# ఆంధ్ర - సాహిత్యదర్పణము.



విశ్వనాథకవిరాజ ప్రణీత గీర్వాణగ్రంథమునకు
అనువాదము.

'కళాప్రపూర్ణ,' 'మహామహోపాధ్యాయ,' 'సర్వతంత్రస్వతంత్రా,'
ద్వ్యసంఖ్యాక బిరుద విరాజిత

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారిచే
విరచితము.

ప్రథమ ముద్రణము

ప్రకాశకులు: [illegible]

తత్పౌత్రులు:
వేదము వేంకటరాయశాస్త్రులు అండ్ బ్రదర్స్,
4. మల్లికేశ్వరస్వామిగుడిసందు,
లింగిసెట్టివీధి, మన్నాడి మదరాసు.

1935



వావిళ్ల రామస్వామిశాస్త్రులు [illegible]
292, [illegible]

శ్రీ

ఆలంకారిక సార్వభౌముఁడు శ్రీవిశ్వనాథకవిరాజు రచించిన 'సాహిత్యదర్పణము' నకు మాతాతగారు కీర్తిశేషులు శ్రీవేదము వేంకటరాయశాస్త్రులవారి యాంధ్రానువాదము రచితమై యిప్పటికి బహుకాలమైనను ఎల్లవారును ఎఱింగిన కారణములచేతనే అముద్రితముగా నుండినది. అట్లుండఁగా, నెల్లూరుజిల్లా కావలి తాలూకా మోపూరు గ్రామవాస్తవ్యులు, పంటకులావతంసులు, వదాన్యశేఖరులు,

శ్రీయుత రేబాల హరిశ్చంద్రారెడ్డిగారు,

ఏతద్రచనకు మాతాతగారిని దొలుత ప్రేరిపించిన తమ బావగారు కావలివాస్తవ్యులు శ్రీయుత దొడ్ల వేంకటరామరెడ్డిగారి వలనను, మాతాతగారికి చిరకాలమిత్రులు ముప్పదియేండ్లుగా మాకు ప్రతివర్షకుటుంబపర్యాప్తధాన్యదాతలు శ్రీయుత గునుపాటి యేనాదిరెడ్డిగారివలనను ఏతద్గ్రంథముం గూర్చి విన్నవారై తమమిత్రులయుత్సాహమును తాముంగొని తమ జ్యేష్ఠకుమారులు

శ్రీయుత రేబాల పట్టాభిరామరెడ్డిగారు,

తమవంశమునకు అలంకారముగాను తమకు అత్యంతము ప్రేమపాత్రముగాను ఉండినవారు ఇరువదియైదవ యేటనే హఠాత్తుగా ఈలోకముం బాయుటం జేసి యాకుమారుని స్మృతిచిహ్నము నొకదానిని శాశ్వతముగాఁ బ్రతిష్ఠింపగోరి తదర్థమై ఏతద్గ్రంథమును ముద్రణపర్యాప్త సర్వస్వము నొసంగి ముద్రింపించినారు. ఈగ్రంథము శ్రీరెడ్డిగారి యాశయమును సఫలీకరించుచు గాక యని పరమేశ్వరునిం బ్రార్థించువాఁడను.

నాప్రార్థనచే నీగ్రంథమునకు నుపోద్ఘాతమును వ్రాసియిచ్చి యచ్చుప్రూఫులను సరిచూచి సహాయపడిన శ్రీమంతులు నేలటూరు రామదాసయ్యంగారు ఎమ్.ఏ., ఎల్. టి., గారికిని, ఆంధ్రీకర్తృజీవిత చరితమును రచించి యొసంగిన శ్రీయుత ధరణికోట వేంకటసుబ్బయ్య బి.ఏ., బి.ఇడి. గారికిని అత్యంతము కృతజ్ఞత

తో వందనము లాచరించుచున్నాఁడను. మాతాతగారికి పలువెలుఁగుల తోడ్పడి మాకు నిరంతరము ఉపకరించుచున్న శ్రీయుత గునుపాటి యేనాదిరెడ్డిగారు ఈగ్రంథముద్రణ విషయమై వహించిన శ్రమయు ఒనర్చిన సాయమును అపారములు. వీరియెడ నాకృతజ్ఞతం దెలుపుకొనుటకు నాకు వాక్కు చాలమి సహజము. ఈగ్రంథమును, ముద్రణకు మున్ను 'సాఫు' వ్రాయించి సరిచూచి,శ్రమకోర్చి లఘుటీకసైతము రచించి ప్రకటింపదలంచుచుండి ఇంతలో దుర్దైవవశమున పరమపదించిన మాచినతాతగారు శ్రీవేదము వేంకటాచలముగారు, బి.ఏ.,బి.ఎల్., ఈసందర్భమున నెంతయు సంస్మరణీయులు. ఇట్టివారికృపచేతను పనిచేతను సత్ప్రయత్నింప ప్రకాశన సందర్భమున సాయముగావించిన యెల్లరకును నాకృతజ్ఞతా వందనములు.

జూన్ 1935.

వేదము వేంకటరాయలు.



కీ. శే. శ్రీయుత రేబాల పట్టాభిరామ రెడ్డిగారు

శ్రీ

# ఉపోద్ఘాతము



మిత్రప్రేరితముగా, శిష్యప్రార్థితముగా, తమకు విరామ వినోదలీలగా కీ. శే. కళాప్రపూర్ణ వేదాన్వవాయ వేంకటరాయ శాస్త్రిలవారు ఆంధ్ర. సాహిత్యదర్పణ రచనను 2_2_1921 వ దినము తొడంగి 10_4_1921 వ దినమున, ఇంచుకమించిన రెండు నెలల కాలమున, ముగించిరి.

వారి స్వంతచేతి వ్రాతగా ఆగ్రంథము ఇంచుక కొఱవగా 600 పుటలు నిండి యున్నది. “ఈదినము తొడంగఁ బడినది, ఈదినము ఇంతింత వ్రాయఁబడినది, ఈదినము ముగింపఁ బడినది”—అనులెక్క వారే అందు వేసియున్నట్టిది సూచించు తెఱంగున, వ్రాతకు ఓపిక కుదుర్చుకొనుచున్న తొలివారమునను, మదరాసు నెల్లూరులకు రాకపోకలకైన ప్రయాణమును ఓర్చిన మధ్యవారమునను, అలంతియు లంతి వ్రాతకే అవకాశము కలుగఁగా, దినమునకు సరాసరి పదిపుటల వంతున రచితమైనది. కొన్ని దినములలో 15, 16 పుటలును వ్రాయఁబడినవి; కొన్నిట 5, 6. పుటలే. ఎక్కువ తక్కువలకు మిత్రగోష్ఠులు, బంధుపరామర్శలు, దేహమున వయస్సునలని డయ్యుటలు కూర్చిన విరామోత్సాహముల బాహుళ్యవైరళ్యములంబోనిది కారణము కానోపును. *వ్రాతను చూచినను, సిద్ధముగా వ్రాసియుంచిన మఱియొక దానింజూచి నకలు (Copy) వ్రాసినంతకన్నను వడియు, చిత్తమున ఆలోచించుకొన

| * తెలుఁగు వ్రాఁతలో పుటలు. | తేది. | మూలమందలి పుటలు. |
|---|---|---|
| 1 | 2—2—21 | A few lines—half a page. |
| 2 | 3—2—21 | A page and a half. |
| 6 | 4—2—21 | Pages 3, 4. |
| 10 | 5—2—21 | Page 5, (6,7.) |
| 16 | 6—2—21 | 8, 9, 10 |
| 22 | 7—2—21 | 11—15 = 5 Pages |
| 35 | 8—2—21 | 16—22 = 7 Pages |
| 51 | 9—2—21 | 23—29 = 7 Pages |
| 68 | 10—2—21 | 30—35 = 6 Pages |
| 81 | 11—2—21 | 36—42 = 7 Pages |

*Continued in the next page*

సాతోచంబూన్సు భృంగాంజనము తిలకపుష్పంబు కస్తూరిబొట్టుగా,
శంకింతురా మాధవశ్రీ సకుల వదనభూషగా సధికాకారయంచుగా.

అనుదానింగని సహృదయమ్మన్యులే కొందఱు "సకులవదన భూషగా—' ఏమి? 'సకల' అని యుండవలయును, లత్తుకయు, విశేషకమును, తిలకమును చెప్పఁబడినవి గదా. 'సర్వవదనాలంకారమును' అనుట. కాకు కొమ్ము అచ్చులో పొర" అనియు; సుమధురములైన అధరమును, గండమును, లలాటమును, లాక్షావిశేషక తిలకములకు స్థానములు వదనముయొక్క కులములో చేరినవి దాని బలంగము; అట్టి 'కులముతో కూడుకొన్న' వదనముయొక్క అనుట. "సకుల వదన" అని శాస్త్రిలవారు ప్రౌఢముగా చమత్కరించినారు; అనియు ప్రజ్ఞావాదము సేసిరి. తరువాత శాస్త్రిలవారిం గలసికొన్నప్పుడు అడుగఁగా—"'సావజ్ఞేవ ముఖప్రసాధనవిధౌ శ్రీర్మాధవీ యోషితాం' అని గదా; అందు "యోషితాం" అనుటకు అనువాదము "సకుల"; 'సఖుల'—చెలిమికత్తెలయొక్క అని నిజహృదయము", అని సెలవిచ్చిరి. మఱి శాస్త్రిలవారు రచించిన యుత్సాహము అప్పుడే తమ యిచ్ఛమెయి ముద్రింపనోదవనీని దుర్దైవముచేఁ బ్రతిహతము కాఁగా, శాస్త్రిలవారు 'సాఫు' వ్రాయింపకయు సరిచూడకయు, సర్వథా విసివియు, 'అవసరమున చూచుకొందములే' అని గ్రంథమును మూలవైచి యుంచిరి. ఆరచన ముగిసిన పదునాలుగేండ్లకు అట్టియది నేఁటికి వారి పరోక్షమున యథాస్థితముగా ఇట్లు ముద్రితమై ప్రకాశమును బొందుచున్నది.

'యథాస్థితముగా' అన్న యస్వాతంత్ర్యము తెలియఁగుటకై ఇంచుక.—

అగ్ని. నీలీకుసుమ్భ మఞ్జిష్ఠాః పూర్వరాగోఽపి చ త్రిధా
నచాతిశోభతే యన్నాపైతి ప్రేమమనోగతమ్
తన్నీలీరాగమాఖ్యాన్తి యథాశ్రీరామసీతయోః
కుసుమ్భరాగం తంప్రాహు ర్యదపైతి చశోభతే.
మఞ్జిష్ఠారాగ మాహుస్తం యన్నాపైత్యతి శోభతే.

"సనిలియు నీలి కుసుంభము మాంజిష్ఠ అని పూర్వరాగము మూఁడు విధములు. అందు—ఏప్రేమ ఎక్కువగా శోభిల్లదో, మనోగతమై వదలిపోదో, అది నీలిరాగమని చెప్పఁబడును; ఉదా— శ్రీరామసీతల రాగము. వదిపోదో శోభించునో దానిని కుసుంభరాగ మందురు. వదిపోదో అత్యంతముగా శోభించునో అది మంజి

ష్ఠారాగ మనంబడును."

ఇందు కుసుంభరాగముంగూర్చి— "ఏది పోదో శోభించదో దానిని" అని. మూలమున "యదపైతిచ శోభతే" అని. అనఁగా "ఏది పోవునో శోభించునో" అని. ఇది వ్రాఁత తొందరలో చేతఁ గలిగిన పొరపాటులు! ఇట మూలమునకు గ్రంథాంతర సంవాదమును కలదు.—

కంఠాభరణమున.—

నీలీకుసుమ్భ మఞ్జిష్ఠా రాగాద్యా రాగభక్తయః

*　　　*　　　*

యన్నాపైతి నచాతిశోభతే, తత్ నీలీరాగం. యథా.—
యదపైతి చ శోభతేచ, తత్ కుసుమ్భ రాగం. యథా.—

యన్నాపైతి అపిచశోభతే, తత్ మఞ్జిష్ఠారాగం. యథా.—

అట్లే రసార్ణవమునను.—

నీలరాగస్తు యస్సక్తో నాపైతి చ నదీప్యతే. యథా.—
అచిరేణైవ సంసక్త శ్చిరాదపి ననశ్యతి
అతీవ శోభతే యోసౌ మాఞ్జిష్ఠరాగ ఉచ్యతే. యథా.—

కావున దీనిని సవరించియుండఁ దగును. అయినను సవరింపలేను.

. . . మఱియు ఆంధ్రదర్పణమునకు శాస్త్రులవారిచేత ఏమూలము ఉండెనో అందలి పాఠము ఇట తొలుత నుదాహృతము. అందు నీలీరాగమునకు లక్షణశ్లోకగతము గానే లక్ష్యమును "సీతారాముల" అని కలదు. మఱి తక్కిన రాగములకును అట్లే నిర్వాహముపక్రమము. కాఁగా నిట గ్రంథపాతము శంకింపఁదగును. పెక్కు ముద్రణములందు తత్పూరణము కానరాదు. అయినను సరుచిర దర్పణమందు శివదత్తపాఠము స్పష్టపుష్టముగా నున్నది.

"కుసుమ్భరాగం తత్ప్రాహుర్యదపైతిచ శోభతే
దేవహూత్యాసమం యద్వత్ కర్దమస్య తపస్వినః
మాఞ్జిష్ఠారాగమాహు స్తద్ యన్నాపైత్యతిశోభతే
ఇన్దుమత్యా యథాஜస్య దమయన్త్యానళస్య వా."

ఈపుష్టిని కుండలీకరణయోగముచేతనో అథోజ్ఞాపికగానో ఆంధ్రదర్పణమునకుం గలిగించి యుండఁదగును. కాని కలిగింప లేదు.

సాహిత్యదర్పణకర్త 'ఆలంకారికచక్రవర్తి,' 'సాంధివిగ్రహిక మహాపాత్రుడు' శ్రీవిశ్వనాథకవిరాజు. ఈతనిచరిత్ర నెఱుంగఁ దగిన యాకరములుగాని యుపాయములుగాని అంతగా కానరావు. ఆలంకారికచక్రవర్తి యని సాహిత్యదర్పణము కాక ప్రసిద్ధిచితమగు నొక కావ్యప్రకాశటీక, కావ్యప్రకాశదర్పణమనునదియు చాటును. కవిరాజనుటకు ఇందే తనవిగా ఉదాహృతములైన పెక్కు లక్ష్యములు సంస్కృతప్రాకృతశ్లోకములు తార్కాణ. తన నాయన శ్రీచంద్రశేఖరమహాకవి చంద్రుఁడట. తన వంశము పెక్కుతరములుగా కవిపండితాచార్యమహత్తరులది అని తన పితృపితామహప్రపితామహాదులను కవులనుగాను పండితులనుగాను ఆచార్యులనుగాను నిర్దేశించుటచేతను, వారిగ్రంథములనుండి అందందు లక్ష్యములను తనదర్పణమునందు ఉద్ధరించుకొనుటచేతను, తత్సూక్తులను అవతారించుకొనుటచేతను సూచించినాఁడు.

> "యదాహుః శ్రీకళిఙ్గభూమణ్డల మహారాజాధిరాజ
> శ్రీనరసింహదేవ సభాయాం ధర్మదత్తం స్థగయన్తః.
> అస్మత్పితామహా శ్రీమన్నారాయణపాదాః"
>
> —కావ్యప్రకాశదర్పణము

> తత్ప్రాణత్వం చాస్మద్ వృద్ధప్రపితామహ సహృదయ గోష్ఠీగరిష్ఠ కవిపండితముఖ్య శ్రీమన్నారాయణ పాదైరుక్తమ్"
>
> —సాహిత్యదర్పణము.

> "అస్మత్పితామహానుజ కవిపణ్డితముఖ్య శ్రీచణ్డీదాసపాదానాం"
>
> —సాహిత్యదర్పణము.

దీర్ఘదీర్ఘముగా తన బిరుదావళిని ఇట్లు పలికినాఁడు.—

> "సాహిత్యార్ణవకర్ణధార, ధ్వని ప్రస్థాన పరమాచార్య, కవిసూక్తి రత్నాకర, అష్టాదశ భాషావారవిలాసినీ భుజఙ్గ, సాన్ధివిగ్రహిక, మహాపాత్ర శ్రీవిశ్వనాథ కవిరాజ." అని.

ఉదాహృతములుగా రాఘవవిలాసమను సంస్కృతకావ్యమును, కువలయాశ్వచరితమను ప్రాకృతకావ్యమును, ప్రభావతి చంద్రకళ యను నాటికలును, ప్రశస్తి

రత్నావళి యని పదునాలుభాషలవెలసినట్టిది కరంభకమును (కావ్యవిశేషము) ఇట్టు ప్రసంగవశమునం బ్రస్తావింపఁబడినవి. విశ్వనాథుఁడు కవిపండితముఖ్యుఁడే గాక తిక్కనాదులవలెనే గొప్పరాజనియోగి, "సాంధివిగ్రహికుఁడు," ప్రసిద్ధుఁడు. కావ్య ననే సాహిత్యదర్పణము తక్కిన కావ్యాలంకారములవలె గాక, శాస్త్రమార్గమునం బొరసినను, లాలిత్య సారల్యవైశద్యములు ఎక్కువగా కలిగియుండఁగోలును. విశ్వనాథుఁడు వైష్ణవుఁడని 'శ్రీమన్నారాయణ చరణారవిందమధువ్రతుఁడుగా' తన్ను చెప్పుకొనుటచేతను, "కావ్యాద్ధర్మప్రాప్తి ర్భగవన్నారాయణచరణారవిన్దస్త వాదినా" అని కావ్యప్రయోజనపాఠమున నారాయణునే కొలుపుకొనుట చేతను, తన తాతను తాతకుం దాతను నారాయణసనామకులనుగా ఉదాహరించుటచేతను ఊహింపఁదగునని అభియుక్తులు అందురుగాని, స్వయము పేరుచేత "విశ్వనాథుఁడు", "చంద్రశేఖరునికిం" గొమారుఁడు, "చండీదాసుని" యన్నకు మనుమఁడును — ఈపాటికే వైష్ణవుఁడని నిర్ణయముం బొందునా?

> శైవా వయం నఖలు తత్ర విచారణీయం;
> పఞ్చాక్షరీజపపరా నితరాం; తథాపి,
> చేతో మదీయ మతసీకుసుమావభాసం
> స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్.

అన్న కవిమతమునకు చేరినవాఁడు ఏల కారాదు? కావ్యప్రకాశదర్పణమున కొన్ని సంస్కృతపదములకుం బర్యాయములను ఓఢ్రమునం జేయుటచేత విశ్వనాథుఁడు ఓఢ్రుఁడు, కళింగదేశమువాఁడని యనుమానింపఁదగునని. కాని, అంతకన్నను "కళిఙ్గః సాహసికః" అని లక్షణోదాహరణకు కళింగుఁడు తనంతట ఉపస్థితుఁ డగుటయు, తన బిరుదావళిలో అవయవమయిన "మహాపాత్ర"ము మహామాత్యార్థకము కళింగదేశమున పురుషనామముగాను బిరుదుగాను ఇప్పుడును వ్యవహ్రియమాణ మగుటయు, తాతలు కాళింగుని యాస్థానివా రగుటయు అందులకు గమకమని తలంపఁ దగును.

సాహిత్యదర్పణము వ్రాఁతప్రతి యొకటి కాశ్మీరమునం దొరకినట్టిది విక్రమ శకమున 1440 వ సంవత్సరముదిగా అంకితము. ఆకాలమునకుం బర్యాయము క్రీస్తు శకమున 1384. కావున ఈదర్పణము తత్పూర్వ ప్రణీతము కానోపును. వేఱు వేఱు గులం బన్నెండవ శతాబ్ది పూర్వార్థము వాఁడుగా నిర్ణయింపఁబడిన జయదేవుని గీత గోవిందమునుండి—

"హృది బిసలతాహారో, నాయం భుజఙ్గమనాయకః;
కువలయదళ శ్రేణీ కణ్ఠే, న సా గరళద్యుతిః;
మలయజ రజో నేదం, భస్మ; ప్రియారహితే మయి
ప్రహర న హరభ్రాన్త్యాఽనఙ్గ క్రుధా కిము ధావసి?"

అను లక్ష్యమును, అట్లే పదుమూఁడవశతాబ్ది వాఁడైన మఱియొక జయదేవుని ప్రసన్నరాఘవమునుండి

"కదళీ కదళీ, కరభః కరభః, కరిరాజకరః కరిరాజకరః;
భువనత్రితయేపి బిభర్తి తులా మిద మూరుయుగం న చమూరు దృశః"

అను లక్ష్యమను గల యీ దర్పణము తదర్వాచీనము కానోపును. మఱియు రుయ్యకాచార్యుని యలంకార సర్వస్వమును అతని తరువాతివారిలో అలంకార ప్రకరణమున ఉపజీవనము చేతనో ఖండనముచేతనో ఉభయముచేతనో పరామర్శింపనివారు అరుదు. విశ్వనాథుఁడును దశమపరిచ్ఛేదమున వెల్లుగా రుయ్యకునియందు నిగ్రహానుగ్రహములు నెఱపినాఁడు. రుయ్యకాచార్యుఁడు అకరములంబట్టి పన్నెండవశతాబ్దివాఁడగునేని ఈదర్పణము చిరము తరువాతిదేగదా. అట్లే నైషధీయము లగు నుదాహరణముల కలిమింబట్టి దర్పణము తదనంతరభవ మగును. కాని దాన నేమగును? నైషధము ఏకాలముదో ఇంకను నిశ్చయము కుదిరియు కుదురకయు ఉన్నది. దానిని పన్నెండవ శతాబ్ది యుత్తరార్ధమునం జొన్పజూచినారు; కాని అందులకు ఉపపత్తి ఇంకను నిర్వికల్పము గాదు. ఇఁక విశ్వనాథుని చిన్నతాతగారగు చండీదాసులవారు కావ్యప్రకాశకుం డీక వ్రాయుటయు, తాతగారగు నారాయణులవారు కళింగేంద్రుఁడగు నరసింహుని యాస్థానిలో ధర్మదత్తుని ఓర్చుటయు, అను నంశములంబట్టి వారికాలము ఎఱుంగదగునేని వారి మనుమని దర్పణముకాలము ఒకపాటి నిర్ణయముం గనును, కాని కాళింగులు నరసింహనాములు వరుసగా పలువురై సూటి కుదురనీక ఈదర్పణ బంధువుల కాలమును చెదరఁగొట్టుచున్నారు. కావున ఇటం బరిశిష్టిత మేమనఁగా సాహిత్యదర్పణము క్రీస్తుశకమున 1384 కి ముందును ఇంచుమించుగా 1250 కిం దరువాతను అనగా త్రయోదశోత్తరార్ధ చతుర్దశపూర్వార్ధ సంకలితమగు శతాబ్దిలో నెప్పుడో రచితమైయుండఁ బోలును.

సాహిత్యమీమాంస కావ్యప్రకాశ కావ్యాదర్శ కావ్యదర్పణ కావ్యమీమాంసా భామహాలంకా రోద్భటాలంకార వామనాలంకార సరస్వతీకణ్ఠాభరణ

శృంగారప్రకాశికా సాహిత్యదర్పణ సాహిత్యరత్నాకర ప్రతాపరుద్రీయ వాగ్భటాలంకార కావ్యానుశాసన ధ్వన్యాలోక రసచంద్రికా రసతరంగిణీ రసార్ణవసుధాకర రసగంగాధరాది నానాగ్రంథరాశి విస్తృతమై యుండఁగా; అందు కావ్యప్రకాశమును, ధ్వన్యాలోకమును, రసగంగాధరమును అనన్యాదృశమగు గౌరవముం బొందియుండఁగా; అందును కావ్యప్రకాశము తరువాతి యాచార్యులకెల్ల సమ్మతిం దెలుపను విమతిం దెలుపను 'తల్లిగ్రంథమై', ఎందఱి చేతనేని వ్యాఖ్యాతమయ్యు, సాహిత్యదర్పణకారుని చేతనుంగూడ వ్యాఖ్యాతమయ్యు, బహుశాస్త్రాచార్యుండగు నాగేశభట్టుచేతను వ్యాఖ్యాతమయ్యు, ఇంకను వ్యాఖ్యానమును ఓర్చుచుండఁగా; తెలుఁగున సాహిత్యమీమాంసా వైరళ్యముం బాపుటకు శ్రీ శాస్త్రులవారు దానిని మాని, వానిని మాని, ఈసాహిత్యదర్పణమునే అంగీకరింపనేల? మిత్రప్రేరణచేతను శిష్యప్రార్థనచేతను అని గ్రహింతమన్న "మాకు ఇదే కావలయును" అనుటకు పరప్రత్యయనీతబుద్ధులగు వారికి సంశయము శాస్త్రులవారే యుద్బోధించి దానియందు ప్రత్యయముం గొల్పియుందురు. కావున దర్పణమందలి తాత్పర్యము శాస్త్రులవారికి స్వాంతముగా సర్వగ్రంథపరామర్శపూర్వకముగా కుదిరినదే. అది ఇటువలె నుండఁబోలును. సాహిత్యదర్పణమువలె నాతిసంకుచితమును, నాతివిస్తృతమును, సమగ్రమును, నాటకశాస్త్రముంగలదియు మఱియొండు గ్రంథము లేదు. సమగ్రకల్పములు సంకుచితములు; కానివి ఒక్కొక్క విషయమునకేని ఒకకొన్ని విషయములకేని అతివిస్తృతములును నాతిసుగమములును. అట్లే బొంబాయి రుచిరయు.— 'సమస్తప్రబన్ధైకసారభూతం సాహిత్యసిద్ధాన్తతత్త్వమనాయాసమవజిగమిషూణాం తస్య తస్య చ ప్రబన్ధస్య తత్త్వాకలనాయ నిరస్తాధికారాణాం బాలానాం ఆపాతామైకత్రైవైకపదం తత్తత్ప్రబన్ధజాతసిద్ధాన్తమనావిలం అనవద్యం తత్త్వమున్నినీషుః' అని. అంతియకాక సాహిత్యదర్పణమున కావ్యమునకు క్రొత్తలక్షణము "వాక్యం రసాత్మకం కావ్యం" అని చెప్పఁబడినది. వాక్య [మాత్ర]మును రసము ఆత్మగాఁ గలది కావ్యమగును. శాస్త్రులవారికి ఈమతము ఉపాదేయతమముగా తోఁచినది. ప్రసంగవశమున నొక్కెడ చెప్పినారు.—

"రసజ్ఞులు కారణవిశేషములంబట్టి గ్రామ్యమందు గ్రంథములను వ్రాసికొందురుగాక. బొబ్బిలిపాటయు, దేసింగురాజు పాటయు గ్రామ్యములేగదా ఆరాధ్యమల్లన రచించిన జంగాల బొబ్బిలిపాటలోని వీరరసము ఇంచుకేనియు రంగ

రాట్చరిత్ర) పద్యకావ్యమున లేదు. ఇది గ్రామ్యప్రభావముగాదు. రచనా ప్రభావము................. గ్రామ్యమున సుద్దులును కథలును గద్దెలును రసవంతములు గలవు. 'వాక్యం రసాత్మకం' కావ్యం అని గదా విశ్వనాథకవిరాజు అనుశాసించినాఁడు. అది హృదయంగమము. ........." అని. నాట్యమునకు రసప్రాణతను రసాత్మతను భరతముని ఆదికాలముననే చెప్పినను, కావ్యమందును అట్లే తొంటిమాలంకారికులు భామహ దండి రుద్రటులు క్రీస్తు షష్ఠనవమ శతాబ్దులందు కావ్యమును మీమాంసించినవారు శబ్దార్థములమీఁదను అలంకారముల మీఁదను రీతులమీఁదను దృష్టిని ఏకాగ్రము చేసినవారైనను,

"యుక్తం లోకస్వభావేన రసైశ్చ సకలైః పృథక్"—భామహ

"ఇహ త్వష్టరసాయత్తా రసవత్తా స్మృతా గిరామ్."— దండి

"కామం సర్వోప్యలంకారః రస మర్థే నిషిఞ్చతి" — దండి

"దీప్తరసత్వం కాన్తిః" ... ... ... వామన

"తస్మాత్తత్కర్తవ్యం యత్నేన మహీయసా రసై ర్యుక్తమ్." రుద్రట

అని రసవత్త్వమును సైతము కొంత ఎఱింగిన జాడ ఊహింపఁదగియున్నను వారు దానికి ప్రాధాన్యమును గ్రహింపరైరి. తరువాత ధ్వనిశాస్త్రమును, క్రొత్తదానిని కల్పించిన ధ్వన్యాలోకలోచనాది ప్రణేతలు ఆనంద వర్ధనాభినవగుప్తాదులును,

"తేన రసఏవ వస్తుత ఆత్మా; వస్త్వలంకారధ్వనీ తు సర్వథా రసంప్రతి పర్యవస్యేతే ఇతి వాచ్యా దుత్కృష్టౌ తా విత్యభిప్రాయేణ ధ్వనిః కావ్య స్యాత్మేతి సామాన్యే నోక్తం."

"యతః పరిపాకవతాం కవీనాం రసాది తాత్పర్యవిరహే వ్యాపార ఏవ న శోభతే."

అని చెప్పినను, సాక్షాద్రసమును మాత్రము ఆత్మ చేయక "రసధ్వనిని" వాస్తవముగాను, "వస్తుధ్వనిని" "అలంకారధ్వనిని" సంయుతము సామాన్యముగాను, అనఁగా ముత్తెఱంగులం "బ్రతీయమాన"మగు నర్థమును, త్రైవిధ్యకధ్వనిని ఆత్మగా గ్రహించినారు. కావ్యప్రకాశమున మమ్మటుఁడును కావ్యానుశాసనమున హేమచంద్రుఁడును పరస్పరము కాలముచే నంతగా నెడపడనివారు నిర్దోషతా సగుణతా సాలంకారతల నన్నింటితో కూడుకొన్న శబ్దార్థములు కావ్యము అని 'కావ్యమును ధ్వని ప్రాణముగాఁ గాని రసప్రాణముగాఁ గాని చేయకయు,మరల ధ్వనినిగాని రసమునుగాని

భ్రాంతిగా మానకయు, "యద్యపి రసే నైవ సర్వం కావ్యం జీవతి...; ఏవం రసధ్వనే రేవామీ భావధ్వని ప్రభృతయో నిష్పన్నాః" [హైమకావ్యానుశాసనము] అను నట్టి మాటలచే రసైకప్రాణతను చెప్పనుంకించియు, డిటవ్రచాలక, పిఱికివారుంబోలె, పూర్వాచార్యుల వెంపకమునెల్ల ఉపజీవించి ఒకపాటి సమగ్రతను సంపాదించినారు. అట్లుండ సాహిత్యదర్పణమున విశ్వనాథుఁడు ఆసర్వసామగ్రిని నిపుణముగా సమాహరించుటయ కాక, రసధ్వని కీతుఁకు కావ్యప్రాణత్వకై కలిగిన పోరాటమును స్మరించి, దాన నస్యతవముచే పూర్వమార్గమున నిర్వృతి కుదురమి, క్రొత్త మార్గము స్వీకరించి, "వాక్యం రసాత్మకం కావ్యం" అను మతమును ధీరముగా నెలకొల్పి ప్రవర్తింపఁజేసినాఁడు. రసముననే కాలూని నిలుచుటకు దిట్టంపు దిటవు వలయును! అయినను రసగంగాధరమున, దీనికిం దరువాతయుటియు నొక్క మార్గమున విహరింపఁ గోరిన పండిత రాయనిచే

"యత్తు 'రసవ దేవ కావ్యమ్' ఇతి సాహిత్యదర్పణే నిర్ణీతమ్, తన్న; వస్త్వలంకారప్రధానానాం కావ్యానాం అకావ్యత్వాపత్తేః; న చేష్టాపత్తిః, మహాకవి సంప్రదాయస్య ఆకులీభావ ప్రసఙ్గాత్; తథాచ జలప్రవాహవేగ నిపతనోత్పతన భ్రమణాని కవిభిర్వర్ణితాని; కపిబాలాది విలసితానిచ. నచ తత్రాపి యథాకథంచిత్ పరమ్పరయా రసస్పర్శోఽస్త్యేవేతి వాచ్యమ్. ఈదృశ రసస్పర్శస్య "గౌశ్చలతి" "మృగో ధావతి" ఇత్యాదౌ అతిప్రసక్తత్వేన అప్రయోజకత్వాత్, అర్థమాత్రస్య విభావానుభావ వ్యభిచార్యన్యతమత్వా, దితి దిక్." అని గొప్ప జోదు చేతనే దర్పణముపై ఆక్షేపణ గుఱివెట్టఁబడినది. అయినను దర్పణము పగులలేదు, పగులదు అని శాస్త్రిలయాశయము. ఈయతిప్రసక్తత్వ ప్రయోజకత్వములు వట్టి 'యెండు జగడము'నకు చువ్వలే కానిప్రయోజకములుఁ బ్రబలములును కావు. చెప్పినాఁడునుంగదా విశ్వనాథుఁడే.—

"నను తర్హి ప్రబన్ధాన్తర్వర్తినాం కేషాఞ్చి న్నీరసానాం పద్యానాం కావ్యత్వం న స్యాత్, ఇతి చేత్, న; రసవత్పద్యాన్తర్గత నీరసపదానా మివ పద్యరసేన, ప్రబన్ధరసే నైవ తేషాం రసవత్తాఙ్గీకారాత్." అని. బొమ్మయందును పీనుంగునందును నిర్జీవమునందు 'వీఁడుగో ఈయన' అను వ్యవహారముంబోలె నీరసమందును, అదే నిర్జీవమునందును, 'ఇదిగో కావ్య' మను వ్యవహారము. రసము లేకయు తోఁచు కావ్యవ్యవహారమేలఁ గాదు నిలుపఁజెల్లదా యనుచు గడిదానికి తెలిసినవద్యపిటలు చెప్ప

'సెల్యూలాయిడు' బొమ్మ వైఖరిం బోనిది. అట్లే 'రుచిర'లో శివదత్తపండితుఁడు.—

"ఏవంచ రసస్య తదభిహితనయేనాపి ఆత్మవ్యవహారసామ్యే వస్త్వలంకారధ్వని ప్రధానానాం కావ్యత్వేనాభిమననం నిర్జీవే జీవవ్యవహారవత్." అని.

రసవద్వాక్యము కావ్యము అను పునాదిపై నిర్మితమగు తక్కిన కట్టడమంతయును నూతననూతనమై అనవద్యమై శాస్త్రిలవారికి ప్రీతివిస్రంభవిహారణమునకుం దగి యుండెను. రసస్వరూపమును; కరుణాదులును ఎట్లు రసములగును అనుటయు రసము కెన్నిష్ఠము, కావ్య(నాట్య)మునందా, నాయకునియందా, నటునియందా, సామాజికునియందా అను విప్రతిపత్తియందు 'సామాజికునియందే' అను సిద్ధాంతమును; సామాజికునియందు రసమునకు ఉద్బోధమెట్లు, రసనమననేమి అను మొదలగు గహనవిషయములు గహన చర్చలకుం దిగక దింపక లలిత సుకుమారముగా, అపేక్షితమును వీడక అనపేక్షితముం జొప్పక అత్యంత నూతన సిద్ధాంతమాత్రము అతి సుబోధముగా ఇందు నిబంధింపఁబడినవి. మఱియు, తిక్కనాదులు తెనుంగున నాటకములు వ్రాయకపోవుట తమ భాగ్యమనియు ఆతల్లి బాసలో నాటకరచనచే జన్మను సఫలీకరించుకొందునుగాక యనియు శాస్త్రిలవారు అనఁగొనిరి. కావ్యమెల్ల తమకు అభిమతమైనను, అందు నాటకము అభిమతతమము. కావ్యమెల్ల పరిశీలితమ మైనను, నాటకము మఱియుం బరిశీలితము. "కావ్యేషు నాటకం రమ్యమ్." అట్టి నాటకమునకు లక్షణము భరత కారికలలో ఇంచించుకగా నున్నట్టిది దశరూపక మున వివరణమును పుష్కలతనుం బొందినది. ప్రతాపరుద్రీయము నాటకలక్షణ ముం జెప్పునది ఇంచుమించుగా దర్పణమునకు సమకాలిక మగుటచే రుద్రీయదర్పణములు ఒండొంటి నెఱింగియుండవు. మఱి ప్రతాపరుద్రీయమును శాస్త్రిలవారికి దర్పణమువలెనే సులభమైనను, అందలి నాటకప్రకరణము అసమగ్రమగుట వలనను, సర్వము "రుద్రకల్యాణము" చేతనే ఉదాహరణముం బొందుటవలనను రత్నావళీ శాకుంతల స్వప్నవాసవదత్త తాపసవత్సరాజాది లోకోత్తర ప్రబంధము లందలి సంవిధానములతో సాక్షాత్తుగా సమన్వితము కానందునను, 'అదెక్కడ! ఇదెక్కడ!' అను నంతటి వాసి యగపడుచున్నందునను ఈమార్గమున శాస్త్రిలవారి ప్రీతికిఁ బాత్రముకాలేదు. భరతధనంజయులకు అర్వాచీనుఁడై, అభినవగుప్తుని భరతటీకనుం బరిశీలించి, విశ్వనాథుఁడు నాటకలక్షణమును సమగ్రతరముగా తన

స్వాతంత్ర్యము స్ఫుటపడునట్లును నాందీరంగద్వారాది భేదము ఆవిష్కరించుటం బోని పట్టుల నిపుణ నిపుణముగాను నాటకకర్తలకు పలు సందియములం బోలంచు నట్లును అనుశాసించినాఁడు. అదెల్ల కరము శాస్త్రిలవారి చిత్తమున కెక్కినది.

ఇట్లు సర్వథా దర్పణమునకును తమచిత్తమునకును సంవాదము కలిగినది. కావున శాస్త్రిలవారు సాహిత్యదర్పణమును అవలంబించి మెచ్చుకొని, శిష్యులకడ ను మిత్త్రిలకడనుం బ్రస్తావించుచున్నందున వారిని వీరు దాని యాంధ్రీకరణమున కుం బ్రార్థించి ప్రేరించి నెఱవేర్పించుకొనిరి. దానిచేత తాము ఆంధ్రమున సమగ్రమగు నలంకార శాస్త్రము లేని కొఱవం దీర్పవలయునన్న యీప్సితమును వేంకటగిరి "సింగమనీనిగద్దెయెక్కిన దొర" ప్రాపున తాము తీర్చుకొనఁగోరినవా నిలో నొకదానిని కొంత తీర్చుకొనిరి.

ఇట్లు సాహిత్యదర్పణమును ఆంధ్రీకరించి తెలుంగుల కిడిన ప్రయోజనమేమి? దాన వారికి సమగ్రమగు నలంకారానుశాసనము నిష్పన్నమై గొప్ప లోపమునకుం బూరణము సంపాదితమైనది. అంతియ కాక, ఆంధ్రీకరణము లెల్ల ప్రాయికముగా మూలమునకు ఒకపాటి వ్యాఖ్యానములును అగును. అట్లే మూలమునం బాఠ ములు లేఖకాదులగుఱికి చెదరిపోయినయెడల అవి సాధుపాఠనిర్ణయమునకు అను వాదకుల మహిమకొలందియు ఉపాయము లగును. ఆంధ్రదర్పణమునుండి ఇందు లకు ఒకయుదాహరణము.—

1874 వ సంవత్సరమునం దొలుత కలకత్తాలో జీవానందుఁడు మూలము మాత్రముగ అచ్చొత్తించినది శాస్త్రిలవారు తొలుదొల్త చదివిన దర్పణ పుస్తకము. ఇది అందలి పాఠము.

"య న్నాట్యవస్తునః పూర్వం రఙ్గవిఘ్నోపశాన్తయే
కుశీలవాః ప్రకుర్వన్తి పూర్వరఙ్గః స ఉచ్యతే
ప్రత్యాహారాదికా న్యఙ్గా న్యస్య భూయాంసి యద్యపి
తథా ప్యవశ్యం కర్తవ్యా నాన్దీ విఘ్నోపశాన్తయే.

అస్యాః స్వరూప మాహ.

ఆశీర్వచన సంయుక్తా స్తుతి ర్యస్మాత్ ప్రయుజ్యతే
దేవద్విజనృపాదీనాం తస్మా న్నాన్దీతి సంజ్ఞితా
మఙ్గల్య శఙ్ఖ చన్ద్రాబ్జ కోక కైరవ శంసినీ

పదైర్వ్యక్తా ద్వాదశభి రష్టాభిర్వా పదైరుత.

అష్టపదా యథా.— అనర్ఘరాఘవే 'నిష్ప్రత్యూహ'మిత్యాది. ద్వాదశపదా యథా మమ తాతపాదానాం పుష్పమాలాయాం.—

" శిరసి ధృత సురాపగే స్మరారా వరుణ ముఖేన్దురుచి గ్గిరీన్ద్రపుత్రీ

అథ చరణయుగానతే స్వకాన్తే స్మితసరసా భవతోఽస్తుభూతిహేతుః"

ఏవ మన్యత్రి.

ఏత న్నాస్తీతి కస్యచి న్మతానుసారేణోక్తం. వస్తుతస్తు, పూర్వరఙ్గస్య రఙ్గ ద్వారాభిధాన మఙ్గమితి ఉచ్యతే. యదుక్తం—

'యస్మా దభినయో హ్యత్ర ప్రథమ్యా దవతార్యతే

రఙ్గద్వార మతో జ్ఞేయం వాగఙ్గాభినయాత్మకం' ఇతి.

ఉక్తప్రకారాయాశ్చ నాన్ద్యా రఙ్గద్వారాత్ ప్రథమం నటైరేవ కర్తవ్యతయా న మహర్షిణా నిర్దేశః కృతః. కాళిదాసాది మహాకవి ప్రబన్ధేషుచ,

" వేదాన్తేషు య మాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ,

యస్మి న్నీశ్వర ఇ త్యనన్యవిషయః శబ్దో యథార్థాక్షరః

అన్త ర్యశ్చ ముముక్షుభి ర్నియమిత ప్రాణైః పరం మృగ్యతే,

స స్థాణుః స్థిరభక్తియోగసులభో నిఃశ్రేయసా యాస్తు వః.

ఇత్యేవమాదిషు నాన్దీలక్షణ స్యాయోగాత్. ఉక్తఞ్చ.— "రఙ్గద్వార మారభ్య కవిః కుర్యా" దితి. అత ఏవ ప్రాక్తన పుస్తకేషు 'నాన్ద్యన్తే సూత్రధార' ఇత్యనన్తరమేవ 'వేదాన్తేష్వి'త్యాది శ్లోకలిఖనం దృశ్యతే. యచ్చ పశ్చాత్ 'నాన్ద్యన్తే సూత్రధార' ఇతి లిఖనం తస్యాయ మభిప్రాయః.— 'నాన్ద్యన్తే సూత్రధార ఇదం ప్రయోజితవాన్; ఇతః ప్రభృతి మయా నాటక ముపాదీయతే ఇతి కవే రభిప్రాయః సూచిత ఇతి." అని. ఇందలి నడిమివాక్యము ఇట్లే "ఉక్తప్రకారాయాశ్చ నాన్ద్యా రఙ్గద్వారాత్ ప్రథమం నటైరేవ కర్తవ్యతయా న మహర్షిణా నిర్దేశః కృతః" అనియే, అనఁగా 'నమహర్షిణా, అని నఞుతో కూడియే 1828 సంవత్సరపు మఱియొక కలకత్తా మూలమాత్ర గ్రంథమందును; తరువాతం బ్రకటితమైన నిర్ణయ సాగరసవ్యాఖ్యాన గ్రంథమందును; 'ఖానే' యను పండితుఁడు మిక్కిలి కృషిచేసి అంగలమున విరివిగా పీఠికను టీకను వ్రాసి ప్రకటించిన 1922 సంవత్సరపు బొంబాయి గ్రంథమందును, కలదు. 'న' ఎక్కువయగుటచేత [illegible] విపరీతమును బోధించు

నది, అపపాఠము అని శాస్త్రులవారి యభిప్రాయము. ఇంతింత వ్యాఖ్యానము వ్రాసి ప్రకటించినవారికైనను ప్రకరణమున వక్తవ్యవిపరీతమును చెప్పునది 'న' అని తోఁపలేదు. ఇటం బ్రకరణము ఎట్లన— నాటకమున తొలుత పూర్వరంగమును తరువాత సభాపూజయు, దానికిం బైన కవిపేరును నాటకము పేరును కీర్తించుటయు, పిమ్మట ఆముఖమును, అని వరుస చెప్పఁబడినది. అందు 'పూర్వరంగ' మననేమో తదుపన్యాసము. దానియంగములు పెక్కు; అందులను మానరానిది నాంది. నాందీ లక్షణము. దానికి ఉదాహరణములు అనర్ఘరాఘవ పుష్పమాలల ప్రథమశ్లోకములు. అక్కడ, ఈ శ్లోకములు నాందియని ఒకానొకని మతముఁబట్టి చెప్పితిని. కాని, (వస్తుతస్తు=) వాస్తవముగా ఇది పూర్వరంగమునకే తరువాతి యంగమైన మఱియొకటి రంగద్వారమను పేరిది, అని రంగద్వారలక్షణముం జెప్పినాఁడు. అంతట ఇది నాంది కాదు రంగద్వారము అగును అనుటకు ఉపపత్తి చెప్పుచున్నాఁడు.—

(1) ఉక్తప్రకారమైన నాంది రంగద్వారమునకు ముందు చేయఁబడవలసినది; నటులచేతనే (కవిచేతఁగాదు) చేయఁబడవలసినది— అని భరతమహర్షి నిర్దేశించుట వలనను.

(2) కాళిదాసాది మహాకవుల ప్రబంధముల యందు "వేదాన్తేషు" మొదలగు వానియందు నాందీలక్షణము పట్టనందునను;

(3) రంగద్వారముం దొడంగియే కవి చేయవలసినది— (అంతకుముందు నటులే) అని చెప్పఁబడియుండుట వలనను;

(4) ప్రాక్తనపుస్తకములందు "నాన్ద్యన్తే సూత్రధారః" అనుదానికి తరువాతనే 'వేదాన్తేషు' ఇత్యాది శ్లోకము వ్రాయఁబడియుండుట వలనను—అని.

(5) ఆపక్షమున, ఎందేని "వేదాన్తేషు" ఇత్యాది శ్లోకమునకుం దరువాత "నాన్ద్యన్తే సూత్రధారః" అని యున్న నప్పుడెట్లు సమాధానము అందురేని.— అందుల యభిప్రాయ మిట్లగును— నాంద్యంతమందు సూత్రధారుఁడు దీనిని (ఈ రంగద్వార (మంగళ) శ్లోకమును) ప్రయోగించినాఁడు; ఇక్కడనుండి నాచే నాటకము గ్రహింపఁబడుచున్నదని కవి యభిప్రాయము సూచింపఁబడినది—అని.

ఇట్లు లంకెను లంకెగా ఉపపత్తిగొలుసు గ్రువ్వఁబడినది. ఉక్తప్రకారాయాశ్చ; కాళిదాసాది మహాకవి ప్రబన్ధేషుచ; ఉక్తంచ; అతఏవ; యచ్చ— అను 'చ'కారములను 'అతఏవ'యు లంకెలు అడికిన పోడి కాఁగా, విశ్వనాథమతమున భరతమత

మునకు వెలిగాకయు, తత్సమీచీనవ్యాఖ్యగాను, ఇప్పుడు ఏనాటకమందును 'నాంది' అని పఠితమగుచున్న తొలి శ్లోకము 'నాంది' కాదనియు మఱి నాందియని భ్రమితమనియు దానిని రంగద్వారముగాఁ గొనుట 'ప్రమ' యగుననియు వివేక నిపుణముగా చెప్పినాఁడు. తరువాత క్రమప్రాప్తములగు సభాపూజా కవినాటకనామాదికథనము ఆముఖము మొదలగువాని లక్షణము. తత్త్వమిట్లుండ ఎంతో మొలఁకువతో మూలమాత్రమును అచ్చువేసినవారు అనర్థదమగు 'న' ను మానకున్నను, అట్లు పలువురు మానకపోవుట విద్యార్థులం జిక్కుపెట్టుచున్నను, ఆమానమినివారు అచ్చుపొరయని సవయాన సమర్థించుకొందురేనియు, నిర్ణయసాగరుల సవ్యాఖ్యానమునను 'న' తోడం బఠించి వ్యాఖ్యాత శ్రీరామచరణతర్కవాగీశభట్టాచార్యుఁడు వ్యాఖ్యానమున తికమకలు తాను 'పడి' పఠితలం 'బఱిచి' నాఁడు. ఎట్లన.—

"తథాచ రఙ్గద్వారాత్ పూర్వమేవ నాన్దీ; సా నిర్విఘ్నం గ్రన్థసమాప్తయే 'కవినాపి' క్రియతే ఇతిభావః"

"(వేదాన్తేషు యమాహురితి) తత్ర నాన్దీలక్షణాగమనే దోషో నాస్తీతి భావః. నను నాన్ద్యాః కవికరణపక్షే నటకర్తృత్వాభావాత్ కథం నాటకారమ్భత్వ మత ఆహ. "ఉక్తంచేతి"— మహర్షిణా ఇతి పూర్వేణాన్వయః.— ......తథా చ, యత్ర నాన్ద్యస్తి రఙ్గద్వారం నాస్తి, తత్రతన్త్రేణ సైవ రఙ్గద్వారమ్. యత్ర రఙ్గద్వారమేవాస్తి, ననాన్దీ, తత్రసా ఫలబలానుమేయా. యత్ర త్వారమ్భే బహవశ్శ్లోకాః, తత్ర శ్లోకద్వయం నాన్దీ, అపరే రఙ్గద్వార మిత్యవధేయమ్" అని.

మఱి యిటీవలం బ్రకటితమైన బొంబాయి వేంకటేశ్వరుల శివదత్తుని రుచిర తోడి గ్రంథమున, శాస్త్రులవారు చూఁడనిదానియందు, సాధుపాఠమును సాధీయసి యగు వ్యాఖ్యయుం గలదు.—

"ఉక్తప్రకారాయాః, చ,నాన్ద్యాః, రఙ్గద్వారాత్ రఙ్గారమ్భాత్,ప్రథమమ్, నటైః సూత్రధారాదిభిః ఇతి శేషః, ఏవ కర్తవ్యతయా మహర్షిణా భరతాచార్యేణోత్యర్థః నిర్దేశః కృతః.

నాన్దీ శుష్కావకృష్టాచ రఙ్గద్వారం తథైవచ, ఇత్యాది నేతి శేషః, ఇదం తత్త్వమ్.— అష్టపదా ద్వాదశపదా వా యా నాన్దీ సాతు 'నాన్ద్యుత్తరం శుష్కాఙ్గం, తతః పర మవకృష్టాఙ్గం, తతోఽప్యనన్తరం రఙ్గద్వార' మిత్యుక్తదిశా పూర్వమేవ నటైః క్రియతే, న తస్యాః ప్రతిపాదనం ప్రతిజ్ఞాయతే, [illegible] వ్యాఖ్యా

న నిరుక్తా నాన్దీ లక్ష్యతే, నాన్దీలక్షణాను క్రాన్తతయా ప్రతీయమానం తు అనర్ఘరాఘవాదౌ రఙ్గద్వారాఙ్గభూతం మఙ్గళమ్; న పున ర్వస్తుతో నాన్దీ ఇతి ... ... ... ... ... అతః ఆపాతతో యత్ర నాన్దీలక్షణం ప్రతీయతేఽపి న తత్ర నాన్దీ, కిన్తు రఙ్గద్వారాఙ్గభూతం మఙ్గళాచరణమేవేతి నిష్కృష్టోఽర్థః" అని.

మఱియు నొక్కటి.—

ఏక ఏవ భవే దఙ్గీ శృఙ్గారో వీర ఏవ వా
అఙ్గ మన్యే రసాః సర్వే కార్యో నిర్వహణేఽద్భుతః.

ఇందులకు అనువాదము (సూ. ౨౭౭).— "శృంగారమే గాని వీరమేగాని ఒకటే రసము అంగి; కడమరసము లన్నియు అంగములు. కార్యనిర్వహణమందు అద్భుత రసము." అని. దీనిపై మహామహోపాధ్యాయ పండిత దుర్గాప్రసాదద్వివేదుల టిప్పణి.—

"ఉత్కర్షాధానాయ ఏక ఏవ రసోఽఙ్గిత్వేన నివేశయితవ్య ఇత్యర్థః. శృఙ్గారో వీరో వేతి కథనం సముచిత రససూచకమ్. తేన ఉత్తరరామచరితే కరుణస్య ప్రబోధచన్ద్రోదయే శాన్తస్య చాఙ్గిత్వ మవ్యాహతమ్. అతఏ వోక్తం ధ్వనికృతా.—

'ప్రసిద్ధేపి ప్రబన్ధానాం నానారసనిబన్ధనే
ఏకోరసోఽఙ్గీ కర్తవ్య స్తేషా ముత్కర్ష మిచ్ఛతా.' ఇతి." అని.

అట్లే వేంకటేశ్వరుల శివదత్త శర్మ రుచిరావ్యాఖ్యలోను.—

"ఇద మవధేయం, —'ఏక ఏవే' త్యభిధాన ముత్కర్షాధానాయ, 'శృఙ్గారో వీరఏవేతి' పునః హాస్య బీభత్స భయానక రౌద్ర మాత్ర వ్యవచ్ఛేదాయ., తేన ప్రబోధచన్ద్రే శాన్త స్యోత్తరచరితే కరుణస్య చ ప్రాధాన్యం సఙ్గచ్ఛతే. ఉక్తం హి ధ్వనికృతా 'ప్రసిద్ధేపి ప్రబన్ధానాం... ...'" ఇతి.

ఇట్టి టిప్పణులు అసమీచీనములని శాస్త్రిలవారు తమ యుత్తరచరిత పీఠికలో ఇట్లు నిర్దేశించినారు — 'శృంగారమేగాని వీరమేగాని అని రెండు ఏవకారము లతో నియమము నిబద్ధమై యుండఁగా, ఈటిప్పణి గ్రాహ్యముగా నుండలేదు. ఎట్లన ప్రబోధచంద్రోదయమందు వీరరసమే అంగి గాని శాంతరసము గాదని మతాంతరము గలదు; అదే సాధువుగాఁ దోఁచుచున్నది. మఱియు నీటిప్పణిచే ఏరూపకమందుఁగాని తత్తల్లక్షణోక్త రసమే ఉండవలయునను నియమము జలలిపి యగును.

మఱియు సీటిప్పణి కరుణ విప్రలంభలక్షణమునకు విరుద్ధముగానున్నది. ఎట్లన_సా.ద.

'యూనో రేకతరస్మిన్ గతవతి లోకా న్తరం పున ర్లభ్యే
విమనాయతే యదైక స్తదా భవే త్కరుణ విప్రలమ్భాఖ్యః.'

'యథా కాదమ్బర్యాం పుణ్డరీక మహాశ్వేతా వృత్తాన్తే. పున రలభ్యే, శరీరా న్తరేణ వా లభ్యే తు కరుణాఖ్య ఏవ రసః. ' అని తద్వృత్తి. సీత పునర్లభ్యమైనది కావున కరణరసము గాదు.' అని. ఈ శాస్త్రిలవారి వ్యాఖ్యచే కారికకు ఆంధ్రదర్ప ణమందలి యనువాదము సమీచీనమని తెలియుచున్నది. ధ్వనికారుఁడు సామాన్య ముగా ఏకావ్యముంగూర్చియు చెప్పుచున్నాఁడు.—

'ప్రసిద్ధేఽపి ప్రబన్ధానాం నానారసనిబన్ధనే
ఏకో రసోఽఙ్గీ కర్తవ్య స్తేషా ముత్కర్ష మిచ్ఛతా.
రసా న్తర సమావేశః ప్రస్తుతస్య రసస్య యః
నోపహ న్త్యఙ్గితాం సోఽస్య స్థాయిత్వే నావభాసినః.
కార్య మేకం యథా వ్యాపి ప్రబన్ధస్య విధీయతే
తథా రసస్యాపి విధౌ విరోధో నైవ విద్యతే. '

అనఁగా మహాకావ్యనాటకాదులయందు పలురసములం గూర్చుట ప్రసిద్ధ మయినను, ఆకావ్యనాటకాదులకు ఉత్కర్ష సంపాదింపఁ గోరినవాఁడు ఏదే నొక్క రసమును అంగి— ప్రధానము— చేయవలసినది. అట్లు ప్రస్తుతమై స్థాయియై సర్వప్రబంధమును వ్యాపించిన అంగి రసముతో రసాంతరములం గూర్చుట దాని యంగితను చెనకదు; మఱి పోషింపనే పోషించును. ప్రబంధమునకు ఎట్లు ఒక్క ప్రధానకార్యము అంతటిని వ్యాపించునదిగా కల్పింపఁబడునో, అది ఇతరకార్యము లతోఁ గూడియు ప్రాధాన్యముం గోలుపోదో, అట్లే [అంగి] రసమును. ఇందు విరోధము లేదు అని. ఆమార్గమున రామాయణమున కరుణమును, భారతమున శాంతమును అంగులు అని అతఁడే. ఈసామాన్యశాస్త్రమును అందుకొని నాటక ప్రకరణమున ఆచార్యు లందఱును ఆయారూపకమునకు ఆయారసము [లు] ప్రధానము (లు) అని విశేషము నిబంధించినారు. వికల్పములు లేక మునికి వెనుక ధనిక ధనంజయులు దశరూపక తద్వ్యాఖ్యలలోను, విద్యానాథుఁడు ప్రతాపరుద్రీ యమునను, దానిటీకలో మల్లినాథకుమారుఁడు కుమారస్వామియు, విశ్వనాథుఁడు సాహిత్యదర్పణమునను, సర్వజ్ఞ సింగమనీఁడు రసార్ణవసుధాకరమునను—

౧. నాటకమున— శృంగార వీరములలో నొకటి యనియు
౨. ప్రకరణమున— అట్లే గాని; శృంగారమే గాని యనియు (౫౧౧)
3. అంకమున— కరుణ మనియు (౫౧౯)
౪. వ్యాయోగమున— రౌద్రమనియు, లేదా హాస్యశృంగారములు తప్ప కడమ అనియు (౫౧౪)
౫. భాణమున— వీరశృంగారము లనియు (౫౧3)
౬. సమవకారమున— వీర మనియు (౫౧౫)
౭. వీథిలో— శృంగార మనియు (౫౨౦)
౮. ప్రహసనమున— హాస్య మనియు (౫33)
౯. డిమమున— రౌద్ర మనియు, కాదా హాస్యశృంగారములు తప్ప కడమ అనియు (౫౧౭)
౧౦. ఈహామృగమున— రసాభాసమనియు (౫౧౮)

నియమము చెప్పియుండఁగా- అసమర్థములగు నీటిప్పణులేల? మఱి యుత్తరచరితమున శాస్త్రిలవారు కావించిన కరుణ విప్రలంభాంగితా సిద్ధాంతముం గాంచియు పెడదారికిం దివియు నిట్టి టిప్పణిని, విఱిగిన యవలంబమును బట్టుకొని యుత్తరచరితమున కరుణమ యంగి యని పెనంగనేల? ఇష్టవస్తువియోగమున ప్రత్యాశ కంఠముతో చెప్పినను చెప్పకున్నను అడంగదు. వైక్లబ్యము "ప్రత్యాశ సంయుతము లేదే" అనునట్టి కంఠరవముం బొందినను, దానిచే వైక్లబ్యాత్కట్యము తోఁచును గాని ప్రత్యాశలేమి వాస్తవముగా సిద్ధింపదు. పీనుంగును బ్రదుకునో అని "దింపుడు కళ్ళముల" నాసవహింతురుగదా.

"ఆదిత్యోఽయం స్థితో మూఢాః, స్నేహం కురుతసాంప్రతం,
బహువిఘ్నో ముహూర్తోఽయం,జీవే దపి కదాచన;
అముం కనకవర్ణాభం బాల మప్రాప్తయౌవనం
గృధ్రవాక్యా త్కథం మూఢా, స్త్యజధ్వ మవిశఙ్కితాః?

Our very hopes belied our fears,
Our fears our hopes belied;
We thought her dying when she slept,
And sleeping when she died"

"జీవే దపికదాచన" "Sleeping when she died." ఇట్టిది అనురాగభూమియందు సహజాతసిద్ధము ప్రత్యాశ. మఱి ఉత్తరచరితమున సీత వివాసితమాత్రయే "క్రవ్యాద్భి

రంగలతికా నియతం విలుప్తా" ఇత్యాది రాముని యేడుపు తెలుంగే కాని ఎఱుక తెలుంగు గాదు. మఱి తాపసవత్సరాజమునను స్వప్నవాసవదత్తమునను వాసవదత్త కాలి పోయిన దని ప్రవాదము విశ్వసనీయులవలననే రాజునకు అందును. ఇఁక నట ప్రత్యాశ యెట్లు? కరుణ విప్రలంభమును ఎట్లు? ప్రత్యాశ కలదనియు కరుణవిప్ర లంభమ యనియు శ్రీమల్లోచనకారుల యుపన్యాసము.— ఇదె కనుఁడు.—

"తాపసవత్సరాజే హి.— వాసవదత్తావిషయో జీవితసర్వస్వాభిమానాత్మా ప్రేమబన్ధః తద్విభావాద్యౌచిత్యాత్ కరుణ విప్రలంభాదిభూమికాం గృహ్ణాన్ సమ స్తేతివృత్తవ్యాపీ. రాజ్యప్రత్యాపత్త్యా హి సచివనీతి మహిమోపనతయా తదఙ్గ భూత పద్మావతీ లాభానుగతయా అనుప్రాణ్యమానరూపా పరమా మభిలషణీ యతమతాం ప్రాప్తా వాసవదత్తాధిగతి రేవ తత్ర ఫలం. నిర్వహణేహి 'ప్రాప్తా దేవీ భూతధాత్రీ చ భూయః' ఇత్యేవం దేవీలాభ ప్రాధాన్యం నిర్వాహితమ్. ఇయతి చ ఇతివృత్తవైచిత్ర్యే చిత్రభిత్తిస్థానీయో వాసవదత్తా ప్రేమబన్ధః ప్రథమ మారంభాత్ ప్రభృతి పద్మావతీ వివాహశ్చేతి తస్యైవ వ్యాపారాత్ తేన స ఏవ వాస వదత్తావిషయః ప్రేమబన్ధః కథావశా దాశఙ్క్యమానవిచ్ఛేదేపి ప్రబన్ధసహితః. తథాహి, ప్రథమే తావదఙ్కే స్ఫుటం స ఏవోపనిబద్ధః......... ద్వితీయేపి... ...... స ఏవ విచ్ఛిన్నవిచ్ఛిన్నో ప్యనుసంహితః. తృతీయేపి ......చతుర్థేఽపి ......... పంచమేఽపి సమాగమ ప్రత్యాశయా కరుణే నివృత్తే విప్రలంభేఽఙ్గీకృతే........., షష్ఠేఽపి త్వత్సంప్రాప్తి విలోభితేన మనసా ప్రాణా మయా ధారితా." ఇత్యాదినా.

మఱియు.—

"తాపసవత్సరాజేఽపి యౌగన్ధరాయణాది నీతిమార్గాకర్ణన సంస్కృతమతీ నాం వాసవదత్తామరణబుద్ధే రేవాభావాత్ కరుణస్య నామాపి నస్యా దిత్యల మవాన్తరేణ బహునా."

అట్లే హేమచంద్రుఁడు కావ్యానుశాసనమున లోచన వాక్యములనే తనవిగా వ్రైకొని "అత ఏవ తాపసవత్సరాజే ధారాప్రాప్తకరుణరసః సర్వాల్పో ద్వితీయోఽఙ్కః కవినా నిబద్ధః................ పఞ్చమే సమాగమ ప్రత్యాశయా విప్రలం భేఽఙ్గీకృతే.........ఇత్యాదినా చ వాసదత్తావిషయో జీవిత సర్వస్వాభిమానా త్మా ప్రేమబన్ధః తత్ర విభావౌచిత్యాత్ కరుణవిప్రలంభాది భూమికాం గృహ్ణా

విచ్ఛిన్నవిచ్ఛిన్నో సమస్తేతివృత్తవ్యాపితయా దర్శితః. రాజ్యప్రత్యాపత్త్యాపి సచివ నీతి మహిమోపనతయా తదఙ్గభూత పద్మావతీలాభానుగత యానుపాప్త్యమాన యాపా వాసవదత్తాధిగతి రేవ తత్ర ఫలమ్. నిర్వహణేపి.........'ప్రాప్తా దేవీ'తి దేవీలాభప్రాధాన్యం నిర్వాహితమ్."

ఉత్తరరామచరితమున పీడనిరతి కలదనియు, ప్రత్యాశయుం గలదనియు శాస్త్రుల వారు దాసిపీఠికలో నిరూపించినారు.

> " మృతేతి ప్రేత్య సంగన్తుం యయా మే మరణం మతమ్
> సైవావస్థితి మయా లబ్ధా కథ మత్రైవ జన్మని"
> " తీర్థే తోయవ్యతికరభవే జహ్నుకన్యా సరయ్వోః
> దేహన్యాసా దమరగణనాలేఖ్య మాసాద్య సద్యః
> పూర్వాకారాధికచతురయా సంగతః కాన్తయాసా
> లీలాగారే ష్వరమత పున ర్నన్ద నాభ్యన్తరేషు"
> " అనుమరణప్రస్థితయా ప్రత్యాగతజీవితే ప్రియతమే
> వైధవ్యమణ్డనం కులవధ్వాః శోభనకం జాతమ్."

అని యవాస్తవముగాను వాస్తవముగాను మృతినొందియు ప్రత్యాశ మృగ్యమయ్యు నాయకులు మరల కలసికొనుటను కరుణవిప్రలంభానంతర సంభోగముగా గ్రహించినారు అభియుక్తులు భోజదేవాదులు. మఱి యీయుత్తరచరితమున వివాసమాత్రమున సీత రామునిచేతికి దొరకియు కంటికి దొరకని సంవిధానమున ప్రత్యాశ సిద్ధమే గదా, వెదుకనేల? మఱి "స్వయం కృత్వా త్యాగం విలపనవినోదో వ్యసులభః" అనునట్టి [కరుణతర-నిష్ఠురతర? కరుణతరమే] సంవిధాన మున్నందున రామునకు సీతను మరలకలసికొను నాస యుండునా అని యడుగుదురా? ఆసడలని ప్రేమబంధమున అదేల యుండదు? 'లోకో న మృష్యతీతి' అని గదా 'నూతనరాజు, రాముడు రాజధర్మముం బురస్కరించుకొని సీతం దఱిమినాడు. కనుక లోకము మర్షించుటయే వ్యవధానము కలసికొనుటకు. రాముడు గదా; వసిష్ఠారుంధతులచే నవేక్షితుడుగదా, పృథ్వీభాగీరథులును అత్తయు అవ్వయునై తలపై పోచు మాట లవాడు గదా, ఋశ్యశృంగునికి మఱది గదా, లోపాముద్రయాశీస్సు పొందిన వాడు గదా, మఱి లోకమర్షణము—హర్షణముం గూడ— ఎట్లెట్లు ఘటిల్లరాదు!

" ఈదృశానాం విపాకోఽపి జాయతే పరమాద్భుతః
యతోఽప్రకరణీభావ మాయా త్యేవంవిధో జనః" అని కదా.

ఉత్తరచరితమున కరుణ విప్రలంభమయని భోజదేవుఁడు శృంగార ప్రకాశికలో కరుణ విప్రలంభ ప్రస్తావములలో దానినుండి పెక్కు ఉదాహరణములు గ్రహించినాఁడు. ఇవిగో ఇప్పటికి ప్రకటితములైన మూఁడుప్రకాశములలో దొరకినవి.— శృంగారప్రకాశిక సర్వము బ్రకాశితమగునేని ఇఁకను ఎన్ని దొరకునో.

౧. ప్రవాసానన్తరాత్ కరుణానన్తరో రాగవర్ధనః.— స యథా.—
'ఆలిమ్పన్నమృతమయై రివ... ...

౨. కరుణే [విప్రలంభే] విసంవాదనం విరుద్ధం యథా,—
'దళతి హృదయం గాఢోద్వేగాత్.'

3. తత్రైవ [కరుణవిప్రలంభే] కాలయాపనం వ్యావిద్ధం యథా.—
'దేవ్యా శూన్యస్య జగతో ద్వాదశః పరివత్సరః.

౪. తత్రైవ [కరుణ విప్రలంభే] ప్రత్యాదానం ప్రతిషిద్ధం యథా.—
'అ ఛేదం రక్షోభిః కనక.........'

౫. యదా తు కరోతే రభూతప్రాదుర్భావ నాద్యర్థవాచినః కరుణ ఇతి రూపం తదా స్త్రీపుంసవిషయ ఆయోజిత కామసూత్రః పునః సమాగమఫలోఽనురాగ ఏవ కరుణశబ్దేన ఉచ్యతే. తద్యథా.—కుఃఖాతిరేకా దభూతా న్కరోతి ప్రాదుర్భావయతీతి కరుణః.— యథా—
'మాత ర్మాతర్దళతి హృదయం... ...'

౬. కరోత్యభ్యఞ్జయతి బహిర న్తశ్చవ్యాప్నోతి విస్రంభోత్పత్త్యా స్త్రీపుంసయో రన్యతర స్యాయం హృదయ మితి కరుణః. యథా
'విలులిత మతిపూరై ర్బాష్ప మానన్దశోక...'

౭. సోఽయం [కరుణః] విప్రలమ్భాదిషు ఉపసర్జనీకృత ప్రత్యయార్థః ప్రకృత్యర్థోపవర్ణితః. అ థోపసర్జనీకృతప్రకృత్యర్థః ప్రత్యయార్థో వర్ణ్యతే. తత్ర భావః కర్మ......... హేతుకర్తా......
హేతుకర్తా యథా.—

"చిరాద్వేగారమ్భీ వికృత ఇవ తీవ్రో విమరసః......"

౮. అధికరణం యథా.—

"యస్యాం తే దివసా స్త్వయాసహ తథా నీతాః పునః స్వే గృహే."

౯. అథ ప్రత్యయోత్పత్తి కాలాః. కే పున స్తే? భూతో భవిష్యన్ వర్తమానోఽవ్యక్త ఇతి.........

తేషు లుఙాదివాచ్యో భూతో యథా.—

'ఏత త్పున ర్వన మహో కథ మద్య దృష్టం......'

౧౦. భూతానద్యతనో యథా....

'కరకమల వితీర్ణై రమ్బునీవారశష్పైః.......'

౧౧. లఙాదివాచ్యో భూతానన్తో భూతసామాన్యోయథా.—

'వినా సీతాదేవ్యా కిమివహి న దుఃఖం రఘుపతేః...'

భవభూతి స్వప్నవాసవదత్త తాపసవత్సరాజములచే ప్రతిబుద్ధుడై, కరుణ విప్రలంభమునకై ఉవ్విళులూరి, వానిని మించగోరి, యౌగంధరాయణాది కల్పిత దాహప్రవాదప్రభవమగు నాయుదయనుని కరుణకథకన్నను ధర్మమునకు కట్టువడి, ప్రజానురంజనకై సీతను కఠోరగర్భను, నమ్మకమున తనయురమునందే నిదురగూరి యున్న ప్రేయసిని, తననమ్మిన పవిత్రచరిత్రను, నిప్పునకు నిప్పు, తీర్థమునకు తీర్థము అయినదానిని అడవులకు తఱిమి, ఏమవనేని మొగములేని యూక పుటంపు దుఃఖపుటమునం గుమిలిన రామునికథను, కుందమాలయు దట్లట్లు ఉన్నదానిని అందుకొని అట్లు సవరించి "అహో. సంవిధానకము"అని తానే ఆత్మలో అలరినాడు.

రసములలో అధరోత్తరములు కలవు. అందు శృంగారము సుకుమారతమము; కమనీయతం బట్టి ప్రధానభూతము, సకలజనమనోభిరామమును. అట్లే ఈయా లోకలోచనోద్ధారములం గనుడు.—

"విశేషతస్తు శృఙ్గారే, సుకుమారతరో హ్యసౌ." ఆలోక

'సర్వేభ్యోఽపి రసేభ్యః సౌకుమార్యాతిశయయోగిని కవిరవధానవాన్ ప్రయత్నవాన్ భవేత్. తత్రహి ప్రమాద్యత స్తస్య సహృదయమధ్యే క్షిప్రమేవ అవజ్ఞానవిషయతా భవతి. శృఙ్గారరసో హి సంసారిణాం నియమేన అనుభవవిష

యత్వాత్ సర్వరసేభ్యః కమనీయతయా ప్రధానభూతః.' ఆలోక.

……కించ, శృఙ్గారస్య సకలజనమనోభిరామత్వాత్ …… ఆలోక.

రసములలో శృంగారమును; శృంగారమున విప్రలంభమును, విప్రలంభమున ఆకరుణాత్మకమును—అని యుత్తరోత్తరప్రకర్ష సంప్రదాయమువలననే కాక కవిసహృదయాభ్యుపగతిచేతను సిద్ధము. అట్లే స్వప్నమున చిరమైనను కాముఁడు ప్రసుప్తుఁడ కాని మృతుఁడు గాఁడు.—

"చిరప్రసుప్త కామో మే వీణయా ప్రతిబోధితః." కుందమాలలో కుందమాలయే ప్రత్యాశకును పునః సమాగమమునకును ప్రథమ సంపాదక సామగ్రి. ఇట్టిదెల్ల ఉత్తరచరితమున మూర్ఛిత రామప్రత్యుజ్జీవన సీతాకరస్పర్శ ప్రభృతికి దిక్ప్రదర్శకము.

మఱియు వినాశమరణములవలని నిరవధి నైరాశ్యప్రభవముకంటె దుఃఖమునకన్నను ప్రత్యాశ దాగుడుమూఁతలాడు నీ సావధి గ్రస్తముకంటె దుఃఖసుభగ సుకుమారతరము. ఆంగ్లవిమర్శకరసికుఁడగు హాట్టను భట్టుని యూసూక్తులను అరయదగును.

Pathos in the truest sense is very much more often felt than adequately expressed. The attempt to express it too often defeats itself ... ............ The death of little Nell, and of Paul Dombey, favourites as they are with the world at large, have in them just the air of vigilant scrutiny of the associations which rend the heart most, that, to my mind at least, robs them of what I mean by Pathos in its truest sense,— that artless cry of the dumb yet not despairing heart which words so seldom render articulate and so often utterly disguise..............................................................

I do not mean, of course, that the cry of a dumb heart which is absolutely despairing can never be adequately given without something to attenuate the misery of the cry; but only that when the passion is not thus attenuated it rises above the level of what we call 'pathos', and reaches that of tragedy. In all cases of true pathos, though trouble pervades the scene, it does not overwhelm; it is held in check by subduing feelings of a more grateful and hopeful description, which soften the pain and make the heart tremble with some undertone of unexpected sweetness, even in the very keenest vibration of its grief. Indeed so true is this, that I believe some of the most pathetic passages in our literature are those in which the subdued thankfulness or hope predominates over the pain instead of the pain over the hope...................................................................

..............................................................................................
In all cases of the higher pathos 'there must be something that battes against the pain, as well as some higher cry of the pain in the heart. Without the former, the latter would be a situation, not of Pathos, but of despair. Wherever there is true Pathos there is the surging of a buoyant wave in the heart breaking the force of the wave which overwhelms it with dejection and not unfrequently even prevailing over it..............................
..............................................................................................

ఉత్తరచరితమున కరుణాంగితకైన యీపెనఁగులాట హూణసంసర్గమువలన అలవడిన ట్రాజెడీ పక్షపాతమువలనం గలిగినది కాఁబోలు! లక్ష్యకారులలో సాఫోక్లీసు ప్రభృతులం దొడంగియు లక్షణకారులలో అరిస్టాటులు ప్రభృతులం దొడంగియు, షేక్స్పియరను పెదబత్తుఁడుంబనివడ, నేఁటివఱకుం గల కవిసహృదయ సువర్ణకారులు కూర్చిన ట్రాజెడీమాలకు హూణసరస్వతి మెడలో రాజిల్లుదానికి బ్రాడ్లీప్రభృతి నేఁటిలాక్షణికులు తుడిచి తుడిచి సానతీర్చితీర్చి మెఱుఁగు ఎక్కించి ఆధునికులను ప్రలోభింతురేని వీరును క్రొత్తగా ట్రాజెడీలను అట్లట్లు రచింతురు గాక. వేఱుసంప్రదాయము నకుం జెందినవైన యీప్రాచీనోత్తర చరితాదులయందు హిందూచిత్తసంస్కారమునకు దూరమైన ట్రాజెడీభావమును వెదకుట సమంజసము గాదు. మఱియు ఒథెల్లోహామ్లెటుమాక్బెతుసీజరు మొదలగువానియందు, ట్రాజెడీలయందే వీరరసముగాక కరుణరసము అంగియని నిశ్చయింపను రాదు. మాలతీ శాకుంతల నాగానంద మృచ్ఛకట్యాదులయందు కట్టకడపటమాత్రమే అటు మంగళము వంకకుం బొరలినకథను ఇట్లు అమంగళమువంకకుం బొరలించియున్న అవి మంచి ట్రాజెడీలే అయ్యెడివి. మఱి పొరలింపమికి కారణము ఏతద్రసవత్తాతిశయమందలి సంప్రదాయాగతాభినివేశమే కాక, హిందువులయాస్తికత తెఱఁగు, చిత్తవృత్తితీఱు, నమ్మకముల విధము, ఆచారములభంగి ఇట్టివెల్ల కారణము. ధర్మమునకు జయము, సుఖమయపరిణతి, అభ్యుదయము చెప్పవలయుననియు, అధర్మమునకు అపజయము దుఃఖమయపరిణతి, పతనము, భంగపాటును కూర్పవలయుననియు, ధర్మానుష్ఠానమున జయప్రత్యాశ ఎన్నఁటికిని అడఁపఁగూడదనియు ఆచార్యమహాత్తరులయాశయము కాఁబోలును. గొప్పవాఁడును అలంతిపొరచే క్లేశమును దుఃఖమును నాశమును పొందుట లోకమున కలిగియున్నను, లోకస్వభావమునకు అది నిదర్శనమైనను, దానియాట "లోకచరితమును అద్దములో చూపుట" యైనను, అందును ఉపదేశమున్నను, నాటకమువలని పరమార్థోపదేశమునకు క్షోభకారియగు దానిని గ్రహింపక సం

ప్రదాయరక్షకులు శాంతికారియగు తద్విపరీతమును, అధికారి సత్ఫలముంబొందుటను, గ్రహించినారు. అట్లుండ పునఃసంయోజనము చెప్పియేయున్న యుత్తరచరిత్రమున కేవలకరుణమును తరువాత సంభోగమును కలిపినా రనుట అననురూపములను అడుకువెట్టుటయగును. కాఁగా శ్రీశాస్త్రులవారు సంప్రదాయరక్షకముగా 'ఏక ఏవ' కారికకు సహృదయులను విమార్గములకుంబోరలనీని తెనుఁగును, "శృంగారమే గాని..." అని కూర్చినారు. రూపకములలో కరుణాంగియైనది అప్రసిద్ధము నామమాత్రశేషము 'అంక' మనునది కలదు. మఱి నాటకమున ప్రసిద్ధమున, అన్యరసప్రధానముగా ప్రసిద్ధమున, ఏడుపును అన్నిటికిం బెద్దచేయ నాసఁగొననేల ? ఇంతయు ప్రసక్తాను ప్రసక్తానుసరణము.

ఇట్లుగాక, తెలుంగులకై సొంతముగా అలంకారశాస్త్రము వ్రాసియుండఁగూడదా, దర్పణమునకు అద్ద మేల, అని యడుగఁదగును. ఆంధ్రులు చరిత్రకారులమతమున ద్రావిడులే యయినను ఆర్యులే యయినను ఉభయసంకర సంజాతులయినను, ఆంధ్రమున దేశ్యమునకన్న తద్భవమును, దానికన్నను తత్సమమును మొనకొనియున్నది. దానికి 'తత్' (సంస్కృత) సంబంధము ఇంచుకయు మానవలవిపడునదికాదు. మానం గోరికయు పోడమడు. అట్లే ఆంధ్రవాఙ్మయమునను 'తద'నుకరణము 'తదు' పజీవనము సర్వథా 'తత్ప' రవశతయు కలిగియున్నది. శ్రుతిస్మృతులు దేశభాషలం దర్జమా చేయఁబడునేని మడితొలఁగి, మైలపడునన్న భయము (ఆంధ్రవిజ్ఞానేశ్వరీయము ఉండుఁగాక) ఆంధ్రులకు లేదా? అశ్రుతిస్మృతులును తమవే యైనట్లు ఆంధ్రులపూజం బొందుటలేదా? సకలశాస్త్రములను సంస్కృతమున నున్న వానినే ఆంధ్రులు ప్రమాణీకరించుకొనుట లేదా? ఆంధ్రుల చౌటపోవనయన వివాహాదులకుం బ్రక్రియ ఆపస్తంబబోధాయనాదుల సూత్రములవలనం గాదా? వాల్మీకి వ్యాసకాళిదాసులకును నన్నయ తిక్కన పెద్దనలకును ఆంధ్రుల చిత్తమున "తను" "పెఱ" భేదము గలదా? ఇప్పటికే ఆంధ్రమున నున్న నరసభూపాలీయచూడామణులు గీర్వాణాలంకారికులను ప్రతిపదమునను అనుకరించినవే గదా? సర్వథా ఆంధ్రులకు పెక్కువేలతరములుగా గైర్వాణులయెడ స్వపరభేదము మాసి 'అందఱము ఒక్కరమే,' 'వారు మనవారే' అను అభేదము వాసనగా ఆత్మలనే పట్టుకొనలేదా? గీర్వాణి సర్వథా మాయమ్మయే అని 'పెవంగవలసియుండ, (ఆ స్థితి, వచ్చినదానికిని రానున్నదానికిని, ఎవఁడు పెడమొగమిడును?—) సాహిత్యపోలమును భరతానందయమ్మటవిశ్వనాథపండితరాయాదులు దున్నిదున్ని,

ఎరువు పెట్టిపెట్టి, పెనుఁబంటం బండించియుండఁగా, అది యింకను అనువాదముగా నైనను ఆంధ్రులసమగ్రానుభవమునకు రాక యుండఁగా, పూర్వోక్తము లైన ఏతద్దర్ప ణగుణములచే ప్రేరితులై శాస్త్రులవారు దీనిని ఆంధ్రులయాస్తి సేసే తెనుఁగుసేసి ఆంధ్రులయనుభవమునకుం దెచ్చుట మిక్కిలి సదృశమైన విషయము. ఏలో కో లొంటి తెలుఁగు మహత్తరులు ధ్వనిప్రకాశ దర్పణాదులం దెలిఁగింపరైరి! శ్రీశాస్త్రుల వారన్ననో దీన నాంధ్రుల గొప్పయక్కఱనే తీర్చినారు.

మఱి "అనువాదముగదా, దీని ముద్రణమున పుటలో పైన తెనుంగును క్రింద మూలమునుంగా ఒత్తింపవలసినది" అని కొందఱు. మఱియుం గొందఱు "ఇందలి లక్ష్యోదాహరణములను మాని వానికి సరిగా తెనుంగు వాఙ్మయమునుండి తివిచి కూర్పవలసినది" అని. ఇంకను ఇతరులు, 'వానిని మానక, వీనినిం గూర్చి ఉపబృహ్మింపవలసినది' అని. మఱి యీమార్గముల నేదియు శాస్త్రుల సమ్మతిం బడయ లేదు. క్రిందుమీఁదుగా ముద్రించుటచే అంగాంగి వివేకము చెదరి అంగి తెనుఁగు తాను అంగమును, అంగము సంస్కృతము తాను అంగియు నై ఆయాంధ్ర శిశువును ఇఁకను ఊర్జితపడవలసినదానిని ఈ దై విబసిని అణఁచి వైచునినియు; లక్ష్యో దాహరణమునకును గీర్వాణమున భరతభామహులందొడంగి ఎంతయో సంప్రదాయ ముండఁగా, ఆచార్యమహత్తరులు అలంతియలంతిగా తొడంగి అధికాధికముగా పెంచి యుండఁగా, ఉదాహరణము ఏరికొనను సాహితితోఁట విశాలమై, నానాజాతికృతులు అనంతముగాఁ గలిగియుండఁగా, తిక్కనపెద్దనలు త్ర్యక్షగురుప్రతిములు అయినను వాల్మీకి కాళిదాసులంబట్టి క్షుద్రులే కాఁగా, ఉదాహృతి నిశితనిశితముగా సూటిగా ఉండవలసియుండఁగా, తటాలునం దొరకుట దుర్లభముకాఁగా, ప్రతాపరుద్రీయ మార్గమున కల్పింపఁగూడదా యన్న ఆకల్పన ప్రతాపరుద్రీయముపాటియే నై ధ్వని ప్రకాశదర్పణములవంటిది కాకపోఁబోవఁగా, మఱి అట్లుగాకుండ సంస్కృతమున దర్పణమునకు ఎంత యధికారమో అంత ఆంధ్రమునను దర్పణమునకు సంపాదిత మగునుగాక అనియు; ఆయుపబృంహణమున అమ్మాయికి నంజే కాని తేజు చేకూర దనియు; ఉద్ధృతలక్ష్యశ్లోకములకు అనువాదమును పద్యములు కాఁగూడదాయని వ అప్రయత్నము అన్యకవివాక్కును అన్యమార్గమునం గూర్పవలయుటచే అతిక్లేశావ హమును కత్తిమీఁది సాముసు అగుటచేతను, 'చెప్పితయ్య హెచ్చు చీకిరేనాకంత, విడిచితయ్య చీమవెండ్రుకంత' అను నిందను, సాహితీ శాస్త్రమున విశేషముగా అప

వ్యాఖ్యమయినదానిని ఓర్వనేవలయుటచేతను, ఓర్చినను ప్రకృతమున ప్రయోజనాతి శయము అంతగా లేకపోవుటచేతను, ప్రయోజనహీనమగు నారంభమేలయనియు; ఈ నానాచాపలమును శాస్త్రిలవారు తలఁగి తమయాంధ్రమూలమును మాత్రము ప్రకటింపం దలంపుఁగొనిరి. ఇట్లు 'ఆలోకమునకు' 'లోచనముం' బోలె దర్పణము నకు వివరణము వ్రాయుటకుం గాక ఇది తెలుఁగుసాహితికి అద్దము కూర్చుటకు, అదే దర్పణమునకు అనువాదము వ్రాయుటకు, ఉపక్రమమగుటచే ఈ యాంధ్ర మూలమున విశ్వనాథునివాక్కును జవదాటని తేటతెనుంగు మాత్రము సంపాదిత మైనది. అంతట అముద్రితమై మూలఁబడిన దీనిని ఇప్పుడు శాస్త్రిలవారే ముద్రించు కొనియున్న 'ఆంధ్రదర్పణప్రకాశమును' సంయుతము ఈపుటలక్రిందం గాని, గ్రంథాం తమునంగాని కూర్చియుందురో ఊహింపఁ దరముగాదు.

సాహిత్యదర్పణమున దశమపరిచ్ఛేదము అర్థాలంకారముం జెప్పునది, కడు దీర్ఘము. అయినను దానిని తాము ఆంధ్రీకరింపమని శాస్త్రిలవారు చెప్పిరి. ఏలన, కువలయానందసహితమయిన చంద్రాలోకమునకు అర్థాలంకార విషయమున జయ దేవుఁడు చంద్రములో, ఆదర్శమున దండివోలె, కవితయందును అనఁన్యాదృశుఁడని శాస్త్రిలవారు- సాటివచ్చునది మఱియొండు లేదు. దానిని ఉపజీవించి ఆంధ్రవృత్తితోఁ గూడ దానిమార్గముననే అంశముచేత లక్షణమును అంశముచేత లక్ష్యమునుం జెప్పు చిన్నిపద్యములతో, ధారణకు మిక్కిలియు సులువగునట్లు, అలంకారసారసంగ్రహ మను వేఱొకకృతిని తాము పూర్వమే రచించియున్నందున. మఱియు గుణదోషముల సంఖ్యను, "అది యిందు అంతర్భూతము, అదియు, అదియు," అని తగ్గించుట ఎట్లు పూర్వపూర్వానుశాసనములకన్న ఉత్తరోత్తరముయందు గుణమో, అట్లే అర్థా లంకారములను ఏనింటిని పదియు, పదింటిని ఏఁబదియు, ఏఁబదింటిని నూఱునుంగా సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమముగా విభేదించి సంఖ్యం బెంచుట గుణము. దర్ప ణమున అవి డెబ్బదియుం గతిపయములే. మఱి చంద్రాలోకమున నూఱు,

" ఇత్థం శతమలఙ్కారా లక్షయిత్వా నిదర్శితాః
ప్రాచా మాధునికానాం చ మతా న్యాలోచ్య సర్వతః"

అని. అయినను ఆనిశ్చయముచు తరువాత మూర్చుకొని గ్రంథపూర్తికై దానిని సంయుతము తెనింగించిరి.

సాహిత్యదర్పణమును పేరునకుం గత మేమగునుకి అందుచేని-కావ్యాదర్శ

ము కావ్యదర్పణము; కావ్యాలోకము కావ్యప్రకాశము— ఇవి కలవు. తత్త్వావగాహియే సాహిత్యదర్పణము. ఆదర్శదర్పణములు ఆలోకప్రకాశములు సనుముల గులేని కావ్యసాహిత్యములును అగునా? కావ్యము కవికర్మ మగును. మఱి ఏటిది ఈ సాహిత్యము? దానికి దర్పణమేమి? సాహిత్యమనగ యోగముచే మేళన మని యర్థము. "కలసినతనము." మీమాంసాది శాస్త్రములయందు ఎట్టిమేళనము—కలసినతనము— సాహిత్యమగుననగా, "పరస్పర సాపేక్షాణాం తుల్యరూపాణాం యుగప దేకక్రియాన్వయిత్వం సాహిత్యం"— ఒండొంటి నపేక్షించునవియు, అనగా ఒకదానింబట్టి ఒకటిగా నుండునవియు, ఒక్క తెఱంగువియు ఒక్కమ్మడి ఒక్క టొకపనియం దు అన్వయముం బొందుట సాహిత్యము. శబ్దమును అర్థమును మనుష్యకృత కావ్యములయందు అట్టిమేళనముం బొందునవగుటచేత, అనగా శబ్దార్థములకు కావ్యమందు 'సాహిత్యము' కలిగియుండుటచేత గౌణమర్యాదగా కావ్యమునకును, దానికి మిక్కిలి సంబంధించినదానికిం గూడ 'సాహిత్య' మను వ్యవహారము యౌగికక్కినది. కాదా "సహితానాం భావ సాహిత్య" మ్మని స్వార్థముననే ష్యఞ్ప్రత్యయయోగముం బొంది ధర్మివాచకము నై యుండఁబోలును. అట్లే విశ్వనాథకవిరాజు "సాహిత్యార్ణవ కర్ణధారుఁడు." బిల్హణకవి "సాహిత్యపాథోనిధిమన్థనోత్థమగు కర్ణామృతమును రక్షింపుడో యి" అని కవీంద్రులను హెచ్చరించెను. సాహిత్యమీమాంసా సాహిత్యరత్నాకర సాహిత్యదర్పణాది గ్రంథములయం దభిహితాంశము లెల్ల ఈనామములయందలి తొలియవయవమగు 'సాహిత్య' శబ్దము కావ్యప్రపంచమంతటిని సమాహరించునని జ్ఞాపకము సేయుచున్నవి. మఱియు,

"పదవాక్యప్రమాణేషు తదేత త్ప్రతిబిమ్బితమ
యో యోజయతి సాహిత్యే తస్య వాణీ ప్రసీదతి."

"వ్యాకరణ మీమాంసాతర్క సాహిత్యాత్మకేషు చతుర్షు శాస్త్రేషు......
అని అభిధావృత్తిమాతృక.

"పఞ్చమీ సాహిత్యవిద్యేతి యాయావరీయః. సా హి చతసృణా మపి విద్యానాం నిష్యన్దః" అని కావ్యమీమాంస.

సాహిత్యము ఎల్లశాస్త్రములయు సారము, శాస్త్రవిశేషమును విద్యావిశేషమును. అంతియకాక,—

"దృష్ట్వా తాం మదనాభి రామనృపతిః పుత్త్రీం పవిత్రస్వరాం

సంగీతాంబునిధేః సుధాకరకలాం సాహిత్యహీనాం తదా
కావ్యాలంకృతి నాటకాదినిపుణాం కార్యామయేతి ధ్రువం
నిశ్చిత్యాశు పరం ప్రధానసచివం పప్రచ్ఛ కార్యక్రమం.
యామినీపూర్ణతిలకా సంగీతనిపుణా కృతా
సాహిత్యవిద్యా త్వభ్యస్యా యువత్యా ప్రౌఢయా తయా.
నానాలంకారశాస్త్రే నవరసభరితే భావసంరంభయుక్తే
కావ్యే నానార్థశాస్త్రే సుజనబహుమతే నాటకే చ ప్రశస్తే
స్వచ్ఛే ఛన్దోబ్ధిపూరే బహుసుఖవిషయే కామదే కామశాస్త్రే
ప్రాభాసీత్ బిల్హణా ద ప్యధికమతియుతా రాజపుత్రీ పవిత్రా"

సాహిత్యహీనను అమ్మాయిని కావ్యాలంకృతి నాటకాది నిపుణం జేయవలయునను టచేతను, సాహిత్యము నేర్పవలసినదానికి అలంకారశాస్త్ర, కా,వ్యార్థశాస్త్ర, నాటక, ఛన్దః, కామశాస్త్రములు నేర్పెననుటచేతను సాహిత్యము కావ్యము కాక కావ్యమందు 'ఊటదిగునట్టియు' 'ప్రతిబింబితమగునట్టియు' సకలకావ్యకావ్యానుషంగిక జ్ఞానముగాను, మఱియు కావ్యభేదమగు నాటకముంగూర్చి భరతమహర్షి చెప్పినట్లుగా

"న తజ్జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా
న తత్కర్మ న వా యోగో నాటకే య న్నదృశ్యతే" అని

ఇంకను అన్నిదెసలం గబళింపను చేతులు చాచుకొనుచు పెంపొందుచున్నది. కావ్యసాహిత్యములకుం బర్యాయత్వమును అభియుక్తులు ఇట్లు ఊహింపఁజూతురు. తొలి యాలంకారికుఁడు భామహుఁడు "శబ్దార్థౌ సహితౌ కావ్యం" అని యుద్దేశించెను. అట్లే వక్రోక్తిజీవిత కారుఁడును

శబ్దార్థౌ సహితౌ వక్రకవివ్యాపారశాలిని
బన్ధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాదకారిణి.
వాచ్యోఽర్థో వాచకః శబ్దః ప్రసిద్ధమితి యద్యపి
తథాపి కావ్యమార్గేఽస్మిన్ పరమార్థోఽయ మేతయోః
శబ్దో వివక్షితార్థైక వాచకోఽన్యేషు సత్స్వపి

అర్థః సహృదయాహ్లాదకారి స్వస్పన్దసున్దరః,

... ... ... ... ... ... ... ... ... ... ...

శబ్దార్థౌ సహితావేవ ప్రతీతౌ స్ఫురతః సదా
సహితావితి తావేవ కిమపూర్వం విధీయతే?
సాహిత్యమనయోః శోభాశాలితాంప్రతి కాప్యసౌ
అన్యూనానతిరిక్తత్వమనోహారిణ్యవస్థితిః.

సహితయోర్భావః సాహిత్యమ్. అనయోః శబ్దార్థయోర్యా కాప్యలౌకికీ చేతశ్చమత్కారకారితాయాః కారణమ్ అవస్థితిర్విచిత్రైవ విన్యాసభఙ్గీ. కీదృశీ—అన్యూనానతిరిక్తత్వమనోహారిణీ, పరస్పరస్పర్ధిత్వరమణీయా. యస్యాం ద్వయోరేకతరస్యాపి న్యూనత్వం నికర్షో న విద్యతే, నాప్యతిరిక్తత్వముత్కర్షో వాస్తీత్యర్థః. నను చ తథావిధం సామ్యం ద్వయోరుపహతయోరపి సమ్భవతీత్యాహ— శోభాశాలితాంప్రతి. శోభా సౌన్దర్యముచ్యతే. తయా శాలతే శ్లాఘతే యః స శోభాశాలీ, తస్య భావః శోభాశాలితా, తాంప్రతి సౌన్దర్యశ్లాఘితాం ప్రతీత్యర్థః. సైవ చ సహృదయాహ్లాదకారితా. తస్యాం స్పర్ధిత్వేనయా సావస్థితిః పరస్పరసామ్యసుభగమవస్థానం సా సాహిత్యముచ్యతే."

"సా సాహిత్యమ్" అను నిగమనము గనుఁడు. మఱియు—

"పరమార్థతః పునరుభయోరప్యేకతరస్య సాహిత్యవిరహోఽన్యతరస్యాపి పర్యవస్యతి. తథాచ— అర్థః సమర్థవాచకాసద్భావే స్వాత్మనా స్ఫురన్నపి మృతకల్ప ఏవావతిష్ఠతే. శబ్దోఽపి వాక్యోపయోగి వాచ్యాసమ్భవే వాచ్యాన్తరవాచకః సన్ వాక్యస్య వ్యాధిభూతః ప్రతిభాతి." అని.

రాజశేఖరుఁడు కావ్యమీమాంసయందు సాహిత్యమునకు ఇట్లు నిర్వచనముం జెప్పెను.— "శబ్దార్థయోర్యథావత్సహభావేన విద్యా సాహిత్యవిద్యా." అని. వ్యక్తివివేకటీకాకారుఁడు ఏమని వ్యాఖ్యానించినాఁడనఁగా— "నచ కావ్యే శాస్త్రాదివదర్థప్రతీత్యర్థం శబ్దమాత్రం ప్రయుజ్యతే, సహితయోః శబ్దార్థయోస్తత్ర ప్రయోగాత్. సాహిత్యం తుల్యకక్షత్వేన అన్యూనానతిరిక్తత్వమ్." అని. రుద్రటుఁడు "నను శబ్దార్థౌ కావ్యమ్." అనియు; "తత్........శబ్దార్థౌ......" అని మమ్మటుఁడును; "శబ్దార్థౌ................కావ్యం కావ్యవిదో విదుః" అని

విద్యానాథుఁడును, "శబ్దార్థౌ......కావ్యమ్" అని వాగ్భటుఁడును, "......... శబ్దార్థౌ కావ్యమ్" అని హేమచంద్రుఁడును— "ఇహ విశిష్టౌ శబ్దార్థౌ కావ్యమ్" అని. యలంకారసర్వస్వటీకాకారుఁడు సముద్రబంధు పండితుఁడును— కావ్యమున శబ్దార్థములకు జోడుపీడని "సాహిత్యమును" చెప్పినారు. భోజదేవుఁడు శృంగార ప్రకాశికలో—

"కావ్యం, తత్పునః శబ్దార్థయోః సాహిత్య మామనన్తి. తద్యథా— 'శబ్దార్థౌ సహితౌ కావ్యం' ఇతి. కః పునః శబ్దః? యే నోచ్చరితేన అర్థః ప్రతీయతే. స చ ద్వాదశధా.— ప్రకృతిః ప్రత్యయ...ఇత్యాది. కోఽర్థః? యః శబ్దేన ప్రత్యాయ్యతే. స చ ద్వాదశధా.— క్రియా, కాలః......ఇత్యాది. కిం సాహిత్యమ్? యః శబ్దార్థయోః సమ్బన్ధః. స చ ద్వాదశధా.—అభిధా, వివక్షా, తాత్పర్యం, ప్రవిభాగః, వ్యపేక్షా, సామర్థ్యం, అన్వయః, ఏకార్థీభావః, దోషహానం గుణోపాదానం, అలంకారయోగః, రసావియోగః— ఇతి........." అని. అందే మఱియు నొండెడ.— "అభిధావివక్షాదిభి ర్నిరూపితే శబ్దార్థయోః సాహిత్యే వాక్యస్య ప్రయోగయోగ్యతా ప్రయోగానర్హతా చ నిరూప్యతే........"అని. ధ్వనిదర్పణ గంగాధరములందును ఈ'సాహిత్యము' వీడిపోలేదు. రసవస్త్వలంకార లక్షణ ప్రతీయమానార్థమునకు—అదే ధ్వనికి, పరంపరగా శబ్దార్థములతోను, [అట్లే గదా, 'యత్రార్థః శబ్దో వా త మర్థ ముపసర్జనీకృత స్వార్థౌ వ్యఙ్క్తః' అనియు 'వ్యఙ్క్తః' అను ద్వివచనముచేత ఇందు శబ్దమునకు అర్థమును అర్థమునకు శబ్దమును సహకారులనియు; మఱియు నొండెడ 'సహృదయానాం ......శబ్దార్థయోః సాహిత్యే నైవకావ్యత్వే' అనియు ధ్వన్యాలోక లోచనములు.], రసవద్వాక్యం అని వాక్యముఁ జెప్పుటచేత అందును అర్థమునకు శబ్దముతోను, రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యం అనుటచేత అర్థమునకు శబ్దముతోను, [అట్లేగదా— అవ్యవహితముగానే శబ్దార్థా......ఆద్యం (కావ్యమ్)' అనుట.'] అట్లే మూఁటను అర్థముతో శబ్దమును, శబ్దముతో అర్థమును సాహిత్యముం బొందినది. రసప్రాణతయను నూతన లక్షణముం జెప్పుటచేత ఈసాహిత్యము నెడ పరాకుం జెందుదురో అనియే విశ్వనాథుఁడు గ్రంథమునకు సాహిత్యదర్పణమని పేరులోనే 'సాహిత్యము'ను నిలుపుట. అట్లే 'శబ్దః' కావ్యమ్ అనుటచేత రసము నెడఁ బరాకు చెందనీకుండ పేరిభట్టుకుమారుఁడు (రసగంగాధర) మనుట. తనకు ప్రాణము అలంకారమైనను రస

మైనను రీతిమైనను ధ్వనిమైనను వక్రోక్తిమైనను కావ్యము శబ్దార్థసాహిత్యము, శబ్దార్థముల యొండొంటి చక్కని పొందిక. అట్లే Theodore Watts అను పండితప్రకాండుఁడు అతిప్రియత్నముతో కావ్యమునకు లక్షణములం గూర్చుచు అది 'Mind', Language' అనువాని సాహిత్యమని సూచించినాఁడు.- "Absolute poetry is the concrete and artistic expression of the human mind in emotional and rhythmical language." అని. ఇఁకను Hudsonఆచార్యుఁడును బహులక్షణ పరామర్శ పూర్వముగా నిట్లు చెప్పినాఁడు.- "In its fullest and completest sense, poetry presupposes "the union of the two." అని. మఱియు,

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ అనియు

తమర్థమివ భారత్యా సుతయా యోక్తుమర్హసి
అశోచ్యా హి పితుః కన్యా సద్భర్తృప్రతిపాదితా. అనియు కాళి
[దాసుఁడును

నాలమ్బతే దైష్టికతాం ననిషీదతి పౌరుషే
శబ్దార్థౌ సత్కవి రివ ద్వయం విద్వా నపేక్షతే. అని మాఘుఁడును

"పౌరుషాదృష్టయోః పరస్పర సాపేక్షత్వాత్" అని మల్లినాథుని సగ్వాంకపయు సూచించుటయె కాక, దాని యుపనిషత్తును,

'శివా శబ్దమయీ ప్రోక్తా శమ్భు శ్చార్థమయః స్మృతః
అతః శబ్దార్థనిష్పత్తిసిద్ధయే తౌ నతౌ మయా'

అను మొదలగు పౌరాణిక వచనములును వాగీశతా మాధవతా అర్ధనారీశతలచే తేజరిల్లు మతమునుంగూడ బ్రతిష్ఠించినవి. (ఈశబ్దార్థసాహిత్యమునే సంగీతమున 'సరిగమాది' స్వరవిన్యాసరూపశబ్ద 'ధననుతా, నాహృదయమున రమింపు'రూపార్థ సాహిత్యమందును అతిదేశించుకొందురు.)ఇట్లు "సాహిత్యము" "కావ్య"మంటు కావ్యానుషక్తమగు ప్రపంచము నెల్ల తివిచి ఆక్రమించినది. ప్రకృతమున కావ్యమే.

మఱి దర్పణ మేమి ? సాహిత్యదర్పణము సాహిత్యమునకు అద్దము కాఁబోలు

" సాహిత్యదర్పణ మముం సుధియో విలోక్య

సాహిత్యతత్త్వ మఖిలం సుఖ మేవ విత్త"

దీనిం జూచి(=ఇలోకస్య) బుద్ధిమంతులు సాహిత్యతత్త్వము అంతయు సులువుగా ఎఱుఁగఁదగునంట! అద్దమునం గనంబడునది ప్రతిబింబము గదా. అట్లే ఈదర్పణమున సాహిత్య(కావ్య) ప్రతిబింబము, ప్రతిబింబములును, ఉదాహరణముచేతను, నిర్దేశము చేతను, చొచ్చి తమ ప్రకృతులు ఎదుట లేకున్నను తాము ప్రకాశించుచున్నవి. ఎట్లనఁగా దండ్యాచార్యుఁడు కావ్యముంగూర్చి చెప్పిన మర్యాదగా. అదియు.

" ఆదిరాజయశోబిమ్బ మాదర్శం ప్రాప్య వాఙ్మయం
తేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి."

"తొంటిరాజుల యశః ప్రతికృతి వాఙ్మయమగు— కావ్యరూపమగు— నద్దముం బొంది, వారు ఎదుట లేకున్నను తాను మాయము గాక అగపడుచు (నేయు)న్నది, చూడు." అని. ఇందు ఇంచుమించుగా ఎనుబది కావ్యములు పరామృష్టములు. అట్లుగాదేని దర్పణమున జనులు తమ వేషవిలాసాదులం జూచుకొని దిద్దుకొని తీర్చుకొందరు. అట్లే కావ్య(శ్రీ) కవుల చిత్తంపుఁబాలవెల్లినుండి మననాది మథనముచే పొడలెంచునట్టిది ఈదర్పణమునం దన్నుఁ జూచుకొని వంకలుతీర్చుకొని నవనవంపుఁ దన నవకమునకు సంతోషింపవచ్చును. కుడి యెడమయు, ఎడమ కుడియునుం గా విపరీతజ్ఞానముం గూర్చునని లోకమున అద్దము ప్రయోజనముం గోలుపోదుకదా. అట్లును సాహిత్యమునకు ఇది దర్పణ మగును. అట్లునుం గాదేని అభినవగుప్తుఁడు సహీటికి నిజముగా (లోచనము) కన్నులు తెఱచినాఁడు. ఆకన్నులతో ఈయద్దము చూచుకొని స్వయము ఉపకరించుకొనవచ్చును. కావుననే యీ "ధ్వనిప్రస్థానపరమాచార్యుఁడు" ఈ 'యద్దమును' తయారు చేసియుండఁబోలును. ఒకవేళ 'దర్పణము' ప్రతికృతిం జూచుకొను నద్దము గాక, పట్టి యద్దము విశేషముగా దృష్టిలోని దోషమును హరించుచు ఆలోకప్రకాశాదులను ఓర్చి చూచి యెఱుంగుటకు కంటికి సాయపడునదైన "సులోచనమును" అగునా? అట్లే గదా లోచనకారుఁడు తాను సులోచనకారుఁడును అగుట.—

" యత్కించి దప్యనురణన్ స్ఫుటయామి కావ్యా—
లోకం సులోచన నియోజనయా జనస్య." అని.

"లోచనాభ్యాం విహీనస్య దర్పణః కింకరిష్యతి?" ఇందలి 'దర్పణము' (ముకురద్దము) కంటిజోడగుటయే సరసము. కావున దర్పణకారుఁడును దర్పణము

దొడ్డగా జనులకు తొడిగి తొలుతనే కావ్య 'ప్రకాశము' యొక్క రంగును జూపినాఁడు. ఆ "ప్రకాశమునకును" "దర్పణము" తమ్ముఁరు చేసినాఁడు. అట్లునుం గాదేని దర్పణము 'ప్రకాశింపఁజేయునది,' ఆదర్శము 'అగపఱుచునది.' మఱి ఆదర్శము టీకార్థకమైనట్లు, లాక్షణికముగా దర్పణమును అట్లే టీకార్థకమై— అలంకారచంద్రికాలంకారదర్పణాలంకారసూర్యోదయాలంకారప్రకాశ కావ్యప్రకాశ కావ్యాలోక కావ్యకౌముదీ కావ్యదర్పణ కావ్యాదర్శ కావ్యాలోక నాటకదర్పణ నాటకప్రకాశ శృంగారప్రకాశికాది సాహచర్యముం బొందునా? అప్పుడు "సాహిత్యము"ను కావ్యము కాక, సకలకావ్యములను లోఁగొని కావ్యరసజ్ఞతనుపదేశించు కావ్యసంబంధిశాస్త్రమును అగును. కావుననే ముకుళపండితుఁడు సాహిత్యమును ఒక శాస్త్రమని అనుట.

ఉపసంహారమున ఇది యొకజ్ఞాపిక.— రసవద్వాక్యాచార్యుఁడు గదా విశ్వనాథకవిరాజు. ఈతఁడ కాక రసమును నిర్వచింపఁబూనిన తొంటియాచార్యు లెల్లరు దానిని బ్రహ్మానందసహోదర మనుచు—

> ౩౮. సత్త్వోద్రేకా దఖణ్డ స్వప్రకా శానన్ద చిన్మయః
> వేద్యాన్తరస్పర్శశూన్యో బ్రహ్మాస్వాదసహోదరః
>
> ... ... ...... ... ... ... ......... ....... ... ...
>
> స్వాకారవ దభిన్నత్వే నాయ మాస్వాద్యతే రసః.'

అన్న మార్గముగా కేవలాద్వైతబ్రహ్మకల్పముం జేసినారు. కాఁబట్టి విశిష్టాద్వైతులకు విశిష్టలక్షణబ్రహ్మను ఉపాసించువారికి— మఱి రస మెక్కడిది! రసవద్వాక్య మెక్కడిది! కావ్య మెక్కడిది!— అని రసికులు చప్పటలు చఱతురు కాఁబోలు. అయినను అవలంబము కలదులే.— వేంకటేశుని గంటయెత్తిన దివ్యావతారము విశిష్టాద్వైతుల జ్ఞానకల్పశాఖి వేదాంతదేశికులు జగద్గురువు వేంకటనాథాచార్యులు న్యాయసిద్ధాంజనమున "బుద్ధిపరిచ్ఛేదమున ఆనతిచ్చినారు,— ఇట్లు.—

"ఏవం సౌశీల్యవాత్సల్య సౌహార్ద ప్రభృతయోఽపి బుద్ధివిశేషాః; భరతాది పఠితాశ్చ రత్యాదయః స్థాయిభావాః తత్పరిణామరూపాః; సఞ్చారిభావేషు చ నిర్వేదాదయః స్వావమాననాదిరూప బుద్ధివిశేషా ఏవ. గ్లాన్యాద యస్తు శరీరాద్యవస్థా విశేషాః. స్వప్నశబ్దస్యాపి స్వప్నదర్శనాభిప్రాయత్వే బుద్ధివిశేష విషయత్వం వ్యక్తమ్ సుషుప్త్యభిప్రాయత్వేఽపి, అమూర్ఛితస్య జీవతః సమస్తజ్ఞానప్రసర రహితావస్థా

విషయత్వం. ఏవం జాడ్యాది ష్వపి చింత్యం. నిద్రా తర్హి కస్యావస్థా? చింతాలస్య కశ్మలాదిభిః సంమీలితో మనసః జ్ఞానస్యైవ వా; సైవ సుషుప్త్యాది కారణమ్...
..." అని. ఈదిక్కున జ్ఞాతృజ్ఞానజ్ఞేయత్రియ విశిష్టతాంగీకారముచే జ్ఞానమునకు ఆత్మధర్మత్వము ఘటించునుగదా. ఆవిశేషము మాత్రము మనస్సున నుంచుకొన్న తక్కిన కావ్యమీమాంస విశిష్టావిశిష్టాద్వైతులకు ఉభయులకు ఉమ్మడిగాను అవికలముగాను సమానమే అగును.

నెల్లూరు. } ఆచార్య శ్రీపాదరేణువు,
జూన్ - 1935 } నే. రామదాసు.



శ్రీరస్తు.

కళాప్రపూర్ణ

# వేదము వేంకటరాయశాస్త్రులవారి చరిత్రము.



రచయిత: ధరణీకోట వేంకటసుబ్బయ్య, బి.ఏ., బి.ఇడి.

[ఉపాధ్యాయుఁడు, వేంకటగిరి రాజవిద్యాలయము, నెల్లూరు.]



శ్రీకమనీయ యాచితివిశిష్టయు సద్భుతనవ్యకల్పనో
త్సేక యుదార సర్వరసదీప్తిసముజ్జ్వల శబ్దశిల్పహే
వాక మనోహరార్థయును భారతి చేరిన బ్రహ్మకే నమో
వాక మొనర్తు వేదకులవర్ధన వేంకటరాయశాస్త్రికిన్.

" దేశక్షేమమునకు భాషాక్షేమము పునాది." — వేం. శాస్త్రి.

" నేనును ఒకయర్థమున ఆంధ్రమధు మథనుఁడను." — వేం. శాస్త్రి.



పఠితలకు పాఠ్యమాన గ్రంథకర్తృ చరిత్రము విషయమున జిజ్ఞాస పొడముట సాజము. కావున తత్పరితోషార్థము సాహిత్యదర్పణాంధ్రీకర్తలును, విద్వద్రసజ్ఞ పరితోషదాయకములును విద్యార్థిజన కల్పకములును అగు పెక్కు గ్రంథములు రచియించి ఆంధ్రగీర్వాణ వాణీ సేవా పరతంత్రులుగ ఆంధ్రులకుం జిర పరిచితులు నైన కళాప్రపూర్ణ, బ్ర. శ్రీ. వేదము వేంకటరాయశాస్త్రి మిశ్రుల చరిత్ర ఇందుక ఇటు నిబంధింపఁబడుచున్నది.

శ్రీ వేంకటరాయశాస్త్రులవారు కౌశిక సగోత్రులు, ఆపస్తంబసూత్రులు, యజుశ్శాఖాధ్యాయులు, ఆంధ్రదేశమున ధీమహిమోల్లసితమైన పుదూరు ద్రావిడ బ్రాహ్మణ సంఘమునకు అలంకారభూతులు, వేదాన్వవాయ ప్రభవులు. ఈకుటుంబమువారు తొలుత తిరుపతి వాస్తవ్యులై కాలక్రమమున ఉత్తరముగా నెల్లూరుజిల్లా అల్లూరు చేరి అందు కొంతకాలము తిరుపతివారనం బరగుచుండిరి. కాని వీరు వేదాధ్యయనాధ్యాపన పరాయణులౌటం జేసి అచిరముననే వేదమువారని విఖ్యాతులైరి. వీరు మల్లయపాళెము శ్రోత్రియమును సర్వాగ్రహారముగాఁ బడసిరి. ఈవంశము పెక్కుపురుషాంతరములుగ పాండితీ మండితము. శ్రీ శాస్త్రులవారి పితామహులు వేంకటరాయశాస్త్రులవారు " వేదశా

స్త్రములందుఁ బ్రఖ్యాతులు, మిక్కిలి పేదలు, అయినను అప్రతిగ్రాహకులు" (భాగధేయము.)

## జననీ జనకులు.

—:0:—

వేంకటరాయశాస్త్రులవారి తండ్రిగారు సుగృహీతనాములు వేంకటరమణశాస్త్రులవారు. బాల్యముననే వారు పితృచరణులతోడ క్రమాంత వేదాధ్యయనము చేసి కావ్యములు చదివి కంచికిం బోయి బ్రహ్మశ్రీ నివర్తి వేంకటరామశాస్త్రుల వారి శిష్యులై వ్యాకరణము అధ్యయనించి అందుసంపూర్ణ పాండిత్యము సంపాదించిరి. వారినిగూర్చి వేంకటరాయశాస్త్రులవారు స్వవిరచిత "వేంకటరాయశాస్త్రి భాగధేయము" నందు ఇట్లు వ్రాసియున్నారు:— "నాయనగారు అగ్నిసిక (అపగ) పతంజలి యని ప్రఖ్యాతులు, మహారసజ్ఞులు, అద్భుతసాహిత్యపండితులు, సౌజన్యపరమావధి, శిష్టులు, అప్రతిగ్రాహులు, నిస్స్పృహులు, సత్యసంధులు, కరుణాపరాయణులు, యథాశక్తిత్యాగి, అనారోగ్యము అరుదు" అని. "పూర్వము హైకోర్టు పండితులై కులపతులుగా జగద్విఖ్యాతి" గాంచిన గుర్జాము అప్పన్నశాస్త్రులవారికిం గూడ వీరు శిష్యులంట. శబ్దరత్నాకర ప్రౌఢవ్యాకరణాది గ్రంథ ప్రణేతలగు బహుజనపల్లి సీతారామాచార్యులవారికి కరము పరిచితులు. మదరాసు ముత్యాలపేట సంస్కృతాంధ్ర ద్రావిడ పాఠశాలలో వేంకటరమణశాస్త్రులవారు ప్రధానోపాధ్యాయులుగను సీతారామాచార్యులవారు ఆంధ్ర ప్రధాన పండితులుగను కొంతకాలము ఉండిరి. సీతారామాచార్యులవారు వీరిని "గొప్ప పండితులు, మంచి లాక్షణికులు" అని ప్రశంసించి యున్నారు. వేంకటరమణశాస్త్రులవారి పరిచితులలో శ్రీశిష్టు కృష్ణమూర్తిశాస్త్రులవారొకరు. భాగధేయమున నిట్లున్నది.— "శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారికి గుంటూరు కాకినాడలలో పరిచితులు. కృష్ణమూర్తిశాస్త్రిగారికి చిన్నయసూరిగారితో కాళహస్తి వేంకటగిరి సంస్థానములలో ఘర్షణ. కృష్ణమూర్తి శాస్త్రిగారు బాలవ్యాకరణమును హరికారికలను పేర సంస్కృతమున అనువదించుట" (పిమ్మట బాలవ్యాకరణమే హరికారికలకు తెనుఁగు అని) "వాదియసత్యవాదము. అట్లుచేయఁగూడదని మానాయనగారు కృష్ణమూర్తి శాస్త్రిగారిని హెచ్చరించుట" అని.

వేంకటరమణశాస్త్రులవారి ధారణాశక్తియు, వాక్చాతుర్యమును అసాధారణములు, తపస్ఫూర్తిలకు సంక్రమించిన యమూల్యపైతృకధనము.

వేంకటరమణశాస్త్రులవారు మొదట మదరాసులో సంస్కృతాంధ్ర ద్రావిడ పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగను, పిమ్మట కాకినాడ నరసాపురము పోడూరు విశాఖపట్టణములందు ఆంధ్రోపాధ్యాయులుగను ఉండి, కడపట 1878 లో రాజమహేంద్రవర రాజకీయ కళాశాలలో సంస్కృత పండితులుగఁ బ్రవేశించిరి. 1887లో ఉద్యోగము విరమించుకొని రు 25 లు అను మాస విశ్రామ వేతనమును బడసిరి. వీరు 83 వ యేట 1902 లో నెల్లూరిలో మరణించిరి. వీరు పూర్వాచార పరాయణులు యోగాభ్యాసాభినివిష్టులు. కాకినాడలో నుండఁగా, "పట్టిసములో పుష్కరాలలో అమ్మవారి సన్నిధిలో కొండమీఁద గుడిలో తపస్సు ఆఱుమాసము (లొనర్చిరి). అనంతభట్ల సుబ్రహ్మణ్యమను పేరి శిష్యుఁడు జువ్వలదిన్నె వాఁడు తెచ్చియిచ్చు దోసెడు రేగుఁబండ్లు ఆహారము, వేఱుఅన్నము లేదు."

(భాగధేయము). వీరితపోవృత్తాంతములు అనేకములు కలవు. ఆమహనీయు నెఱింగి వచించు వారి వలన విన్న సరికదా, వీరి ప్రతికృతిని దర్శించినను ఆప్రశాంతతయు, ఆబ్రహ్మవర్చసమును ముఖమున ప్రతిఫలించుచుండును.

వీరు రెండు గ్రంథములు రచియించిరి. అందు శ్రీ శంకరభగవత్పాదుల యాత్మబోధకు ఆంధ్ర వివరణము ఒకటి. ఇది అకర్తృకముగా నొరులచే ముద్రితమై ప్రచారమునను న్నది. మఱొకటి "లఘువ్యాకరణము" అను నాంధ్రవ్యాకరణము. దీనికి "సరసాపురవ్యాకరణ" మని నామాంతరమఁట. వెంకయ్యవ్యాకరణమునకుఁ బూర్వము ఇది ఉత్తర మండలములలో ప్రచారమున నుండెనని విన్నదేగాని కన్నదిలేదు.

వేంకటరాయ శాస్త్రులవారి తల్లి లక్ష్మమ్మగారు. ఉడాలి యశ్వత్థ సూర్యనారాయణ సోమయాజుల వారి పుత్త్రిక, విద్వద్వీరప్రసవ. 1928 అక్టో 27 నెల్లూరిలో కాలధర్మమొందెను.

## శాస్త్రులవారి జననము-

—:0:—

శ్రీ వేంకటరమణ శాస్త్రులవారు లక్ష్మమ్మగారు అనుపావన దంపతులకు మదరాసు వీరపిళ్ళవీథిలో క్రీ. శ 1853 డిసెంబరు 21 వ తేదీనాఁడు (శా. శ ౧౭౭౫ ప్రమాదీచ మార్గశీర్ష బహుళ షష్ఠి సౌమ్యవాసరము ఉదయము ౧౬—౨౩ గడియలకు మీనలగ్నమున) శ్రీవేంకటరాయ శాస్త్రులవారు జన్మించిరి.

## తత్సహోదరులు

—:0:—

వేంకటరమణశాస్త్రుల వారికి నలుగురు పుత్త్రికలును, మఱిమువ్వురు పుత్త్రులును జన్మించిరి. పుత్త్రులలో నెల్ల ప్రథములు వేంకటరాయశాస్త్రులవారు. వారిబాల్యచరిత్ర వక్ష్యమాణము. ద్వితీయులు వేంకటసుబ్బయ్యగారు. ఎఫ్. ఏ. పరీక్షలో జయమొంది సాలూరి చినజమీందారుగారి యొజ్జలుగను, రాజమహేంద్రవరముటౌను స్కూలులో ప్రధానోపాధ్యాయులుగను, ఉండి 25వ యేట మరణించిరి. వీరు స్వారీ, ఈఁత, మల్లయుద్ధము మున్నగు కాయికకళలలో ప్రసిద్ధులు. నిండువఱదలో గోదావరిని ఇద్దరినుండి యద్దరికి, అద్దరినుండి ఇద్దరికి ఈఁది పందెమున గెల్చుగొని ఉత్తరకాలమున విద్యానాథుని యీఁతవృత్తాంతమునకు నిమిత్తభూతులైరి. ఒకప్పుడు శ్రీశాస్త్రులవారు గోదావరివఱదలో పడి తనుకులాడుచుండ వీరు కూఁతవేటుదూరముఁబడవను (పడవ, పడవోయి, పడవ" అని కేకవేసి పిలిచి అది సమీపించువఱకు అన్నగారిని కాపాడి, అందుఁజేర్చి దరిఁ జేర్చిరఁట. "పడవ......" ఇత్యాది ఆఙ్గ్ల ప్రతాపరుద్రీయమునందు చేర్పఁబడినది. వీరు కవనకామనీయమునందును, మనోమార్దవమునందును ఆఙ్గ్లకవి గోల్డుస్మిత్తువంటివారని వినికి.

మూఁడవవారు వేంకటాచలయ్యగారు. వీరు 1883 లో సంస్కృతమున రాజధానిలో ప్రథములుగ బి. ఏ పరీక్షలో నుత్తీర్ణులై 400 రూపాయల విజయనగర బహుమానము పడసిరి. 1885—87.

లో రాజమహేంద్రవరము (ఇన్నీసుపేట) బోర్డుహైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగ నుండిరి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును, శ్రీ రాయసము వేంకటశివుఁడు (ఎం. ఏ., ఎల్. టి.) గారును అప్పటి శిష్యులఁట. పిమ్మట వేంకటాచలయ్యగారు బి. యెల్. పరీక్షనిచ్చి నెల్లూర న్యాయవాదిప్వృత్తి నుండి 12 నవంబరు 1931 లో కాలధర్మమునొందిరి. వీరు న్యాయశీలురు, మహాపండితులు, ప్రాచీనార్వాచీన ప్రాక్పశ్చిమ భాషలలో పదునేనింట కోవిదులు. 'హిందూలా' ను గూర్చి వీరు వ్రాసి ప్రకటించిన రెండు లఘుకృతిని ఇంగ్లాండులో సర్. హెన్రీమెయిన్ గారు ఎంతయుఁగొనియాడిరి. ప్రాచీన చరిత్రమును, భాషాతత్త్వ శాస్త్రమును తదభిమతవిషయములు. సమకాలీన భాషాచరిత్ర పర్యాలోచనపూర్వకముగ 800 సంస్కృత శబ్దములకు వ్యుత్పత్తులఁజర్చించి సిద్ధాంతీకరించినారు. అందు సుమారు 30 మాత్రమే భారతిలోఁ బ్రకటితములు. 4 వ సంచిక వచ్చులోపలనే కాలధర్మమునొందిరి. లేకున్న ఆ శబ్దనిరుక్తనిధులు ఆంధ్రులకు దక్కియుండెడివి. వీరు ఆంగ్లమాసపత్రికలలో 'ఆర్యనస్తము,' 'సప్తద్వీపా వసుంధరా' ఇత్యాది బహువ్యాసముల నమూల్యములఁ బ్రకటించిరి. సప్తద్వీపములఁ గూర్చిన తదీయ సిద్ధాంతమును లండన్ జిగ్రాఫికల్ సొసైటీవారు ప్రమాణముగా నురరీకరించియున్నారు. వీరు భారత విమర్శనమను నొకగ్రంథమును ఆంగ్లభాషలో వ్రాసి ప్రకటించిరి. 'సెగటిలో నిమందువేలు' నాయమున అది ఇచట నజ్ఞాతకల్పమయ్యె, ఖండాంతర దేశాంతర ప్రఖ్యాతము. కాలేజిలో చదువుకొను దినములలో వీరు ఆంగ్లాంధ్ర గీర్వాణములలో చెప్పిన కూటపద్యములలోఁ గొన్ని యద్భుతములు ఇప్పటికి తత్కుటుంబమువారికి స్మృతి గోచరములైయున్నవి. సంస్కృతమున ధూమకేతువర్ణనమునుండి ఒకశ్లోకము:—

> ఆకాశహ్రదతో వళక్షవసజవ్యూహో భవే ద్వావా
> కిం పుంజీకృత సర్వలోక తుహినస్తోమో భవే దస్బ గే!
> కిం వాకాలిక శారదాభ్రశకలాః! కింవా!బలాకాచయః!
> కిం కారణ్ణవ సంచయః! కిము భవేత్ ప్రాగంగనానవల్లికః!

నాలవవారు శ్రీసూర్యనారాయణ శాస్త్రిలవారు. 30 యేండ్లుగా నెల్లూరు వేంకటగిరిరాజ విద్యాలయమునందు ఉపాధ్యాయులు, చతురులు, సంస్కృతాంధ్రభాషావిశారదులు, 'నీతిశ్లోకరత్నావళి' రచయితలు, ఏతద్వ్యాసరచనమున నాకత్యంతము సహాయులు.

## విద్యాభ్యాసము.

—:o:—

శ్రీవేంకటరాయశాస్త్రిలవారి బాల్యవినోదక్రీడలు పెక్కులు కలవు. గ్రంథాంతరప్రసక్తములను వాని నిలఘువ్యాసమున వర్ణింపక,అవెల్ల తద్బాల్యనిపై దుస్యచాతుర్యస్వాతంత్ర్య సాక్షులని మాత్రమే ఇట వచించువారము. వీరు జన్మించినపుడు తండ్రిగారు ఉక్తసంస్కృతాంధ్రప్రధాన పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగ నుండిరి. పిమ్మట ఉద్యోగవశమున వారు ఉత్తరమండలములకుఁ జేరఁగా వేంకటరాయశాస్త్రిలవారు పోడూరి నార్మలుస్కూలులో మూఁడవఫారమువఱకు విద్యాభ్యాసము చేసిరి.

తత్కాలోదంతము భాగధేయమున నిట్లుకలదు,—"అక్కడ ప్రతితరగతిలోను నేను మొదటివాఁడనగుదును. పైతరగతిలో నన్ను వేయఁగా నేక్షణములో నేను మొదటివాఁడ నగుదును. మఱి నాతావు తప్పింప నాయల తరముగాదు. నాకు ఒకమాఱు చెప్పినఁ జాలును. ఒకమాఱు చదివిన వచ్చును. నాకు సులువుగ రానిది గణితము. కుదురనిది చేతివ్రాఁత. నేను దెబ్బలెఱుఁగను. అబద్ధము చెప్పను. * * సాలాఖరుపరీక్షలో నాకు పుస్తకబహుమానము. 'For general proficiency' అని వ్రాసి యిచ్చినారు." అని. ఉపనయనము గర్భాష్టమమున మల్లయపాలెములో జరిగెను. పిమ్మట తండ్రిగారు విశాఖపట్టణము చేరఁగా శాస్త్రులవారు అచట హిందూహైస్కూలులో నాలవఫారము, మిషన్ హైస్కూలులో ఐదవఫారమును, నార్మలుస్కూలులో మిట్రిక్యులేషను చదివిరి. 1869 లో మిట్రిక్యులేషన్ మొదటి తరగతిలో జయమొందిరి. అప్పుడు వీరికి సర్కారువారు రు. 9 లు అనుమాస విద్యార్థి వేతనము నొసఁగుచుండిరి. అనంతరము పదిపదునాకండు రూప్యముల స్టైపెండుతో మదరాసులో నార్మలుస్కూలులో చదువుకొనుచు ట్రెయినింగు (బోధనశిక్ష) పొందిరి. "అచట అప్పుడు బహుజనపల్లి సీతారామాచార్యులవారు ప్రధానాంధ్రపండితులు. చెనలువాఁడ సీతారామశాస్త్రిగారు ద్వితీయాంధ్రపండితులు. ఇరువురు బ్రాహ్మణికులు. ఆంధ్రమున గొప్పపండితులు" (భాగధేయము.) అందు సీతారామాచార్యులు 'వేశ్యాలంపటులు.' ప్రతిశనివారము 'వేశ్యాంగనాది సంగీతగోష్ఠులు' సలుపుచుండురు.

స్కూలులో చేరిన క్రొత్తలో శాస్త్రులవారు ఆచార్యులవారి పాండిత్య విశేషము తెలియక వారిని మాటిమాటికి ప్రశ్నలడిగి వేధించుచుండిరఁట. వేసఁగి సెలవులలో వారు రాజమహేంద్రవరమునకుఁ బోయినప్పుడు ఆవృత్తాంతము తండ్రిగారితో చెప్పఁగా వారు నవ్వి 'పొరపడితివి. వారు ఆంధ్రమున మహాపండితులు' అని పలికిరఁట. కాలక్రమమున శాస్త్రులవారికిని అది స్పష్టమయ్యెను. పిమ్మట నొకనాఁడు శాస్త్రులవారు ఆచార్యులవారి యింటికిం బోయి తమ యవినయమునకు క్షమాపణము వేఁడికొనఁగా "నీవు గడుసువాఁడవు" అని వారు అభినందించి పలికిరఁట. 1882 లో ఆచార్యులవారు శాస్త్రులవారికి అనుగ్రహించిన యోగ్యతాపత్రములోని వక్ష్యమాణ వాక్యములు:—"వీరు కొన్నియేండ్లకు ముందు సమారమి యొకటిన్నర సంవత్సరము నార్మలు స్కూలులో నాయొద్ద తెనుఁగు చదువుచుండిరి. అదిమొదలు నేను వీరిని బాగుగా గుర్తెఱుంగుదును. చదువునప్పుడు వీరుచేయు విద్యావిషయకమైన ప్రశ్నలకు సముత్తరములు చెప్పి వీరిని సమాధానపఱిచి నాపాండిత్య గౌరవమును మాటిమాటికి నిలువఁబెట్టుకొనవలసి వచ్చుచుండును." అను నీవాక్యములు ఆ 'గడుసుఁదనమునకు' వ్యాఖ్యాప్రాయముగా నున్నవి. అదిమొదలు శాస్త్రులవారు ఆచార్యులవారియందు అత్యంతభక్తిగౌరవములు చూపువారు. "మహావిద్వాంసులు కీ. శే. మద్గురువర్యులు వర్తమాన శతాబ్ది నన్నయార్యులవారు" అని ఆముక్త వ్యాఖ్యాన పరిశిష్టిలో సప్రశ్రయ గౌరవాలంకృతముగా నుదాహరించియున్నారు.

"పెద్దకుటుంబము, పేదకుటుంబము. బాల్యమునందే వైదికులను పల్వురను వైదికవృత్తియను యాచ్ఞావృత్తిచేత జీవించు వారింగని నాకును అదియేగతి యగునని జీవనమునకై దిగులొందినవాఁడనై చదువుమీఁద శ్రద్ధవహించియుంటిని." అని నిజవిద్యాకలన శ్రద్ధాకారణమును శాస్త్రులవారు వచించియున్నారు. ఈశ్రద్ధ తదమేయ ప్రజ్ఞాశేముషీ సనాథమాటచే పట్టినదెల్ల బంగారమైనది. పైయుద్ధారముచే తత్స్వాతంత్ర్య జీవనాభిలాషయు తేటపడుచున్నదిగదా.

విద్యాగ్రహణంబున నపరిమిత ప్రీత్యుత్సాహములున్నను ‘నాయనగారొక్కరె’, ‘పెద్దకుటుంబము’ భరింప క్లేశపడుచుండుటచే శాస్త్రులవారు విశాఖపట్టణముజిల్లా నరిసీపట్టణము అసిస్టెంటు కలెక్టరు కచ్చేరిలో లేఖకోద్యోగమునఁ జేరిరి. కాని నిరంతర భాషారాధకులును సారస్వత వ్రతులునగు శాస్త్రులవారికి ఆ యుద్యోగముపై అచిర కాలముననే చిరాకు జనించి ఉన్నత విద్యాభిలాషతో దానిని మాని 1875 లో ఎఫ్. ఏ. పరీక్షకుఁ బోయిరి. “ఆంధ్రము, ఆంగ్లము, గణితము అను మూఁడే విషయములచే ఎఫ్. ఏ లోనే ‘తెలివి యొకింత లేనియెడ’ నను న్యాయంబున ఆంధ్రమును ముగించితిని.” (ఆ. సా. ప.) ప్రవీణులైనను, ఇంత నఱవను మాటాడువారైనను, అందు అభినివిష్టులయ్యును, శాస్త్రులవారు ఆంధ్రవాణి నభిమానించి సమ్మానీకరించుకొనుటకు చతురముగా నిట్లు కారణము చెప్పియున్నారు.— “ఆంధ్రమునం జొచ్చిన యఱవనుగాన నడుమంతరపు వైష్ణవమునకు నామములు మెండగురీతిగా నాకు ఆంధ్రాభిమానము పూకన్నను హెచ్చు,” “కడమ భాషలకన్నను, ముఖ్యముగా అఱవముకన్నను తెలుఁగు గానమునకు శ్రేష్ఠము.” “అఱవము పాడెడి యాంధ్రుఁడు లేఁడు. తెలుఁగు పాడని యఱవ యుండఁడు.” “ఆంధ్ర మధురమధురుఁడు ‘దేశభాషలందు తెలుఁగు లెస్స’ అని యూపాటి పల్కెను. నేనును ఒకయర్థమున నాంధ్రమధురమధురుఁడను. నేను ‘భాషలందుఁ దెలుఁగుబాస తీపు’ అనివచించెదఁ” అని. (ఆ. సా. ప.) ఇట్లభిమానించి “వస్తుప్రాయను” ఆంధ్రమును ఎఫ్. ఏ వఱకు కళాశాలలోఁ బఠించి పిమ్మట “సంస్కృతములేని యాంధ్రము పనికిరాదు.” కావున సంస్కృతభాషను తదేక దీక్షతో నలవఱచుకొనసాగిరి. సంస్కృత కావ్య నాటకములు స్వయముగాఁ జదువుకొనుటేమివింత? వోపదేవకృతము ముగ్ధబోధ వ్యాకరణమును ఉపాధ్యాయ నిరపేక్షముగాఁ జదివి ఆఱు నెలలలో ముగించిరి! మూఁడేండ్లు తదేక నిష్ఠతో కౌముదీ మహాభాష్యములను తండ్రిగారి తోడ్పాటునఁ జదివి ముగించి, పిమ్మట భాస్కరాచార్యుని లీలావత్యాదులు నేర్చిరి. క్రమముగా సాహిత్య శాస్త్రములు కావ్యప్రకాశాదులును జదివిరి. ఆమరణాంతము ఒక్కక్షణమేని వ్యర్థపుచ్చక తమకుంగల శాస్త్రములును, సంస్కృతాంధ్ర గ్రంథముల నెక్కడనేది క్రొత్తగాఁ బ్రకటితమైనను వెల యెంతైనను, తెప్పించుకొని నిర్నిద్ర శ్రద్ధతోఁ బఠించుచునే యుండిరి. అందుచే శాస్త్రులవారు యావజ్జీవ విద్యార్థులు.

## ఉద్యోగదశ.

—:o:—

వేంకటరాయ శాస్త్రులవారు తమ యుద్యోగ జీవితము ఆంధ్రసారస్వతమహాసభాధ్యక్షోపన్యాసమందును, మఱొకెడను ఇట్లు వర్ణించియున్నారు,—

ఎఫ్. ఏ యనంతరము “విద్యాగ్రహణంబునకు ఉపాధ్యాయ వృత్తి కరమనుకూల మగుటంగని జీవికార్థమై యందుఁ జొచ్చి సంస్కృతములేని యాంధ్రము పనికిరాదు గావున సంస్కృతముం గూడ నిరంతరము అభివృద్ధి చేసికొనుచు వరుసగా ౧. శ్రీకాకుళము గవర్నమెంటు స్కూలులో కడపటి యొజ్జ ౨. విశాఖపట్టణము జిల్లా చోడవరము (లోకల్ ఫండు మిడిల్) స్కూలు ప్రధానోపాధ్యాయుఁడు 3. విశాఖపట్టణము హిందూహైస్కూలులో ద్వితీయ సహోపాధ్యాయుఁడు ౪. రాజమహేంద్రవరము టౌనుస్కూలు ప్రధానోపాధ్యాయుఁడు ౫. మదరాసు ముత్యాలపేట ఆంగ్లో వర్నా

క్యులరు మిడిల్‌స్కూలు ప్రధానోపాధ్యాయుఁడై— అనసొజ్జనములయందు 11 సంవత్సరములు గడపితిని.

“ ఇందుఁ గడపటం జేర్కొన్న పదవుండుఁగా 1883 వ సంవత్సరమున “ స్త్రీపునర్వివాహ దుర్వాద నిర్వాపణము ” అను ధర్మశాస్త్ర విషయక నిబంధన గ్రంథమును రచించి ప్రకటించితిని. (ఆ. సా. మ.) “ బహు గ్రంథ పరామర్శ పూర్వకముగా నిద్రాహారముల నొప్పరికించి దానిని రచించిన ఫలము ఇరువదెలుంగులయినది. నాకు దారిద్ర్యానారోగ్యాది క్లేశములును, తద్గ్రంథముచే నిరస్తవాదులగు మతద్రోహులకు బిరుదాంకములును, లబ్ధమయినవి. ఆ నిర్వాపణ గ్రంథమునకు ఇప్పటికిని ఎవ్వరివలనను ఉత్తరము పుట్టలేదు. అయినను ‘ తపస్సు ఫలింపక పోయినను తనువు తేలికపడ్డ’దను రీతిగా ఆవాదగ్రంథమువలనను తత్కాలమందు మహాజన సంఘము మోప్రిల సాధించిన ఖండనోపన్యాసములవలనను నన్ను మదరాసులోని ప్రముఖులెల్లరు నెఱుంగుటయు, డాక్టరాపర్టు మిల్లరుదొరగారు లోనగు మహాజనులకు నేను పరిచిత గీర్వాణ భాషుఁడనుఁగా గోచరీభూతుఁడనగుటయు సంభవించినది.’’ (వేంకటగిరి రాజలేఖము) అప్పట్టున “దానింగని శ్రీసమర్థి రంగయ్యసెట్టిగారు, (బి.ఏ, క్రిస్టియను కాలేజి యుపభాషా ప్రవచన విచారణాధికారి) నన్ను మదరాసు క్రిస్టియన్ కాలేజి సంస్కృతప్రధాన పండితుంగావింపఁ దలంపుఁగొనిరి. నేనును ఆపదమునే కోరుచుంటిని.

“ ఆ సమయమందే [రాజకీయకళాశాలా సంస్కృత భాషా మహోపాధ్యాయులు (Professor of Sanskrit)] డాక్టరు ఆపర్టుగారికి ఇంచుకంత నేను ఉపకరించితిని. ఎట్లన,—వారు అప్పటికి ఐదేండ్లకుముందు ‘ నరపతి విజయము’ను ముద్రింప దొరకొని ప్రాయికముగా పండితపరిష్కృతము సేయించియు, అందొకచూర్ణిక—బిరుదాంకాది భూయిష్ఠము— ఆదిలో కవిపెట్టిన రూపుం గోల్పోయి లేఖకాదికారణంబున శబ్దస్వరూప వాక్యవాంతరగవాక్యాది విభాగము తేర్పడక క్రింప బలిసి యుండఁ దానిని సంస్కరింపుఁడని మదరాసులో ప్రసిద్ధాంధ్ర పండితులు మువ్వురకడ నైదేండ్లు ఉంచి భగ్నమనోరథులైరి. వారిని నేను భాగ్యవశంబున దర్శింపఁగా వారు ఆచూర్ణికను తదీయ దురూహతా వృత్తాంతముం జెప్పక నాచేతికిచ్చి సవరింపుమనిరి. నేనును వారముదినములు కడుశ్రమపడి ఉన్మత్తునివలె తదేకతానుఁడనై దానిని సవరించి సాధువుగా వ్రాసి ఆంగ్లానువాద సమేతముగా నించి కొనిపోయి వారికిచ్చితిని వారు నాయిచ్చినదానిం గైకొని పండిత సమేతముగా రెండువారములు పరిశోధించుకొని అంగీకరించి అనంతరము నాకు దాని రైదేండ్ల వృత్తాంతమును వక్కాణించిరి.

“ ఆయినవృథ చేతనుం బ్రీతిబోధితులై డాక్టరు మిల్లరుగారు పూర్వోక్తమైన మదరాసు క్రిస్టియన్ కాలేజి సంస్కృతోపాధ్యాయ పదమును 1896 వ సంవత్సరమున నవంబరులో నాకొసంగిరి. (ఆం. సా. మ.) ఇట్లు శాస్త్రిలవారు తచ్చిరాభీష్టమయిన పదమును పడసిరి.

“ మఱుసటి సంవత్సరము (1887) బి.ఏ పరీక్షకు నియతములైన సంస్కృతాంగ్లేయ భాషలలో మదీయశిష్యులతో గూడ నేనును పరీక్షితుఁడనైతిని. రెంటను జయమొందితిని. సంస్కృత జేతలలో మొదటివాఁడనై విజయనగరము మహారాజ వైశాఖపుర గోడెగజపతిరాయ దాతవ్యములయిన రు 400ల పరిమితిగల బహుమానమునకుం బాత్రుసనైతిని. కాని, ఆసంవత్సరము డిగ్రీ పూర్తిచేసికొననందున ఆబహుమతిం బడయనేరనైతిని. ఉక్తకారణంబున ఈ బహుమానము నాకు తప్పిపోయినదని నాతో అప్పు

గారు సెలవిచ్చిరి. "(ఆ. సా. ప) ఆసంవత్సరమే కాదు, మఱే సంవత్సరముగాని శాస్త్రిలవారు డిగ్రీ పూర్తిచేసికొనరైరి. ఇందుకు ఉపేక్షయొక్కటే ముఖ్యకారణము. కాకున్న, ఆప్రతిభకు ఏది అసాధ్యము! సంస్కృతమున ఎం.ఏ. పరీక్షచేసి తాము "Professor of sanskrit" పదమున దీపింప శ్రద్ధవహింపక యుపేక్షించుట అనతిక్రమణీయ భాగధేయ ఫలమే కావలయును. బహుభాషా కోవిదులు, తదనుజన్మమహాశయులు శ్రీ వేంకటాచలయ్యగారు తదర్హమగు నేతాదృశపదము నపేక్షింపక, తన్న్యాయశీలతకు ఉచితముకాని న్యాయవాదివృత్తి నాశ్రయించుటయు నట్టిపరిపాకమే. కానిదానికి ఇంత వ్యాఖ్యానమేల? ప్రకృత మనుసరింతము. ఇట్లు క్రిస్టియన్ కాలేజి సంస్కృత ప్రధానోపాధ్యాయత్వము వడసి వేంకటరాయ శాస్త్రిలవారు 25 సంవత్సరములు ఆపదవికి వన్నె దెచ్చిరి. పైజెప్పినదానిం బట్టి శ్రీశాస్త్రిలవారి యుద్యోగజీవితము ఆ శ్రీకాకుళ చెన్నసగర పర్యంత సర్వాంధ్రదేశావగాహి యగుటచే ప్రతిమండలమునను పండితమిత్రులును, సహస్రముల ఛాత్రులును ఏర్పడుచుండుట, తత్తద్దేశాంధ్రభాషాస్వరూప వైలక్షణ్యజ్ఞానము కరతలామలకమై వారికి ఉత్తరకాలమున గ్రామ్యప్రతిఘటనమునను నిస్తరింప నత్యంతముపకరించినది.

## తత్ప్రవచనమహిమ.

—:o:—

విద్యాగ్రహణంబునకు కరమనకూలమని ఉపాధ్యాయవృత్తి నవలంబించినవారగుటచే అవిశ్రాంత దీక్షా ధురంధరులై కళాశాలలో ప్రవక్తవ్యమును సంస్కృతమును, ఆంగ్లభాషలో దానిని నిర్వహింపవలసియుండుటచే ఆంగ్లమును, 'వధూప్రాయను' ఆంధ్రమును శోధించి చూచుకొనుచు తమ 'యంతటి జీతమున కుటుంబభరణమునకు ఇంచుకంతయే వ్యయించి తక్కినదెల్ల నైమ్మూడు భాషల గ్రంథకోశ సంపాదనమునకై వ్యయింపను' అందుచే 'నిరంతరము రిక్తత ననుభవింపను' ఏమాత్రమును శాస్త్రిలవారు ఓహటింపరైరి. 'దేశక్షేమమునకు భాషాక్షేమము ప్రధానము' అని ఆంధ్ర సాహిత్య మహాసభలో నధ్యక్షపీఠమునుండి యుపన్యసించిరి కదా. ఆంధ్రభాషోద్ధరణము మూలమున దేశోద్ధరణము చేయ బద్ధకంకణులై వారు ఆకాలమున - పాశ్చాత్యవిద్యాభ్యాస ప్రభావమున, మెకాలే సంకల్పించినట్లే, భారతీయుల చిత్తవృత్తులు వేషభాషాచారములును పాశ్చాత్యీకృతములై, విద్యార్థులు తత్కారణమున పరభాషా విమోహితచిత్తులై స్వకీయమును నిరాదరించు కాలమున - స్వభాషాభిమాన ధౌరేయులై అట్టి విద్యార్థిజన సామాన్యమునకు నిజవాఙ్మయ సారస్యమును, మహిమమును దెలుపను, సవిమర్శకముగ, కవిహృదయ ప్రకాశకముగ, మనోరంజకముగ తన్మనము లిగిరించి ఆజన్మము స్వభాషా నిరతానురక్తములై తనరు తెలుగున ప్రవచనము చేయసాగిరి. అట్టి నిరంతర విద్యార్థిబోధన తాత్పర్యము కారణమున వారు,—

"శ్లిష్టా క్రియా కస్యచి దాత్మసంస్థా
సంక్రాన్తి రన్యస్య విశేషయుక్తా
యస్యోభయం సాధు స శిక్షకాణాం
ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ"

("నేర్వ నేర్వ నెవఁడు నెఱవాది యగు, వాని
నొజ్జలందు మొదల నునుపవలయు.")

అను కాళిదాసోక్త సదుపాధ్యాయ లక్షణమునకు తెన్నగా లక్ష్యభూతులైరి. అందుచేఁ దన్మహిమ ప్రఖ్యాతమై సంస్కృతమునకొఱకు క్రిస్టియన్ కాలేజిని వెదకికొనుచు విద్యార్థులు—ఆంధ్రులు, కన్నడులు, అఱవలు, క్రిస్టియనులును, మహమ్మదీయులును,—వచ్చుచుండిరి. వారు సంవత్సరాదిని ఏదేనొక కళాశాలలోఁజేరినను పిమ్మట అవకాశము కల్పించుకొని క్రిస్టియన్ కాలేజిని చేరుటాచారమయ్యెను. అట్టి శిష్య సహస్రములలో మైసూరు దివానులు శ్రీ కాంతరాజ అరసున్నగారును, కమీషనరు హరియణ్ణగారును, "పుదూరి ద్రావిడ సంఘమునకు చూడామణులు, హైకోర్టు వకీలుపదమునకు అలంకారభూతులు" శ్రీయల్లాడి కృష్ణస్వామయ్యరుగారును, ద్వారకాపీఠ శంకరభగవత్పాదులు వేంకటరమణ సరస్వతి మహాశయులును, ఈసాహిత్యదర్పణమునకు భూమిక వ్రాసినవారు, విద్వద్రసజ్ఞులు, విక్రమ సింహపురి వేంకటగిరిరాజ కళాశాలలో చరిత్రోపన్యాసకులు శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారును మఱెందఱో ప్రముఖులుగలరు. అట్టివారివలన వినియు, ప్రత్యక్షముగా నొండుకడఁ గనియు నావ్రాసినదే ఈశాస్త్రిపాద పాఠనమహిమ. ఒకపూటయైననుసరే వారితోడఁ జదివి వారిని ఆజన్మము హృదయాంబుజమున పూజింపని శిష్యమ్మన్యుండేని యుండఁడు. కాలేజియధికారులును శ్రీ శాస్త్రులవారి ప్రజ్ఞా సౌజన్య విశేషములకు మెచ్చి బహుమానించుచుండిరి. శ్రీరంగయ్యసెట్టిగారి మరణానంతరము శాస్త్రులవారు ఉపభాషా ప్రవచన విచారణాధికారులైరి. వారిమాసవేతనము నూరు రూప్యములు.

---

# గ్రంథరచన.

## (i) వ్యాఖ్యలు, అనువాదములు,

—:0:—

అప్పుడే, వేంకటరాయశాస్త్రులవారు నిరంతర సంస్కృతాంధ్రాంగ్ల కావ్యముల సారామృతముం గ్రోలి తదానందలహరుల నోలలాడుటతోను, 'ఛాత్ర సాహసప్రచారంబుగా' విద్యాదానము చేయుటతోను తనివిసనక లోకోపకారకములైన పెక్కుగ్రంథముల రచియించిరి. పూర్వోక్తరీతి ఆనంద వ్యుత్పత్త్యుపదేశముల నలవఱిచి ఆంధ్రలోకము నుద్ధరించుటే తదుద్దేశ్యము. కనుఁడు—"హిందువులకెల్ల నైహికాముష్మిక సర్వశ్రేయః ప్రదయగు సంస్కృతభాష వారిచేత ఈకాలమునందు ఉపేక్షిత ప్రాయమయి దిగస్కృతప్రాయమునై జర్మనీఫ్రాంసు ఇంగ్లాండు రష్యా, యునైటెడ్ స్టేట్సు జపాను లోనగు దేశాంతర ఖండాంతర ద్వీపాంతరములకు వలసపోయిన విషయము జగద్విదితముకాదా. మన దేవతల భాషయు మనకర్మభాషయు, మన 'యెల్లభాషలకుందల్లి' యునగు నీసరస్వతిని వెండియుం దెచ్చికొని హృదయాలయములందు ప్రతిష్ఠించుకొని యుపాసించి తత్ప్రసాదంబున సంస్కృతభాషలో కావ్యనాటకకథాప్రబంధరసంబును ధర్మయోగపురాణేతిహాసవేదవేదాంతాది విషయంబులను గ్రహించి

సర్వశ్రేయంబులు పొందం గోరిక ఇతరవిద్యాభ్యాస ప్రయాసచే బాల్యమందు ఈవిద్యను నేర్వని సజ్జనులకు పలువురకు చిత్తమందు ఉదయించుచున్నది..........

“అట్టివారికొఱకును కేవల బాలురకొఱకును ఉపాధ్యాయునితోఁ బనిలేకుండ స్వయంబోధకములుగా పెక్కు సంస్కృతగ్రంథములను, తెనుఁగున టిప్పణముతో కొన్నింటిని, సంపూర్ణటీకతో కొన్నింటిని, ప్రకటించియు ప్రకటించుచును ఉన్నాఁడను. కారణ విశేషములచే నడుగంటుచున్న మన భాషలకొఱకై యీయుద్యమమని విన్నవించుకొనుచున్నాఁడను.” అని తమయుద్దేశ్యమును తత్ప్రకటితవిజ్ఞప్తిలో స్పష్టపఱచియున్నారు. తదనుసారముగా 1891 లో కథాసరిత్సాగరమును సులువైన సొంపైన వచనకావ్యముగా తెలిఁగించి ప్రథమముద్రణ మొనర్చిరి. ఇది యొక నవీనాద్భుతశైలి నొప్పు కావ్యము. భోజవిక్రమ (1890) హితోపదేశ (1914) దశకుమార చరిత్ర (1912) ములలో మొదటి రెండును సటిప్పణములుగను, నాల్గును సాంధ్రవచనానువాద సనాథములుగను; బిల్హణ (1890) మేఘ (1901) రఘు, కుమార (1911) భర్తృహరి సుభాషితములను (1910), అమరుక రసమంజరీ పుష్పబాణ విలాసములను (1909) స్వవిరచిత సంపూర్ణాంధ్ర టీకాతాత్పర్యాలంకృతములుగను ప్రకటించిరి. ఉత్తరకాలమున హితోపదేశమును గద్యపద్యమయముగా నాంధ్రీకరించిరి. ఆయాంధ్రహితోపదేశ చంపువు 1932 లో ప్రకటితము. ఇందు పద్యములు సుమతిశతక మహాభారత ఫక్కిని సుగమములై సరసములై సొంపుగుల్కుచున్నవి. వారు ప్రియదర్శికా నాటికను సానువాద సంపూర్ణాంధ్రవ్యాఖ్యతో 1909 లోఁ బ్రకటించిరి. ప్రియదర్శికవలె నట్లు అద్భుతముగ రమణీయముగ నచ్చువేసిన నాటకము తెలుఁగులిపిలో నన్నేల నాగరమందును లేదు. అట్లే సర్వగీర్వాణ నాటకములఁ బ్రకటింప నుద్దేశించిరి

వైవ్యాఖ్యానములం దొక్కటొక్కటియు జిజ్ఞాసుజనకల్పద్రుమమే. అయినను పేసుసంప్రదాయం ఛాత్రటీకాతాత్పర్యముతోడి పదప్రయోజనచర్చ మిన్న. శాస్త్రులవారి వైదుషీరసప్రసక్త్యపతాక. ఇట్టివ్యాఖ్య మఱొండు సంస్కృతంబునను లేదు. ఇదెల్ల సంస్కృతవ్యాఖ్యామూలకమనుట భ్రమయని తద్వ్యాఖ్యాభిజ్ఞు లెఱుంగుదురు. దీనిచే సంస్కృతమునను ఆంధ్రమునను రచియించియుండిన శాస్త్రుల వారి కీర్తికల్పవల్లి సర్వదేశముల నల్లుకొనియుండును. ఈగ్రంథసంఘములఁగాంచి శ్రీ[illegible] శాస్త్రులవారిని అభినవ మల్లినాథ బిరుదముచే బహుమానించిరి. (“[illegible] మల్లినాథ [illegible] కృతః.”) లోకమెల్ల నట్లే తనిసి భూషించినది గదా.

## (ii) నాటకములు

—:o:—

శ్రీ వేంకటరాయశాస్త్రులవారు సర్వతోముఖ పాండిత్య శోభితులని యిగ్వ్యాఖ్యానోపన్యాసాదులఁ దెల్లము. అయినను కావ్యసాహిత్యము (Pure literature) నందు వారికి అత్యంతము ప్రీతి. అందును నాట్యసంగీతకవిత్వ చిత్రాది లలితకళాసాగభూతంబును, సర్వసాహిత్యమకుట ప్రాయంబును అగు నాటకము తదభిమానపాత్రము. ‘భాగధేయము’న నిట్లున్నది.— “షేక్స్పియరు కాళిదాసులను చదివి ఆశ్చర్యపడి నాటకరచనాభిలాష వహించితిని.” “సంస్కృత నాటకములను చదువగా నాటకరచనాభిలాష పొడమినది. (నాటకరచనము) నాకు శక్యమే అని తలంచితిని... స్వతం

త్రి కల్పనకు వెనుదివిసి తొలుత అభ్యాసార్థము నాగానందమును ఆంధ్రీకరించితిని. దానిని వెంటనే ఎఫ్. ఏ. పరీక్షకు పెట్టిరి. నీరసములగు నావ్రాఁతలేల, కాళిదాసాది మహనీయుల కవనరసము కరతలామలకముం గావించుట వాస్తవమయిన భారతీసేవ యని యెంచి శాకుంతలాది గీర్వాణ నాటకముల ఆంధ్రీకరించితిని " అని తదాంధ్రీకృత నాటకములు ఏఁడు,—నాగానందము (1891), శాకుంతలము (1896), ప్రియదర్శిక (1910), మాళవిక (1919), ఉత్తరరామచరిత్ర (1920), విక్రమోర్వశీయము (1921), రత్నావళి (1921). అట్లే షేక్స్పియరు నాటకముల సైతము తెల్గింప దొరంకొని, 'కింగ్ లియరు' నాటకమును కొంతవ్రాసి, ఏలమోగాని ఆయుద్యమమే త్యజించిరి.

వేంకటరాయశాస్త్రులవారి యాంధ్రీకరణ ప్రకారము " అశేషమనీషిహృదయంగమంబుగా, శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, ఔచిత్యంబాదరించియు, అనౌచిత్యంబు పరిహరించియుఁ (బ్రాయికముగా) మాతృకానుసారంబుగా " శ్రీనాథోక్తరీతి నుండును. శ్రీనాథుండువోలె శాస్త్రులవారును ఆంధ్రీకరణ ప్రకారంబున పురాణేతిహాసాదులకును కావ్యనాటకాదులకును భేదము కలదని చక్కఁగా గుఱుతించినారు. భేదమేలన, మొదలివి విషయప్రధానములు, రెండవవి రసప్రధానములు. ఏతత్కారణమునఁ దన తెనిఁగింపు నన్నయాదుల యాంధ్రీకరణమునకన్న భిన్నమని విశదముచేయుటకే శ్రీనాథుఁడు శృంగార నైషధాంతమున తత్ప్రకారమును ప్రపంచించుట. రసమునకు ఔచిత్యము ఉపనిషత్తు కదా. ఔచితి యుం శబ్దార్థోభయగతమునగుటచే భావంబు పోషించి, శబ్దంబు లక్షించి కదా కావ్యనాటకాదులఁ దెలిఁగింపవలయును. మూలమునందలి సాభిప్రాయ శబ్దకల్పవృక్షములఁ బెకలించి తెలుఁగున యొకశబ్దవిషవృక్షములను పాదుకొల్పుట తెలిఁగింపా? తెగిలింపా? శాస్త్రులవారి మతమును నిర్వాహమును ప్రాయికముగా శ్రీనాథోక్తరీతి నుండును. ఎటనేని రసపోషణార్థమే స్వతంత్రతయు నవలంబింపఁబడినది. అందుచే తదనువాదములు తత్తత్సంస్కృత మాతృకలకు అద్భుతవ్యాఖ్యానములై, ఉత్తమకవితాలవాలములై, రసోత్తుంగములై చదువ నింపుగులుకుచుండును. వీనిప్రౌఢికి వెవరి గుణము నారయనేటికి, సారస్యముకన్న సౌలభ్యము నే, పేలవత్వమునైనను సరే అభిమానించు విమర్శకమ్మన్యులు గొందఱు వీనిని కఠినములని తెగడుదురు మఱికొందఱు, ఆంగ్లేకర్తలు, వీనిని 'మక్కికి మక్కి' అని దూఱుదురు. ఆమూలము మూలార్థము నెఱుఁగు శక్తిలేక, సరిగ తెలిఁగింప నేర్పుచాలక, పద్యము కుదరమిఁజేసి కొంత జార్చి, కొంత దూర్చి, కొంతమార్చి, కడకు అంతయుం గూలార్చి తాముచేయు నాంధ్రీకరణవికటాయితమునకు ప్రధానాంగమగు స్వాతంత్ర్యము స్వాశక్తతాగోపనోపాయ విశేషమని సహృదయుల కెఱుకయే. ఆ దుర్విమర్శలచే పాశ్చాత్యమునేను బుద్ధులు ప్రతారితులౌదురుగాక, రసాభిమానులు మాత్రము వానిని స్వయముగా సవిమర్శకముగాఁ జదివి యథోచితముగ పరితోషమొ అపరితోషమొ పొందుట సరి.

కేవలానువాదములే గాక శాస్త్రులవారు ప్రతాపరుద్రీయము (1897) ఉష (1901) బొబ్బిలి యుద్ధము (1916) అనుమూఁడునాటకముల రచియించిరి. ఓరుఁగంటి ప్రతాపరుద్ర మహారాజును తురకలు ఢిల్లీకి ఖయిదుకొనిపోయిన కథ తా మెనిమిదేండ్లవయస్సునుండఁగా తండ్రిగారవలన విని ఉద్బుద్ధచిత్తులై 1888లో ఆకథను తమకు తోఁచినట్లు విరివిచేసి కథారూపమునఁ బ్రచురించిరి. పిమ్మట

## ఆంధ్రభాషాభిమాని సమాజము.

—:0:—

నాటకము 'చాక్షుషక్రతువు' కదా. అందుచే, "ఛాత్రసాహస్రప్రచారంబుగా నాటకములఁ దన్నిగమంబుఁగ నొప్పుట" మాత్రముతోఁ గనివిసనక శాస్త్రులవారు నాటకములను రంగమున నారాధించి ప్రేక్షకజన పరితోషముం గూర్చనాగై తమ కాలేజి శిష్యులచే సంస్కృత శాకుంతలము నాడించిరి. శ్రీమాన్. క. శ్రీనివాసన్‌గారు (దొరసామయ్యంగారని ప్రఖ్యాతులు) దుష్యంతవేషముం దాల్చిరి. అప్పటిప్రేక్షకులలో నొకరు డాక్టరు మిల్లరుగారు దొరసామయ్యంగారిని 'Every inch a prince' అభిశ్లాఘించిరఁట. పిమ్మట 1886 లో ఉత్తరరామచరిత్రము గూడ ప్రయోగింపఁబడినది. శిష్యులు పెక్కురు తద్రచిత నాటకములనె ప్రయోగింప నుత్సహింపఁగా శాస్త్రులవారు తా మభిజనమని గారవించు నెల్లూరిలో ఆంధ్రభాషాభిమానిసమాజమును 1896 లోఁ గావలయు స్థాపించిరి. "నెల్లూరిలో నాంధ్రభాషాభిమాని అనుపేర నొక నటసంఘము నేర్పడిచి నాటకలక్షణము నేర్చి మదీయ శాకుంతల ప్రతాపరుద్రీయాదులను ఆడించుచుంటిని. నటులు సుశిక్షితులును వ్యుత్పన్నులును (పెక్కురు బియేలు) నారు పరమనిధేయులు అయినందున ప్రయోగములు అత్యుత్తమముగా నెఱవేఱుచుండినవి." (భాగ) ఈ పేర్కొనంబడిన నటులలో కీ. శే, క. శ్రీనివాసన్ బి.యే గారు అగ్రగణ్యుఁడు. నాయకపాత్రధారి, ప్రతిభావంతుఁడు, రసజ్ఞుఁడు, సంస్కృతాంగ్లాభినివిష్టుఁడు, హరిశ్చంద్రాది నాటకరచయిత, దుష్యంతాది నాయకపాత్రధారణమున నసదృశుఁడు. నాయికాపాత్రము ధరించి వాసికెక్కినవారు శ్రీ నందగిరి హనుమంతరావుగారును, పిమ్మట శ్రీ క. గంగసామయ్యంగారును. ఇందు మొదటివారు చిరకాలముగా నెల్లూరు వేంకటగిరిరాజవిద్యాలయమునను, రెండవవారు బెంగుళూరులోను ఉపాధ్యాయులు. ఇరువురును ఆంధ్రభాషాభిజ్ఞులు, రసజ్ఞులు, ప్రతిభావంతులు. శ్రీ రంగసామయ్యంగారు జీమూతవాహనుఁడుగను, పురూరవుఁడుగను అద్వితీయుఁడనిపించుకొనెను. ఏపాత్రము ధరించినను అపూర్వముగా అనన్యసాధ్యముగా నిర్వహించువాఁడు. కీ. శే. యనగుడిపాటి సోదరులు శ్రీగోపాలకృష్ణయ్యగారును, శ్రీ వేంకటాచలము పంతులు (బియే, బియెల్.) గారును అపరబాణాసురులు, డిల్లీ సుల్తాను చకుముకులును. కీ. శే. శ్రీ నేలటూరు వేంకటాచార్యులుగారు (బంగారయ్యగారు) యుగంధరుఁడును కణ్వుఁడును, కీ. శే. శ్రీ కొండకుంట వేంకటరమణయ్యగారు పేరిగాఁడు—రాజు మొదలు భృత్యునివఱకు నన్ని వేషములవారును నేర్పుగలవార. ఈ సమాజమునకు శాస్త్రులవారధ్యక్షులు, ధనవిషయమునఁ దప్ప కడమయన్నింటఁ సర్వాధికారులు, వారు తన్నాటకరచయితలును తన్నాట్యాచార్యులును (భరతముని యొండె) నై కౌశలము మెఱయ సర్వపాత్రములను సముచితనాట్యనైపథ్యాది సకలమున శిక్షించి ప్రయోగముల త్యంత మనస్యముగా నెఱవేర్పఁ గారణభూతులై యుండిరి. నాటకము పఠనపాఠనములనే గాక నాటకమునఁ బ్రయోగము శాస్త్రులవారు అసదృశులైరి. ప్రాచీనాధునాతన నాట్యకళలఁ జక్కఁగ సమన్వయము చేసిరి.

ఆంధ్రభాషాభిమాని సమాజము శాస్త్రులవారికి ద్వితీయాపత్యక ప్రాయముగ నుండెను. ఇందు మొదట సభ్యులు శాస్త్రివారికి శిష్యులైన కారణమున పరమ విధేయులై యుండిరి. కాని ఉత్తరకాలమున అట్టి సంబంధములేనివారు నానా సభ్యులు యువజనులు వారు చెప్పినట్లు వినకపోయిరి. శాస్త్రుల

వారి లేఖలలో వీరలఁగూర్చి యెంతేనికలదు. శ్రీ. క. శ్రీనివాసరావుగారు, కారణవిశేషమున సమాజమునుండి విడిపోయి విక్రమసింహపురి సుగుణవిలాససభ, అని కొంతకాల మొకనటసంఘము నేర్పఱచుకొనిరి. మఱికొందఱు సభ్యులు శాస్త్రులవారికెదురాడిపోయి నెల్లూరి 'యాంధ్రసభ' లో చేరిరి. ఆంధ్రభాషాభిమాని పేరునకే భంగమువాటిల్లునట్లయ్యెను. శాస్త్రులవారు ఎల్లెట్లో పేరునిలిపి కొన్ని నాటకములు వేయించిరి. కాని క్రమముగా సమాజము రూపుమాసెను. అంత్యకాలమున శాస్త్రులవారి మనఃక్లేశముల కిదియు నొండుకారణము.

## (iii) కింకిణీక్వణ శింజాన శారదా కాంచిక

—:o:—

క్రిస్టియన్ కాలేజిలో నుపాధ్యాయపదవియందుండఁగనే శాస్త్రులవారు, టాటోటు కవులు పటాపంచలై మాకు 'కింకిణీక్వణశింజాన శారదాకాంచికను శారదాదేవి కర్పింప మొదలిడిరి. శారదాకాంచిక ఒక విమర్శ గ్రంథమాల. అందొక్కొక్క గ్రంథము కాంచికలో నొకకింకిణి. ఇంక ఆ కాలపు చరిత్ర యించుక ప్రసక్తము.

అది ఆంధ్రభాషాచరిత్రమున విమర్శసారస్వతమున వికాస కాలము. ఊరూర సారస్వత పత్రికలు బయలుదేరి ప్రాచీన నవీన గ్రంథవిమర్శప్రతివిమర్శలతో లోకమును ముంచివైచినవి. అప్పుడు ఆంధ్రగ్రంథ సవిమర్శక పఠనమునకు అత్యంత ముత్సాహము కలిగినది. ఆంధ్రగద్యశైలి యందు పాకమును బిగువును వాడియుఁ బెంపొందినవి. అట్టి పత్రికామతల్లులు మూఁడు. 1. అముద్రిత గ్రంథ చింతామణి. ఇది మ. రా. శ్రీ పూండ్ల రామకృష్ణయ్యపంతులుగారిచే సంపాదితము. "శాస్త్రీయ విమర్శనలకు బద్ధకంకణమై" సుమారు పదునేనేండ్లు నెల్లూరున కొనసాగిన మహోన్నత సారస్వత పత్రిక. 2. ఆంధ్రభాషా సంజీవని. దీనికి మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు అధిపతులు. ఇది 1872 లో ప్రారంభించి 1881 లో "......వెండియుంజిగిరించి" 1900 వఱకు, పంతులుగారు మదరాసువదలి రాజమహేంద్రపురమునకుఁ బోవువఱకును, మదరాసులో నిర్వహింపఁబడినది. దీనిని "సుధీవంద్యంబు, త్రైలింగభాషామాన్యంబు" అని పంతులుగారు వర్ణించుకొనియున్నారు. 3. వివేకవర్ధని. ఇది శ్రీ రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారిచే సంపాదితము, రాజమహేంద్రవరమునఁ బ్రకటితము. ఇందు ప్రథమమునఁ బంతులుగారి గ్రంథములు పెక్కులు ప్రకటితములు. వాఙ్మయ సాంఘిక మతవిషయములు ఇందు ప్రసక్తములు. ఇవిగాక కళావతి, రాజహంస, సూర్యాలోకము, సత్త్వసాధిని, మంజువాణి, శశిలేఖ మున్నగు పత్రికలు పెక్కులు ఈ భాషావివాదములలో పాల్గొనుచుండినవి.

శ్రీ వేంకటరాయశాస్త్రులవారు అముద్రిత గ్రంథ చింతామణిలో ననేక చర్చలు కొనసాగించిరి. శారదా కాంచిక ప్రథమ కింకిణియగు "విక్రమాంకచరిత్రముద్రణవిమర్శనము" ఏతదనుబంధముగ 1898 లో ప్రకటితము. ఆనంద ముద్రణాలయ ముద్రితమై (1) క్రిస్టియన్ కాలేజి యాంధ్రపం

డితులు శ్రీ రాయదుర్గము నరసయ్య శాస్త్రులు (2) స్కాట్లండు మిషన్ కాలేజి యాంధ్రపండితులు కొమండూరు అనంతాచార్యులు అను వారలచేఁ బరిష్కృతమైన జక్కనవిక్రమార్కచరిత్రము "కాగిదము మంచిది, అచ్చుచక్కనిది, అట్టగట్టిది, తప్పులు మెండు" గ నుండ దానిలో 150 కన్న నెక్కుడు తప్పులుదిద్ది, "నావిమర్శనము తప్పైన, ఈముద్రణ మొప్పగునేని నాకు పరమసంతోషము. నావ్యాసము భ్రాంతి సమత్పన్నమని నిరూపించు పెద్దలకుఁ గృతజ్ఞుఁడనయ్యెద" అని శాస్త్రులవారు సమాప్తిచేసిరి.

వాఙ్మయ ఖండనమున శాస్త్రులవారి విపక్ష పండితులలో ఇద్దరు ముఖ్యులు. అందుఒకరు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులవారు. ఏతదీయ స్త్రీపునర్వివాహ మతమును పూర్వపక్షముచేయ శాస్త్రులవారు 1873 లోనే "స్త్రీపునర్వివాహ దుర్వాద నిర్వాపణము" ప్రకటించి తత్ప్రతిపక్ష కోటిలోఁ జేరిరి. పంతులవారి సంస్కృత నాటకాంధ్రీ కరణములం దుప్పతిల్లిన మూలాతిక్రమణాది బహువిధదోషముల మొత్తములు శాస్త్రులవారు అట నట విమర్శించుటచేతను ద్వేషము వృద్ధిపొందెను. ప్రెసిడెన్సీ కాలేజిలో సమకాలమున ఆంధ్రపండితులుగానుండి పంతులవారుచేయు పాఠప్రవచనమునందు విద్యార్థికిఁ బయమూలమునను ద్వేషము వర్ధిల్లెను. ఈద్వేషములు ప్రబలి వ్యక్తిపరములైనవి. పంతులుగారు తమ సంస్కరణ పరిశ్రమము మూలమున దొరలయొద్దను, అధికారుల యొద్దను సంపాదించిన యపార ప్రభావ ముపయోగించి శాస్త్రులవారికి విద్యాగ్రంథముల పరీక్షలకు నియమించుటయందును, తత్పరీక్షక పదవి విషయమునను కరము అపకరించిరి. "ఒకానొక కారణంబున నాగానందము ఎఫ్. ఎ. పరీక్ష కిడియు, ఒకానొకరి కారణంబున పరీక్షా గ్రంథనియమనాధికారులు మదీయ గ్రంథములను పరీక్షకిడకుండిరి. ఇప్పటికిని నాగ్రంథముల నిడుట యరుదే అని శ్రీ. శ్రీ. శ్రీ. యేలిన వారికి విశదమే." (వేం. రాజలేఖ) అని శాస్త్రులవారు 1915 లో వ్రాసియున్నారు.

వేంకటరాయ శాస్త్రులవారి ప్రతిపక్షకోటిలో నెల్ల నగ్రగణ్యులు మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులవారు, ప్రెసిడెన్సీ కాలేజిలో నాంధ్రపండితులు, స్వపాండిత్యము నందు అపరిమిత ప్రియాభిమానములు కలవారు.

> "రాక్షరవెట్టపెగ్గడయె, తాక్షరమారయ తిక్కయజ్వయే
> నాక్షరమన్ననన్నయయె యాంటఁ గవిత్రియ మానురత్నమో
> త్రిక్షణ నీదుభక్తుఁడ నుతించెద వేంకటరత్న నాముఁడన్."

కవిత్రియాత్మకులఁట! అందుచేఁ బంతులవారు అన్యుల పాండిత్యమును జీరికిఁగొనరు. పెక్కురు పండితులు వారినాత్మగతము ద్వేషించియు ప్రకాశముగా పొగడుచుండుటయు సంభవించుచుండెను.(1898 లో ప్రకటితములైన పూండ్లరామకృష్ణయ్యగారి లేఖలచే నిదిస్పష్టము.) అందుచే తన్నధిక్షేపించువారు లేరని పంతులవారు పెద్దలొప్పని యతి ప్రాస వ్యాకరణ ప్రయోగముల నొనర్చుచు బంగారు మున్నగు పద్యములు వ్రాయుచు, నొకమూల లక్షణసేతూల్లంఘన ప్రవణులయ్యు మఱొకమూల సర్వవ్యవహారములందును, ఒక్కొక్కపరి నవ్వుచేటుగఁ గూడ, వ్యాకృతభాషను భాషించువారు. ప్రతాపరుద్రీయమున

గ్రామ్యము పాత్రోచితమనియు భరతశాస్త్ర సమ్మతమనియు గ్రహింపక సహింపకయు వేంకటరాయశాస్త్రులవారిని “గ్రామ్యశాస్త్రి” అనిపరిహసించుచు ఆంధ్రభాషా సంజీవనీ పత్త్రికలో పెదరూరు పండితమండలిలో నిరంకుశులుగ నుండిరి. కొందఱు వారిని పుంభావ సరస్వతి అని విశ్వసించువారు లేకపోలేదు. వారు బహుగ్రంథకర్తలు. ప్రస్తుతములు రెండు (i) ఆంధ్రీకృతప్రసన్న రాఘవము, (ii) బిల్వేశ్వరీయము.

వేంకటరాయశాస్త్రులవారు తత్పరిహాస దూషణముల నోర్వక రత్నము పంతులవారి పాండిత్యము నకన్న తదభిమానమే వేయిమడంగులు హెచ్చని తేటపఱచువాఁడై “ఆంధ్రీకృతప్రసన్నరాఘవవిమర్శనమును”, ద్వితీయకింకిణిని 1898 లో ప్రకటించిరి. అందు మూలార్థ ప్రకాశకముగ పంతులవారి యనువాదము విమర్శింపఁబడినది. చదువనివారి దాక్షిణ్యానుకంపావాదము లటుండఁగాక, ఈవిమర్శనమును మూలానువాద సహితముగ నామూలాగ్రము పఠించినవారు ఈయాంధ్రీకరణము అత్యంతము దుష్టమనక మానరు. ఇది ‘ఈమత్ప్రవచన సహితము’ గ ఇప్పుడు మనకుఁ దోఁచును. కాని యాకాలపు విమర్శలతో, ముఖ్యముగ రత్నకవిగారి విమర్శలతోఁ, బోల్చిచూచిన ఇదికడుసాధువుగాఁ గన్పట్టును. ఏ కాలపు వాఙ్మయమును ఆకాలపు లక్షణ మర్యాదలచేఁగదా యోచింపవలయు.

శాస్త్రులవారు 1898 వేసవి సెలవులలో ప్ర. రా. విమర్శ వ్రాయుట విని పంతులుగారు నిజపత్త్రికలో “భువనావళి” యను పేర అతిహేయోపములతో 14 పద్యములు వ్రాసి, అందు విమర్శకులు విమర్శలను లోకమునకుం బ్రకటింపక రహస్యముగా కవికి తెలుపవలయుననియు, అట్లు చేయుట వారికి కీర్తికరంబగుననియు, ప్రకటించినచో విమర్శకులు అకీర్తిపాలగుదురనియు, నరకమునం గూలుదురనియు విశదపఱిచిరి. శాస్త్రులవారు అందఱి సూచనలను లక్ష్యపెట్టక గ్రంథమును ముద్రింపసాగిరి. ఆవిషయము పంతులవారికి తెలిసి వారు మఱల నిజపత్త్రికలో ప్రసన్న రాఘవ విమర్శచేయువాఁడు తక్షణము మృతినొందుననియు ప్రకటించిరి. ఈపద్యముం గనుఁడు;—

“ అఱవదట్టె, ముప్పదట్టె నల్వదియట్టె,
నిండ నూఱేఁడ్లకే నుండఁగలుగుటే
ప్రాణితమునా ప్రసన్నరాఘవకృతి విమ
ర్శనము చేసి పుణ్యజనుఁ డిలపఁడు. ”

దానింగూడ శాస్త్రులవారు సరకుగొనక ముద్రణము ముగించుచుండఁగా పంతులవారు ప్రతాపరుద్రీయ నాటకమును గాల్చివేయ వలసినదని పత్త్రికలో వ్రాసియుండిరి. ఈశాపములు లోకమునకు నుల్లాసకరములగు నిమ్మటనే యొక్కనాఁడు వేంకటరాయశాస్త్రులవారిని ఆంధ్రనాటక పితామహులు శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు (రత్నకవిశిష్యులు, మిత్రులు) క్రిస్టియన్ కాలేజిలో దర్శించి విమర్శనముల ప్రస్తావముఁదెచ్చి “ఇట్టి విమర్శలు మాత్సర్యముచే వ్రాసినవని లోకులు తలంతురు” అనిరి. “కారణ మేమని యెవరూహించిన నెవరికేమి? విమర్శలలోని విషయము సాధువైన లోకులు గ్రహింతురు. గాన శ్రేయముం బొందుదురు.— ” అని శాస్త్రులవారు సమాధానమిడిరి. అంతట కృష్ణమాచార్యులవారు, కవి

పండితసంఘ కార్యదర్శులు. "ఇట్టి విమర్శలు వెడలకుండ ట్లైతే మేము కృతివిమర్శపసంఘమొకటి నిర్మించెదము" అని పల్కిరి. "ఉచితమేని కానవేయుంగాక" అని శాస్త్రులవారనుజ్ఞ నిచ్చిరి. ఈ ప్రయత్నమును తత్పర్యవసానమును స్థలాంతరమున నిందు వ్రాసితిమి. ఈశిక్షకిలు రిప్పుడావంగా విమర్శ ముద్రితమై బయల్వెడలెను. అముద్రితగ్రంథచింతామణిలో విశ్వేశ్వరీయము నను సమలోకరిచే విమర్శింపఁ బడినది. పిమ్మట పంతులవారు తమ సంజీవనిలో పరికల్పించిన శాపములలో నొకటి,—

"రామబాణము నిజమేని నీమహిమ ప్ర
సన్నరాఘవ జయభేరి సరకుగొనక
తద్విదళనము నొనరించి దర్పితులవు
వారల న్వారివారల నారయు మికఁ"

అదే యర్థము ఒకశ్లోకమున ఘటించియున్నారు,—

"శ్లో. ప్రసన్నరాఘవజయభేరీ రామాయణం హి తత్
తద్దూషణా పరా నేష రామబాణః ప్రశాసతు."

ఈ రామబాణము శాస్త్రులవారిని చంపక సూర్యాలోకమునఁ బడ్డది. ఎట్లన, సూర్యాలోకము ఈ శ్లోకమున వ్యాకరణము మరణమందినదని చాటెను. ఇందు "ఏష రామబాణః" కర్త ఏకవచనమున నుండ, క్రియ "ప్రశాసతు" బహువచనమున నున్నది. ["ప్రశాస్తు" ఏకవచనము] మఱియు, "ఆ శ్లోకవనికం బెకలించిన యాంజనేయా, నా గ్రంథమును విమర్శించిన యల్లయాశాస్త్రిగారిని సమూలముగా బెకలించివైవుము" అని పంతులవారు ఆంజనేయులవారికి మొఱవెట్టిరి. ["ఆంధ్రకవి పండితసంఘతత్త్వము" చూడుఁడు.]

పిమ్మట 1902లో విశ్వేశ్వర శతకములో పంతులవారు,

"హితమగు చేసు ప్రసన్నరాఘవము నా నింపారు సన్నాటకం
బు పెల్లింగించిపడఁ దంశ్రి కంకితముగా భూషించి రాద్యుల్ ఘనుల్,
ప్రతిరోధి ప్రియుఁడై గయికండు సెగ డెక్ బాకు ండు గ్రామ్యుండు, నీ
మతి నెట్లెంతువొ సాక వైద్రినుత భీమా బిల్వనాథేశ్వరా."

అని వ్రాసికొనిరి. ఇట్టి తమ శాంతిని ఆ విశ్వేశ్వరశతకమందే, "కొన్ని సత్కృతుల్ మొనసి గచింపితిన్, బహుల భూషణ దూషణ లొల్ల" అని ప్రశంసించుకొనిరి. ఇంత వ్రాయుటేల యనఁగా ఆకాలపు విమర్శ స్వరూపము తెలుపఁబడుచున్నది. ఇట్టివిమర్శలను సమకాలీన మాటచేతనే ప్ర. రా. విమర్శ "ఈపద్య పదవచనసహిత"మగును.

విమర్శ ప్రకాశముంగూర్చి శాస్త్రులవారి యీ వాక్యములు తెలియఁదగినవి. "ఈవి మర్శ

3

శారదాదేవి కాంచికను విరాజిల్లినవి అమూల్యములు ఈయూటు కింకిణులే. గ్రంథాంతర రచనా ప్రసక్తిని వ్యవధి పరిమితమూటుచే శాస్త్రులవారు శారదాదేవి యొడ్డాణమునిండుగ గజ్జెలఁ గైసేయలే నైరి. కింకిణులఁ గూర్చి వారు ఇట్లు వ్రాసియున్నారు. "అవ్యుత్పన్నులు, పండితమ్మన్యులై భాషానాశము చేయుచున్న సాహసము ప్రకాశము చేయువాఁడనై కొన్ని కింకిణులను విరచించితిని. అవి ఎవరికిఁ దగిలినవో వారు ద్వేషించినను సాధుబృందారకులు అమదీయ విమర్శ కింకిణులకు సాధువాదము నాకు బాబులమూలమునం దెలిపిరి. మఱి వింతగా మదీయ కింకిణీశింజిత విసంజ్ఞితులకు మహామహోపాధ్యాయ బిరుదాంకము సైతము తన్మిత్రబృందముచే సాధితమైనది." అని (వేం, రాజశేఖ).

కింకిణీ నామాంకితములు గాకపోయినను మఱికొన్ని యద్భుతోపన్యాసములు విమర్శాత్మకములు తద్రచితములు కలవు. అందు విమర్శ వినోద మొకండు. 1902 లో ముద్రితము. ఇందనేక ప్రాచీన సంస్కృతాంధ్ర గ్రంథ పాఠనిర్ణయాద్యనేకచర్చలు కలవు. దీనిని గూర్చి శాస్త్రులవారు "నా గ్రంథములన్నిటిలోను ఉత్కృష్టము విమర్శ వినోదము. తెలిసికోఁగలవారికి తెలియును." (రెడ్డిలేఖ 2-12-29) అని వ్రాసియున్నారు. (2) ఇట్టిదే శ్లేషవినోదము, అముద్రితము.

(3) మోచాకుసుమామోద విచారము. "మోచాకుసుమామోదసువాసిత మలయనగాగత మందానిలముఁ" అను శ్రీనర్మసరము రామకృష్ణమాచార్యులవారి రగడలోని 'మోచయు' కందళీశిలీంధ్రములును ఏకార్థములు, నేలయరఁటియే వానికి అర్థము. అందు ఆమోదములేదు. "కావున మోచాకుసుమామోద ప్రయోగంబు అపప్రయోగంబ" అని ఇందు సిద్ధాంతితము. ఇది 1912 కు పూర్వమై రచితము. మేఘసందేశసీసకలో పరామృష్టము. నెల్లూరిలో శ్రీ యరుగుడిపాటి వేంకటాచలము పంతులు బి. యె, బి.యల్ గారియింట బ్రహ్మశ్రీ గాడేపల్లి వేంకటరామశాస్త్రులవారి యాధ్యక్ష్యమున జరిగిన సభలోఁ జదువఁబడినది. ప్రమోదూత భాద్రపద భారతిలో ముద్రితము. (4) ఆంధ్ర గ్రంథ విమర్శ ప్రకారలేశము. ఇందు విమర్శన పద్ధతులు కొన్ని చక్కఁగా నిరూపితములైయున్నవి. ప్రమోదూత జ్యేష్ఠ భారతిలో ముద్రితము. (5.) భారతా భారత రూపక మర్యాదలు. పేరుచేత నేవిషయము స్పష్టము, నాట్యకళా చరిత్రమను పేర శుక్లభాద్రపద భారతిలో ముద్రితము (6.) విసంధి వివేకము. ఇది 1912 లో పచ్చయప్పకళాశాలలో నుపన్యస్తమై1913 లో ముద్రితము. ఈలఘూపన్యాసమునందు "సంహిత ఏకపదమందు నిత్యము (ఉదా-వనేన,ఇచ్చెను). ధాతూపసర్గలకు నిత్యము (ఉదా-ఉపాస్తే, ఆధ్యేతి.) సమాసమందు నిత్యము. (ఉదా-రాజాజ్ఞ,ఇల్లాలు).వాక్యమునందైననో వివక్షాధీనము (ఉదా-దధిఅత్ర,పెరుగు ఇక్కడ.) చెప్పినతొలిమూఁడుపట్లను దక్క వాక్యమధ్యములో వివక్షలేనిచో సంహితలేదు. సంహితలేనిచో సంధి కార్యము రాదు." అని బహుప్రమాణోదాహరణ పూర్వకముగా సిద్ధాంతము చేయఁబడినది. ఇచట 'ఏకపద' మన్నచోట పద్య పాదమును గ్రాహ్యము. ఈమతము నే శాస్త్రులవారు తమరచన లందెల్లను పాటించిరి. అది నానాఁటు బహుజనాదృతమగుచున్నది. దుస్సంధులు నిరవకాశములగుచున్నవి. (7) గ్రామ్యాక్షేపనిరసనము. ఇందు గ్రామ్యముననే గ్రంథములు వ్రాయవలయునను వాదము పూర్వపక్షము చేయఁబడినది. ఇది శ్రీపచ్చయప్ప కళాశాలాంధ్రభాషాభిరంజనీసమాజసభ్యుల ప్రార్థనమై 12-2-1914 న.రా.శ్రీ దివాన్ బహద్దరు కంచికృష్ణస్వామి రావు సి.ఐ.ఇ గారి యాధ్యక్ష్యమున నుపన్యస్తము. వెయ్యిలు ముద్రితప్రతులు పంచిపెట్టఁబడినవి. (8) తిక్కన విజయము ఈవ్యాసము విక్రమ సింహపురి వర్ధమాన

సమాజమువారి కోరికపై 1919 సం. మే లో నెల్లూరు పొగసౌధములో పఠింపఁబడినది. 1920 లో ముద్రితము. ఇది ప్రాయికముగా కేతన దశకుమార చరితమునకై వ్రాయఁబడినది. తిక్కన నెల్లూరివాఁడే యని శాసన ప్రమాణములచే సిద్ధాంతితము. ఇందు కవిత్రయ సోమనాథ కవనతారతమ్యము చక్కఁగా నిర్ణయింపఁబడినది.

ఈ విమర్శగ్రంథములందెల్ల శైలి జిగి, బిగి, ఇమిడిక గలిగి సారస్వత విమర్శ పంథయందు దగియున్నది. శాస్త్రిగారిచేతి లేఖిని సవ్యసాచిచేతి గాండీవమని ఇందు ప్రకటము. అటునటు లక్ష్యభూతుల గుండె డిల్లఁజేయునవయ్యు, పతితలను పడిపడి నవ్వఁజేయు చమత్కార శబ్దకల్పనలు, వాక్యములును ఇందు కలవు. అందుచేఁ జదువ వినోదమును, వ్యుత్పత్తియు, రచనాపాటవమును చేకూరును.

ప్రవీరపండితులతో వాదించునపుడు శాస్త్రిలవారు నిజాభిప్రాయ మాటాడినను, పరోక్షమతముఁ గైకొని విమర్శించుటయుఁ గలదు. ఆవిమర్శలు తదభిప్రాయ సాధకములు కావు. తదనుసారముగఁ దద్రచనలు లేవని వాదింప నవకాశము లేదు. "వారు మత్కృతాక్షేపములను మదీయ సిద్ధాంతములుగా భావించిరి. నాసిద్ధాంతమనివారు తలంచినది నాసిద్ధాంతము గాదు. ఆయాతావుల వారు అవలంబించిన మార్గమువలన వాస్తవసిద్ధాంత స్థానమున ఆపాదించునట్టి తద్విపరీతమును నేను సూచించితిని" (వేం. రాజశేఖ) ఈ కీలు తెలియని కొందఱు శాస్త్రిలవారి ప్రయోగములు సిద్ధాంతాను సారముగ లేవే అని అట్టహాసము చేయుచున్నారు.

ఈ విమర్శ గ్రంథములు శాస్త్రిలవారి సర్వంకష పాండిత్య ప్రాభవమును, సునిశిత బుద్ధి వైభవమును, అమేయభావనావైశద్యమును, అద్భుతరసజ్ఞతా మహిమను, అనన్యాస్పృశ్య పాండిత్య నిర్ణయ కౌశలమును వేనోళ్ళం జాటుచున్నవి.

## కవిపండిత సంఘచరిత్రము.

—:о:—

ఇది పూర్వాధ్యాయానుబంధము. కింకిణ్యాది విమర్శ వాఙ్మయములకు లక్ష్యభూతులైన కొందఱు వైరనిర్యాతన ప్రారంభము. దీనిపరిణామము వేంకటరాయశాస్త్రి విజయముగ పర్యవసించినది. తద్వృత్తాంతము కొంత ఇట ప్రస్తుతము.

ఆంధ్రకవిపండిత సంఘప్రథమ సమావేశము 1898 లో బళ్లారి పురమున జరిగినది. మఱుసటి సంవత్సరము ద్వితీయ సమావేశము మదరాసులో జరిగినది. శ్రీధర్మవరము రామకృష్ణమాచార్యులవారు తన్నిర్మాత, కార్యదర్శియు. మొదటి సంవత్సరము శ్రీమాన్ రావుబహద్దరు పనప్పాకము అనంతాచార్యులు బి.ఎ, బి.యల్ గారును, రెండవ సమావేశమునకు ప్రెసిడెన్సీ కాలేజి సంస్కృతభాషా మహోపాధ్యాయులు (Professor of sanskrit) శ్రీయుత శేషగిరి శాస్త్రిలవారు ఎం.ఏ.యు అగ్రాసనాధిపతులు. సంఘము పేరు చక్కఁగ నేయున్నది. అట్టి సంఘము అపేక్షణీయమే. ఉద్దేశ్యములు, (1) ఆంధ్రవ్యాకరణమును సంస్కృత వ్యాకరణ సహాయమున సమగ్ర పఱచుట. (2) తెలుగుమాటలకు వ్యుత్పత్తుల నిర్ణయించుట, (3) నాటకమున గ్రామ్యము ప్రయోక్తవ్యమా కాదా అని నిర్ణయించుట, (4) కృతి

విమర్శోప సంఘమును నిర్మించుట- ఇత్యాదులు ప్రశంసనీయములె. కాని, మొదటినుండియు కార్యదర్శి గారు పాక్షికబుద్ధివహించి, కవిపండితాన్యులను అనేకుల సభ్యులుగాఁజేర్చుకొని పండితులకు చాలమంది కి ఆహ్వానములు పంపకయు, వచ్చిన పండితులను యోగ్యులకును ప్రసిద్ధులకునుఁగూడ ఉపన్యాసముల నొసంగకయు, తగని వారికొసంగియు నిరాదరించిరి. మొదటి సమావేశము నిష్ఫలము. దాని చర్యా గ్రంథము 20 మాసములకు పిమ్మట పెక్కుల సంధనములతో ప్రకటింపఁబడినది.

రెండవ సమావేశమునకు ముందె ప్రథమద్వితీయ కింకిణులు ప్రకటితములు. ఆంధ్రప్రసన్న రాఘవ విమర్శయు ప్రకటితముగా నుండుటకై వేంకటరత్నము పంతులవారి శాపవాక్యములును, వదరాసులో ఆచార్యులవారి బిభీషికలను పూర్వోక్తములు కదా. కావున రెండవ సమావేశము వాస్తవముగా "ఆంధ్రకవిపండిత సమావేశము" కాదు. శాస్త్రివైరులు అన్యపక్షమువారల నిబర్హణము సేయఁబన్నిన వ్యూహము. ఉద్దేశ్యములలో మొదటి రెంటికెప్పుడో జలాంజలి యర్పింపఁబడినది. ఆసమావేశమున శ్రీరామకృష్ణమాచార్యులవారు తమవారల ననేకుల నుపసంఘమునఁ జేర్చుకొని ఓట్ల బాహుళ్యమున 3 వ యుద్దేశ్యమును, నాటకమున గ్రామ్యము ప్రయోక్తవ్యమా కాదా అను విషయమును, చర్చకు రానీయకుండఁ జేసిరి. శ్రీరామకృష్ణమాచార్యులవారును తమ నాటకములలో గ్రామ్యము ప్రయోగించినవారే కాని కొంచెము ప్రయోగించిరంట. అందుచే తన్నాటకములు గ్రామ్యములంట. వేంకటరాయ శాస్త్రులవారు బహుళముగా ప్రయోగించిరంట, అందుచే వారినాటకము సగ్రామ్యమఁట. ఈ ప్రసంగముమీఁద కృష్ణమాచార్యులవారిని శాస్త్రులవారు "పాతివ్రత్య భంగమునకు ఎన్నిమాఱులు కక్కుర్తిపడవలయునని ధర్మశాస్త్రము?" అని నాటక ప్రయోక్తవ్య గ్రామ్య పరిమాణ నిరసనముగా ప్రశ్న యడిగి నిరుత్తరులఁ జేసిరి. పిమ్మట కృతి విమర్శోప సంఘ మవశ్య ప్రతిష్ఠాపనీయమని తత్స్వరూపమునుగూర్చి అరగంట సేపు శ్రీ యాచార్యులవా రుపన్యసించిరి. దాని సారమిది-ఆఱుగురు సంఘసభ్యులు ఉపసంఘమఁట. వారు పండితులచే నెన్నుకొనఁబడవలెను. ఆసంఘమువారు విమర్శకొఱకు పంపఁబడిన గ్రంథములనే విమర్శింతురఁట! విమర్శకోరనివారి గ్రంథములను విమర్శింపరఁట- ఇత్యాది. ఏవిషయమునను వేంకటరాయశాస్త్రులవారికి ఉపన్యాసము రామకృష్ణమాచార్యులవారేర్పఱుపకున్నను సభ్యులప్రార్థనమై అగ్రాసనాధిపతులు పలుమాఱు కోరఁగా శాస్త్రులవారు కృతివిమర్శోపసంఘమునుగూర్చి యుపన్యసించిరి. "ఈ 5 గురు విమర్శింపసమర్థులని యొక నమ్మకమా? మఱి వారిగ్రంథముల నెవరు విమర్శింపవలెను? వీరు కన్నుగీటుకొని ఏవురగ్రంథముల నేవురు కొనియాడవలసినదా? లేక మత్సరద్వేషములచే దూషణ చేయవలసినదా? వీరిని నియమించువారు పండితులు కదా. పండితాపండిత భేద మేర్పడినదా? కావున విద్య యథమపక్ష మింత యనియు సభ్యులు వీరనియు నేర్పడువఱకు కృతివిమర్శోప సంఘ నిర్మాణప్రయత్నము పనికిరాదు." అని యుపన్యసించిరి. శాస్త్రులవారి యుపన్యాసమునకు సామాజికుల హర్షసూచక కరతాళ ఘోషములచే వ్యవధానము కలుగుచుండినది. 'రాజహంస' అప్పటిసభ్యుల చిత్తవృత్తులిట్లు కూజించినది- "పునాదిలేని సౌధమువలె నాంధ్రకవిపండిత సంఘమొక్కసారి నేలఁబడఁబోవుచున్నదాయే యని సభ్యులయుల్లములు జల్లుమనునట్లు వేంకటరాయశాస్త్రిగారు ప్రసంగించిరి. అగ్రాసనాధిపతిగారు సభ్యులవంకఁ జూచిరి. సభ్యులాచార్యులవంకఁ జూచిరి. ఆచార్యులవారాకాశమువంకఁ జూచిరి." అని. తమపక్షమువారలపై విమర్శలు రాకుండఁజేసికొన దాము చేసిన ప్రయత్నము భగ్నమాటచే ఆచర్చను తర్వాతి

సంవత్సరమునకును అట్లుగనే ఆచార్యులవారు అగ్రాసనాధిపతిగారిని గోరి వచ్చినదానికి సంజీవి పోయగమకించిరి. శ్రీకొక్కొండ వేంకటరత్నము పంతులవారు భగ్నమనోరథులై కృతి విమర్శోపసంఘుభంగమునకు వేంకటరాయశాస్త్రులవారియు పూండ్లరామకృష్ణయ్యగారియు దురభిమానము కారణమనియు తృతీయ సమావేశమున వారిని మానిన మేలనియు సంజీవనిలో వ్రాసుకొనిరి. మూడవ సమావేశమునకుఁ గూడ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు కార్యదర్శిత్వము సంపాదించుకొనిరి. అది 1899 లో నెల్లూరునఁ జరుగవలసియుండెఁగాని తత్పూర్వవత్సరముననే మదరాసులో సంఘము వేరు మాపు మాయుటచే మఱిజరుగలేదు. శాస్త్రులవారికి సంఘముపై ద్వేషములేదు. "సాధువాఙ్మయ సంరక్షకై యొక విద్వత్సంఘము అపేక్షణీయమైయున్నది. అందుకై నేను రెండుమాఱులు యత్నించి నెఱవేఱక మానితిని" అని ఆ. గ్రం. విమర్శ ప్రకారలేశమున వ్రాసియున్నారు. కాని "ఆం. క. పం. సంఘము తృణావృత మహాకూపమై, రహస్యముగ స్వప్రయోజన సాధనమునకును, వైరిని బర్హణార్థమును రామకృష్ణమాచార్యాదులచే కల్పింపఁబడిన వ్యూహమాటచే, ఆకాలపుపండితుల కనేకులకు ఆసంఘుభంగము సంతోషకరమై యుండినది. వేంకటరాయశాస్త్రులవారి తప్పా—కొందఱు తప్పనిరి—దాని తత్త్వము ప్రకాశపఱుచుచునే! "ఈపండిత సభాసందర్భమున శాస్త్రులవారి యత్యద్భుతములగు ప్రతిభా ప్రకర్షలు లోకమున కచ్చెరువు కల్గించినవి:" (ఆంధ్రపత్రికానుబంధము 1922. సెప్టం. 23.)

[ఏతద్విషయ విస్తరము ఈ క్రిందిగ్రంథములలోఁ జమువనగును (i) కవిపండిత సంఘుచరిత్ర తత్త్వము (1897-98) ఇది (i) కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు, (కళావత్యధిపతులు) (ii) కోపూరు సుబ్బరామయ్యగారు (కోపూరు) (iii) గుండ్లపూడి సుబ్బయ్యగారు (పెదపుత్తేడు) (iv) సి. దొరసామయ్యగారు (సత్త్వసాధిని కార్యనిర్వాహకులు) అను నలువుర తృతీయాంధ్రకవి పండితసంఘు సాంఘిక విజ్ఞాపనము. 1899 లో ముద్రితము. అత్యద్భుత గ్రంథము. (2) కవిపండిత సంఘమునఁ గలిగిన పండిత ప్రతారణము శ్రీచుంగు రామానుజరావుగారిచే ప్రణీతము. (1899) (3) శ్రీ పూండ్లరామకృష్ణయ్యగారిచే ప్రకటితములైన జాబులు (1899)].

## భారతీపూజా సమాప్తి.

—:0:—

శ్రీశాస్త్రులవారు కాలేజిలో 25సంవత్సరములు సంస్కృతప్రధానపండితపదమునందున్నప్పుడు సంస్కృతాంధ్రములు రెంటను పరీక్షకులుగా చిరకాలము ఉండిరి. తత్పరీక్షక పదలబ్ధివృత్తాంతము వారిట్లు వచించియున్నారు;— "శ్రీపంతులు అష్టాదశభాషాధురంధరులునగు ప్రొఫెసరు శేషగిరిశాస్త్రులవారు ఎం.ఏ.వన్ను ఎఱుకచేసికొని, మిత్రధేయమై తామెయత్నించియు, శ్రీ మిల్లరుదొరవారిని హెచ్చరించియు, యూనివర్సిటీపరీక్షాధికారమును నాకు ఇప్పించినారు."(వేం. రాజలేఖ) ఇది యెంతయు నాయతికరముగనుండెను. అప్పుడే యూనివర్సిటీ యధికారచోదితులై 'విశ్వకళాపరిషత్పాఠ్యమాల' (university selections) నొండు ఆంధ్ర గ్రంథరాజములనుండి సంకలించి లఘుటీకాలంకృత మొనర్చియిచ్చినారు. ఇప్పటికిని అందుండి విశ్వకళాపరిషత్పరీక్షలకు పాఠ్యభాగములు నిర్ణీతములగుచున్నవి..

కళాశాలలో నిట్లు "విద్యాదాన వ్రతమహోదధులై" కాలముగడుపుచుండియు, బహుగ్రంథ రచనమునకును, అన్యమార్గముల భాషాసేవకును ఉద్యోగము నిరోధకారణమౌటచే 1908 లో దానిని విరమించుకొన సంకల్పించియు, ఆర్బత్తునెటునిధిమునుకలో తాము పరీక్షకులుగ నార్జించిన సర్వస్వము 3 వేల రూప్యములు మునిఁగిపోవుటచే 1910లోఁగాని ఉద్యోగము మానుకొనుట సాధ్యముకాదయ్యెను. "ఈ (భాషా) సేవలోనే కాలము వెళ్లఁబుచ్చఁదం గోర్కెఁగాని ఉపభాషా ప్రవచన విచారణాధికార సమేతమైన సంస్కృతప్రధానోపాధ్యాయ పదమును- నెలకు రు 100 లు జీతమును; దినమునకు ఒకటిరెండుగంటలకు మించని పనియుం గలదానిని-వదలితిని." (ఆం. మ.స.) వెజ్జవజ లేక పోవుటచేఁ గూడ, ఎప్పటికేని చేయవలసినదేగదా, అని వారుదానినిమాని ముద్రణ వ్యాపారమునందె కాలము వినియోగింపఁ బూనిరి. కాలేజిలోనున్నప్పుడే 1900 కు పూర్వమె జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల స్థాపింపఁబడినది. అందు తదీయములును, అన్యములును, పెక్కు గ్రంథములు శుద్ధముగా సుందరముగా ముద్రితములగుచుండెను. అక్షర ఘటకులు సుశిక్షితులౌటచే గ్రంథములు ప్రాయికముగ నిర్దుష్టములుగనుండెడివి. శాస్త్రులవారి పుత్త్రుఁడు శ్రీ వేంకటరమణయ్యగారు ముద్రణకళయందసదృశుఁడు, వారికి కొంత కాలము కుడిబుజముగానుండెను.

### శృం. నైషధ విష్ణుచిత్తీయ వ్యాఖ్యలు.

—:0:—

ఇట్లు ప్రారంభించి చేమకూర వేంకట కవిరాజకృతులను సారంగధర విజయ విలాసములను (1911) సటీకములుగ ముద్రించి, పిమ్మట, "నైషధము శిష్టీసిధుల్ నెఱచూఱలిచ్చిరి." మధుప్రాయకు ఆంధ్రవాణికి వారు చేసినకైసేఁతలో నెల్ల శృంగార నైషధసర్వంకష వ్యాఖ్య (1913) ప్రధానమైనది. శాస్త్రి శిష్యవతంసుఁడు శ్రీ గునపాటి యేనాదిరెడ్డిగారి ప్రేరణమై శ్రీవిక్రమ సింహపురిరెడ్డిప్రభువర్యులు రావుబహద్దరు, కే. శే. రేబాలలక్ష్మీనరసారెడ్డిగారు తద్గ్రంథముద్రణపర్యాప్తధనము రు 2000 లు ఇచ్చి దానిని అచ్చువేయించి ఆంధ్రపాఠకుల కృతజ్ఞతకు పాత్రులైరి. "ఏతద్వ్యాఖ్యాగుణ గ్రాహులలో ఆంధ్రభాషాభిమాన ధురంధరులు, రసజ్ఞ చూడామణులు నగు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డి, ఎం. ఏ గారు ప్రీతిపూర్ణముగా దాని నిట్లు అభినందించినారు.—

YELWAL ROAD, MYSORE.

*My dear sir,* *23rd., Sept., 1914.*

I thank you most heartily for your kindness in presenting me with a copy of your superb edition of Sringara Naishadha. I have read through a good portion of the book and find it of entrancing interest. I suppose it is beyond question that yours forms the greatest commentary that has so far appeared in Telugu and that it will probably be a unique one of its kind for all time to come. Up till now the old commentaries on Vasu charitra, Manucharitra Raghavapandaviya etc, held the field as classical productions of their kind, but to-day the Telugu world could boast that a

modern scholor has beaten the ancients at their own game in the most decisive fashion.

Wishing you more prosperous years of literary labour and distinction,

*I remain,*

*Your very sincere admirer and friend,*

**C. R. REDDY.**

ఇట్లు శృంగార నైషధమునకు అసదృశ వ్యాఖ్యానిర్మితియొనర్చి

"ఉత్కృష్టతమమైన దుర్గ్రాహ్యప్రౌఢికతనం
దవ్యక్తమయిన యాముక్తమాల్యదకు విపుల
వివరణంబును వేడ్కరచించినారు."

అన్యపండిత దుస్సాధ్యమును తాము 'వేడ్క'పై సంజీవనీవ్యాఖ్యను రచియించిరి. ఇది తత్పాండిత్య నికషము. దీనిని వ్రాయుటకు 1917 కు పూర్వమే శాస్త్రులవారు ప్రారంభించి 'దీక్షితులై' వ్రాసి 1921 కడపటు ముగించినట్లు లేఖలచేఁ దెలియుచున్నది. ఈవ్యాఖ్య వ్రాయుట ఒకయెత్తు, దీని పీఠిక వ్రాయుట ఒకయెత్తు. "అన్ని మిక్కిలి పెద్దగ్రంథములను ఆంధ్రగీర్వాణ భాషలయందు ఇంచుమించుగా మున్నూటిని పఠించుట ఆవశ్యకమైనది." అని మాళవికాగ్నిమిత్రనాటకానువాదము విన్నపము. శ్రీ. శ్రీ. శ్రీ పిఠాపురము రాజాగారు తన్ముద్రణము నిమిత్తము రు 1200 లును, శ్రీయుత అల్లాడి కృష్ణస్వామయ్యగారు రు 1000 లును, శ్రీయుత [illegible] రామచంద్రారెడ్డిగారు 2500 లును-ఇంతధనము పారితోషికముగ నొసంగినను, ఇందు గ్రాహకులు తరిగిపోగా రు2000 లకు శాస్త్రులవారు అప్పుపడిరి. నేత్రాభావకాలమున చిత్తుగ అచ్చులు చూచుట సంభవించినది. అందుచే చాల, తప్పులు పడినవి. ఆకష్టకాల చరిత్ర లేఖలలోఁ జదివిన 'అపి దలతి వజ్రస్య హృదయమ్' అనుట నిజమనిపించును. ఎట్లుకేని ఈవ్యాఖ్య 1927 లో ప్రకటితము. 'కృష్ణరాయలప్రౌఢి' ఆబాల సుప్రసిద్ధమైనది. ఇది శాస్త్రులవారి కడపటి గ్రంథము.

సాహిత్యదర్పణము.

—:0:—

విష్ణుచిత్తీయ వ్యాఖ్యాన రచనా కాలమునందె 1921 సంవత్సరములో రచియింపఁబడినదే సాహిత్యదర్పణము. ఆంధ్రభాషయందు శాస్త్రవాఙ్మయము ఏమియులేదు. సాహిత్యశాస్త్రగ్రంథములు అసత్కల్పములే. "ఈ భాషకు సమగ్రమైన యలంకారశాస్త్రములేదు. ఉన్నట్టి యలంకారగ్రంథములు ధనాఢ్యులకై దొరలంబొగడుటకు సాధనములుగా వ్రాయఁబడినవే కాని విషయములన్నియు విపులముగా సుబోధముగా చర్చించి విశదీకరించుటకు వ్రాయఁబడినవి కావు" (వేం, రా జలేఖ.) ఈవిషయము వారు చిరపూర్వమే గ్రహించినారు. 1882 లో అలంకార సార సంగ్రహము రచియించినారు. దాని ని గద్వాలపండితులు అత్యంతోపయుక్తమని [illegible] అలంకారగ్రంథము [illegible] అనియును ప్రస్తుతించుటచే [illegible]

విస్తర సమేతముగా వచ్చుల 1927 లో ముద్రించినారు. భానుకృతిని రసమంజరిని 1909 లో ఆంధ్ర వ్యాఖ్యతో ప్రకటించినారు. కాని ఇవి సాహిత్య విషయముల నొండు రెండు ప్రపంచించునవి. సర్వవిషయ సమగ్రమైన యలంకార శాస్త్ర మొకండును ఆంధ్రమున లేకపోవఁగా, కావలి పురవాస్తవ్యులు శాస్త్రిశిష్యవతంసులు నైన శ్రీ దొడ్ల వేంకటరామరెడ్డిగారి ప్రేరణచే 1921 ఫిబ్రవరి 2 ప్రారంభించి ఏప్రెలు 9 వ నాఁటికి విశ్వనాథ కవిరాజకృత సాహిత్యదర్పణము తెలిఁగించిరి. కాని, 13 ఏండ్లైనను అముద్రితముగ నది యుండెను. కాని ఆంధ్రులభాగ్యవశమున మోపూరు గ్రామవాస్తవ్యులు, ఈవికిపేరు వడిన రేబాల వంశమునకు అలంకారభూతులు మ. రా. శ్రీ రేబాల హరిశ్చంద్రారెడ్డిగారి వదాన్యతాతిరేకముచే ఇప్పటికేని, ఈసగమేని, ప్రకటితముగా నోచుకొన్నది. వారికి ఆంధ్రులెల్ల కృతజ్ఞులు. వారియాదరముచే కడమసగము కూడ శీఘ్రకాలముననే ముద్రితమగుఁగాక.

శాస్త్రిలవారి గ్రంథరచనము ఇంతటితో పరిసమాప్తమైనది. ఆమహానీయుఁడు వాణీసేవలో క్షణమేని ఆలస్యము వహింపలేదు. వారు రచించినవి ‹ పంచాశదధికములు గ్రంథనిధులు › కాక తత్సంకల్పితములు మఱియెన్నో యుండఁగలవు. స్థలాంతరమునఁ జెప్పఁబడును.

శాస్త్రిలవారు తమ భాషాసేవా ప్రకారమును ఇట్లు వర్ణించియున్నారు:—" మదీయ వాగ్దేవతా పూజలో- ఆవాహనము శ్రీపుష్పవాహిని దుర్వాదనిర్వాపణము, ఆసన సమర్పణము కథా సరిత్సాగరము, అర్ఘ్యము ప్రతాప్రరుద్రీయ నాటకము, పాద్యము మేఘసందేశాంధ్ర టీక, అలంకారము అంధ్ర ప్రసన్నరాఘవ నాటక విమర్శ కింకిణీగణ శింజాన శారదాకాంచిక, నైవేద్యము శృంగారనైషధ వ్యాఖ్యాసర్వంకష" (ఆం. మ. స.). అప్పటికి (1920) పూజ పూర్తికాలేదు. సరస తాంబూలము కావలయు సాహిత్యదర్పణము. నైవేద్య మిచ్చి తాంబూల మియ్యమి పూజావిధాన లోపము కదా. నమస్కారము ఆముక్తమాల్యదయే. ఏలన పిమ్మట మఱేగ్రంథమును శాస్త్రిలవారు రచియింపలేదు. ఇట్టి పూజాభాగ్యము వారొక్కరదే.

## పూజాఫలము.

—:o:—

వేంకటరాయ శాస్త్రిలవారి నిరంతర భారతీపూజా ఫలము ఇరుతెఱంగు లైనది. ఆంధ్రమయ ప్రపంచమున వారికి సాటిలేని గౌరవములు కలిగినవి. తద్గ్రంథములు నేఁటి నవలా నాటకముల వలె సార్వజనీనములు గాకపోవుటచే వారికి అపరిమిత ఋణములు, నిర్వ్యరిక్తత, మనఃక్లేశమును సంభవించినవి.

ఈకాలమున విద్యాసంపాదనము మహాధనులకే గదా సాధ్యము. శాస్త్రిలవారికన్ననో ఉద్యోగలబ్ధి కుటుంబభరణ పర్యాప్తమునకన్న నెచ్చు కాకపోయినను, ఆయలంతిలోనే అధికభాగము గ్రంథకోశ సంపాదనార్థము వ్యయిత మాటచేతను, కథాసరిత్సాగర కింకిణ్యాది గ్రంథ ముద్రణకారణమునను, జీవితప్రథమ దశలోనే అప్పులైనవి. నిజగ్రంథములు పాఠ్యములగుట అరుదగుట సరికదా, పరీక్షక పారితోషిక సర్వస్వము మూఁడువేలరూపాయలు ఆర్బత్తునేటు మునకలో వారు గోల్పోయిరి.

25 సంవత్సరములు కొలువుచేసినను విరామవేతనము లేకపోఁగా, దానిని మానుకొని ముద్రణవ్యాపారమున నష్టములు తీర్చుకొన నెంచిరి. కాని అదియు సాధ్యపడదయ్యెను. పెక్కుమాఱులు అచ్చుయంత్రమును కొనుటయు విక్రయించుటయు సంభవించెను. ఈవర్తకమున తత్పుత్రుఁడు వేంకటరమణయ్యగారు (రాజన్న) మొదట సహాయపడి, పిమ్మట అపారధనము కొల్లపెట్టి దానిని నష్టభాజన మొనర్చెను. ఆంధ్రపత్రిక పోటి, ఐరోపాయుద్ధము ఇత్యాది కారణములవలన అప్పులు తలమునకలై వారు 16 వేలు చేయు అచ్చుకూటమును తక్కువవెలకు అమ్మి తీర్చి శేషమును గృహిణి స్నుషా పౌత్త్రి ధార్యమాణ కాంచనమయ లేశములు విక్రయించి తీర్చుకొన వలసివచ్చెను. 1915 వ సంవత్సరము నెల్లూరు చేరి తన్ను రసజ్ఞశేఖరా అని పిలుచువారును, విద్వద్రసజ్ఞప్రభువులును తనకు పూర్వము రెండువేలరూపాయలు కథాసరిత్సాగర ప్రతాపరుద్రీయ ముద్రణపారితోషిక మిచ్చినవారును అగు శ్రీ వేంకటగిరి మహారాజు గారికి తమ వృత్తాంతమెల్ల లేఖామూలమున విన్నవించికొని వృద్ధిరహితముగ నైదువేలు అప్పుగైకొని తమవర్తకమును చక్కఁబెట్టుకొనిరి, క్రమముగ ఋణము తీర్చిరి.

అట్టి సమయమున 1916 లో మదరాసులో సూర్యరాయాంధ్రనిఘంటువునకు శాస్త్రిలవారు ప్రధానసంపాదకులుగ ఆంధ్రసాహిత్య పరిషన్నియుక్తులైరి. అప్పుడు వారి మాసవేతనము రు 250 లు. నిఘంటునిర్మాణసరణిఁ గూర్చి తమ యభిప్రాయములను "సూర్యరాయాంధ్రనిఘంటు నియమ కతిపయములు" అని యొక చిన్నపుస్తకము వ్రాసి ముద్రించిరి. కిట్టనివారు కొందఱు అసూయాపరులు తత్పదము శాస్త్రిలవారు మానునట్టి వ్యూహముగా నిఘంటు కార్యస్థానమును పిఠాపురమునకు మార్పించిరి. "నిన్న సాయంకాలము ఆంధ్రసాహిత్య పరిషత్తువారిసభ కూడినది. అందులో తీర్మానమయిన విషయములు, పరిషత్తులో నిఘంటు నిర్మాణసభ లోపముచే కార్యము జరుగలేదుకాని ప్రధాన సంపాదకుని లోపముచేఁ గాదనియు నిఘంటు కార్యాలయము కాకినాడకేని పిఠాపురమునకేని మార్పవలయుననియు డిసెంబరాఖరునకు మార్చునట్లుగాను తీర్మానములయినవి. (4-11-17 రెడ్డిలేఖ) రేపటినుండి పనికి పోవలసినదిలేదు —— గారు నిజాభిమతసిద్ధికి మిక్కిలి హృష్టులైయున్నారు." (7-11-17 రెడ్డిలేఖ) అని శాస్త్రిలవారు వ్రాసియున్నారు. పిఠాపురమునకు మార్చుటచేతనే కావలయు ఈపదునేడేండ్లలో సూర్యరాయాంధ్రనిఘంటు నిట్లు సంపూర్ణమై వెలసినది! మఱల 'స్వతంత్రులై' వేంకటరాయశాస్త్రిలవారు ఆముక్తమాల్యదా వ్యాఖ్యానోపోద్ఘాతములు పరిసమాప్తిచేయఁ బూనిరి. విమర్శవినోదము (1920) తిక్కనవిజయము (1920) ఉత్తరరామచరిత్రము (1920) రత్నావళీ విక్రమోర్వశీయములును (1921), అప్పుడప్పుడు రచియించిరి.

1919 వ సంవత్సరము జూన్ 7,8 తేదులలో ఆంధ్రసాహిత్య పరిషదష్టమవార్షికోత్సవము నెల్లూరున జరిగినపుడు వేంకటరాయశాస్త్రిలవారు అధ్యక్షులుగా నుండిరి. శాస్త్రిలవారికి మహామహోపాధ్యాయ బిరుదము నొసంగఁదగు నని ఆసభవారు శ్రీ చక్రవర్తి ప్రతినిధిగారికి విజ్ఞాపనాపత్రమును మహాజనచోదితమును పంపిరి. అది నెఱవేఱలేదు గాని 1920లో మదరాసులో నాంధ్రమహాసభవారు సమావిష్టులై 1116 రూపాయల సంభావనతోడ శాస్త్రిలవారికి 'మహోపాధ్యాయ' బిరుదము సర్పించిరి. అందు వారొనర్చిన యుపన్యాసము తజ్జీవిత చరిత్ర రచనమునకు ఒక యమూల్యాకరము, బహుస్థలముల నీదు దానినుండి ఉద్ధారములు కలవు. శాస్త్రిలవారి యప్పుసొప్పులు తీరినవి.

ఇట్లుండఁగా 1922 జనవరి తే 14 ది నాఁడు ఇండియాను చిత్తగించుటకై వేల్సుయువరాజుగారు వచ్చినపుడు మదరాసు యూనివర్సిటీ వారి వేఁడుకోలుపై వారు దక్షిణదేశపండితుల సత్కరింప నియ్యకొనిరి. "దానికి ఖిల్లత్ ఇత్తురని వ్యవహారము. అందులకు ఆంధ్రమునకు నన్ను మొదటివానిఁగా నియమించుకొని నాయంగీకారము నీదినమే పడసినారు. ఈసభ జనవరి తే 14 ది జరుగును." (20-12-27) రెడ్డిలేఖ. ఆ "ముసళ్ళపండుగ"లో రత్నోజ్జ్వల సౌవర్ణవలయంబును, జోడుశాలువులును శాస్త్రులవారి కొసంగఁబడినవి. ఈ శుభసంతోషసమయమందు శాస్త్రులవారు "5 నూత్న నాటకములకు కథాంకసరణి నేర్పఱుచుకొంటిని." అని వ్రాసినారు. అవి సంపూర్ణనాటకములు గామికి రెండు ముఖ్యకారణములు కలవు (1) నెల్లూరిలో ఇల్లు గొని అధమర్ణతాదుఃఖభాజనులౌట (2) ఆయుక్తమూల్యనా ముద్రణక్లేశమునఁ గుంగుట సుం.

శ్రీ వేంకటరాయశాస్త్రులవారికి 1915 వ సంవత్సరమునుండియు నెల్లూరిలో నివసించు తలంపు కలదు. వారి జాబులలో అందుకు పెక్కుకారణములు విశదపడుచున్నవి. "ఆయుశ్శేషము స్వల్పమైనను, ఆస్వల్పంబును అవిదితపరిమాణంబును అనియతంబును అయినను, దానికే ఇక్కడికన్న (మదరాసుకన్న) అక్కడ (నెల్లూరఁ) బెక్కుకారణములచేత తక్కువశ్రమతో గడుపవచ్చునని నాయభిలాష కలదు. ఆప్తదర్శనము, తదీయసామీప్యము, తద్గోష్ఠి, అకృత్రిమపదార్థ భోజనము, పరిశుద్ధవాయువు, నాతమ్ముల నైకట్యము, ఇత్యాదిగుణములు అచటినివాసముచే పెక్కులు కలుగును. (రెడ్డిలేఖ). "నెల్లూరిలో మానాయనగారు, కుమారుఁడు, అమ్మగారును స్వర్గస్థులైనారు. కనుక నెల్లూరి నాకు స్వస్థలము." (5-3-29) "నెల్లూర నివాస మపేక్షించుటకు రెండు మూఁడు ప్రయోజనములు కలవు,- ౧. లక్షణకశ్మలమును తొలంచి సాధులక్షణ ప్రతిష్ఠాపనము, ౨. ఆంధ్రగీర్వాణ కావ్యనాటక ప్రవచనమున లఘుమార్గ నిర్మాణము, 3. ఏతత్సిద్ధ్యర్థమై బడి (విద్యాలయము, కాలేజి) పెట్టుట. ఈయుద్యమము నెఱవేఱుట మంచిదే. నెఱవేఱమి భావికాలములో నెల్లూరికిని ఆంధ్రభాషకును ఆంధ్రగౌరవమునకును లోపమే. ఈశ్వరసంకల్పము లేక ఏదియు జరుగదు. ఈయుద్యమములు నెఱవేఱిన ఆంధ్రభాషకు లక్షణసేతువు, లక్ష్యసేతువు- తిక్కన భారతము జనించినచోటనే జనించి యొక నిర్ధారణకు వచ్చును. దేశమునకెల్ల ఆదేశమగును. ఈ ప్రయోజనములకై ఇది ఇప్పటి లక్షణవిప్లవములో మంచికాలము." (13-11-20) మఱియొక కారణము ఆంధ్రభాషాభిమాని "సేవ". ఇది తద్భారతీసేవకు రెండవది ఇత్యాది బహువిధ కారణముల వలన నెల్లూర నివసింప శాస్త్రులవారు తలంపుఁగొనిరి. 23-4-21 మొదలు ప్రతిలేఖలోను గృహక్రయ ప్రస్తావము కలదు. గృహక్రయధనమును నెల్లూరిలో కొందఱుమిత్రులు తమకు వాగ్దానము చేసిరని జాబులలో కలదు. తదనుసారముగా రు 4600 లకు నెల్లూరు రంగనాయకులపేటలో నొక యింటిని కొనిరి. 4. ఆగష్టు 1922 శ్రీమాన్ శఠగోప రామానుజాచార్యులనువారికి రు 5000 లకు అప్పుపత్రము వ్రాసియిచ్చిరి. ఆయిల్లు అంత వెలచేయకపోయినను, అనుభవముచాలకయు, సమయముతప్పిన నేదియు రాదేమో అను నుద్వేగముతోను, కొందఱు మిత్రబుద్ధుల యుపదేశములవలనను, దానిని మెడఁగట్టుకొనిరి. ఆవాగ్దానముచేసిన మిత్రులు ధనప్రదానము విషయమున నుపేక్షచేయఁగా, అలవిగానియప్పు మైఁబడఁగా ఎవరెవరు ఎంతెంత పారితోషిక మొసంగినను అధనమునెల్ల ఆగృహాభాసమును వాసయోగ్య మొనర్చుకొనుటకై వ్యయించి వర్ణనాతీతక్లేశపాత్రులౌట ఇఁకమీఁద. ఎట్టకేలకు శాస్త్రులవారు నెల్లూరిలో స్వగృహమున

ప్రవేశించి తచ్చిరాభీష్టసాఫల్యమునఁ దనిసిరి. అచట శాస్త్రులవారు తదుద్దిష్టములలో నొండగు బడిపెట్టిరి. అందు రెండు తరగతులు. శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారును, నెల్లూరు ఏ. బి. యం. గరల్సు హైస్కూలులో నాంధ్రపండితులు, ఆంధ్ర లక్ష్యలక్షణ పారగులు, బ్ర. శ్రీ. కైపా సుబ్రహ్మణ్యశర్మ గారును పెద్దయుద్దిగ అనర్ఘరాఘవ సాహిత్యదర్పణ కువలయానందాది బహుసంస్కృత గ్రంథములను చదివిరి. చిన్నతరగతి విద్యార్థులలో—శతూర్వార్వము ఏఁడేండ్లనుండి శ్రీ శాస్త్రిగురుచరణముల నపరికపచుగా “ఏకలవ్య మర్యాదను” గొలుచుచుండినవాఁడను నే నొకఁడనై వారిమనసునకెక్కి—ఆమరణాంతము తద్వాత్సల్యభాగ్యము వడసితిని. నా సతీర్థ్యులు,—శ్రీయుత యోరుఁగంటి వేంకటకృష్ణయ్యగారు (ఇప్పుడు నెల్లూరిలో న్యాయవాదులు, నందనారునాటకకర్తలు,) శ్రీమోరుఁగంటి వేంకటేశ్వర శర్మగారును, (పిమ్మట కాశీవిద్యాపీఠమున వద్ధ్యయనములు చదివి “శాస్త్రి” పట్టవిరాజితుఁడై, హిందీలో “మానసికతత్త్వశాస్త్రము” అను నొండు మహాగ్రంథము రచియించెను,) శ్రీయుత బిరదవోలు చెంచు సుబ్రహ్మణ్యముగారు బి. ఏ., (ప్రస్తుతము మదరాసులో అకౌంటెంటు జనరల్ కచ్చేరిలో నుద్యోగమున నున్నాఁడు) మున్నగువారు. రెండేండ్లమాత్రమె శాస్త్రులవారియింటియందు తిన్నెపై ప్రతిసాయంకాలమును ఈబడిజరిగెను. ఇట్టివిద్యాశాలలు, ఇట్టి యుపాధ్యాయులును వేనవేలున్నచో భాషాదేవి మతియెంత ప్రసన్నురాలై యుండునో కదా.

1922 వ సంవత్సరమున శాస్త్రులవారికి ఒక యఖండగౌరవము జరిగినది. ద్వారకాపీఠ శంకర భగవత్పాదులు నెల్లూరున గొప్పదర్బారుచేయించి అందు శాస్త్రులవారికి సర్వతంత్ర స్వతంత్ర, మహామహోపాధ్యాయ, విద్యాదాన వ్రతమహోదధి అనుబిరుదముల నొసంగి వారి “ఋణములఁ దీర్చుటకును శాశ్వతముగా పుత్త్రపౌత్త్రపారంపర్యముగా నెలకు రు 150 లు పారితోషికము ఆవరము ఇచ్చునట్లు ఖరారుచేసి ముద్రించి నెల్లూరు పౌరసౌధములో దర్బారుగావించి ప్రకటించిరి. ” (భాగ) అది విక్రమసింహపుర చరిత్రమున మహోన్నతదివసము. ఆంధ్రకవులలో సర్వతంత్రస్వతంత్ర బిరుదము వడయఁగన్న ధన్యులు శ్రీ వేంకటరాయశాస్త్రులవారు ఒక్కరే. తమఋణములుతీరి ఆయుశ్శేషమును బహుగ్రంథకరణమున సఫలీకరింపఁ దలఁచి శాస్త్రులవారు సంతసిల్లిరి. కాని దుర్దైవవశమున మఠాధిపతి 1922 లో ఆలీసోదరులతోడ అసహాయోద్యమమున కారావాసపాత్రులై పిమ్మట పెక్కుచిక్కులపాలైనందున ఆయీవి కొన్నినెలలలోనే నిలిచిపోయినది. “వారిచ్చిన యాకొన్నినెలల సైకమును ఆదినములలో నాకును, నా కుమారునకును వచ్చినవ్యాధులకుమలకు ఇంటిని నివాసయోగ్యము కావించుకొనుటకును వ్యయితమై పోయినది. ” (భాగ).

తర్వాతి చరిత్రము, 1922-1929 మధ్యకాలపుది, శాస్త్రులవారి జీవితములో అత్యంతకష్టభాజనము. శ్రీనాథుని చరమదశ వంటిది. ఈ కాలమున, తజ్జీవితాంతరిక్షమున వైశసకాలాభ్రసమావృతమున అప్పుడప్పుడు ఒక యాశాతటిల్లత మెఱసి మిఱుమిట్లుగొల్పి. అంతలో మాయమయ్యెను. మఱల నంతలో సర్వము క్లేశాంధకారమయమై అతర్కితోపనత ఘోర విశసాశనిపాతముల మహాభీకరమై యుండెను. మొదటి పిడుగుపాటు 1922 డిసెంబరులో తదీయైకాపత్యము నలువదేండ్ల కుమారుఁడు కాలధర్మ మొందుటయు, తత్సంతతి శిశువులు ఏవురు తదేకపోష్యులగుటయు, జరారుగ్ణతాపీడితులై దినదినమును కృశించుచు, కుటుంబభరణము దుర్భరము కాఁగా ఇంట నిలువలేక, మిత్త్రకతిపయ ప్రేరి

తులై గద్వాల సంస్థాన ప్రభువుగారి విద్వత్సంభావన ఆశించి పోయి తే 24 ఫిబ్రవరి 1923 వారిని దర్శించిరి. 11-3-24 గద్వాలనుండి శ్రీయేనాదిరెడ్డిగారికి వ్రాసిన యీలేఖార్థములు తద్వృత్తాంతమును విశదము చేయుచున్నవి. "ఇది వనవాసము కాదు. మనవాసము. ప్రభువు దొడ్డవారే. ఆసన్నవర్తు లందఱును అత్యంతము మిత్రులైనారు. వైష్ణవపండితు లందఱును, వారల పుత్త్ర శిష్యాదులందఱును అత్యంతము ప్రియమిత్రులైనారు. బ్రాహ్మణేతరులయిన ప్రభుసన్నిధానవర్తి రసజ్ఞకవిపండితులందఱును శిష్యులే అయినారు. అందఱును నాకు ఎంతటి గొప్ప సమ్మానము జరిగినను జరగునుగాక, అని కోరువారే. ఇట్టి ఈ సంవిధానమాత్రమునకై దుఃఖపడువారు వైదేశికులు, వారిని ఇక్కడ ఎవరును సరకుగొనకున్నారు. శ్రీ. శ్రీ. ప్రభువుగారు ఆయాగంతకుల కవనదోషములను దోషములనుగా నాచేత నిర్ధారణచేసికొనుచున్నారు. ఈవిధమున నిట నాకొక జడ్జిపదము తనంతట కలిగియున్నది." శాస్త్రులవారికి "దొడ్డ ప్రభువుగారు" శ్రీ. శ్రీ సీతారామ భూపాలరావు బహద్దరుగారు తోడా జోడుశాలువులు రు 600 లు నొసంగిరి. పూర్వప్రస్తావిత వైష్ణవపండితులు నాటకాదులందు పెక్కుసంశయములఁ దీర్చుకొని అత్యానందభరితులై "స్మార్తులకు మే మెన్నఁడును నమస్కరింపలేదు. ఇదిగో సరస్వత్యంశ సంభవులకు మీకు నమస్కరించుచున్నారము!" (యుగంధర 23-6-29)అని నమస్కరించిరి. తదాస్థాన పండితాగ్రేసరులు శ్రీమాన్ ఫల్లగుమ్మి వేంకటాచార్యులవారు శాస్త్రులవారిని

"ఈదృ గధీతీ శాస్త్రే గైర్వాణ గ్రంథజాలే చ
ఆన్ధ్రగ్రన్థేషు తథా నహి దృష్టః శ్రుతచరో వాఽపి"

అని శ్లాఘించిరి. వేంకటరాయశాస్త్రులవారు గద్వాల సంభావనా ధనముతో "నెల్లూరివారు నాశము చేసిన యింటిని బాగుచేయించుకొంటిని" (భాగ) అని వ్రాసిరి. పిమ్మట కుటుంబమును పోషింప దారిగానకయు, ఆముక్తమాల్యద 'ఇంటిలోనిపాము వలె ముద్రణదంశము' నిచ్చుచుండుటయు, మదరాసులో గృహవిక్రయము సాధ్యపడకపోవుటయు- ఇంటిపై యప్పు ముప్పుపైముప్పుగా బాధించుటయు, నిరంతర చిత్తవ్యథచే ననారోగ్యము పైకొనుటయు, ఏతాదృశ కారణపరంపరలచే ఇతికర్తవ్యతాజడులై యుద్విగ్నాంధకారమున మునిఁగియున్న కాలమున మఱల నొకప్రత్యాశావిద్యుల్లతిక పొడసూపెను. పూర్వము దర్బారులో ధనమునిచ్చెదమని వాగ్దానము చేసిన స్వాములవారు పూరి (జగన్నాథ) శంకరమఠాధిపతియై శాస్త్రులవారి కష్టములు తీర్చెదమని ప్రతిశ్రుతిచేసి అయర్థముగల శ్రీముఖము ననుగ్రహించి పూరికి ఆహ్వానముచేసిరి. అది జరుగుననుప్రత్యయము చేతను మిత్రకతిపయ ప్రోత్సాహమునను, ఋణములు తీరునని నమ్మి, వ్యాధిగ్రస్తులై యుండియు, "స్వాములవారి సంస్థానములోనే వైద్యముకూడ జరుగునుగదా" అని సాహసించి 1925 డిసెంబరు నెలలో స్వాములవారికడకు పోయిరి. కాని వారిప్రతిశ్రుతి ఏదియు జరుగలేదు. చేత ధనములేక, శాస్త్రులవారిశిష్యశ్రేష్ఠులు శ్రీ గుఱ్ఱము వేంకట సుబ్బరామయ్య ఎం. ఏ. గారు నెల్లూరినుండి పంపిన యేఁబదిరూప్యములతో బయలుదేరి దారిలో విశాఖపట్టణములో శ్రీ.శ్రీ.శ్రీ. విక్రమదేవవర్మ పండితప్రభువులును, తమ శిష్యుఁడగు శ్రీ నంబూరి తిరునారాయణస్వామి బి.ఏ.గారి పుత్త్రుఁడు మెడికల్ కాలేజి ప్రొఫెసరు, అలగిసింగరిగారును అత్యంతము తమ్ము సత్కరించి నూటపదార్లిచ్చిపంపఁగా మఱల నెల్లూరుచేరఁగాంచిరి. ఈయాశ నిరాశయ్యైనది. "పూరికిం బోయి పూరియే కఱచివచ్చితిని."

మఱి, ఋణవిముక్త్యుపాయము ఆముక్తమాల్యదాముద్రణమే యని శాస్త్రిలవారు నమ్మిరి. అది ప్రకటితమైనచోఁ జేసేత వెలపోయి తమకు అపారధనము ప్రాపవగునని వారిదృఢవిశ్వాసము. ఆముక్త అప్పటికే కొంత ముద్రితమైనది. ధనాభావముచే శాస్త్రిలవారు శేషము ముద్రింపలేకయుండఁగా తత్పూర్వార్ధము శ్రీయుత యెఱ్ఱబోలు రామచంద్రారెడ్డిగారు రు 2500 లు విరాళ మొసంగిరని పూర్వోక్తముకదా. ఆవదాన్యశేఖరు లొసంగిన ధనములో, శాస్త్రిలవారి యనారోగ్యదశలో, నేత్రామయావస్థలో, ఆషాఢభూత్యవతారమూర్తులు ముగ్గురు ప్రతారకులు విశేషభాగము హరించిరి. శాస్త్రిలవారు దిగులున క్రుంగిపోయిరి. "ఏతన్నిమిత్తమై కీర్తికాములై నాకు ధనమిచ్చినరెడ్డిగారి కేమి బదులు చెప్పుదును? ... ఈపుస్తకముచే ఋణముందీర్చుకొని బ్రదుకుదునని తలంచి... రేయనక పగలనక దినమెల్ల వ్యాఖ్యానరచనాక్లేశమే యగునట్లు పదియేండ్లు పాటుపడి తుదకు దానిని దొంగలపాలు గావించుకొంటిని. ఈదిగులుచేత అన్నములేదు. నిరంతరము దుఃఖాబ్ధితరంగములచే హతులొందుచు మునుంగుచు ఊపిరి సలుపక యుక్కిరిబిక్కిరి యగుచు ఏఁడియలో గుండియవ్రీలి మరణముం బొందునో యని డెందమున నాందోళనముచే కొందలించుచు వేళ యెదురుచూచుచున్నాను. ...హా ఆంధ్రభాషాభిమానీ! హా ఆంధ్రదేశమా! ...ఆంధ్రవిద్యకును ఆంధ్రనాటకములకును ఆంధ్రకవనమునకును ఆంధ్రభాషాభిమానికిని నమస్కారములు (రెడ్డిలేఖ. 22-10-26). "రసజ్ఞశేఖరా, కలాప్రపూర్ణా యని దొరలు పేర్కొన్నవాని యాత మిట్లగుచున్నది." ఎట్లెటులో 1927 జూలైలో ఆముక్తమాల్యద ముద్రితమై బయటపడినది. దీనివలన తమయప్పుతీరి కనకాభిషేక మగునని కొనుచుండిరి గదా శాస్త్రిలవారు. భగ్నాశులైరి. 13-3-28 లో వారునాకు వ్రాసినజాబులోని యీపద్యత్రయము వినుండు.-

" హరిహరులు నన్ను వదలిరి
నరులా నను బ్రోతురింక? నా పొత్తములం
గరము కరుణఁ గైకొన్నా
ర రిదిగ న న్నేమిపైక మడుగక యె ధనుల్.

"నూఱుపుస్తకముల నూర్వురకిచ్చితి
నందుఁ బోష్టుకె వ్యయంబు నాకు
హెచ్చుగాదు డెబ్బదే రూప్యములు గాన,
నూటివెల యెనిమిదినూర్లు నష్టి.

" అయిదువేలు పట్టె నచ్చువేయింపఁగా
నందు రెండువేల కప్పుపడితి
దానిఁ దీర్పలేక తంటాలనున్నాఁడ,
శర్వుఁడొకఁడె నాకు శరణమింక. "

"I am Bhartrihari's Khalvata!" అముక్తమాల్యదాదేవి ధనము ప్రసాదింపకపోయెం గాని యనన్యాదృశ పాండిత్యకీర్తి ప్రసాదించినది. శాస్త్రిలవారి సంజీవనీ వ్యాఖ్యయు నుపోద్ఘాతమును వైదుష్యమునకుఁ దలపాలనులు. ఆముక్తప్రికట్రికమైన సంవత్సరమె 5-12-27 బెజవాడలో నాంధ్రవిశ్వకళాపరిషత్తువారు (Andhra university) శాస్త్రిలవారికి "కళాప్రపూర్ణ" బిరుదము సర్పించిరి. ఇది డాక్టరేటునకు ఆంధ్రరూపము. కాని, అథమర్ణతా కాలమేఘములు నలువలంకుల ముంచుకొనిపోవుచుండఁ గళాప్రపూర్ణుఁ డెట్లు భాసిల్లి లోకమును స్వచంద్రికా విస్ఫూరణమున నానందమున నోలలాడింపఁ జాలును? వట్టిబిరుదములపై యాస లేదు. వచ్చిన కీర్తి వానిచేఁ గాదు. వారిహృదయ మిట్లు సంతాపించుచున్నది,—

అప్పుతీర్చి, యాత్మ యాత్మలో నిలయుంచి
మూఁడవస్థలందు మోహ మడిపి
సచ్చిదాదులందు సాక్షాత్స్వరూపతఁ
బరగ నాసమాధి భాగ్య మెపుడొ? (రెడ్డిలేఖ 19-12-28.)

ఆయప్పు రు 7500 లు. ఉత్తమర్ణుల హెచ్చరికలు దినదినము. ఒకజాబులో "నాకు సివిల్ జయిలే గతి గావలయు!" అని శాస్త్రిలవారు కృంగిపోయిరి. "నే నథమర్ణతచే నరకమునఁ గూలుదు నేమో!" అని భయవిహ్వలు లైరి. అంతలో "అప్పుతీరును, నామిత్రులు నన్ను విడువరు" అనిధైర్యముండిరి.

"ఆ పుణ్యదినము మిత్రమ
యెప్పుడొ వచ్చునందె నాకు నిపుడె సిరికృపన్
శ్రీపతి కరుణావశమున
బ్రాపించుత బహుళజన్మ ఫలభరితముగన్."

(11-9-28) అని సమసుఖ దుఃఖభాగులగు శ్రీయేనాదిరెడ్డిగారికి వ్రాసిరి.

వాస్తవముగా "సిరికృపన్" "శ్రీపతికరుణావశమున" తప్పక శాస్త్రిలవారి "బహుళజన్మ ఫలభరితముగ" నే, ఆ "పుణ్యదినము." 27 డిసంబరు 1928, ప్రాపించినది. శ్రీగునుపాటి యేనాదిరెడ్డిగారు- శాస్త్రిభక్తకోటిలో నగ్రేసరుఁడు, ముప్పదేండ్లు గురువులకు కుటుంబ పర్యాప్తధాన్య దక్షిణ నొసంగిన ధన్యుఁడు, రసజ్ఞజీవనపరాయణుఁడు— ఏతద్గురుకార్య ధురంధరుఁ డయ్యెను. సౌజన్యపరమావధి, వదాన్యశేఖరుఁడు, విద్వచ్చింతామణి, మదరాసులో శాసనసభాధ్యక్షపట్టభద్రుఁడు, శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారును, సౌజన్యనిధి భాషాభిమాన ధురంధరుఁడు శ్రీ బెజవాడ చంద్రశేఖరరెడ్డిగారును అత్యంతము శ్రద్ధాళువులై యుద్యమించి నెల్లూరిమండలమున రెడ్డిదొరలనెల్లఁ జూచి, వారు ఉదారముగా నొసంగిన రు 9688 లతో

"కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారి నిధి"

నెలకొల్పి, శాస్త్రిలవారి యప్పులు తీర్చిరి. ఆమహాపురుషుని రక్షించిరి. తాము ను మహత్తర సుకృతము పడసిరి. సహాయముచేసిన వదాన్యమహాశయులకెల్ల నాంధ్రలోకము కృతజ్ఞతాబద్ధము. కళాప్రపూర్ణుఁడు అధమర్ణతా గ్రహబంధన విముక్తుఁడై అత్యంతము విరాజిల్లినాఁడు.

## కృతజ్ఞతావిష్కరణము

—:0:—

“ మీరు నాకు మహోపకారము గావించినారని నేను వచింతు నేని మీరు ఆమాట నన్ను చెప్పనీయకయున్నారు. కావున నా యభీష్టమును నేన ప్రత్యేకవిధమునఁ గావించెదను. ఎట్లన నేనొక యొజ్జను. ఆకారణంబున మీకై ఇహపరసాధకమయిన యొకయుద్యమముం బూనఁదలంచి యున్నాఁడ.—ధర్మార్థకామమోక్షములు అను నాల్గు పురుషార్థములలో తుదదానికై పరమేశ్వరుఁడు పురుషమాత్రునెల్ల సృజించియున్నాఁడు. ఇతరములు ఏమి సాధించినను మాయ మాత్రమే గాని అందు సత్యములేదు. కావున ఆపురుషార్థమును నే నలవఱచుకొనుటకును మీకును అలవఱచుటకును భగవద్గీతను సర్వజనవేద్య మగునట్లుగా మీకై యాంధ్రీకరించి చిత్తశాంతి గావించుకొనఁ దలంపు పూనియున్నాఁడ...బహుకాల జిజ్ఞాసకు ఫలముగా నిన్నటిదినము నాబుద్ధికి ఇది దోఁచినది... నాచేత నిర్విఘ్నముగా ఈకృత్యమును చేయింప పరమాత్ముఁడు ప్రసన్నుఁ డగునుగాక.

“ విరచిష్యమాణ వరయాంధ్ర శ్రీమద్గీతను నా మిత్రులయిన రెడ్డిపంచకమునకు (అనఁగా, ౧. బెజవాడ రామచంద్రారెడ్డి, ౨. బెజవాడ చంద్రశేఖరరెడ్డి 3 గనపాటి యేనాదిరెడ్డి, ౪. పాణకా వీరరెడ్డి, ౫. దొడ్ల రామిరెడ్డి అనువారలకు) వ్రాసుకొనం గోరిక కలదు. (రెడ్డిలేఖ 30-5-29.)” కాని పరమాత్ముఁడు ఏతత్కార్యమును జేయింపఁ బ్రసన్నుఁడు కాలేదు.

## అస్తమయము

—:0:—

ఈలేఖకు పిమ్మట ఏనాదిరెడ్డిగారికి వారు వ్రాసిన లేఖలు రెండు మాత్రమే కలవు. అందు కడపటిది 4-6-29 వ్రాసినది. అందు తద్ద్వితీయ పౌత్రుని యుపనయనప్రస్తావము కలదు. పిమ్మట 9-6-29 జ్యేష్ఠపౌత్రుని లేఖలో “ తాతగారు మూఁడుదినములుగా మిక్కిలి జబ్బుగా నున్నారు. దేనికిఁగాని వారు సరిగా ఉత్తరమిచ్చుటలేదు. ఉపనయనము జూన్, తే 17 ది నిశ్చితమైనది! ” అని యున్నది. పిమ్మట 11-6-29 “ తాతగారు బొత్తుగా ఒడలు తెలియని స్థితిలో నున్నారు. ” 14 వ తేది ఉపనయనాహ్వాన శుభలేఖ! 18-6-29—ఉపనయనము జరుగవలసిననాఁటి మఱునాఁడు— “ ఈదినము తాతగారు కాలముచేసినారు. ” ఇట్లు ఆంధ్రప్రపంచమున చిరకాలము స్వప్రతిభాచంద్రికలు కాయించి మహానందము వెల్లివొడిపించుచుండిన కళాప్రపూర్ణుఁడు (శా, శ. 1851 శుక్లసం. జ్యేష్ఠ శుక్లద్వాదశి భౌమవాసరము సూర్యోదయమున) అస్తమించినాఁడు. అయినను ఆశ్చర్యకరముగ తత్కళావిష్కృతి

సాంద్రయశశ్చంద్రికలు ఎప్పటివలెనే గాఢతమోదూరీకరములై ఆంధ్రలోకమునకెల్ల శాశ్వతజ్యోత్స్న కా విలాసకరములై, నిరంతరాహ్లాదమును గూర్చుచున్నవి.

## తదుద్దిష్టములు.

—:o:—

### (i) గ్రంథములు.

(1) " ఈభాషకు సమగ్రమైనవ్యాకరణము లేదు. (2) అట్టి యలంకారశాస్త్రము ను లేదు " (ఆంధ్ర సాహిత్యదర్పణముచే నీకొంత ఇప్పుడు తీరినది.) (3) ‚‚మన్మద్రిత గైర్వాణ ప్రియదర్శికా నాటక ముద్రణమార్గమున సంస్కృత నాటకములను పెక్కింటిని—శాకుంతల మాలతీమాధవ మహా వీరచరి తోత్తరరామ చరిత్రాదులును —మూలవిరుద్ధార్థముగా నాంధ్రీకృతములై యున్నట్టివానిని— వాస్తవార్థబోధకములుగా, వ్యాఖ్యాసమేతముగా ప్రకటింపవలసియున్నది. (4) వ్యుత్పత్తులాసం గునట్టి నిఘంటువొకటి నిర్మింపవలసి యున్నది. (5) శ్రీమదాంధ్రభాగవతమును సాధుపాఠనిర్ణయపూ ర్వకముగాను, గూఢార్థబోధన పూర్వకముగాను, ప్రకటింపవలసి యున్నది. (6) ఇంకను ఎల్లవారికి బఠనీయముగా, సకలనాటక కథావళి రచింపవలసి యున్నది. (7) శిశుపాలవధాది కావ్యములను సంస్కృతవ్యాఖ్యా నాంధ్రపదటీకా సమేతముగా ముద్రింపవలయును. (8) అమర కోశమునకు ఆంధ్ర గీర్వాణమయమైన సుబోధ వ్యాఖ్య రచింపవలయును. (9) కాశీఖండ సోమహరివంశ పాండురంగమా హాత్మ్యాది దివ్యప్రబంధములను విషమపదటీకలతో సుముద్రితములం జేయవలయును. ఇత్యాది కృత్యము లెన్నియో......గలవు. [ముందుగా కాదంబరి నాంధ్రీకరించెద]...ఆయుశ్శేషమును వీనిచే సఫలీక రించుకొనుట యొప్పును.'' [1915, వేం. రాజలేఖ] మఱియు, ‚‚ నృసింహపురాణము రాఘవ పాండవీ యము, కళాపూర్ణోదయము, పాండురంగ మాహాత్మ్యము, నాచేత శోధితములు, నాకడ నున్నవి. పున ర్ముద్రణము సమయమునకు పనికివచ్చును. ఇవన్నియు సార్థకములగునట్లు ఒకమార్గము పన్నవలయు. నాసవరణలు అచ్చుపడుంగాక. నావలన అట్టి సేవ జరిగినదిగాక యని లోకమునకు విదితముకావల యును. " (రెడ్డిలేఖ. 23-4-29.) ఇవిగాక కథాంకసరణి రచించుకొని పూర్తిచేయ వీలుకాకపోయిన నాటకములు కలవు. పూర్వోక్త భగవద్గీతాంధ్రీకరణము, మృచ్ఛకటీ స్వప్నవాసదత్తల యాంధ్రీకరణ ము. మత్ప్రార్థనమై తమరరీకృతము ఆత్మచరిత్ర (Auto-biography) రచనమును. " భాగధేయము" ఇట్టి ప్రారంభమునకు ఉపలక్షణము, 1929 కడపట రచితము.) ఇట్టివి ఎన్నెని నెఱవేఱవలసినవి కలవు. ఆధమర్ణతా దుఃఖ సమావృతము కానిచో ఆ యేడేండ్లకాలములో ఇందు అనేకములు చేసియుందురు. అవి పూర్తికాకపోవుటకు కారణములు ఈకాలమును, ఈదేశమును.

### (ii) పత్త్రిక.

13-11-20 లేఖలో పత్త్రికాప్రస్తావము కలదు. " గ్రామ్యవాఙ్మయమును తలంద్రొక్కుట వాగ్దేవతారాధనముగదా. ఆకార్యమును కీర్తికాములయిన పుణ్యాత్ములు చేయవలెను. వారికి సకలజన్మ ములందును వాక్సిద్ధికల్గునట్లు శారద వరమిచ్చును. ఏతద్విషయమై ఒకపత్త్రిక వలయును. దానికి బలీయమైన పోషణ వలయును. ప్రాణము సరకుగొనక పోరాడి తిక్కనాదులశారదకు జయము తేవ

లయును. ...నామతము సాధువని మీకుం దోచెనేని ఈదురమందు పోరుటకు నే నొక సిపాయినిగా లేచెదను. పత్త్రిక నెఱపుటకు అందు ఇతరవిషయములను అభివర్ణనీయములు పెక్కులు ఉండవలయును. (1) సంస్కృతనాటకములకు ప్రతిపదటీక. (2.) ఆంధ్రకావ్యములకు పరిశుద్ధ ముద్రణములును, టీకలును (3). నిరంతర గ్రామ్యవాఙ్మయనిరాస వాదములు (4.) పాఠశాలలందు పఠనీయముగా నిర్ణీతములయిన పాఠ పుస్తకముల దోషోద్ఘాటనము. (5.) ఆధునిక వాఙ్మయమునందలి యవలక్షణములు — నవలలు లోనగువానిలోనివి — ఇట్టివానికెల్ల ముట్టడి సేయవలయును. ఇంకను చిల్లర విషయము లేవేని యుండవచ్చును. రాజకీయ వ్యవహారముతో పనిలేదు. దేశక్షేమకరములయిన వ్యాసములు ఉండవచ్చును. ఇందులకు ప్రత్యేకముగా నొక ముద్రాక్షరశాల వలయును. ఏతన్నిమిత్తమై ఒకమాఱుగాని పలుమాఱుగాని దేశసంచారము చేయవలయును. శ్రీ రామలింగారెడ్డిగారు లోనగువారిని పోయి కనవలయును. ఇంతయుం జేయ వలసియున్నది. ఈవిషయమై మీరు ముఖ్యముగా శ్రద్ధవహింపం దగుదురు." (రెడ్డిలేఖ).

### (iii) ఏనాదిరెడ్డి పఠన మందిరము.

"నాయొద్ద పుస్తకములు, నేనే చదువుకొనుటకై సంపాదించుకొన్నట్టివి, రు 2000 ల వెలగలవి, యుండినవి. అందులో నామిత్రఛద్మలు అపూర్వగ్రంథములను పెక్కింటిని అపహరించినారు. అట్లుగాక కొన్ని శిథిలమైపోయినవి. మిత్రవేషధారులు హరించినవి వెండియు క్రయమునకు సయితము దొరకవు. అవి అచ్చులో లేవు. మంత్రశాస్త్రము గణితము, వ్యాకరణము, యోగము, ఇత్యాదులు పెక్కులు లిథోగ్రాఫుప్రతులలో నున్నవి. సైక్లోనులో కొన్ని తడిసి ముద్ద అయినవి. నష్టశేషములు మూలముగానుంచుకొని ఒక పఠనమందిరమును స్థాపించి "ఏనాదిరెడ్డి పఠనమందిరము" అని పేర్కొని క్రమముగా వృద్ధిచేయుచు నెల్లూరికి మహోపకారము చేయుట నాకొకయాలోచన కలిగినది. నెల్లూరికి పుష్కలమైన గ్రంథకోశము లేదు. అట్టిదాని మనమేల సిద్ధింపఁగూడదు? ... ఈ యీప్సితము నెఱవేర్చిన మనము శాశ్వతజీవులలో చేరుదుము." [23-4-29, రెడ్డిలేఖ.]

ఇవెల్ల నెఱవేర్చుకొనుటకు చిరకాలము జీవించియుందుమనియే వారిప్రత్యయము. 'జ్యోతిషికులు ఇంకను 7,8 సంవత్సరముల యాయుస్సును చెప్పుచున్నారు.' 23-4-29 — చనిపోవుటకు 1½ నెల ముందటి మాటలివి! పాపము, జ్యోతిషికుల తప్పేమున్నది! పార్వతిశాపము! ఇట్టిలోకారాధన తత్పరులు చిరంజీవులు కాఁగూడదా!

## శాస్త్రులవారి లేఖలు.

—:0:—

శాస్త్రులవారి గ్రంథములు తత్పాండిత్య కవనమహిమా సూచకము లైనట్లే వారిలేఖలును తన్నానాగుణప్రఖ్యాపకములుగా నున్నవి. గ్రంథపఠనరచనములందు అవిశ్రాంత వ్యాపృతులయ్యు వారు తన్మిత్రులకును శిష్యులకును పెక్కుజాబులు వ్రాసియున్నారు. సారస్వతలేఖలు చాలమట్టుకు అముద్రితగ్రంథచింతామణి మయూఖమునందు అచ్చయినవి. అవిగాక బహువిషయప్రసక్తములు

జాబులుకలవు. అవి తజ్జీవితచరిత్రరచనకు అమూల్యాకరములు. వారిజీవితచరిత్రను సమగ్రముగా వ్రాయ పరిశ్రమించుచున్న మాకు ఎంతయు నపేక్షణీయములు. వానిని కనుల కద్దికొని కైకొని, వానిం బంపువారలకు మాకృతజ్ఞతను తెలుపుకొనువారము.

అట్టిజాబులలో మాకు లభ్యములు సుమారు రెండువందలు. ౨౦౫ సుమారు నూటయేఁబది 1906 మొదలు 1929 లో నిర్యాణమున కొక పక్షము ముందటివఱకు శాస్త్రులవారు గునుపాటి యేనాదిరెడ్డిగారికి వ్రాసినవానిలో నెల్లోనులోపోయినవి పోఁగా మిగిలినవి. ఇందు ,, రెడ్డిలేఖలు " అని యుద్ధృతములు. ఈజాబులు పఠించినచో అట్టిమహాపురుషునిచే నట్లు మన్ననలఁగన్న యేనాదిరెడ్డి ఎంత సుకృతాత్ముఁడో అనిపింపక పోవదు.

" మిత్రమవో, నా యమృతపు
పాత్రమవో, మాకు నన్న పానము లిడు శ్రీ
సత్రమవో, కనుము బుధ
స్తోత్రము లేనాదిరెడ్డి, శుభముల వడ్డీ. " [16-9-28]

అని కించి దుదాహృతి. (ii) శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి బి.ఏ. గారికి శాస్త్రులవారు వ్రాసిన జాబులలో మాకు లభ్యములు రెండు. (iii) 1915 లో శ్రీ వేంకటగిరి మహారాజాగారికి వారు వ్రాసుకొన్న విజ్ఞాపనాలేఖ, 4 పేజీల పెద్దజాబు, ముద్రితము, ఒక్క-టేప్రతి శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారి యొద్ద కలదు. ఇందు "వేం, రాజలేఖ" అని యుద్ధృతము. ఇవి తెలుఁగు. (iv) శాస్త్రిమిశ్ర శుశ్రూషా నిరతులు, మేఘసందేశాది గ్రంథకర్తలు నగు శ్రీ గుఱ్ఱము వేంకట సుబ్బరామయ్య ఎం. ఏ. గారికి (1921-1929) వ్రాసినవి రమారమి ముప్పది జాబులు. (v) నాకు వ్రాసినవానిలో నష్టశేషములు యొండు రెండు. ఇవి ఆంగ్లమున నున్నవి, శాస్త్రులవారి యాంగ్లభాషా రచనా ప్రౌఢికి అద్భుతోదాహరణములు. వానినుండి కొన్ని యుద్ధారములు:-

"In this world of puzzle why regret anything and rejoice in anything? Mutual robbery is the rule of the day." (21-8-27)

"Please allow me to say that this world is really 'The Vale of Tears.' Right or wrong, virtuous or vicious, kind or cruel — have no meaning; but the punishment or reward is in the deed, character and conduct, and the mental state itself. The only heaven, real in creation, is the company of the wise." (To G. V. S. 22-11-27).

"Collapsing of the house, two months life as guest, trip under a heavy shower, severence of my better-half, the old widow's curses, young children longing for me, to see me, to greet me and roll in my lap, a sister eagerly expecting me — in concatenation appeared as a transition to a new state of existence................What is this? dream? What is dream? How

happy was Bishma, who could breathe his last at will? Why attachement to this delirium? Why this individuality? The heart feels pain at this puzzle. The only desirable thing in my life is to spend time with friends wise, learned and good-natured. Sleep – what is it? slumber – what is it? Pain and pleasure – what are they? Why are they? My Dear friend, I am turning mad God has forsaken me." (To G. V. S. 13-3-28).

"On 4th instant the (Madras) Andhra Nataka Sabha staged Paduka for my benefit. The play was simply glorious, perfect in every respect, actions faultless, apparel and Jewellery the richest. The play costs me nothing. I paid Re. 1/- for conveyance, which was borne by the Society. No students attended the play, as it was given duing the examinations days. So the collection just met the expences and their was no balance for my benefit. You know I am Bhartrihari's Khalwata..................... It will not be long before I close my eyes upon this world. Those who were long my dependents are now my critics, not my patrons, or friends or sympathisers. But such as have much still to rob me do still befriend me with smiles." (To D. V. S. 13 3 28.)

ఈజాబులలో శాస్త్రులవారి నానాభావములు తత్తత్కాల మానసికదశా జన్యములు సముచిత భావం జిత్రితములై యున్నవి. వారియాశలు, అపేక్షలు, సుఖములు, దుఃఖములు, స్వపరగ్రంథ విమర్శాభిమర్శలు, తన్మిత్రామిత్ర మిత్రవిచ్ఛేదములు, తత్తత్కృతోపకారాపకార సంచనములు, నిజ గ్రంథములు, తద్రచనాకారణములు, తత్సందర్భములు, తద్రచనాక్రమము, సమాప్తిసంతోషవార్తలు, ముద్రణానైరాశ్యదుఃఖము, ముద్రణాది సహాయకులయెడ కృతజ్ఞతలును, గసణ్ణులు పొత్తగను సంతుష్టి "ఎంత శ్రమించినను హర్షించువారెవరు." అను నిరాశాభావము, ఇత్యాదికము లెన్నెని అత్యద్భుతముగ వర్ణితములు. ఈలేఖలలో చాలవఱకు తత్కాలశాఖాగములు నానావిధములు నానావిధ కారణోద్భూతములు కలవు. కుటుంబసంబంధములు కొన్ని, కుటుంబభరణానుపపత్తి నిమిత్తములు కొన్ని, గ్రంథముద్రణపర్యాప్త ధనాభావకారణములు కొన్ని, గ్రంథముద్రణాప్రసక్తిధనాపహారక ప్రతారక కృతములు కొన్ని, అన్నిటిని మించి మహాధమర్ణతా విముక్తి నైరాశ్యవర్తిష్యమాణ క్లేశావమానభీతిజన్యములు కొన్నియు, కష్టముల వర్ణించు వాక్యములు ఎన్నెని ఉన్నకారణమున లేఖలు పాఠకజనహృదయ విద్రావకములుగ నుండును. కాని, ఇన్నికష్టములందును తన్నైజోదాత్తతకు భంగముకలిగించు వాక్యములు కనపట్టవు. ఈశ్వరభక్తియు, నద్వైతానురక్తియు రానురాను పెంపొందినట్లు స్పష్టము:

"అరిషడ్వర్గము సమసెన్;
బరమాత్ముని గొల్చుకోరికె ప్రబలంబయ్యెన్;
హరికథలచేతఁ గాలము
నిరతము గడపంగ హరియె నెఱవేర్పందగున్." (25-12-28)

అని యాశింపించినారు. జాబులలో వారి సహజనిష్కపట నవనీతమృదుల హృదయము సర్వత్ర గానగును. ఉపకారసంఘసేవాప్రీత్యుత్కర్షము తేటపడుచున్నది. వారు ఉపాధ్యాయులుగా నున్నకాలమునఁ జేసిన సాంఘికసేవ తద్వ్యాజ్యముసేవలో మఱిగిపోయినది కాని, "హిందూమత ధర్మములను గుఱించి క్రైస్తవమతబోధకులచే అపార్థము లుపన్యసింపఁబడుటను గాంచి ఆకాలమునఁ గొందఱు ప్రముఖులచే ప్రేరితులై 'యంగ్ మెన్స్ హిందూ అసోసియేషన్' [హైందవ యువజన సంఘము] స్థాపించి లింగిసెట్టివీథిలో ప్రతిదినము యోగశాస్త్రము మున్నగు నార్యవిజ్ఞాన గ్రంథములను గుఱించి యుపన్యసించి శ్రోతలకు అమందానందము గల్గించిరి. ఆయసోసియేషనుకు సర్. టి. ముత్తుసామయ్యరుగారు అధ్యక్షులుగను, శతావధానము శ్రీనివాసాచార్యులుగారును, వేంకటరాయశాస్త్రులవారును కార్యదర్శులుగా నుండిరి. శాస్త్రులవారి జీవితమునందు ధర్మోద్ధారకములగు నిట్టివిశేషములు అనేకములు కలవు." (ఆంధ్రపత్రికానుబంధము 1922, సెప్టెంబరు తే 23 ది.) ఇట్టి పరోపకారనిరతి లేఖలయందును గోష్ఠియందును స్పష్టము.

"గాంధిమహాత్ములు నెల్లూరికిం గూడవత్తురని వినికి. అచట వారిని దర్శించుపుణ్యము నాకు లేనందులకుఁ జింతిల్లుచున్నాఁడను." శాస్త్రులవారికి దేశభక్తియు, దేశోద్ధారక మహానాయకభక్తియు ఉత్కటములు.

ఈ లేఖలందును తద్రచితోపన్యాసములందును, అన్నిటికన్నమిన్నగ తత్సంభాషణమునందును, ప్రకాశమానమగు నొండులక్షణము వారి 'హాస్యవిలాసము, ఛలోక్తికౌశలము' ను. ఇవి ప్రతిభావంతులకు సహజాలంకారములు. అడిసన్, స్విఫ్టు, జాన్సన్, గోల్డుస్మిత్తు, కార్లైలు, హ్యూమ్సు మున్నగు పాశ్చాత్య రసజ్ఞకోవిదులకు పెట్టినసొమ్ము. ఈగుణమహిమచే నెంతవ్రాసినను, ఎంతయుపన్యసించినను ఎట్టిక్లిష్టవిషయమైనను, పరిశ్రోతృప్రియముగా నుండును. ఇది అందఱ సొమ్ము కాదు. దీనియందు వేంకటరాయశాస్త్రులవారి ప్రతిభ నిరుపమానము. ఆ సందర్భశుద్ధి, ఆ సమయస్ఫూర్తి, ఆ శబ్దప్రయోగకౌశలము, ఆ వక్రోక్తి ఛలోక్తి చాతుర్యము వారి హాస్యవిలాసకేళి నద్భుతమొనర్చుచుండును. ఇతరులు పడి పడి నవ్వవలసినదే, తాము నవ్వరు. ఒక్కొకపరి అది కోమలవచస్సమరకేళి యౌను. తదకుంఠిత చతురవచశ్శరగోచరీభూతుఁడైన ప్రతిపక్షి ముగ్ధుఁడై ఇతికర్తవ్యతాజడుఁడై, నిరుత్తరుఁడై, ప్రక్కవారు నవ్వుచుండఁ దా నూరకుండును; లేదా, తానును నవ్వును. ఈవినోదము తత్సంభాషణా పరిచితుల భాగ్యసీమ. లేఖలందును ఈలక్షణము గానగును:

"తద్రచనా (సా. దర్పణరచనా) కాలమున నాకుటుంబభరణము కావలసి యుండును. అందులకు ఏర్పాటులేనిచో నెద్దిభట్టుగారు భార్యను 'ఏమికూర వండితివి?' అని యడుగఁగా, ఆమె 'ఇత్యాహాలు పులుసు, ఇత్యష్ఠలు ఇగురును వండితిని' అని చెప్పిన యుత్తరము నాకు ఇంకు వచ్చును." (రెడ్డిలేఖ, 20-12-20.)

"ఆంధ్ర సాహిత్యదర్పణము స్వయంబోధకముగా నుండవలయునేని, ఇచ్ఛామాత్రమున నిట్టిది నిష్పన్నమగునా? అందులకై గ్రంథకర్తకు ఆత్మస్వవశము గావలసినంత కాలముండుటకు వలసిన యే

ర్వాట్లు చేయరాదా? ఇష్టమున్న ఆచేత ఏపాటి? అట్టి విపులగ్రంథముద్రణమునకు చతుస్సహస్రీ, లేదా ద్విసహస్రి యేని వలసియుండదా? “ అవును పాపము! నీవు నడవలేవు. కావున కాశికి దేకిపోయి మాకు గంగం దెమ్మ. ” అన్నట్లున్నది. మంచిజాతి ఫలవృక్షమైనను నీరుపోయక బ్రదుకునా? ” (రెడ్డిలేఖ, 18-10-21.)

ఈ లేఖలందు శాస్త్రులవారి స్వాతంత్ర్యము సర్వత్ర తేటపడుచుండును. మొదటినుండియు వారు స్వతంత్రజీవన పరాయణులుకదా! చరమదశలో అప్పులముప్పుచే నొకప్పుడు తన దీనదశను తన శిష్యమిత్రాభిమానుల కెఱుకపఱుచుకొని సహాయముపడయఁగోరి “ వేంకటరాయశాస్త్రి భాగధేయము” అనునొక లఘుగ్రంథము రచియించియు ముద్రింప నియ్యకొనరైరి. “ గ్రాసములేక సుక్కిన జరాకృశమైన, విశీర్ణమైన, సాయాసమునైన నష్టరుచియైనను, ప్రాణభయార్తమైన.........కేసరి జీర్ణతృణంబు మేయునే! ” “ ఆత్మకు ప్రియముగ గ్రంథముల రచించెనే కాని, అర్థమునకై యాశించి పామరాభిరుచికై ప్రాకులాడలేదు” (యుగంధర). కడకు గ్రంథముద్రణమునందును తత్స్వాతంత్ర్యము పరిస్ఫుటము. అభిప్రాయభేద ముప్పతిల్లియేకదా సాహిత్యదర్పణము ఇంత కాలము అముద్రితముగనుండెను!

ఈలేఖలయందు విశదమగు మహాగుణము మఱియొండు కలదు. గొప్పపండితుఁడైనను, ఆత్మవిశ్వాసము అపారమైనను, మేరుతుల్యమైనను, మహాప్రతిభావంతుఁడగు మానవుఁడు సాధింపఁజాలిన విద్య స్వల్పమాత్రమని వారికెఱుకయే. దేవతలు సాక్రటీసును సర్వజ్ఞుఁడని యుగ్గడించిరఁట. సాక్రటీసునకు దానితత్త్వము ఎఱుఁగరాక, ఆరయఁగోరి మహాపండితులని పేరుగన్న వారికడకు పోయి ప్రసంగించి వారు వాస్తవముగ నజ్ఞులనియు, కేవలపండితమ్మన్యులనియుఁ దెలిసికొని “ అజ్ఞుఁడనని నన్ను నే నెఱుంగుదును. కడమ యజ్ఞులెల్లరును తాము మహాప్రాజ్ఞుల మనుకొనుచున్నారు. ఈకారణముననే గావలయు నన్ను సర్వజ్ఞుఁడని దేవతలు వచించిరి. ” అని సాక్రటీసు పల్కెను. సాక్రటీసువలెనే వేంకటరాయ శాస్త్రులవారును దలంచువారు. ఇట్టిపట్టున ఎవఁడుగాని ప్రమాదపతితుఁడుగామి యన నెట్టిది? ప్రమాదములు, మానవజ్ఞానము అల్పపరిమాణ మగుటంజేసి యనతిక్రమణీయములు. ధీమంతులలో గుణబాహుళ్యకారణమున నవి లెక్కకురావు. అట్లే, శాస్త్రులవారు తమయందు తప్పులుప్పతిల్లవని వాదించువారు గారు. స్వప్రమాదములను సవరించుకొన నోడరు. శాస్త్రులవారి యాక్షేపకులు కదా శ్రీరావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులవారు. వారినిగూర్చి లేఖలలో శాస్త్రులవారి వాక్యములు వినుఁడు,—

“ గిడుగు రామమూర్తిగారి వ్రాఁత సాధువని నేనందుల కంగీకరింపవలసినదే. కాదేని సమాధానముమాత్రము నేను చెప్పవలసిన పనిలేదు. (3-11-20). [బహులువ్రాసికొనుటకు] ఆస్పదము లేనియెడల నేను లోఁబడుటయును, మదీయాజ్ఞానభ్రాంతిప్రమాదములను ఒప్పుకొనుటయు ఇహపరసాధకములు. మఱియు, ఇందుల తత్త్వమేమనఁగా, వారి యీయభియోగము నామీఁదికి వచ్చినట్టిది గాదు; గ్రాంథికభాషోన్మూలనార్థము ఉద్దిష్టమయినది. ”

స్వప్రమాదముల నూరీకరించి, సవరించుకొననోడమి—ఇది పాండిత్యపరమోచ్ఛ్రితి, సౌజన్యపరమావధి.

ఇట్లు లేఖలు శాస్త్రులవారి గుణవర్ణనమునకు అమూల్యాధారములు. వీనిని వారిసమగ్రజీవిత చరిత్రతోడఁ బ్రకటింపఁ దలఁచియున్నారము. సర్వేశ్వరుని కృపచే నది నెఱవేఱుఁగాక.

## సింహావలోకనము.



పూర్వవర్ణితరీతి శ్రీ వేంకటరాయశాస్త్రులవారు బహుగ్రంథములచే, బహువిధగ్రంథములచే, భిన్నకౌతుకాంధ్ర లోకమును ఆరాధించిన ధన్యులు. సాక్షరలోకమునకేగాక, నిరక్షరలోకమునకును ఆబాలవృద్ధము ఆయన సుపరిచితుఁడు. "ఢిల్లీసుల్తాన్ పట్టకపోతాన్"-అని విని వారిని స్మరించి యభినందింపనివారు లేరుకదా. కథాప్రియులను తత్కథాసరిత్సాగరాదులచేతను, నాటకకళాకలాపప్రియులను ఉషా ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధ నాటకములచేతను, గీర్వాణనాటక రసామృతపానప్రియులను శాకుంతలోత్తర రామాది తదాంధ్రీకృత నాటక సప్తకముచేతను, వ్యాకృతి ప్రియులను మేఘ నైషధ విష్ణుచిత్తీయ వ్యాఖ్యలచేతను, విమర్శప్రియులను కింకిణీగణ శింజాన శారదా కాంచికచేతను, సాహిత్యశాస్త్రప్రియులను అలంకార సారసంగ్రహ సాహిత్యదర్పణములచేతను, కవితాప్రియులను చమత్కృతిప్రియులను సర్వత్ర తద్గ్రంథములచే మాత్రమేగాక, తత్సంభాషణములచేతను-నానావిధజనులను తనిపిన సర్వతోముఖ ప్రతిభాశాలి ఒక్కఁడే అనుట యద్భుతముగదా. ఒక్కొక్క విషయమునందును వారిని మించువారుండిన నుండురేమో. ఇన్ని తెఱఁగుల మహాప్రతిభలు—ఆయాంగ్లాంధ్ర గీర్వాణపాండిత్యము, ఆ పద్ధతి బోధన నాటన గ్రంథకరణ ముద్రాపణ సామర్థ్యము, ఆరసజ్ఞత, ఆబుద్ధివైశిత్యము, ఆవిమర్శవైశద్యము, ఆగద్యపద్యరచనా నైపుణి, ఆనాటకరచనాప్రౌఢి, ఆనానావిధ పాత్రోచిత భాషా నిబంధన కౌశలము, ఆహాస్య విలాస చాతురి—ఆంధ్రులలో నొక్కనియందు నాఁడుగాని నేఁడుగాని కన్పట్టవుగదా. ఇందుకు నిర్మత్సరహృదయ సహృదయాంతర్వాణీంద్రులెల్ల ప్రమాణము. సరసవాఙ్మయము ఉండునంతవఱకు శాశ్వతంబుగ అమృతరూప తద్భారతి ఆంధ్రప్రపంచమున ఆరాధనీయ యగుననుటకు సందియములేదు. ఈరీతిని అనన్యాదృశ మహిమమై ఆంధ్ర గీర్వాణోభయాత్మకవాణిని నిరంతరము సేవింపఁగన్న శ్రీ వేదము వేంకటరాయశాస్త్రికళాప్రపూర్ణులు ఎంతయు ధన్యులు. వారిచే నాంధ్రులు గణ్యులు. ఇట్టిమహాపురుషులు ఆంధ్రదేశమున అవారిగ నవతరింతురుగాక. ఆంధ్రులచే శాశ్వత స్మరణీయు లౌదురుగాక!

ఓం

తత్సత్.



# ఆంధ్ర సాహిత్యదర్పణము.



## విషయసూచిక.

———:(o):———

### ప్రథమ పరిచ్ఛేదము.



### ద్వితీయ పరిచ్ఛేదము.

## తృతీయ పరిచ్ఛేదము.

## చతుర్థ పరిచ్ఛేదము.

## పంచమపరిచ్ఛేదము.



## షష్ఠపరిచ్ఛేదము.

# ఉదాహరణ శ్లోకసూచి





# * లఘుశోధనము



| పుట | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 15 | 10 | ఉపక్ర్యారాది | ఉపకారాది |
| | 21 | దీద్వశం | దీద్వశ |
| 19 | 6 | బోధయు | బుద్ధియు |
| 20 | 26 | కిరించినవాఁడు | కరించినవాఁడు |
| 30 | 13 | మెఱఁగు | మెఱుఁగు |
| 37 | 29 | ఘూర్తనీ | ఘూర్ణన్తీ |
| 41 | 9 | తన | తనకు |
| 43 | 8 | వళనము | వలనము |
| ,, | 12 | ఇత్యాది. ఇచట | 'ఇచట' క్రొత్తపేరాకు ఆది |
| ,, | 13 | కలిగిన | కలిగినను |
| | 16 | త్రివగల్భ | త్రివగల్భ |

* ఇంకను కంట్రికి చెదరిపోయిన స్ఖలితములు ఉండును.

| | | | |
|---|---|---|---|
| 43 | 25 | జావాతి | జానాతి |
| ,, | 26 | నేత్రోత్పలా | నేత్రోత్పలైర్ |
| ,, | 28 | కధమపి | కథమపి |
| 46 | 31 | విడమ్బనాబిః | విడమ్బనాభిః |
| 48 | 14 | రసజ్ఞఁడా | రసజ్ఞుఁడా |
| 56 | 25 | హిమంశో | హిమాంశో |
| 69 | 10 | నిగిడించెను? | నిగిడించెను. |
| | 20 | శమము | శ్రమము |
| 75 | 28 | మితి— | మితి? |
| | ,, | న్మే? | న్మే— |
| 76 | 28 | ముగపతా | ముపగతా |
| 85 | 25 | 'నాకు | 'చెక్కిటిని ముద్దుగొన్నందులకు పులకలందాల్చినవాఁడా, నాకు |
| 86 | 14 | కఠంము | కంఠము |
| 99 | 2 | ్టైన | ముట్టైన |
| 100 | 21 | చీకటి | చీఁకటి |
| 103 | 7 | విస్మరణ | స్మరణ |
| 107 | 6 | తొలిదాని | తొలిదాన |
| 108 | 14 | రాత్రిగ్రామమున | రాతిగ్రామమున |
| 109 | 11 | వ్యంజ్యమాన | వ్యజ్యమాన |
| 110 | 16 | ఆయత్తము | ఆయితము |
| 114 | 3 | బృందము' | బృందము' ఇత్యాది |
| 115 | 17 | హాదముచేత | హ్లాదముచేత |
| | 25 | విశశ్రిద్ధ | విసస్రిద్ధ |
| | 27 | వ్యతికరః | వ్యతికరం |
| 117 | 5 | స్వతఃసంభవి | స్వతఃసంభవి. |
| 118 | 18 | —అంతటను | =అంతటను |
| 120 | 22 | అరోపితమై | ఆరోపితమై |
| 122 | 27 | హతయా | హృతయా |
| 142 | 6 | వీథ్యంగములు | వీథ్యంగములు. |
| 143 | 5 | ఆమాటవలన | ఆమెమాటవలన |
| 151 | 8 | గముచేత | ముచేత |
| 154 | 27 | సమ్భృతం | సమ్భృతం |
| 155 | 27 | ముధయపార్థనా | ముభయపార్థనా |
| 157 | 16 | నిష్టురము | నిష్ఠురము |

* ‘ ఓయి వీరుఁడా, రాత్రులయందు శుభ్రాంశుని కర సమూహముచేత ప్రకాశితమగు భువన వలయము నంతయు నీకీర్తి సంతానము ఎప్పుడును ధవళీకరించుచున్నది. ’

ఇచట కవి ప్రౌఢోక్తి సిద్ధమయిన వస్తువుచేత కీర్తి సంతతి చంద్రకిరణ సమూహము నకన్న ఎక్కువ కాలము ప్రకాశక మని వ్యతిరేకాలంకారము వ్యంగ్యము.

† ‘ ఆక్షణమందు దశాననుని కిరీటములనుండి రాక్షసస్త్రీయొక్క యశ్రుబిందువులు మణి మిషంబున నేలమీఁద రాలినవి. ’

ఇచట కవిప్రౌఢోక్తిసిద్ధమయిన యపహ్నుత్యలంకారముచేత భవిష్య ద్రాక్షస శ్రీ వినాశ రూపమయిన వస్తువు వ్యంజింపఁబడుచున్నది.

‡ ‘ ఓయి త్రిలింగభూమితిలకుఁడా, నీకీర్తిరాశి ఒక్కటి యయ్యును ఇంద్రపురీ సుందరులకు కొప్పులలో విరజాజిమొత్తముగాను, కేల తెల్లదామరగాను, కంఠతటమందు హారముగాను, పాలిండ్ల దోయియందు దట్టంపుఁ జందనచర్చగాను,— దేహమందు నానాలంకారత్వ మును పొందినది. ’

ఇచట కవిప్రౌఢోక్తిసిద్ధమయిన రూపకాలంకారముచేత భూమి నున్నవాఁడ వయ్యును స్వర్గస్థులకుం గూడ నుపకారము సేయుచున్నా వని విభావనాలంకారము వ్యంజింపఁ బడుచున్నది.

§ ‘ సుముఖీ, ఈచిలుకబోద నీయధరమువలె పాటలమయిన బింబఫలమును కఱచు భాగ్యము కలుగునట్లుగా ఏపేరి తపస్సును ఏకొండయందు ఎంతకాలము కావించినదో! ’

ఇచట కవినిబద్ధుఁడైన యొకానొక కామియొక్క ప్రౌఢోక్తి సిద్ధమయిన వస్తువుచేత ‘ నీయధరము పుణ్యాతిశయ లభ్యము ’ అనెడి వస్తువు తోఁచుచున్నది.

---

* రజనీషు విమలభానోః కరజాలేన ప్రకాశితం వీర,
ధవలయతి భువనమణ్డల మఖిలం తవ కీర్తిసన్తతిః సతతం.

† దశానన కిరీటేభ్య స్తత్క్షణం రాక్షసశ్రియః
మణివ్యాజేన పర్యస్తాః పృథివ్యా మశ్రుబిన్దవః.

‡ ధమ్మిల్లే నవమల్లికా సముదయో, హస్తే సితామ్భోరుహం,
హారః కణ్ఠతటే, పయోధర యుగే శ్రీఖణ్డ లేపో ఘనః,
ఏకో౽పి త్రికలిఙ్గభూమితిలక త్వత్కీర్తిరాశి ర్యయౌ
నానామణ్డనతాం పురన్దరపురీ వామభ్రువాం విగ్రహే.

§ శిఖరిణి క్వ ను నామ కియచ్చిరం కిమభిధాన మసా వకరో త్తపః
తరుణి యేన త వాధర పాటలం దశతి బిమ్బఫలం శుకశాబకః!

* ‘ ఓసొబగు రాలా, వసంతములో మదనబాణములు కోటిసంఖ్యముం బొంది పంచతను విడిచి నను, పంచత వియోగులకుం గలిగినది. ’

ఇచట ‘ కామశరములకు కోటిసంఖ్యత్వము కలిగినందువలన నిఖిల వియోగి మరణము కలిగినది. ’ అను వస్తువు కవి నిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధము. దానిచేత ‘ శరముల పంచత శరములను వదలి వియోగులం జేరినదియుం బోలె ’ అని యుత్ప్రేక్షాలంకారము వ్యంజింపఁబడినది.

‡ ‘ చండీ, పంచబాణుని పయనమందు శంఖమును ఊఁదుచున్నదియుం బోలె తుమ్మెద మల్లె మొగ్గమీఁద నలియుచున్నది. ’

ఇచట కవినిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధమైన యుత్ప్రేక్షాలంకారముచేత ‘ వచ్చియున్న యీకాలమున కాముఁడు అత్యంతోన్మాదకుఁడు, అట్లుండ ఓమానినీ, కోపము మానవేమి ’ అనువస్తువు వ్యంజింపఁబడుచున్నది.

† ‘ సొబగుఁడా, వేగురు మహిళలు నిండియున్న నీహృదయమున ఆకోమలి ఇముడనిదై ప్రతిదినము కడమపనులు మాని సన్నమే అయిన తనదేహమును మఱియు సన్నము సేయుచున్నది. ’

ఇచట ‘ ఇముడనిదై ’ అని కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధమైన కావ్యలింగాలంకారముచేత ‘ దేహమును సన్నము చేసికొన్నను నీహృదయమునందు లేదు. ’ అనెడి విశేషోక్తి వ్యంజింపఁబడినది. కవికి కవినిబద్ధునికిం బోలె రాగాద్యావిష్టత్వము లేదు, కావున, కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి కవిప్రౌఢోక్తికన్న సహృదయులకు ఎక్కుడు చమత్కారమును గొలిపించును; అందువలన దానిని ప్రత్యేకించి చెప్పుట.

౨౬౪. శబ్దార్థశక్త్యుద్భవమందు ఒకటే.

* సుభగ తే కోటిసఙ్ఖ్యత్వ ముపేత్య మదనాశుగైః
వసన్తే పఞ్చతా త్యక్తా, పఞ్చతాసీ ద్వియోగినాం.

‡ మల్లికాముకులే చణ్డి భాతి గుఞ్జతి మత్తమధుపోఽయం
ప్రయాణే పఞ్చబాణస్య శఙ్ఖ మాపూరయన్నివ.

† మహిలా సహస్స భరిఏ తుహ హిఅఏ సుహఅ సా అమాఅంతీ
అణుదిణ మణణ్ణకమ్మా అంగం తణుఅం పి తణుఏఇ.

[ఛాయా.]

మహిళా సహస్ర భరితే తవ హృదయే సుభగ సామాన్తీ
అనుదిన మనన్యకర్మాఙ్గం తనుక మపి తనయతి.

- వ్యంగ్యము శబ్దార్థోభయశ క్త్యుద్భవమయినచో ధ్వనికి ఒకటే భేదము.

¶ ఉదా.—— ' హిమ ముక్త చంద్రి రుచిరుండు, సపద్మకుఁడు, ద్విజతతిని మదింపఁజేయు వాఁడు, జనిత మీనకేతనుఁడు, ప్రసాదిత సురుండును నై మాధవుఁడు ప్రమదాజనమునకు చిరకాలము పెనుఁబండువుగా నుండెను. '

ఇచట మాధవుఁడు కృష్ణుఁడు మాధవునివలె వసంతునివలె అని యుపమాలంకారము వ్యంగ్యము. ఇట్లు వ్యంగ్యభేదముచేతనే వ్యంజకములైన కావ్యముల భేదము.

౨౬౦. ఇందువలన ధ్వని పదునెనిమిది విధములు.

అర్థాంతర సంక్రమిత వాచ్యము, అత్యంత తిరస్కృత వాచ్యము నని అవివక్షితవాచ్యము రెండు విధములు; వివక్షితాన్యపరవాచ్యము మఱి అసంలక్ష్యక్రమ వ్యంగ్యత్వముచేత ఒకటి; సంలక్ష్యక్రమవ్యంగ్యత్వముచేతను శబ్దార్థోభయమూలత చేత పదునేను భేదములు గలది. వీనియందును.——

౨౬౧. శబ్దార్థశక్త్యుత్థ మగు ధ్వని వాక్యమందు మాత్రమే ఉండును. కడమవి పదమందును వాక్యమందును ఉండును.

అందు అర్థాంతరసంక్రమితవాచ్యమునకు పదగతమునకు ఉదా.——

† ' యువజన మోహన విద్య యయిన యాసుముఖి ఎవని సమ్ముఖమున నుండఁగలదో ఆతరుణుఁడొక్కఁడే ధన్యుఁడు వాని కన్నులే కన్నులు. '

ఇచట రెండవ కన్నుశబ్దము భాగ్యవత్త్వాది విశిష్ట నయన పరము.

‡ వాక్యగతమునకు ఉదా.—— ' నీకు నేను చెప్పుచున్నాను. విద్వాంసుల బృందము ఇక్కడ నున్నది. కావున నీతెలివిని తెచ్చుకొని యిచ్చట ఉనికిం గావింపుము. '

ఇచ్చట ప్రతిపాద్యుఁడగువాఁడు సమ్ముఖీనుఁడుగా నుండుటచేతనే వాని ప్రతిపాద్యత్వము తెలియుచుండఁగా ' నీకు ' అని ఎక్కువగా వచించుట ఇతరుల వ్యావృత్తితోఁ గూడుకొన్న ' నీకు ' (నీకుమాత్రమే) అను నర్థమును లక్షించుచున్నది, ఇట్లే

---

¶ హిమ ముక్త చన్ద్ర రుచిరః సపద్మకో మదయన్ ద్విజాఞ్జనిత మీనకేతనః
అభవత్ప్రసాదితసురో మహోత్సవః ప్రమదాజనస్య స చిరాయ మాధవః.

‡ ధన్యః స ఏవ తరుణో నయనే త స్యైవ నయనే చ
యువజన మోహన విద్యా భవితేయం యస్య సమ్ముఖే తరుణీ.

† త్వామస్మి వచ్మి విదుషాం సమవాయోఽత్ర తిష్ఠతి.
ఆత్మీయాం మతి మాస్థాయ స్థితి మత్ర విధేహి తత్.

' చెప్పుచున్నాను ' అనుటచేతనే కర్త లభించియుండఁగా ' నేను ' అని ఎక్కువగా చెప్పుటయు. అట్లే ' విద్వాంసుల బృందము ' అనుటచేతనే వక్త ప్రతిపాదింపఁ చున్నాఁ డనుట సిద్ధించియుండఁగా అధికముగా ' చెప్పుచున్నాను ' అనుట ' ఉపదేశించుచున్నాను ' అనెడు వచనవిశేషరూపార్థమును లక్షించుచున్నది. ఈలక్షితము లన్నియు తన యతిశయమును వ్యంజించుచున్నవి. ఇందువలన ' నామాట నీకు మిక్కిలి హితము, కావున అది అవశ్యము చేయనలసినది. ' అని యభిప్రాయము. కావున ని ట్లిది వాక్యగతమయిన యర్థాంతరసంక్రమితవాచ్య ధ్వని.

పదగతమయిన యత్యంతతిరస్కృతవాచ్యమునకు ఉదా.— ' నిశ్వాసముచేత గ్రుడ్డిదైన ' ఇత్యాది(౧౫౩). వాక్యగతమునకు ఉదా.— ' నీవు కర ముపకారము ' ఇత్యాది (౧౫). ఇతరములకు వాక్యగతత్వమునకు ఉదాహరణము లిప్పటికే ఈయఁ బడినవి.

* పదాంశత్వమునకు ఉదా.— ' ఆలావణ్యము ఆకాంతి ఆరూపము అవచనక్రమంబును అప్పుడు అమృతస్యంద మాయెను; ఇప్పుడో మహాజ్వరము. '

ఇచట లావణ్యాదులయొక్క తాదృ గనుభ వైక గోచరత్వమును వ్యంజించుచున్న ' ఆ ' శబ్దములకే ప్రాధాన్యము, ఇతరములకు వాని కుపకారులగుట మాత్రమే, అగుటంబట్టి వానివలననే ధ్వని వ్యవహారము. దానిని ధ్వనికారుఁడు ఇట్లు చెప్పినాఁడు. ' ఏకావయవమందున్న భూషణముచేత కామినియుం బోలె పదద్యోత్యమగు ధ్వనిచేత సుకవియొక్క భారతి ప్రకాశించుచు. ' భావాదులయందును ఇట్లూహించునది.

† ' భుక్తి ముక్తి కరము ఏకాంతోపదేశ తత్పరము సదాగమము ఎవరికి ఆనందనిష్యందము గావింపదు? '

ఇచ్చట సదాగమ శబ్దము సన్నిహితుని ఉపనాయకునిఁగూర్చి సచ్ఛాస్త్రార్థమును వచించి సత్పురుషుని రాక అను వస్తువును వ్యంజించుచున్నది. అట్లు చెప్ప నేల ' సదాగమము సదాగమమువలె ' అని ఉపమాధ్వని యేల గాదు? అనిన, సదాగమ శబ్దార్థములకు ఉపమానోపమేయ భావము వివక్షితముగానందున; రహస్యమును దాఁచుటకొఱకే గదా ద్వ్యర్థ పద ప్రతిపాదనము, ప్రకరణాది పర్యాలోచనచేతను

---

* లావణ్యం త దసౌ కాన్తి స్త ద్రూపం స వచఃక్రమః
తదా సుధాస్పద మభూ ద్ధునా తు జ్వరో మహాన్.

† భుక్తి ముక్తి కృ దేకా న్త సమాదేశన తత్పరః । కస్య నానన్ద నిస్యన్దం విదధాతి సదాగమః

సచ్ఛాభస్త్రాభిధానము అసంబద్ధ మగుటవలనను.

* 'అనన్య సాధారణ ప్రజ్ఞుఁడు వ్యాప్తాఖిల వసుంధరుఁడు వర్తింప వలసి నానివాఁడు ఆరాజు పురుషోత్తముఁడు లోకములో ప్రకాశించుచున్నాఁడు.'

ఇచట పురుషోత్తముఁడు పురుషోత్తమునివలె అని ఉపమాధ్వని. ఈరెండు ఉదాహరణములందును శబ్దశక్తిమూలములైన సంలక్ష్యక్రమభేదములు (ప్రదర్శితములు).

† 'నీవు సాయంకాలమున జలకమాడితివి, మేనికి చందనముఁ జక్కఁగా బూసికొంటివి, మింటి మాణిక్యము క్రిందుపెట్టి సిగపుం బోయినాఁడు, స్వచ్ఛందముగా నిటకు వచ్చితివి, నీసౌకుమార్యము అదృష్టపూర్వము, అందువలన నిపుడు అంతటను అలసితివి, అందువలన నీకనుదోయి మూఁతపడక యుండఁజాలకున్నది.'

ఇచట స్వతఃసంభవి యగు వస్తువుచేత 'కృతపరపురుషసంగమవై స్నానమాడితివి' అను వస్తువు వ్యంజింపఁబడుచున్నది. అదియు 'ఇపుడు అలసితివి, మున్నెప్పుడును నీకు ఇట్టి యలయికను చూచి యెఱుఁగము' అని బోధించుచున్న 'యిప్పుడు' పదమువలనం గలిగినదే, 'ఇప్పుడు' పదమే యితరపదార్థములకు ఉత్కర్షనొసఁగూర్చిన కతంబున కడమ పదములకన్న దానికే ప్రాధాన్యము.

‡ 'వేఱొక గోపకన్య శ్రీకృష్ణునిం బొందని మహాదుఃఖముచే తన పాతకము లెల్ల నశింపఁగా, అతనిం జింతించుటవలని మహాహ్లాదముచేత తన పుణ్యరాశి క్షీణింపఁగా, కేవలము బ్రహ్మస్వరూపుఁ డయిన జగత్సూతిని నిరుద్ధప్రాణయై చింతించుచు ముక్తిం బొందినది.'

ఇచట "ఎల్ల—రాశి" పదముల ప్రభావమువలన అనేక జన్మ సహస్ర భోగ్యములైన దుష్కృత సుకృత రాసులతో తాదాత్మ్యాధ్యవసితములనుగా భగవ ద్విరహదుఃఖ చింతాహ్లాదములను తోఁచించుట యను నతిశయోక్తి ద్వయ ప్రతీతి 'ఎల్ల—రాశి' పదద్వయముచే ద్యోతింపఁబడినది. మఱియు నిట వ్యంజకము కవిప్రౌఢోక్తి

---

* అనన్య సాధారణ ధీ ర్ధృతాఖిల వసుంధరః । రాజతే కోఽపి జగతి స రాజా పురుషోత్తమః.

† సాయం స్నాన ముపాసితం, మలయజే నాఙ్గం సమాలేపితం,
యాతోఽస్తాచల మౌళి మమ్బరమణి,ర్విస్రబ్ధ మ త్రాగతిః,
ఆశ్చర్యం తవ సౌకుమార్య, మభితః క్లాన్తాసి, యే నాధునా
నేత్రద్వన్ద్వ మమీలనవ్యతికరః శక్నోతి తే నాసితుం.

‡ త దప్రాప్తి మహాదుఃఖ విలీ నాశేష పాతకా । తచ్చిన్తావిపులాహ్లాద క్షీణ పుణ్యచయా తథా
చి న్తయన్తీ జగత్సూతిం పరబ్రహ్మ స్వరూపిణం । నిరుచ్ఛ్వాసతయా ముక్తిం గ తాన్యా గోపకన్యకా.

లేకయే తనంతట తానే సంభవించుటవలన స్వతస్సంభవి.

* 'దేవా, లెక్కలేని పథములం బాఱుచున్న నీదానజల వాహినిని గాంచుచున్నదె త్రిపథ గ (మూఁడు పథములం బాఱునదైన గంగ) ఉగ్గుని శిరంబున దాఁగుచున్నది.'

ఇది నారచితము. ఇందు 'కాంచుచున్నదె' అని కవిప్రౌఢోక్తి సిద్ధమైన కావ్యలింగాలంకారముచేత 'ఇతరదాత లెవ్వరును నీకు సాటి గారు' అను వ్యతిరేకాలంకారము అసంఖ్య పదముచే ద్యోత్యము. ఇట్లు ఇతరమంయిన యర్థశక్తిమూల సంలక్ష్యక్రమభేదములకు ఉదాహరింపవలయును. కావున నిట్లు మున్ను చెప్పినధ్వని భేదములు పదునెనిమిదింటిలో శబ్దార్థశక్త్యుత్థ మగు వ్యంగ్యము వాక్యమాత్రమందే ఉండునది గాన ఒకటే. ఇతరములు పదునేడును వాక్యమందును పదమందును కూడ నుండున వగుటవలన ముప్పదినాలు గగును కావున ముప్పదియైదు భేదములు.

౨౮౨. ప్రబంధమునందుం గూడ విద్వాంసులు అర్థశక్త్యుద్భవ మగు ధ్వనిని చెప్పుదురు.

ప్రబంధ మన మహాకావ్యము, ఈచెప్పిన పంద్రెండు భేదములుగలది అర్థశక్త్యుత్థము.

† ఉదా.—మహాభారతములో గృధ్ర జంబూక సంవాదంబున:- 'గద్దలును నక్కలును మెండు కొన్నట్టిదియు, అస్థిపంజరములచేత వ్యాప్తమును సర్వప్రాణి భయంకరంబును అయిన యీవల్లకాట నిలువకుండు. ప్రియుండు గాని ద్వేష్యుండు గాని కాలధర్మముఁ బొందినవాఁడు ఎవ్వఁడును ఇట బ్రతికినవాఁడు లేఁడు. ప్రాణుల గతి యిట్టిది.'

అని పగలు శక్తిగలదైన గద్దకు శ్మశానమున మృతుని బాలుని తెచ్చియున్నవారు వానిని వదలిపోవుట ఇష్టము.

* 'ఓమూఢులారా, ఇదె సూర్యుఁ డున్నాఁడు; ఇప్పుడు ప్రేమ చూపుఁడు; ఈముహూర్తమున విఘ్నములు మెండు; ఒకవేళ బ్రదికినను బ్రదుకును; బంగారమువంటి కాంతి గల

---

* పశ్య న్త్యసఙ్ఖ్య పథగాం త్వ ద్దానజల వాహినీం । దేవ త్రిపథ గాత్మానం గోపయ త్యుగ్రమూర్ధని॥

† అలం స్థిత్వా శ్మశానేఽస్మి న్గృధ్ర గోమాయు సఙ్కులే,
కఙ్కాల బహులే, ఘోరే, సర్వ ప్రాణి భయఙ్కరే.
న చేహ జీవితః కశ్చి త్కాలధర్మ ముపాగతః,
ప్రియో వా యదివా ద్వేష్యః ప్రాణినాం గతి రీదృశీ.

యీబాలుని అప్రాప్తయౌవనుని గద్ద మాటలవలన, మూఢులారా, అవిచారితముగా ఎట్లు వదలెదరు? '

అని రాత్రి సమర్థమైన నక్కకు పగలు వదలుట ఇష్టముగా దని వాక్య సమూహముచేత ద్యోతింపఁబడుచున్నది. ఇచట వ్యంజకము స్వతఃసంభవి. ఇట్లే కడమ పదునొకండు భేదములకును ఉదాహరింపవలయును. ఇట్లు వాచ్యార్థము వ్యంజక మగుటకు ఉదాహరణము లొసంగఁబడినవి.

లక్ష్యార్థము వ్యంజక మగునందులకు ఉదా.—' స్తనతటమందు చందనము ' ఇత్యాది (౨౭). వ్యంగ్యార్థము వ్యంజక మగునందులకు ఉదా.— ' చూడు, నిర్మలమైన ' ఇత్యాది (౨౭). ఈ రెంటను స్వతఃసంభవులగు లక్ష్యార్థ వ్యంగ్యార్థములు వ్యంజకములు. ఇట్లు కడమ పదునొకండు భేదములకును ఉదాహరింపవలయును.

౨౬౩. అస్ఫుటక్రమము పదముయొక్క యంశములందును వర్ణములందును రచనయందును ప్రబంధమునందును (కలుగును).

అసంలక్ష్యక్రమ వ్యంగ్యంబగు ధ్వని పదాంశ ప్రకృతి ప్రత్యయోపసర్గ నిపాతాది భేదము వలన పలు తెఱంగులు. ఉదా.—

‡ ' చలాపాంగముగా చూడంబడితివి, కంపముగలదానిని మాటి మాటికి తాఁకుచున్నావు, రహస్యము చెప్పువాఁడవుం బోలె చెవిచెంతఁ జేరి మృదువుగా శబ్దించుచున్నావు; చేతులు విసరుచున్నదానియొక్క రతిసర్వస్వమయిన యధరమును పానము సేయుచున్నావు; తత్త్వ మరయఁగా ఓమధుకరా, మేము హతులము, నీవే సుమా ధన్యుఁడవు. '

ఇచ్చట ' దుఃఖముం బొందితిమి ' అనక ' హతులము ' (అనఁగా 'చంపఁబడినవారము') అని హన్ప్రకృతివలన. (దుష్యంతుని విప్రలంభోత్కర్ష దుఃఖాతిశయముచేత వ్యంజింపఁబడుచున్నది, దుఃఖాతిశయము ' హతాః ' అనుటచేత వ్యంజింపఁబడుచున్నది )

---

* అదిత్యోఽయం స్థితో మూఢాః; స్నేహం కురుత సాంప్రతం;
బహువిఘ్నో ముహూర్తోఽయం; జీవే దపి కదాచన;
అముం కనకవర్ణాభం బాల మప్రాప్తయౌవనం
గృధ్ర వాక్యా త్కథం మూఢా, స్త్యజధ్వ మవిశఙ్కితాః?

‡ చలాపాఙ్గాం దృష్టిం, స్పృశసి బహుశో వేపథుమతీం,
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదు కర్ణాన్తిక చరః;
కరౌ వ్యాధున్వత్యాః పిబసి రతిసర్వస్వ మధరం
వయం తత్త్వాన్వేషా న్మధుకర, హతా, స్త్వం ఖలు కృతీ.

* ' మాటికి నంగుళులచే అధరోష్ఠము సంవృతము అగుచుండంగా వల దను వర్ణములచే వ్యాకులము నభిరామంబును అంసము వైపు మరల్పంబడినదియు నైన పక్ష్మలాక్షి ముఖమును ఎట్లో ఎత్తితిని గాని ముద్దు గొనలేతిని '

ఇచట ' కాని ' (తు అను నిపాతము) అనుతాపమునకు వ్యంజకము. ' ఇదియే నాకు తిరస్కారము ' (౨)ఇత్యాదియందు ' శత్రువులు ' అను బహువచనంబును, ' తాపసుండు ' అను నేకవచనంబును, ' ఇట ' (ఈచోట ఇచ్చోట-ఇచ్చట-ఇచట-ఇట) (అత్ర) అను సర్వనామంబును, ' సమయించుచున్నాండు ' ' ఉన్నాండా ' అను తిఙ్లులును, ' అహో ' అను నవ్యయంబును, ' ముక్కిడిపల్లియ ' ("గ్రామటికా") అనుదానియందలి క రూప తద్ధితంబును, ' ముట్టదోచిన ' ( విలుణ్ఠన—వి=ముట్ట)అని వ్యుపసర్గయు ' బాహువులవలన ' అను బహువచనంబును వ్యంజకములు.

† ' ఆహారమందు విరతి, సమస్త విషయ వ్రాతమందు నిండు నివృత్తి, నాసాగ్రమందు ఈ చూపు, ఇదిగాక అనన్యవృత్తి యగు మనస్సును, ఈమౌనంబును, మఱి యీవిశ్వము నీకు శూన్యముగా ఆభాసిల్లుటయు, కావున చెప్పుము సఖీ, యోగిని వగుదువో కాదేని వియోగిని వగుదువో. '

ఇచట ' ఆహారమందు ' అను విషయసప్తమియు, ' సమస్త ' ' నిండు ' అను విశేషణములును, ' ఈమౌనంబు ' అని ప్రత్యక్షమునే పరామర్శించుచున్న (ఈ) సర్వనామంబును, ' ఆభాసిల్లుట ' అను పదమందు ఆ(—అంతటను)అను నుపసర్గయు, ' సఖి ' అని ప్రణయ స్మారణంబును, ' అగుదువో ' అని సోత్ప్రాస సోపసర్గంబును, ' కాదేని ' అని యుత్తరపక్ష దార్ఢ్య సూచకమంయిన ' వా ' శబ్దంబును, ' అగుదువు '(అసి=అగుచున్నావు) అను వర్తమానోపదేశంబును ఆయావిషయములకు వ్యంజకములు— అని సహృదయు లెఱుంగుదురు.

వర్ణరచనలకు ఉదాహరణములు పిమ్మట చూపంబడును. ప్రబంధమం దెట్లన్న.—— మహాభారతమున శాంతము, రామాయణమున కరుణము, మాలతీమాధవ

---

* ముహు రఙ్గులి సంవృతాధరోష్ఠం, ప్రతిషేధాక్షర విక్లబాభిరామం,
ముఖ మంసవివర్తి పక్ష్మలాక్ష్యాః కథ మ ప్యున్నమితం, న చుమ్బితం తు.

† ఆహారే విరతిః, సమస్త విషయ గ్రామే నివృత్తిః పరా,
నాసాగ్రే నయనం, తదేత దపరం యచ్చైకతానం మనః,
మౌనం చేద, మిదం చ శూన్య మధునా యద్విశ్వ మాభాతి తే,
తద్బ్రూయాః సఖి, యోగినీ కిమసి భోః? కిం వా వియోగిన్యసి?

రత్నావళియందు శృంగారము. ఇట్లు కడమ తెలియునది.

౨౬౪. ఇట్లు ఆధ్వనికి ఏబదియొక్క భేదములు అంగీకరింపఁబడినవి. ఇవి మూఁడు విధముల సంకరముచేతను(చూ. ౭౫౭) ఏకరూపమైన సంసృష్టిచేతను (చూ. ౭౫౬) వేదఖాగ్నిశర సంఖ్యాకములు (౫౩౦౪) అగును; శుద్ధములతో ఇషుబాణాగ్నిసాయక సంఖ్యములు (౫౩౫౫) అగును.

శుద్ధములతో అనఁగా ఏబదియొకటి యగు శుద్ధభేదములతోఁ జేరి అని యర్థము. దిఙ్మాత్రము దాహరణము.—

† 'ఉత్తుంగ స్తన యుగళియు తరళాయత దృష్టియు నైన యాతరుణి ద్వారమందు నిలిచినదై అతని రాక యను మహోత్సవమునకు పూర్ణకుంభములును క్రొందామరల తోరణపఙ్క్తులును సంభార మనెడు మంగళమును అయత్నకృతము సమకూర్చుచున్నది.'

ఇచట స్తనములే పూర్ణకుంభములు దృష్టులే క్రొందామరల తోరణస్రజములు అని రూపక ధ్వనికిని రస ధ్వనికిని ఏకాశ్రయాను ప్రవేశ మనెడి సంకరము.

‡ 'వసంతదినములు మదముచే పెరుఁగుచున్న తుమ్మెదల ధ్వని గలిగి పాంథుల హృదయము లను వణఁకించుచు, నిస్తంద్ర చంద్రముఖీ వదనారవింద సౌరభ్యముతోడి చెలిమిచేత గర్వించిన వాయువులతో ప్రీతి గొల్పుచున్నవి.'

ఇచట నిస్తంద్ర సౌహృదేత్యాది లక్షణామూల ధ్వనులకు సంసృష్టి.

ఇఁక గుణీభూత వ్యంగ్యము.—

౨౬౫. ఇతరమో గుణీభూతవ్యంగ్యము, అందు వాచ్యముకంటె వ్యంగ్యము అనుత్తమము.

ఇతరము ఇతరకావ్యము, అనుత్తమత్వము న్యూనతచేతను సామ్యముచేతను సంభవించును.

౨౬౬. అందు వ్యంగ్యము ఇతరమునకు అంగము, కాక్వాక్షిప్తము, వాచ్యసిద్ధ్యంగము, సందిగ్ధప్రాధాన్యము, తుల్యప్రాధాన్యము, అస్ఫుట

---

† అత్యున్నత స్తన యుగా తరళాయతాక్షీ ద్వారి స్థితా త దుపయాన మహోత్సవాయ సా పూర్ణకుమ్భ నవ నీరజ తోరణ స్రక్ సమ్భార మఙ్గళ మయత్నకృతం విధత్తే.

‡ ధిన్వ న్త్యమూని మద మూర్చ్ఛ దలిధ్వనీని ధూతాధ్వనీన హృదయాని మధో ర్దినాని నిస్తన్ద్ర చన్ద్రవదనా వదనారవిన్ద సౌరభ్య సౌహృద సగర్వ సమీరణాని.

ము, అగూఢము, అసుందరము, అగును; అందువలన దానికి ఎనిమిది భేదములు చెప్పఁబడినవి.

ఇతరమున కనఁగా రసాదికమునకు అంగము రసాదివ్యాంగ్యము. ఉదా.—

* ‘ఇది మొలనూలిని తివిచివైచునదియు, పీనస్తనములను విమర్దించునదియు, నా భూర్యుల జఘనములను స్పృశించునదియు నైన యాచేయి.’

ఇందు శృంగారము కరుణకు అంగము.

§ ‘మానోన్నతను ప్రేయసిని అనునయింపఁ గోరినదై నీసేనా సముద్రపుఘోషచేత కర్ణతాపము కలుగఁగా అయ్యో అయ్యో నీశత్రుని రాజధానియందలి మేడల పరంపరయందు కామిలోకము ఎట్లుండునో?’

ఇచట ఔత్సుక్య త్రాస సంధిచే సంస్కృతమయిన కరుణమునకు రాజ విషయక మయిన రతియందు అంగభావము.

‡ ‘నేను బంగారము మీఁద ఎండమావుల(వంటిదైన దురాశ)చేత (బంగారపు లేడి మీఁది యాసచేత) నాబుద్ధి గ్రుడ్డిది కాఁగా, జనుల తావున(జనస్థానమందు) తిరిగితిని, ప్రతి స్థానమందును అవశ్యము ఇమ్ము (వైదేహి) అనుమాటను ఉబుకుచున్న కన్నీళ్ళ ప్రలపించితిని; ధనస్వామియొక్క మాటయొక్క సంతోషభంగులయందు ఏదో ఒక ఘటనను (లంకాభర్తయొక్క ముఖ పంక్తియందు బాణ ఘటనను) చేసితిని. ఇట్లు నాకు రామత్వ ప్రాప్తి గలిగినది గాని కుశలవసుతాప్తి (దారిద్ర్యముం బోనడఁచునదై ధన ప్రాప్తి అని యొక యర్థము—కుశలవులు సుతులుగా గలదై సీతాప్రాప్తి యని రెండవ యర్థము) కలుగదాయెను.

ఇచట రామత్వ ప్రాప్తి గలిగిన దని చెప్పకున్నను అది శబ్దశక్తివలననే బోధపడుచున్నది, చెప్పుటచేతనో సాదృశ్య హేతుకమయిన తాదాత్మ్యము అరోపితమై దాని గోపనమును తొలఁగించినది. అందువలన వాచ్యమయిన సాదృశ్యము వాక్యార్థమునకు

---

* అయం స రశనోత్కర్షీ పీన స్తన విమర్దనః
నా భ్యూరు జఘన స్పర్శీ నీవీ విస్రంసనః కరః.

§ మానోన్నతాం ప్రణయినీ మనునేతుకామ స్త్వ త్సైన్య సాగర రవోద్గత కర్ణతాపః
హాహా కథంను భవతో రిపు రాజధానీ ప్రాసాద సన్తతిషు తిష్ఠతి కామిలోకః?

‡ జనస్థానే భ్రాన్తం కనక మృగతృష్ణాన్విత ధియా
వచో వైదేహీతి ప్రతిపద ముదశ్రు ప్రలపితం
కృతా లఙ్కాభర్తు ర్వదన పరిపాటీషు ఘటనా
మయాప్తం రామత్వం, కుశల వసుతా న త్వధిగతా.

అన్వయము నుపపాదించునదై అంగతను పొందింపఁబడినది.

* కాక్వాక్షిప్తమునకు ఉదా.— 'యుద్ధమున క్రోధముతో నూర్వురు కౌరవులను చంపను, దుశ్శాసనుని రక్తమును వాని ఱొమ్మునుండి త్రాగను, గదతో దుర్యోధనుని తొడలను నుగ్గుసేయను, మీరాజు (అయిదు గ్రామముల నిచ్చెడి) యొడంబడికతో సంధిచేయుఁగాక.'

ఇచట చంపనే చంపుదును ఇత్యాది వ్యంగ్యము వాచ్యమైయున్న నిషేధముతోడి సహభావము కలిగియే యున్నది.

† 'ఓరాజేంద్రుఁడా, వైరి వంశ దవానలమైన నీయీ ప్రతాపము ఘనాఘనాంతరాళమును వెలిఁగించుచు ఎల్లెడల జ్వలించుచున్నది.'

ఇచట అన్వయమునకు వేణుత్వారోపము వ్యంగ్యము ప్రతాపమునకు దావానలత్వారోప సిద్ధికి అంగము.

'హరుఁడును ధైర్యము' (౭౮౬) ఇత్యాదియందు విలోచన వ్యాపార చుంబనాభిలాషలలో దేనికి ప్రాధాన్యమో ఆవిషయమున సందేహము.

§ 'బ్రాహ్మణాతిక్రమమును మానుట మీకే భూతికరము. అట్లు చేయలేని మీమిత్రము జామదగ్న్యుఁడును దుర్మనస్కుఁడగును.'

ఇచట 'పరశురాముఁడు రక్షఃకులమును క్షయ మొందించును' అను వ్యంగ్యమునకును వాచ్యమునకును ప్రాధాన్యము సమము.

‡ 'సంధియందు సర్వస్వ హరణ మగును, విగ్రహమందు ప్రాణ నిగ్రహ మగును, కావున అల్లావదీన నృపతితో సంధియు లేదు విగ్రహంబును లేదు.'

ఇచట అల్లావదీనుఁ డనుపేరి నృపునియెడ దానసామాది తప్ప వేఱు ప్రశమోపాయము లేదనెడి వ్యంగ్యము వ్యుత్పన్నులకుం గూడ త్వరగా స్ఫుటము గాదు.

---

* మథ్నామి కౌరవ శతం సమరే న కోపాత్, । దుఃశాసనస్య రుధిరం న పిబామ్యురస్తః, సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ, । సన్ధిం కరోతు భవతాం నృపతిః పణేన.

† దీపయన్ రోదసీ రన్ధ్రమేష జ్వలతి సర్వతః । ప్రతాపస్తవ రాజేన్ద్ర, వైరివంశ దవానలః

§ బ్రాహ్మణాతిక్రమత్యాగో భవతామేవ భూతయే.
జామదగ్న్యశ్చ వో మిత్రమన్యథా దుర్మనాయతే.

‡ సన్ధౌ సర్వస్వహరణం, విగ్రహే ప్రాణనిగ్రహః,
అల్లావదీన నృపతౌ న సన్ధిః న చ విగ్రహః.

* 'లోకగురువును సజ్జనులకు ధర్మ ముపదేశించువాఁడును అగు నితనిచేత వ్రతవంతురాలను నేను స్వైరముగా—అట్లానైని ఏల చెప్పవు? '

ఇచట శాక్యముని తిర్యగ్జాతి స్త్రీని బలత్కారమున ఉపభోగించుట ప్రతీయమానమైనను స్ఫుటత్వముచేత వాచ్యము పోలె నున్నది గావున అగూఢము.

‡ 'వేతస లతా గృహమందు ఎగిరిన పిట్టల కలకలమును వినఁగా ఇంటిపనిలో మెలఁగుచున్న వధువునకు పనికి అవయవములు(కాలుసేతులు) ఆడవాయెను. '

ఇచట దత్తసంకేతుఁడు ఒకఁడు తీవఇల్లు చొచ్చినాఁడు అను వ్యంగ్యముకన్న 'అవయవములు కార్యాక్షమము లాయె' ననెడి వాచ్యముయొక్క చమత్కారము సహృదయ సంవేద్యము కావున అసుందరము. మఱియు, దీపక తుల్యయోగితాదులయందు ఉపమాలంకారము ఏది వ్యంగ్యమో అది గుణీభూతవ్యంగ్యమే, ఏలన కావ్యము దీపకాది ముఖముననే చమత్కారము చేయున దగుటవలన. అట్లని ధ్వనికారుఁడు చెప్పియున్నాఁడు. 'ఎచ్చట అలంకారాంతరము తోఁచుచున్నను కావ్యమునకు దాని యందు తాత్పర్యము లేదేని అది ధ్వనిమార్గముం బొందదు' ఎచ్చట శబ్దాంతరాదిచేత గోపన కృత చారుత్వము విపర్యస్త మగునో అచ్చటను గుణీభూత వ్యంగ్యమే. ఉదా.—

† 'కేశవా, గోపరాగ(గోధూళి చేత— గోపుఁడవగు నీయందలి రాగముచేత) హృతమైన దృష్టిచేత నేను దేనినిం గనలేనైతిని, అందువలన ఇట తొట్రిల్లితిని, నాథ పడినదానిని నన్ను లేవనెత్త వేమి? నీవు ఒక్కఁడవే విషమములయందు ఖిన్నమైన మనస్సుగలవా

---

* అనేన లోకగురుణా సతాం ధర్మోపదేశినా
అహం వ్రతవతీ స్వైర- ముక్తేన కి మతః పరం?

‡ వాణీర కుడంగ ఉడ్డీణ సఉణి కోలాహలం సుణంతీఏ
ఘరకమ్మ వావడాఏ వహూఏ సీఅంతి అంగాఇం.

[ఛాయా]

వానీర కుఞ్జోడ్డీన శకుని కోలాహలం శృణ్వన్త్యాః
గృహకర్మ వ్యాపృతాయా వధ్వాః సీదన్త్యఙ్గాని.

† 'దృష్ట్యా కేశవ గోపరాగ హృతయా కిఞ్చి న్న దృష్టం మయా,
తే నేహ స్ఖలితాస్మి, నాథ పతితాం కిన్నామ నాలమ్బసే?
ఏ కస్త్వం విషమేషు ఖిన్న మనసాం స వాఽబలానాం గతిః. '
గోప్యైవం గదితః సలేశ మవతా ద్గోష్ఠే హరి వశ్చిరం.

రైన(విషమ బాణుని బాణములచేత ఛిన్నమైన మనస్సు గలవారైన) అబలులకు(అబలలకు) ఎల్లరకును గతియై. ' ఇట్లని పసుల కొట్టాములో సమూచనముగా గోపికచేత వచింపఁబడిన వాఁడగు హరి మిమ్ము చిరకాలము రక్షించునుగాక. '

ఇచట గోపరాగాది పదముల యొక్క గోపునియందు రాగము, ఇత్యాది వ్యంగ్యార్థమునకు ' సమూచనముగా ' అను పదముచే స్ఫుటావభాసము కలిగినది. ' సమూచనముగా' అను పదమును మానినచో ధ్వనియే అగును. మఱియు ఎచట వస్త్వలంకార రసాది రూప వ్యంగ్యములకు రసాభ్యంతరంబున గుణీభావమో అచట ప్రాధాన్యమునకే కావ్య వ్యవహారము. ధ్వనికారుఁడే చెప్పినాఁడు.— ' అయినను ఈప్రకారము గుణీభూతవ్యంగ్యము సయితము రసాది తాత్పర్య పర్యాలోచనచేత ధ్వనిరూపతను ధరించును. ' అని.

మఱి ఎచ్చట—

* ' ఎచ్చటమింటిని నాకుచున్న కెంపుల కాంతి సంధ్యా భ్రమము పొందుచున్న ప్రమదలకు ఉన్మదరాండ్రకు అకాండమందు సయితము అసంగాలంకార విధిని కావించుచున్నదో. '

ఇత్యాదులయందు రసాదులకు నగరీ వృత్తాంతాది వస్తుమాత్రమందు అంగత్వమో అచ్చట అవి తాత్పర్య విషయములు గాకపోయినను అగుణీభూతములైనవాని చేతనే కావ్యవ్యవహారము. అట్లని మాసగోత్రులైన కవిపండితముఖ్య శ్రీచండీదాసపాదులవారు చెప్పినారు.— ' అఖండబుద్ధి సంవేద్య మయిన కావ్యార్థము తన్మయీభావమున ఆస్వాదింపఁబడు దశయందు గుణప్రధాన భావావభాసమో అనుభవమునకు రాదు. కాలాంతరమందో ప్రకరణాది పర్యాలోచనచేత అనుభవమునకు వచ్చియును అది కావ్య వ్యపదేశమును పడఁగొట్టుటకు సమర్థముగాదు, ఏలయన, కావ్య వ్యపదేశము ఆస్వాదమాత్రాయత్తం బగుటం బట్టి. ' అని.

కొందఱు చిత్రమనుపేర మూఁడవ కావ్యభేదము నిచ్ఛగింతురు; ఇట్లు చెప్పుదురు.— ' శబ్దచిత్రము వాచ్యచిత్రము నని అవ్యంగ్యమో అధమముగా చెప్పఁబడినది. ' అని. అది సరిగాదు. ఏలన, అవ్యంగ్యత్వ మనఁగా వ్యంగ్యాభావ మేని, ఆపక్షమున దానికి కావ్యత్వమే లేదని మున్నే చెప్పఁబడినది; ఈష ద్వ్యంగ్యత్వ మనెడి పక్షమున ఈష ద్వ్యంగ్యత్వ మన నేమి? ఆస్వాద్య వ్యంగ్యత్వమా అనాస్వాద్య

---

* యత్రోన్మదానాం ప్రమదాజనానా మభ్రంలిహః శోణమణీ మయూఖః సంధ్యా భ్రమం ప్రాప్నువతా మకాణ్డేఽ ప్యనఙ్గ నేపథ్య విధిం విధత్తే.

వ్యంగ్యత్వమా? తొలి దేని ప్రాచీనభేదములలోనే అంతర్భూత మగును; రెండవ దేని కావ్యత్వమే లేదు; ఏలయన ఆస్వాద్యత్వము కలదేని అప్పుడు అక్షుద్రత్వము సిద్ధమే. క్షుద్రత యున్న అనాస్వాద్యత్వము కలుగుటం బట్టి. అట్లని ధ్వనికారుఁడు చెప్పియున్నాఁడు.—' ఇట్లు వ్యంగ్యముయొక్క ప్రధాన గుణ భావములచేత రెండు కావ్యములు వ్యవస్థితములు. వానికంటె నితరము ఏదికలదో అది చిత్ర మనఁబడును. ' అని.



# సాహిత్యదర్పణము.



## పంచమ పరిచ్ఛేదము.

ఇఁకను ఏది యిది క్రొత్తవృత్తి వ్యంజన యనునది- అనఁగా చెప్పుచున్నాఁడు.—

౨౬౭. అభిధ తాత్పర్యము లక్షణ అను పేరుల వృత్తుల విశ్రాంతివలన రసాదుల బోధయందు నాలవ వృత్తి అంగీకరింపవలసినది.

అభిధ సంకేతితార్థమాత్రబోధనచేత విరతమైనందున వస్త్వలంకార రసాది వ్యంగ్య బోధనమందు సమర్థము గాదు; మఱి రసాదికము సంకేతితము గాదు; విభావాదుల యభిధానమే దాని యభిధాన మని చెప్పఁగూడదు; దానికి దానితో ఏకరూపత అంగీకృతము కానందున; ఎచ్చట స్వశబ్దముచేత చెప్పఁటయో అచట పైగా దోషమే అనియు చెప్పఁబోవుచున్నాము. (౯౭౭). కొన్నిట ఇది శృంగారరసము ఇత్యాదుల యందు స్వశబ్దముచేత చెప్పినను తత్ప్రతీతిలేదు, అది స్వప్రకాశానందరూప మగుటంబట్టి.

అభిహితాన్వయవాదు లంగీకరించిన తాత్పర్య నామక వృత్తియు సంసర్గ (సంబంధ)మాత్రమును తెలిపి క్షయించునది గావున వ్యంగ్యమును బోధింపనేరదు.

ఇట కొందఱు వచింతురు.— 'ఇది అభిధావ్యాపారము బాణముయొక్క వ్యాపారము వలె దీర్ఘదీర్ఘతరము.' అని. ధనికుఁడును ఇట్లు చెప్పినాడు. 'వ్యంజకత్వము తాత్పర్యముకన్న వేఱు కానందున ధ్వని కాదు; కార్యమందు(సంసర్గబోధన మాత్రమందు) వ్యాపించునట్లుగా తాత్పర్యము తులలో తూన్పఁబడినదియు కాదు.' అని. ఈయిరువురమీఁదను 'శబ్దబుద్ధికర్మలు విరమించి వ్యాపారమును కోలుపోవును' అని వాదించువారు దుడ్డుగుదియను వైతురు గావున.

ఇట్లేని లక్షణ సయితము ఏల అవలంబించుట, దీర్ఘదీర్ఘతరమైన యభిధా వ్యాపారముచేతనే లక్ష్యార్థబోధ సిద్ధించుటంబట్టి? మఱియు 'బ్రాహ్మణుఁడా, నీకు

కొడుకు పుట్టినాఁడు, నీకన్య గర్భిణి యైనది. ' ఇత్యాదులయందును హర్ష శోకాదుల కుం గూడ వాచ్యత్వము ఏల కలుగదు? ఇట్లు చెప్పుటయుం గలదే— " పౌరుషే యము అపౌరుషేయమును వాక్యము సర్వమును కార్యపరము, అతత్పరత్వమున[అనఁగా తత్పరము( = కార్యపరము)కాని పక్షమున] అనుపాదేయత యగును, ఉన్మత్త ప్రలాపమునకుం బోలె; అందువలన కావ్యశబ్దములకు నిరతిశయసుఖాస్వాదము లేని చో వానియందు శ్రోతలకును వక్తలకును ప్రవృత్తికి కారణీభూతమైన ప్రయోజనము చేకూరమిచేత, నిరతిశయసుఖాస్వాదము కార్యముగా నిశ్చయింపఁబడుచున్నది. ' శబ్దము యత్పరమో శబ్దార్థము అది తత్పరము. ' అను న్యాయమువలన. " అని.

ఇట నడుగవలసియున్నది.— ఏటిది యిది తత్పరత్వ మనునది? తదర్థత్వమా, తాత్పర్యవృత్తిచే తద్బోధకత్వమా? మొదటి పక్షమున వివాదము లేదు, వ్యంగ్యత్వమందును తదర్థత్వము తొలఁగదు గావున; రెండవ పక్షమున ఏది యిది తాత్పర్య మనుపేరి వృత్తి? అభిహితాన్వయవాదులు అంగీకరించినదా, తదన్యమా? ఆద్య పక్షమున ఉత్తరము దత్తమే. ద్వితీయపక్షమున నామమాత్రమున వివాదము; వారి మతమున నాలవ వృత్తి సిద్ధమగుటం బట్టి.

మఱి ' ఏకకాలముననే తాత్పర్యశక్తిచేత విభావాది సంసర్గము రసాదియు ప్రకాశించుఁగాక ' అందువేని, అది సరిగాదు, వానికి హేతు ఫల భావము అంగీకృతము గావున. అట్లు ముని చెప్పినాఁడు.— ' విభావానుభావ వ్యభిచారి సంయోగముచేత రస నిష్పత్తి ' అని. సహభావమునందు కుడి యెడమ కొమ్ములకుం బోలె పౌర్వాపర్య విపర్యయమున కార్యకారణభావము ఎట్లు ఘటిల్లును?

' గంగలో గొల్లపల్లె ' ఇత్యాదియందు తటాద్యర్థమాత్రమును బోధించి విరమించిన లక్షణ శీతత్వ పావనత్వాది వ్యంగ్యమును ఎట్లు బోధించును? కావున నాలవ వృత్తిని స్వీకరింపవలసినదే యని నిర్వివాదము. మఱియు—

౨౬౫. బోద్ధృ స్వరూప సంఖ్యా నిమిత్త కార్య ప్రతీతి కాలములయు ఆశ్రయ విషయాదులయు భేదముచేత అభిధేయముకంటె వ్యంగ్యము భిన్నము.

వాచ్య వ్యంగ్యార్థములకు పద పదార్థ మాత్ర జ్ఞాన నిపుణులయిన వైయాకరణులును ఎఱుంగుటచేతను, సహృదయులు మాత్రమే ఎఱుంగుటచేతను బోద్ధలు వేఱువేఱు. ' ధార్మికుఁడా, నిర్భయముగా భ్రమింపుము. ' (౨౫౩) ఇత్యాదులయందు

ఒక్కెడ విధిరూపము వాచ్యమై యుండఁగా నిషేధతచేతను, ఒక్కెడ 'స్తనతట మందు నిశ్శేషముగా '(౨౭) ఇత్యాదియందు నిషేధరూపమై యుండఁగా విధిరూపత చేతను స్వరూపభేదము. 'సూర్యుఁడు అస్తముంబొందినాఁడు.' ఇత్యాదియందు ఒక్కెడ వాచ్యార్థము ఒకటే తోఁచును, వ్యంగ్యమన్ననో దానిని గ్రహించువారి భేదముచేత ఒక్కెడ 'కాంతునభిసరింపుము' అని, 'ఆవులను కట్టివైవుము' అని, 'ఇది నాయకుఁడు వచ్చెడు కాలము' అని, 'ఇపుడు సంతాపము లేదు' అనియు నిత్యాది రూపముల అనేకము అని సంఖ్యాభేదము. వాచ్యార్థము శబ్దోచ్చారణ మాత్రముచేత తెలియునది; ఇదియో అట్టి ప్రతిభా నైర్మల్యముచేతను అని నిమిత్త భేదము. ప్రతీతిమాత్రమును కలిగించుటవలనను చమత్కారమును చేయుటవలనను కార్యభేదము. కేవలరూపతచేతను చమత్కారితచేతను ప్రతీతిభేదము. పూర్వ పశ్చాద్భావముచేత కాలభేదము. శబ్దాశ్రయత్వముచేతను, శబ్ద తదేకదేశ తదర్థ వర్ణ సంఘట నాశ్రయత్వముచేతను ఆశ్రయభేదము.

† 'ప్రియుని మోవియందు క్షతముం గాంచిన ఎవనికి కోపము రాదు? ఓసి విపరీతమతీ, నేను వలదన్నను మానక తేఁటితోడి తమ్మిని మూర్కొంటివి, ఇప్పుడు నాయకునిచేత చీవాట్లు తిను.'

అని సఖీ తత్కాంత విషయత్వమున విషయభేదము. కావున అభిధేయము వ్యంగ్యము కానేకాదు. మఱియు——

౨౬౯. పూర్వము లేనందున రసాదులు, లక్షణాభిధలు వానికి బోధకములు గావు. ఇది గాక ముఖ్యార్థ బాధ లేకున్నను లక్షణ.

బోధక కాదు అని చెప్పుకోవలయును. ఈలక్షణాభిధలు బోధించుటకై రసనాత్మక వ్యాపారమునకంటె వేఱుగా రసాది పద ప్రతిపాద్యమయిన పదార్థము ప్రమాణ సిద్ధము లేదు గదా.

మఱియు ఎచట 'గంగలో గొల్లపల్లె' ఇత్యాదులయందు ఉపాత్తములయిన శబ్దార్థముల యన్వయము కలుగుచునే అనుపపత్తిచేత బాధితమగునో అచటనే

† కస్స వ ణ హోఇ రోసో దట్ఠూణ పిఆఏ సవ్వణం అహరం
సభమర పడమ గ్ఘాఇణి వారిఅ వామే సహసు ఎహ్ణిం.

[ఛాయా.]

కస్య వా న భవతి రోషః దృష్ట్వా ప్రియాయాః సవ్రణ మధరం
సభ్రమర పద్మాఘ్రాయిణి వారితవామే సహా స్వేదానీం.

గదా లక్షణకు ప్రవేశము. అట్లని న్యాయకుసుమాంజలియందు ఉదయనాచార్యుల వారు చెప్పినారు— 'శ్రుతముయొక్క అన్వయము అనాకాంక్షముగా కుదిరెనా వాక్యము ఇతరమును కోరదు; పదార్థాన్వయము కుదురని యెడల ఏది యాక్షిప్త మగునో దానితో కూడును.' 'పడుకటింట' (3)-ఇత్యాదియందు ముఖ్యార్థ బాధ లేదు. 'గంగలో గొల్లపల్లె' ఇత్యాదియందు ప్రయోజనము (వ్యంగ్యముగాక) లక్ష్యమగునేని తీరమునకు ముఖ్యార్థత్వమును బాధితత్వమును అగును; ప్రయోజ నాంతరమందు అదియు లక్ష్యమగునేని దానికిని ప్రయోజనాంతరము అని అనవస్థా ప్రసంగము ఆపాదించును.

ప్రయోజన విశిష్టమైన తీరముననే లక్షణ అని చెప్పఁగూడదు; విషయ ప్రయోజనములకు రెంటికిని యౌగపద్యమున ప్రతీతి అంగీకృతము గానందున. నీలాది సంవేదనమునకు తర్వాతనే గదా జ్ఞాతతకేని అనువ్యవసాయమునకేని సంభవము.

౨౭౦. అనుమానము వ్యంగ్యములను రసాదులను బోధింప సమర్థము గాదు, ఏలయన హేతువులు ఆభాసించుటచేత. మఱియు రసాది జ్ఞానము స్మృతియుం గాదు.

వ్యక్తివివేకకారుఁడు— "విభావాదులవలన రసాదుల ప్రతీతి యేదో అది అనుమానములో అంతర్భావముం బొందఁదగినది. విభావానుభావ వ్యభిచారి ప్రతీతి గదా రసాది ప్రతీతికి సాధనముగా తలంపఁబడుచున్నది. అదియు రసాదులగు భావ ములకు కారణములు కార్యములు సహకారులును అయి వానిని ఊహింపఁజేయుచు నే రసాదులను నిష్పాదించును; అవే ప్రతీయమానము లగుచు ఆస్వాదపదవిని పొం దుచున్నవై రసము లని పేర్కొనఁబడును. తప్పక సంభవించునదైన తత్ప్రతీతి క్రమ ము కేవలము ఆశుభావితచేతను(బుద్ధికి)గోచరింపకయున్నది. అందువలన ఇదే అభి వ్యక్తి క్రమము." అని.

అట నడుగవలసియున్నది.—— శబ్దాభినయ సమర్పిత మయిన విభావాదుల ప్రత్యయముచేత అనుమితమయిన రామాదిగత రాగాదిజ్ఞానమే రసముగా మీకు అభిమతమా? దాని భావనచేత భావకులచేత భావ్యమానమైన స్వప్రకాశానందమా? ఆది పక్షమున వివాదము లేదు; కాని 'రామాదిగత రాగాది జ్ఞానమును రససంజ్ఞచేత మేము చెప్పము' అని మాత్రమే విశేషము. ద్వితీయ పక్షముననో వ్యాప్తి గ్రహ

గాభావమువలన హేతువు ఆభాసించుటచేత అసిద్ధమే. మఱి యతఁడే చెప్పినాఁడు.— 'ఎక్కడెక్కడ ఈవిధమయిన విభావానుభావ సాత్త్విక సంచారులకు అభిధానము గాని అభినయముగాని అక్కడక్కడ శృంగారాదిరసావిర్భావము' అని. వ్యాప్తియు పక్షధర్మతయు సుగ్రహములే. అట్లే— 'అర్థాంతరాభివ్యక్తియందు నిబంధనముగా నే సామగ్రి మీకు ఇష్టమో అదియే మాకు అనుమితి పక్షమందు గమకముగా సంగతము.' అని. ఇదియును మాకు విరుద్ధము గాదు. కాని ఈవిధమైన ప్రతీతి ఆస్వాద్యముగా మాకు అభిమతము గాదు. మఱి యేమన— స్వప్రకాశమాత్ర విశ్రాంతము సాందానంద నిర్భరము (నుంగా మా కభిమతము). అందువలన ఇట సాధింపఁ గోరిన యర్థముకన్న వేఱె అర్థమును సాధించుటచేత హేతువునకు ఆభాసత. మఱియు— 'ధార్మికుఁడా, నిర్భయముగా' (౨౫౩) ఇత్యాదియందు ప్రతీయమానమయిన వస్తువును,

* 'జలకేళి యందు జవ్వనంపుఁ జక్రవాక మిథునముల విఘటన సంఘటనములను చూడం గుతూహలము గలవాఁడై రాధికా వదనమునుండి వడిగా చేతుల నెడలించుచు మరల మూయుచునున్న శ్రీకృష్ణుఁడు లోకము నేలుంగాక.'

ఇత్యాదులయందును రూపకాలంకారాదులు అనుమేయములే. అట్లే గదా.- అనుమానమనఁగా పక్షసత్త్వ సపక్షసత్త్వ విపక్షవ్యావృత్తత్వములతోఁ గూడిన లింగమువలన లింగిని ఎఱుంగుట. అందువలన, వాచ్యమువలన అసంబద్ధమయిన యర్థమేమో తోఁపదు; అట్లు గాదేని అతిప్రసంగ మగును; అని బోధ్య బోధకము లగు నర్థములకు ఏదో సంబంధము ఉండనేయున్నది. అందువలన, బోధకమయిన యర్థము లింగము, బోధ్యము లింగి, బోధకమయిన యర్థముయొక్క పక్షసత్త్వము చెప్పఁబడినదే, సపక్షసత్త్వంబును విపక్షవ్యావృత్తత్వంబును నిబద్ధములు కాకున్నను, సామర్థ్యమువలన ఊహింపఁదగినవే, కావున నిట లింగరూప వాచ్యార్థమువలన వ్యంగ్యార్థ మయిన లింగిని ఎఱుంగుట ఏదో అది అనుమానమందే పర్యవసించును.— అని. అదియు సరిగాదు.— అట్లే గదా ఇట 'ధార్మికుఁడా, నిర్భయముగా' ఇత్యాదియందు ఇంట కుక్క లేమిచేత విధింపఁబడిన సంచారము గోదావరి తీరమున సింహ ముండుటచేత అసంచారమును ఊహింపఁజేయుచున్నది అను వక్తవ్యము ఏది కలదో దానికి అనైకాంతిక హేతువు. ఏలన భీరువునకు సంయితము గురువుయొక్కయేని ప్రభువుయొక్కయేని నిదేశ

* జలకేలి తరళ కరతల ముక్త పునః పిహిత రాధికా వదనః।
జగదవతు కోకయూనో ర్విఘటన సంఘటన కౌతుకీ కృష్ణః॥

ముచేతనేని ప్రియానురాగముచేతనేని గమనము సంభవించును గావున; పుంశ్చలి వచనము ప్రామాణికమా కాదా అని సందిగ్ధాసిద్ధము కూడ.

'జలకేళియందు'—అనుచోట 'ఎవఁడు ఆత్మ దర్శ నాదర్శనములచేత చక్రవాక విఘటన సంఘటనములం గావించునో అతఁడు చంద్రుఁడే' అని యిది యను మితియే అని వచింపఁగూడదు. ఉత్ప్రేక్షకాదులందు అనైకాంతిక మగుటవలన. 'ఏవం విధార్థము ఏవంవిధార్థబోధకము ఏవంవిధార్థ మగుటం బట్టి, ఏది యిట్లుగాదో అది యిట్లుగాదు.' అని అనుమానమునందును హేతువు ఆభాసమాన యోగక్షేమము, ఏలన ఏవంవిధార్థత్వముచేత అను హేతువుచేత ఏవంవి ధానిష్ట సాధనత్వము సంయితము ఉపపన్నమగును గావున.

అట్లు 'ఓహోరుగింటియక్కా, క్షణముసేపు ఇట నాయింటికేసి కన్నుంపుము' (౨౧౫) ఇత్యాదియందు, కిక్కిసపుగణుపులు ఒడలిని గీరుట, ఒంటిగా ఏటికి పోవుట, ఆతరుణియొక్క పరకాము కోపభోగమునకు లింగికి లింగముగా చెప్పఁబడు చున్నది; అది యిటనే చెప్పఁబడిన స్వకాంత స్నేహముచేత నయినను సంభవించునదే అని హేతువు అనైకాంతికము.

ఏది 'స్తనతటమందు చందనము' (౨౭) ఇత్యాదియందు దూతియందు ఆ కాముకునితోడి యుపభోగము అనుమానింపఁబడుట కలదో అది ప్రతిపాద్య యగు టంబట్టి దూతిచేతనా, తత్కాల సన్నిహితు లయిన యన్యులచేతనా, తత్కావ్యార్థ భావనచేత సహృదయులచేతనా? తొలి పక్షములు రెంటను వివాదము లేదు. మూఁడవ పక్షమందో అట్టి యభిప్రాయము లేని చోట వ్యభిచారము. మఱి వక్తృ ప్రభృత్యవస్థా సహకృత మగుటవలన విశేష్యమే హేతువు అని చెప్పఁగూడదు; ఏవంవిధ వ్యాప్త్యనుసంధానము లేనందున.

మఱియు కవి ప్రతిభామాత్ర జాతములగు నిట్టి కావ్యములకు ప్రామాణ్యము అనావశ్యక మగుటంబట్టి హేతువునకు సందిగ్ధాసిద్ధత్వము కలుగును. వ్యక్తివాదియు 'అధమ' పద సహాయములైన యీపదార్థములకే వ్యంజకత్వమును చెప్పినాఁడు. అందుచేత ఆకాంతుని యధమత్వము ప్రామాణికమా కాదా యని యనుమాన మెట్లు?

ఇందువలన వ్యంగ్యములకు అర్థాపత్తి వేద్యత్వము కూడ అపాస్తమయినది, ఏలయన అర్థాపత్తియు పూర్వసిద్ధమయిన వ్యాప్తిచ్ఛను ఉపజీవించియే ప్రవర్తిల్లును

గావున. ఎట్లన— ' ఎవఁడు బ్రదికియున్నాఁడో వాఁడు ఎటనేని యుండును. ఇట గోష్ఠియందు అవిద్యమానుఁడు చైత్రుఁడు బ్రతికియున్నాఁడు.

మఱియు ఇది వస్త్రవిక్రియాదులయందు చూపుడువ్రేలితో ఎత్తుటచేత పది సంఖ్యలు లోనగువానిం బోలె సూచనబుద్ధిచేత వేద్యమునుం గాదు. సూచనబుద్ధి యు సంకేతము లోనగు లౌకిక ప్రమాణమును అపేక్షించుటచేత అనుమాన ప్రకా రతను అంగీకరించును గావున. ' సంస్కార జన్య మగుటంబట్టి రసాదిబుద్ధి స్మృతి యగును. ' అని కొందఱు వచించుట యేది కలదో అచటఁ గూడ ప్రత్యభిజ్ఞయందు అనైకాంతికత్వముచేత హేతువునకు ఆభాసత.

' దుర్గములచేత అడ్డపడని ' (౨౫)ఇత్యాదియందును ద్వితీయార్థము లేనేలేదు అని మహిమభట్టుఁడు చెప్పిన దేదో అది అనుభవసిద్ధమును కాదనుచు గజనిమీలిక గానే యున్నది.

కావున నిట్లు అనుభవసిద్ధమును తత్తద్రసాదిరూపార్థమును అపలపించుట అశ క్యమగుటచేత తత్తచ్ఛబ్దా ద్యన్వయ వ్యతిరేకానువిధాయితచేతను అనుమానాది ప్రమాణావేద్యతచేతను అభిధాది వృత్తిత్రయాబోధ్యతచేతను నాలవ వృత్తి ఉపా స్యయే యని సిద్ధము; ఇదియు వ్యాప్త్యాద్యనుసంధానము లేకయు కలుగు నని సర్వము నిర్మలము.

ఈవృత్తిపేరేమనిన చెప్పుచున్నాఁడు.—

౨౭౧. అది వ్యంజనయను వృత్తిగా బుధులచేత చెప్పఁబడును. రసవ్యక్తి యందో రసనయనెడి వృత్తిని ఇతరులు ఎఱుంగుదురు.

ఇదియు రసనిరూపణప్రస్తావమునందు వివేచనతో చెప్పఁబడినది అని సర్వము అవదాతము.



# సాహిత్యదర్పణము.



## షష్ఠ పరిచ్ఛేదము.

ఈవిధముగా ధ్వని గుణీభూతవ్యంగ్యత్వముచేత కావ్యముయొక్క భేద ద్వయమును చెప్పి, మఱి దృశ్యత్వ శ్రావ్యత్వముచేత భేద ద్వయమును చెప్పుచున్నాఁడు.—

౨౭౨. దృశ్య శ్రవ్యత్వ భేదముచేత మరల కావ్యము ఇరుదెఱంగు లగును; అందు దృశ్య మభినేయము.

దానికి రూపక మను పేరికి హేతువుం జెప్పుచున్నాఁడు.—

౨౭౩. అది రూపము నారోపించుటచేత రూపకము.

అది యనఁగా దృశ్యకావ్యము నటునియందు రామాది రూపము నారోపించుటచేత రూపక మని చెప్పఁబడును. అభినయ మనఁగా నేమి? అనినఁ జెప్పుచున్నాఁడు.—

౨౭౪. అభినయ మనఁగా అవస్థను అనుకరించుట; అది నాలుగు విధములు— ఆంగికము వాచికము ఆహార్యము సాత్త్వికము నని.

నటులు అంగాదులచే రామయుధిష్ఠిరాదుల యవస్థను అనుకరించుట అభినయము. రూపకముయొక్క భేదములం జెప్పుచున్నాఁడు.—

౨౭౫. నాటకము ప్రకరణము భాణము వ్యాయోగము సమవకారము డిమము ఈహామృగము అంకము వీథి ప్రహసనము అని రూపకములు పది.

మఱియు.—

౨౭౬. నాటిక త్రోటకము గోష్ఠి సట్టకము నాట్యరాసకము ప్రస్థానము ఉల్లాప్యము కావ్యము ప్రేంఖణము రాసకము సంలాపకము శ్రీగదితము శిల్పకము విలాసిక దుర్మల్లిక ప్రకరణి హల్లీసము భాణిక— అని

మనీషులు పదునెనిమిది యుపరూపకములం జెప్పుదురు. అన్నిటికిని విశేషము తప్ప లక్షణము నాటకమునకుం బోలె నెఱుంగునది.

అన్నిటికిని అనఁగా ప్రకరణాది రూపకములకును నాటికా ద్యుపరూపకముల కును. అందు—

౨౭౭. నాటకమున వృత్తము ప్రసిద్ధము; అయిదు సంధులు (౩౩౭).— విలాసము బుద్ధి లోనగు గుణములును నానావిభూతులును ఉండును; అది సుఖ దుఃఖ సముద్భూతములగు నానారసములచే నిరంతరమును అగును. అందు అయిదు మొదలు పది వఱకు అంకములు చెప్పఁబడినవి. నాయ కుఁడు ప్రసిద్ధవంశుఁడు, రాజర్షి, ధీరోదాత్తుఁడు(౬౬), ప్రతాపవం తుఁడు, గుణవంతుఁడు, దివ్యుఁడేని దివ్యాదివ్యుఁడేని కావలయును. శృంగారమే గాని వీరమే గాని ఒకటే రసము అంగి, కడమ రసము లన్నియు అంగములు. కార్య నిర్వహణమందు అద్భుతరసము. కావ్య వ్యాపృత పురుషులు నలువు రైదుగురు ముఖ్యులు. దాని బంధనము గోపుచ్ఛాగ్రమునకు సమమయిన యగ్రము గలదిగా చెప్పఁబడినది.

ప్రసిద్ధము రామాయణాది ప్రసిద్ధము వృత్తము.— ఉదా— రామచరిత లోన గునది. సంధులు పిమ్మట చెప్పఁబడును. నానావిభూతులు గలది యనఁగా మహా సహాయ మనుట. సుఖదుఃఖసముద్భూతత్వము రామయుధిష్ఠిరాది వృత్తాంతముల యందు వ్యక్తము. రాజర్షులు దుష్యంతాదులు. దివ్యులు శ్రీకృష్ణాదులు. దివ్యాది వ్యుఁడు ఎవఁడు దివ్యుఁడయ్యును తన్ను నరునిగా భావించుకొనునో ఆతఁడు. ఉదా.— శ్రీరామచంద్రుఁడు. గోపుచ్ఛాగ్రసమాగ్ర మనఁగా క్రమముగా అంకములు చిన్నవి కావలయు నని కొందఱు; ఇతరు లందురు:—'ఏప్రకారముగా ఆవు తోఁక లో కొన్ని వెండ్రుకలు కుఱుచలు కొన్ని నిడుదలుంగా నుండునో అట్లే ఇందును ఏవేని కార్యములు ముఖసంధిలో సమాప్తములును ఏవేని ప్రతిముఖమందును; అట్లే ఇతరములందును ఏవేని ఏవేనియుంగా.' అని.

అంక లక్షణముం జెప్పుచున్నాఁడు—

౨౭౮. అంకము— నాయకుని చరితమును ప్రత్యక్షముగాఁ జూపునది, రసము చేతను భావముచేతను వెలుఁగునది, శబ్దార్థములు అగూఢముగా నుండునది, చిన్న గద్యములతోఁ గూడినది, ప్రత్యేకమయిన యవాం

తర ప్రయోజనము కలది (నాటకములో నొక ప్రత్యేకభాగ మనుట), ఇంచుక యంటిన బిందువు(3౧౯)కలది, పెక్కు కార్యములతోఁ గూడినది కాదు, బీజమును సంప్రాప్తిని చూపనిది, నానావిధాన సంయుక్తము, కడునెక్కువ పద్యములు గలది కాదు, ఆవశ్యక కార్యములకు విరోధము కలుగని యట్లుగా నిర్మితము, అనేకదినములు పట్టిన కథతోఁ గూడినట్టిది కాదు, ఆసన్ననాయకము, మువ్వురు నలువురు పాత్రములు కలది.

అంకమందు— దూరమునుండి పిలుచుట, చంపుట, యుద్ధము, రాజ్య విప్లవము, దేశాది విప్లవము, వివాహము, భోజనము, శాపము, మల విసర్జనము, చావు, రతము, దంతచ్ఛేద్యము, నఖచ్ఛేద్యము, లజ్జాకర మగునది ఇంక నేదేనియు, నిద్ర, అధరపానాదికము, నగరాదుల ముట్టడి, స్నానమాడుట, మైపూఁతం బూసికొనుట, ఇవి కూడవు. అంకము ఎక్కువ విస్తరముగలదిగా నుండఁగూడదు. రాజపత్నీ పరిజ నాదులయు అమాత్య వణిజులయు భావరసోద్భవములయిన ప్రత్యక్ష చిత్ర చరిత్రములతో కూడినదిగా నుండవలయును. అంతమందు పాత్రము లన్నియు నిష్క్రమింపవలయును.

బిం ద్వాదులు పిమ్మట చెప్పఁబడును. ఆవశ్యక కార్యములనఁగా సంధ్యా వందనాదులు.

౨౭౯. ఒక యంకముయొక్క యుదరమందు చొచ్చిన వేఱొకయంక మేది గలదో రంగద్వారము ఆముఖము లోనగునవి కలది బీజము కలది ఫల ము గలదియును అది గర్భాంక మనఁబడును.

*ఉదా.— బాలరామాయణంబున రావణుంగూర్చి కంచుకి.— ' పెక్కులైన చెవులతో త్రాగఁదగినది, దీర్ఘములైన పెక్కుకన్నులతో చూడఁదగినది, నీకొఱకే యన రచింపఁ బడినది,సీతాస్వయంవరణ మనియెడు నాట్యము.' ఇత్యాదిగా విరచితము సీతాస్వయం వర మనుపేరి గర్భాంకము.

౨౮౦. అందు తొలుత పూర్వరంగము పిమ్మట సభాపూజయు అటుపిమ్మట కవి పేరు నాటకము పేరు చెప్పుటయు, అనంతరము ఆముఖము.

అందు అనఁగా నాటకమందు.

౨౮౧. దేనిని నాట్యవస్తువుకంటె పూర్వమే రంగ విఘ్నోపశాంతికొఱకు కావింతురో అది పూర్వరంగ మనంబడును. దీనికి ప్రత్యాహారము లోనగు నంగములు పెక్కులు కలవు; అయినను (ఆయంగములలో) అవశ్యముగా విఘ్నోపశాంతికై నాందిని కావింపవలయును.

దాని స్వరూపముం జెప్పుచున్నాఁడు.——

౨౮౨. ఆశీర్వచనముతోఁ గూడినదిగా దేవద్విజనృపాదుల స్తుతి యేది ప్రయోగింపఁబడునో అది నాంది యని పేర్కొనంబడినది. మంగళ్యములయిన శంఖ చంద్రాబ్జ కోక కైరవములను చెప్పునది, పండ్రెండు పదములతోఁ గాని, లేక, ఎనిమిది పదములతోఁ గాని కూడుకొన్నట్టిది.

ఎనిమిది పదములది అనర్ఘరాఘవమున ‘ నిష్ప్రత్యూహ ’ మిత్యాది. పండ్రెండు పదములది మాతాతపాదుల పుష్పమాలయందు.——

‘ శిరసి ధృత సురాపగే స్మరారా, వరుణ ముఖేన్దు రుచి గ్గిరీన్ద్రపుత్రీ
అథ చరణయుగానతే స్వకాన్తే, స్మితసరసా భవతోఽస్తు భూతిహేతుః. ’

[‘ స్మరారి సురాపగను శిరమున ధరించినందులకు అరుణముఖేందుకాంతియై అనంతరము స్వకాంతుఁడు చరణయుగానతుఁడు కాఁగా స్మితసరసయైన గిరీంద్రపుత్త్రి మీకు ఐశ్వర్యము నొసంగుఁగాక. ’]

ఇట్లు ఇతరస్థలములందును.

ఇది నాందియని యొకానొకని మతము ననుసరించి చెప్పుట. వాస్తవమున ‘ఇది పూర్వరంగముయొక్క రంగద్వార మనుపేరి యంగము.’ అని చెప్పఁబడుచున్నది. అట్లు చెప్పఁబడియున్నది—‘ ఎందువలన మొదట అభినయ మిందు తేఁబడునో అందువలన వాగంగాభినయాత్మకమయిన యిది రంగద్వార మని యెఱుఁగఁబడును.’ అని. మఱియు చెప్పినప్రకారంపు నాందిని రంగద్వారముకన్న ముందే నటులు చేయవలసినట్లుగా మహర్షి నిర్దేశించినాఁడు. అందువలననే కాళిదాసాది మహాకవి ప్రబంధములయందును

‘ వేదాన్తేషు య మాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ,
యస్మి న్నీశ్వర ఇత్య నన్యవిషయః శబ్దో యథార్థాక్షరః,
అన్త ర్యశ్చ ముముక్షుభి ర్నియమిత ప్రాణైః పరం మృగ్యతే,
స స్థాణుః స్థిర భక్తి యోగ సులభో నిఃశ్రేయసా యాస్తు వః. ’

* [ఎవనిని వేదాంతములందు రోదసిని వ్యాపించియున్న యేకపురుషుంగాఁ జెప్పుదురో, అనన్యవిషయమైన యీశ్వర శబ్దము ఎవ్వనియందు యథార్థాక్షరమో, ఎవనిని ముముక్షువులు ప్రాణాదులను నిరోధించి లోన వెదకుదురో, ఆస్థాణుఁడు స్థిరభక్తియోగసులభుఁడు మీకు నిశ్శ్రేయస మొసంగుఁగాక. ]

ఇత్యాదులయందు నాందీలక్షణము పట్టకున్నది. ఇఁక 'రంగద్వారము మొదలుగా కవి (నాటకమును) రచించునది.' అనియు చెప్పఁబడియున్నది. కావుననే ప్రాచీన పుస్తకములందు 'నాన్ద్యన్తే సూత్రధారః' అనుదాని యనంతరమే 'వేదాన్తేషు' ఇత్యాది శ్లోకపువ్రాఁత కనఁబడుచున్నది. ఎచ్చట 'నాన్ద్యన్తే సూత్రధారః' అను వ్రాఁత పిమ్మట అగపడుచున్నదో అచ్చట నభిప్రాయ మేమన 'నాంద్యంతమున సూత్రధారుఁడు దీనిని ప్రయోగించినాఁడు, ఇది మొదలు నాచేత నాటకము తొడంగంబడుచున్నది అని కవి యభిప్రాయము సూచింపఁబడినది.' అని.

౨౮౩. పూర్వరంగమును గావించి సూత్రధారుఁడు నివర్తించును, వానివలెనే స్థాపకుఁడు అంతట ప్రవేశించి కావ్యమును నెలకొల్పును. ఆతఁడు దివ్యమర్త్య వస్తువులను తద్రూపుఁడై, మిశ్రమును ఆయిరువురలో నొకఁడై సూచించును; బీజమును గాని ముఖమును గాని పాత్రము నొండెం గాని సూచించును.

కావ్యార్థమును స్థాపించును గాన స్థాపకుఁడు. వానివలెనే అనఁగా సూత్రధారునికి సదృశమయిన గుణాకారములు గలవాఁడై. ఇప్పుడు పూర్వరంగమును సమగ్రముగా ప్రయోగించుట లేనందున ఒక్కఁడే సూత్రధారుఁడు సర్వమును ప్రయోగించు నని వ్యవహారము. ఆస్థాపకుఁడు దివ్యవస్తువును దివ్యుఁడై, మర్త్యవస్తువును మర్త్యుఁడై మిశ్రవస్తువును దివ్య మర్త్యులలో ఎవ్వఁడేని ఒకరుఁడై సూచింపవలయును. వస్తు వనఁగా ఇతివృత్తము. ఉదా.—ఉదాత్తరాఘవమందు.—

'రాముఁడు తండ్రి యాజ్ఞను మాలికంబోలె శిరమునం దాలిచి కాననమున కేఁగెను; ఆతని యందలి భక్తిచేత భరతుఁడు రాజ్యము నెల్ల తల్లితోఁగూడ విడిచిపైచెను; (ఆయనను) ఆశ్రయించిన సుగ్రీవ విభీషణులు అత్యంతౌన్నత్యముం బొందింపఁబడిరి; గర్వితులయిన రావణాదులు శత్రువులు ధ్వంసము సేయంబడిరి.'

* రామో మూర్ధ్ని నిధాయ కానన మగా న్మాలా మి వాజ్ఞాం గురో;
స్తద్భక్త్యా భరతేన రాజ్య మఖిలం మాత్రా స హైవో జ్ఝితం;
తౌ సుగ్రీవ విభీషణా వనుగతౌ నీతౌ పరా మున్నతిం;
ప్రోత్సిక్తా దశకన్ధర ప్రభృతయో ధ్వస్తాః సమస్తా ద్విషః.

బీజమునకు రత్నావళియందు.—

* ' ఒండు దీవినుండి యేనియు కడలి నడుమనుండి యేనియు దిక్కుయొక్క తుదినుండి యేనియు అభిముఖీభూతుఁడైన విధి అభిమతమును క్షణములో తెచ్చి కూర్చును. '

ఇచట సముద్రములో ఓడ పగులుటచేత మునిఁగిపోయి తేలిన రత్నావళి అనుకూలమైన దైవ సంపత్తిచేత వత్సరాజ గృహమందు ప్రవేశముం బొందుట యౌగంధరాయణుని వ్యాపారముం దొడంగి రత్నావళీప్రాప్తికి బీజము.

ముఖ మనఁగా శ్లేషాదులచేత ప్రస్తుత వృత్తాంతమును ప్రతిపాదించునదైన వాగ్విశేషము.— ఉదా.—

‡ ' ప్రకట నిర్మల చంద్ర ప్రకాశముం బొంది విశుద్ధమైన నీళ్ళచేత రమణీయమై కటిక చీఁకటి గల యుగ్రంపు మేఘకాలమును పెకలించివైచి మంకెనచెట్లను పూవులతో నిండించుచు ఇదె శరత్సమయము— దశకంఠుని నిర్మలఖడ్గముం బూని పెకలించి రాముండును నిజ బంధువులకు జీవ మొసంగ కూర్చిరని గాఢ తమో గుణుని దశాస్యుని పెకల్చి(వచ్చిన) శ్రీరాముండునుంబోలె— వచ్చినది. '

పాత్ర మెట్లన, శాకుంతలమున్లో—

† ' ఇతఁడె రాజు దుష్యంతుఁడు అతివేగమయిన సారంగముచేతనుం బోలె హారి యయిన నీ గీతరాగముచేత నేను బలాత్కారముగ హరింపఁబడితిని. '

౨౮౮. అతఁడు కావ్యార్థమును సూచించునదై మధురములగు శ్లోకముల చేత రంగముం బ్రసన్నముం గావించుకొని యాసకముయొక్కయు కవియొక్కయు నామమును గోత్రాదికమును గూడ కీర్తింపవలయును. భారతీవృత్తిని ఆశ్రయించి ప్రాయికముగా ఏదే నొక ఋతువును కీర్తించును.—

అతఁడు స్థాపకుఁడు. ప్రాయికముగా అనుట కొన్నిచోట్ల ఋతువును కీర్తింపమియు. ఉదా.— రత్నావళియందు.

---

* ద్వీపా దన్యస్మా దపి మధ్యా దపి జలనిధే ర్దిశోఽప్యన్తాత్
ఆనీయ ఝటితి ఘటయతి విధి రభిమత మభిముఖీభూతః.

‡ ఆసాదిత ప్రకట నిర్మల చన్ద్రహాసః, ప్రాప్తః శరత్సమయ ఏష విశుద్ధకాన్తః
ఉత్ఖాయ గాఢతమసం ఘనకాల ముగ్రం, రామో దశాస్య మివ సమ్భృత బన్ధుజీవః.

† త వాస్మి గీత రాగేణ హారిణా ప్రసభం హృతః.
ఏష రా జేవ దుష్యన్తః సారఙ్గే ణాతిరంహసా.

భారతీవృత్తియో.—

౨౮౫. భారతీవృత్తి యనఁగా నరాశ్రయంబును సంస్కృతప్రాయంబును నగు వాగ్వ్యాపారము.

సంస్కృతబహుళంబును వాక్ప్రధానంబును నగు వ్యాపారము భారతి.

౨౮౬. దానికి ప్రరోచన వీథి ప్రహసనము ఆముఖమును అంగములు. ఎచట ప్రశంసచేత ఉన్ముఖీకరణమో అది ప్రరోచన.

ప్రశంసచేత ప్రస్తుతాభినయములయందు శ్రోతలను ఉన్ముఖులం జేయుట ప్రరోచన. ఉదా. రత్నావళియందు—

* 'శ్రీహర్షుఁడు నిపుణుఁడగు కవి, ఈపరిషత్తును గుణగ్రాహిణి, లోకమునలో వత్సరాజు చరిత్రము మనోహరము, మేము నాట్యములో నేర్పరులము. ఇట నొక్కొక్క వస్తువును వాంఛితఫల మబ్బుటకు కారణము, మఱి ఏమి! నాభాగ్యాతిశయముకలన గుణముల సమూహ మంతయు నమకూడినది.'

వీనికి ప్రహసనములు పిమ్మట చెప్పఁబడును.

ఆముఖముం జెప్పుచున్నాఁడు.—

౨౮౭. ఎందు నటియేని విదూషకుఁడేని పారిపార్శ్వకుఁడేగాని, సూత్రధారునితోఁ గూడినవారై స్వకార్యజనితములును ప్రస్తుతాక్షేపులును ఐన చిత్రవాక్యములతో ఒండొరులతో సల్లాపము సేయుదురో దానిని ఆముఖ మని యెఱుంగవలయును, ప్రస్తావన యనియును దానికి పేరు.

సూత్రధారసదృశుఁడు గావున స్థాపకునిఁ గూడ సూత్రధారుఁ డనుట. అతని యనుచరుఁడు పారిపార్శ్వకుఁడు. ఇతఁడు సూత్రధారునికన్న కొంచెము తక్కువవాఁడైన నటుఁడు.

౨౮౮. ఉద్ఘాత్యకము కథోద్ఘాతము ప్రయోగాతిశయము ప్రవర్తకము అవలగితము అని ప్రస్తావనా భేదములు నాలుగు.

అందు.—

---

* శ్రీహర్షో నిపుణః కవిః, పరిష ద ప్యేషా గుణగ్రాహిణీ,
లోకే హారి చ వత్సరాజ చరితం, నాట్యే చ దక్షా వయం;
వ స్త్వేకైక మ పీహ వాఞ్ఛిత ఫల ప్రాప్తేః పదం, కిం పున-
ర్మద్భాగ్యోపచయా దయం సముదితః సర్వో గుణానాం గణః.

౨౮౯. ఎందు అర్థము పొందుపడని పదములను వానికి అర్థము పొందుపడున ట్లుగా నరులు ఇతరపదములతోఁ గూర్తురో అది ఉద్ఘాత్యకము అనఁ బడును.

ఉదా— ముద్రారాక్షసమున సూత్రధారుఁడు.— ‘ క్రూరగ్రహము ఆకేతువు చంద్రు నసంపూర్ణమండలు నిపుడు బలిమిమెయి నభిభవింపఁజూచుచున్నాఁడు.’

[దీని మూలమయిన సంస్కృతము పైయర్థమున నగతార్థము. ఆమూలమునకు శ్లేష చే నర్థాంతరము కలదు.

‘ గట్టి పట్టుదల గలవాఁడు(అమాత్యరాక్షసుఁడు) మలయకేతు సమేతుఁడై చంద్రగుప్తుని సంపూర్ణమండలుని అభిభవింపఁజూచుచున్నాఁడు.’ అని.]

పైవాక్యమునకు అనంతరము—

* ‘ [నేపథ్యమున] ఆ! ఎవఁడు వీఁడు నేను బ్రదికియుండఁగా చంద్రగుప్తుని పూర్ణమండలుని అభిభవింపఁ గోరెడువాఁడు! ’

[మరల సూత్రధారుఁడు.— ‘ ఇతనిని బుధగ్రహముతోడి యోగము రక్షించుచున్నది.’ దీనివలన సూత్రధారుని వాక్యమునకు అర్థమునం బొందిక కలిగినది. దీని మూలమునకు ‘ కోవిదుఁడైన చాణక్యునితోడి యోగము చంద్రుని రక్షించుచున్నది. ’ అని శ్లేషచే అర్థాంతరము. ఈయర్థముచేత చాణక్యుని మతమునను పూర్వోక్త వాక్యమునకు అర్థ సంగతి కలిగినది.]— ఈకుండలీకృతము ఆంధ్రకర్త చేర్చినాఁడు.

ఇచట అన్యార్థము గలవాని నైనను పదములను మనస్సులోని యర్థగతిచేత అర్థాంత రముం బొందించి పాత్రము ప్రవేశించినది.

౨౯౦. సూత్రధారుని వాక్యమును గాని దాని యర్థమును గాని కొని పాత్ర ము ప్రవేశించునేని అది కథోద్ఘాత మనంబడును.

వాక్యము కొని ప్రవేశించుటకు ఉదా.— ‘ ఒండు దీవినుండి యేని’ ఇత్యాదిని (౨౮3) సూత్రధారుఁడు పఠింపఁగానే “ [నేపథ్యమున]ఔను అది యట్లే. ఏమి సందేహము? ‘ ఒండు దీవినుండి యేని ’ ఇత్యాది పఠించి యౌగంధరాయణుఁడు ప్రవేశించును.

‡ ‘ వాక్యార్థముం గొని ప్రవేశించుటకు ఉదా.— ‘ శత్రువుల శాంతిచేతను వైరాగ్ని అటి

* “ క్రూరగ్రహః స కేతు శ్చన్ద్ర మస మ్పూర్ణమణ్డల మిదానీం అభిభవితు మిచ్ఛతి బలాత్ :— (ఇత్యర్ధోక్తే) నేపథ్యే- ఆః! క ఏష మయి స్థితే చన్ద్రగుప్త మభిభవితు మిచ్ఛతి!

‡ నిర్వాణ వైర దహనాః ప్రశమా దరీణాం నన్దన్తు పాణ్డుతనయాః సహ మాధవేన రక్త ప్రసాధిత భువః క్షత విగ్రహా శ్చ స్వస్థా భవన్తు కురురాజసుతాః.

పోఁగా పాండుతనయులు మాధవునితోఁగూడ ఆనంద మనుభవింతురుగాక. ఆశ్లే ధృతరాష్ట్రపుత్రులును సభృత్యులుగా అనురాగముచేత భువిని వశీకరించి కలహములు తీఱి స్వస్థముగా నుందురుగాక. '

అని సూత్రధారుఁడు పఠింపఁగా దాని యర్థమును కొని

[నేపథ్యమున] ఆ ఓరి దుష్టహృదయుఁడా! వృథామంగళపాఠక! నేను బ్రదికియుండఁగా ధార్తరాష్ట్రులు ఎట్లు స్వస్థు లగుదురు? '

అంతట సూత్రధారుఁడు నిష్క్రమింపఁగా భీమసేనుఁడు ప్రవేశించును.

౨౯౧. ఒక ప్రయోగమందు వేఱొక ప్రయోగమును తలకొల్పుట ఏదో అది ప్రయోగాతిశయ మనంబడును.

ఎట్లన, కుందమాలయందు.—

'[నేపథ్యమున] ఇటు ఇటు రమ్ము ఆర్యా.

సూత్ర.— ఎవ రితఁడు మఱి ఆర్యను పిలుచుటచేత నాకు సాహాయ్యక మొనర్చుచున్నాఁడు? [విలోకించి] అయ్యో! అతిదుఃఖకరముగా నున్నది.

* లంకేశ్వరుని యింట చిరకాలముండిన దని రాముఁడు లోకాపవాద భయాకులుఁడై దేశమునుండియు వెడలనంపిన సీతను గర్భభరాక్రాంతను వీఁడుగో లక్ష్మణుఁడు వనమునకు తివుచున్నాఁడు! '

ఇచట నృత్యప్రయోగముకై తన భార్యం బిలువఁగోరిన సూత్రధారుఁడు ' వీఁడె లక్ష్మణుఁడు సీతను వనమునకు తివుచున్నాఁడు ' అని సీతాలక్ష్మణుల ప్రవేశమును సూచించి నిష్క్రాంతుఁడై తన ప్రయోగమును అతిశయించునదే అగు ప్రయోగమును ప్రయోగించినాఁడు.—

౨౯౨. జరుగుచున్న కాలము నవలంబించి ఎందు సూత్రధారుఁడు వర్ణన సేయునో ఆవర్ణన నాశ్రయించి పాత్రము ప్రవేశించునో అది ప్రవర్తక మనంబడును.

ఉదా.— 'ప్రకట నిర్మల చంద్ర ప్రకాశముం బొంది' ఇత్యాది(౨౮౩). 'అంతట యథానిర్దిష్టుఁడు రాముఁడు ప్రవేశించును.

౨౯౩. ఎందు ఒక ప్రయోగమున సమావేశసముచేత వేఱుకార్యము సాధింపఁబడునో దానిని బుధులు అవలగిత మందురు.

---

* లఙ్కేశ్వరస్య భవనే సుచిరం స్థితేతి రామేణ లోకపరివాద భయాకులేన నిర్వాసితాం జనపదా దపి గర్భగుర్వీం సీతాం వనాయ పరికర్షతి లక్ష్మణోఽయం.

ఉదా.— శాకుంతలమందు సూత్రధారుఁడు నటిని జూచి— ' ఇతఁడే రాజు దుష్యంతుఁడు ' ఇత్యాది (౨౧౩). అంతట రాజు ప్రవేశించుట.

౨౯౪. ఆముఖమందు యథాసంభవముగా వీథ్యంగములను ఇతరములనుం గూడ చేర్పవచ్చును.

ఉద్ఘాత్య కావలగితములే గాక వక్ష్యమాణములైన (౫౨౧) యితర వీథ్యాంగములు నఖకుట్టుఁడు చెప్పిన దేమన—

౨౯౫. నాటకాదులయందు నేపథ్యోక్తమును గాని ఆకాశభాషితమును గాని విని దాని నాశ్రయించియేని ఆముఖముం గావింపవలయును. ఈచెప్పిన యాముఖభేదములలో దేనినే నొకదానిని సూత్రధారుఁడు ప్రయోగింపవలయును. దానిచేత అర్థమునుగాని పాత్రమునుగాని తివిచి ప్రస్తావనాంతమున నిర్గమించునది. తర్వాత వస్తువును ప్రయోగింపవలయును.

వస్తు వనఁగా ఇతివృత్తము.

౨౯౬. ఈవస్తువును పండితులు రెండు విధములుగా కల్పించియున్నారు— ఒకటి ఆధికారికము, రెండవది ప్రాసంగికము. అధికార మనఁగా ఫలమందు స్వామ్యము, తత్స్వామి అధికారి. అతని యితివృత్తమును కవులు ఆధికారిక మందురు.

ఫలమందు అనఁగా ప్రధానఫలమందు. ఉదా.— బాలరామాయణమందు రామచరితము.

౨౯౭. దీనికి ఉపకరణనిమిత్తము ప్రాసంగికము కోరఁబడును.

దీని కనఁగా ఆధికారికేతివృత్తమునకు ఉపకరణనిమిత్తమయిన చరిత మేదో అది ప్రాసంగికము. ఉదా. సుగ్రీవాదిచరితము.

౨౯౮. నాట్యమందు చక్కఁగా విచారించి పతాకాస్థానకమును చేర్పవలయును.

౨౯౯ ఒకవస్తువు చింతితమై యుండ దానివంటిదే మఱియొకటి ఆగంతుకభావముచేత ఎచట ప్రయుక్త మగునో అది పతాకాస్థానకము.

దాని భేదములు జెప్పుచున్నాఁడు.—

ఉత్కృష్టత

300. అతిరిక్తతముగా గుణవతియైన యర్థసంపత్తి ఉపచారములవలన లభించుట పతాకాస్థానకముయొక్క ప్రథమభేదము.

ఉదా.— రత్నావళియందు 'ఇదె వాసవదత్త' అని రాజు ఎప్పుడు ఆమెకంఠమునుండి పాశమును వదలించునో అప్పుడు ఆమాటవలన 'సాగరిక యీసకి' అని గుర్తించి 'ఏమి నాప్రియ సాగరిక.—

(వలదు వలదు నీ కీయత్యంతసాహసము. సకి త్వరితముగా నీవు ఈలతాపాశమును వదలుము. ఓప్రాణేశ్వరీ తరలిన నాప్రాణమును నిలుపుటకు క్షణము నాకంఠమున నీబాహుపాశము నుంపుము.'

ఇట్లు ఫలరూప మయిన యర్థాపు సంపత్తి పూర్వముకన్న ఉపచారాతిశయముచేత గుణవతి అనఁగా ఉత్కృష్టమయినది.

301. మిక్కిలి శ్లిష్టంబును నానాబంధసమాశ్రయంబును అగు వచనము రెండవ పతాకాస్థానకముగాఁ జెప్పఁబడినది.

ఉదా.— వేణియందు.— (రక్త ప్రసాధిత భూములు క్షతవిగ్రహులు నై కురురాజసుతులు సభృత్యులు స్వస్థు లగుదురుగాక.

[రక్త=నెత్తురు, క్షతవిగ్రహులు=దారితదేహులు, స్వస్థులు=స్వర్గస్థులు— అని యమంగళార్థమున].

ఇచట రక్తాది శబ్దములు రుధిరశరీరార్థహేతుక మయిన శ్లేషచేత బీజార్థమును ప్రతిపాదించుటవలన ద్వితీయము పతాకాస్థానకము.

302. ఏది శ్లిష్టప్రత్యుత్తరముతోఁ గూడుకొన్నదై గూఢముగాను సవినయముగాను కార్యమును (302) సూచించునో అది మూఁడవ పతాకాస్థానక మనఁబడును.

గూఢ[లీన] మనఁగా అవ్యక్తార్థము, శ్లిష్ట మనఁగా సంబంధయోగ్యమయిన అభిప్రాయాంతరమందు ప్రయుక్తము. అట్టి ప్రత్యుత్తరముతో కూడుకొన్నట్టిది. అట్టిదిగా సంపాదింపఁబడునది యేదో అది మూఁడవ పతాకాస్థానకము. ఉదా. వేణియందు—

* (కంచుకి— దేవా భగ్నము. రాజు— ఎవనిచేత? కంచుకి— భీమునిచేత (భీమమయిన). రాజు—

* భగ్నం భీమేన భవతో మరుతా రథ కేతనం
పతితం కింకిణీ క్వాణ బద్ధాక్రన్ద మివ క్షితౌ.

ఎవనిది? కంచుకి.— నీది. రాజు— అబ్బ! ఏమి పేర్చెదవు? కంచుకి (భయముతో)— దేవా, నిజము చెప్పుచున్నాను.— భగ్నమయినది భీమునిచేత (భీమమైన) నీది. రాజు- ఇసీ ముసలిపాదలీ, ఏమి నీ కిప్పు డీమతిభ్రమ? కంచుకి- దేవా మతిభ్రమ గాదు, సత్యమే. భగ్నమయినది భీమముచే నీది వాయువుచేత తేరిపడగ (భీమవాయువుచే నీతేరిపడగ భగ్నమయిన దనుట;) చిఱుగంటలపిందు(యొక్క-మోృత)చేత రోదనము చేయుచున్నది వోలె నేలం గూల్పంబడినది. '

ఇచట అర్థోపక్షేపణము దుర్యోధనుని యూరువుల భంగమనెడి ప్రస్తుతముతో సంక్రమించియున్నది.

౨౦౩. రెండర్థముల వచనప్రయోగము సుసంబద్ధము కావ్యమందుఁ గూర్పఁబడినట్టిది ప్రధానమైన యర్థాంతరమును తివుచునది నాలవ పతాకాస్థానకము.

ఉదా— రత్నావళిలో— (ఆంధ్రానువాదము)—

' తే. పాండువును పోత్కలిక దీనిఁ బ్రొవ్వజృంభ సవిరళ శ్వస నోద్గ మాయాసి తాత్మఁ గంతుయుత నొండు సకిఁ బోలెఁ గనుచు లతను బొనరిచెద దేవిముఖమునఁ గినుక కెంపు. '

ఇందు భావ్యర్థము సూచితము. ఇవి నాల్గును పతాకాస్థానకములు, ఒక్కెడ మంగళముకొఱకును ఒక్కెడ నమంగళముకొఱకును ఎల్ల సంధులయందును ప్రయోక్తవ్యములు. ' ఇవి ముఖసంధియం దారంభించి నాలుగు సంధులయందు క్రమముగా వచ్చును. ' అని యొకానొకఁడు చెప్పినదానిని ఇతరులు అంగీకరింపలేదు; ఏలన, అత్యంతోపాదేయములయినట్టి వీనిని అన్నిటిని సర్వత్ర అనియమముగా ప్రయోగించుట యుక్త మగుటంబట్టి.

౩౦౪. నాయకునికి అనుచితమేని రసమునకు విరుద్ధమేని అగు వస్తు వేది కలదో దానిని విడువవలసినది, లేదా వేఱువగనేని కల్పింపవలెసినది.

అనుచితమైన యితివృత్తమునకు ఉదా.— రాముఁడు మోసముగా వాలిం జంపుట. దానిని ఉదాత్తరాఘవములో చెప్పనేలేదు. వీరచరితమందో వాలి రాముం

---

ఉద్దామోత్కలికాం విపాణ్డురరుచం ప్రారబ్ధజృమ్భాం క్షణా-
దాయాసం శ్వసనోద్గమై రవిరలై రాతన్వతీ మాత్మనః
అద్యోద్యానలతా మిమాం సమదనాం నారీ మి వాన్యాం ధ్రువం
పశ్య న్కోపవిపాటలద్యుతి ముఖం దేవ్యాః కరిష్యా మ్యహం.

జంపుటకు వచ్చి రాముని చేత మడిసె నని మార్పఁబడినది.

3౦౫. ఏకథ అంకములందుఁ జూపఁ గూడదో, అయిన అవశ్యము చెప్పవల
సినదిగా సమ్మతమో, ఏది రెండు దినములు మొదలుగా సంవత్సరము
పర్యంతము జరిగినదో ఏది అతివిస్తీర్ణమో అట్టిదాని నెల్ల బుద్ధిమంతులు
అర్థోపక్షేపకముల చేత సూచింపవలయును.

అంకములందుఁ జూపరానిది యుద్ధాది కథ.

3౦౬. వత్సరమునకంటె ఎక్కువ కాలమున జరిగిన వస్తు వేదో దానిని వత్స
రముకంటె తక్కువ కాలములో జరిగినట్లు చేయవలయును.

చెప్పెనుగదా ముని— 'మాసకృతము గాని, వర్షమితము గాని, అట్టి దెల్ల అంకచ్ఛేదమందు చేయవలసినది, సంవత్సరమునకు మించినదానిని మాత్రము ఎప్పుడును చేయఁగూడదు.' అని. ఈవిధముగా పదునాలుగు సంవత్సరములు వ్యాపించిన రామవనవాసమందు విరాధవధాదులు కథాభాగములు ఏవేవి కలవో వానిని వర్షము వర్షావయవము దినయుగ్మము ఇత్యాదులలో నొకదానిచేత సూచించుట విరుద్ధము గాదు.

3౦౭. ఏకదిన నిర్వర్తనీయము లైనను ఏది సమగ్ర దిన నిర్వర్త్యమో దానిని
కూడ అంకచ్ఛేదము గావించి అర్థోపక్షేపకముల చేత వచింపవలసినది.

ఆయర్థోపక్షేపకములు ఏవి అనం జెప్పుచున్నాఁడు.—

3౦౮. అర్థోపక్షేపకములు అయిదు— విష్కంభకము ప్రవేశకము చూళిక
అంకావతారము అంకముఖము అనునవి.

జరిగినవియు జరుగనున్నవియు అగు కథాంశములను సంగ్రహముగా
తెలుపునది విష్కంభము; అంకమునకు ఆదియందు వచ్చును. మధ్యముఁ
డగు నొకనిచేతఁ గాని మధ్యములగు నిరువురచేతఁ గాని ప్రయోగింపఁ
బడునది శుద్ధ మగును, అదేనీచ మధ్యమ ప్రయుక్త మేని సంకీర్ణ మనఁ
బడును.

అందు శుద్ధము మాలతీమాధవములో శ్మశానమందు కపాలకుండలా ప్రయుక్తము, సంకీర్ణము రామాభినందమందు క్షపణక కాపాలిక ప్రయుక్తము.

ఇఁక ప్రవేశకము—

3౦౯. ప్రవేశకము నీచోక్తితో నీచ పాత్ర ప్రయోజితము. రెండంకముల
నడుమ వచ్చును, కడమ విష్కంభమున కెట్లో దీనికిని అట్లే.

రెండంకముల నడుమ ననుటచే ప్రథమాంకాదియందు రాదు. ఉదా.— వేణియందు అశ్వత్థామాంకమున రాక్షసమిథున[ప్రయుక్త]ము.

ఇఁక చూళిక.—

300. తెరచాటుననున్న వారు వృత్తాంతమును సూచించుట చూళిక.

ఉదా.— వీరచరితమందు చతుర్థాంకమునకు ఆదిలో ‘ [నేపథ్యమున]ఓహో యి విమాన చారులారా రంగమంగళములను జరుపుఁడు. ’ ఇత్యాది. ‘ రాముఁడు పరశురాముని జయించెను. ’ అని నేపథ్యములోని పాత్రములచేత సూచితము.

ఇఁక అంకావతారము—

301. అంకాంతమందు పాత్రములచేత సూచింపఁబడినదై ఎందు ఆయంకము తో విభాగము లేకుండ అంకము అవతరించునో అది అంకావతార మనంబడును.

ఉదా. అభిజ్ఞానమందు పంచమాంకమున సూచితమై షష్ఠాంకము ఆయంకము యొక్క యవయవవిశేషముం బోలె అవతరిల్లినది.

ఇఁక అంకముఖము —

302. ఎచట ఒకయంకమందు అంకముల సూచన సర్వమును చేయఁబడునో అది అంకముఖ మనంబడును. అది బీజమును అర్థమును వెల్లడించును.

ఉదా.— మాలతీమాధవములో ప్రథమాంకాదియందు కామంద క్యవలోకితలు భూరివసు ప్రభృతులయు భావి భూమికలయు వలసిన కథాప్రబంధముయొక్కయు సన్నివేశమును ప్రసంగవశమున సూచించినారు.

303. ఒండె, అంకాంతపాత్రములు భిన్నాంకముయొక్క అర్థమును సూచించిన అంకముఖ మగును.

అంకాంతపాత్రము లనఁగా అంకాంతమందు ప్రవేశించిన పాత్రములు.

ఉదా.— వీరచరితమందు ద్వితీయాంకాంతమందు ‘ [ప్రవేశించి] సుమంత్రుఁడు.— భగవంతులు వసిష్ఠ విశ్వామిత్రులు మిమ్ము సభార్గవులను పిలుచుచున్నారు. ఇతరులు.— ఏరీ భగవంతులు? సుమంత్రుఁడు.— మహారాజ దశరథుని కడను. ఇతరులు.— అట్లయిన అచటికే పోవుదము. ’ ఇట్లని అంకము తుదను ‘ (అంతట కూర్చున్నవారుగా వసిష్ఠ విశ్వామిత్ర పరశురాములు ప్రవేశింతురు.) అను నిచట పూర్వాంకాంతమందే ప్రవేశించినవాఁడైన సుమంత్రుఁడు శతానంద జనక కథా విచ్ఛేదంబున ఉత్తరాంక ముఖమును సూచించుటవలన అంకాస్యము అని.

ఇది ధనికమతానుసారంబున చెప్పఁబడినది. ఇతరులో ఇది అంకావతరణము చేతనే గతార్థ మని వచింతురు.

३०४. ఆకాంక్షితమైన నీరస వస్తు విస్తరమును విడిచి ఎప్పుడు శేషమును చూపునో అప్పుడు నాట్యమందు ఆముఖానంతరము ఆముఖ సూచిత పాత్రములతో విష్కంభకమును ప్రయోగింపవలయును.

ఉదా.— రత్నావళిలో యౌగంధరాయణుఁడు ప్రయోగించిన విష్కంభకము.

३०५. ఎప్పుడు సరసమయిన వస్తువు మూలమునుండియే ప్రవర్తిల్లునో అప్పుడు ఆముఖసూచితమై అంకము ఆదిలోనే ప్రారంభింపవలయును.

ఉదా.— శాకుంతలమున.

३०६. విష్కంభకాదులచేత నేనియు అధికారియొక్క వధను చెప్పఁగూడదు. రసవస్తువులను ఒకదానిచేత నొకదానిని మఱుఁగింపఁగూడదు.

రసము శృంగారాది. ధనికుఁడును అట్లే వచించినాఁడు. 'అతిరసముచేత వస్తువును దూరముగా త్రెంచివైవఁ గూడదు; వస్త్వలంకార స్వరూపములచేత రసము నేని మఱుఁగు సేయఁగూడదు.' అని.

३०७. బీజము బిందువు పతాక ప్రకరి కార్యము అని అర్థప్రకృతులు అయిదు. వీని నెఱిఁగి యథావిధిగా కూర్పవలయును.

అర్థప్రకృతులు అనఁగా ప్రయోజన సిద్ధి హేతువులు.
అందు బీజము.—

३०८. ఇంచుకగానే ఉద్దేశింపఁబడినదై బహుప్రకారముల ఏది ప్రసరించునో అది ఫలమునకు మొదలి హేతువు బీజ మని చెప్పఁబడును.

ఉదా.— రత్నావళియందు వత్సరాజునకు రత్నావళి దొరకుటకు దైవానుకూల్య సహకృతమయిన యౌగంధరాయణుని వ్యాపారము. ఒండె ఉదా. వేణియందు ద్రౌపదీ కేశ సంయమన హేతువు భీమసేనుని క్రోధముచేత పెంపొందిన యుధిష్ఠిరోత్సాహము.

३०९. అవాంతరార్థము త్రెగఁగా బిందువు త్రెగనీకుండెడు కారణము.

ఉదా.— రత్నావళియందు అనంగపూజాపరిసమాప్తియందు కథార్థము విచ్ఛి

న్నము కాఁగా 'చంద్రుని పాదములనుం బోలె ఉదయనుని పాదములను' అని విని సాగరిక '[హర్షముతో] ఏమి ఈయన ఆ యుదయనన రేంద్రుఁడా? ' ఇత్యాది అనంత రార్థ హేతువు.

3౨౦. వ్యాపి యగు ప్రాసంగిక వృత్తము పతాక యనఁబడును.

ఉదా.—రామచరితమందు సుగ్రీవాదుల చరితము, వేణియందు భీమసేనుని చరితము, శాకుంతలమందు విదూషకుని చరితము.

3౨౧. పతాకానాయకునికి స్వకీయమయిన ఫలాంతరము పతాక కాదు; గర్భ సంధియందుఁ గాని విమర్శసంధియందుఁ గాని దానికి నిర్వాహము కలుగును.

ఉదా.— సుగ్రీవాదులకు రాజ్యప్రాప్తి.

'గర్భాంతమున నేని విమర్శాంతమున నేని పతాక ముగిసిపోవును. ' అని మునిచెప్పినాఁడే అచట ' పతాక యనఁగా పతాకా నాయక ఫలము, పతాక నిర్వహణ సంధి పర్యంతము ప్రవర్తిల్లుటం గనుచున్నాము గావున. ' అని అభినవగుప్తపాదులవారు వివరించినారు.

3౨౨. ప్రాసంగికము ఏకదేశ వృత్తి యగు చరితము ప్రకరి యనఁబడును.

ఉదా.— కులపత్యంకమందు రావణ జటాయు సంవాదము.

3౨3. ప్రకరీనాయకుని స్వకీయ ఫలాంతరము (ప్రకృతానుపయోగి) ప్రకరి కాదు.

దేనిని సాధించుటకై అపేక్షయో, ఆరంభము దేనిం గూర్చినదో, దేని సిద్ధికొఱకు సాధనసామగ్రిం గూర్చుటయో అది కార్య మనఁబడును.

ఉదా.— రామచరితమందు రావణవధము.

3౨౪. ఫలార్థులు తొడంగిన కార్యమునకు అవస్థలు అయిదు: ఆరంభము యత్నము ప్రాప్త్యాశ నియతాప్తి ఫలాగమము.

అందు.—

3౨౫. ముఖ్యఫలసిద్ధికి ఔత్సుక్య మేది కలదో అది ఆరంభ మగును.

ఉదా.— రత్నావళియందు రత్నావళిని అంతఃపురమందు నెలకొల్పుటకు

యౌగంధరాయణుని యౌత్సుక్యము. ఇట్లు నాయక నాయికాదులకు సంయుతము ఔత్సుక్యమును ఆకరములయందు ఎఱుఁగునది.

౩౨౬. ఫలావాప్తికై అతిత్వరాయుక్తమయిన వ్యాపారము ప్రయత్న మనఁబడును.

ఉదా.— రత్నావళియందు.— ‘అట్లైనను వేఱు దర్శనోపాయము లేదని ఎట్లో ఒక యట్లు చిత్తరువు వ్రాసి నాకోరినట్లు చేసెదను.’

ఇత్యాదిచేత ప్రతిపాదింపఁబడినట్టిది రత్నావళియొక్క చిత్రలేఖనాదికము వత్సరాజ సంగమోపాయము. ఉదాహరణాంతరము రామచరితమందు సముద్రబంధనాది.

౩౨౭. ఉపాయాపాయ శంకలచేత ప్రాప్తి సంభవము ప్రాప్త్యాశ.

[సంభవము కలుగు నని తోఁచుట].

ఉదా.— రత్నావళియందు నాలవ యంకములో వేషము మార్చుకొనుట అభిసరణము లోనగు సంగమోపాయమువలనను వాసవదత్తా రూపాపాయ శంకచేతను అనిర్ధారితమైన యేకాంత సంగమ రూప ఫలప్రాప్తి ప్రత్యాశ. ఇట్లే ఇతరస్థలములందును.

౩౨౮. అపాయము తొలంగుటచేత నిశ్చితమయిన ప్రాప్తి నియతాప్తి యనంబడును.

అపాయము లేమిచేత నిర్ధారితైకాంత ఫలప్రాప్తి నియతాప్తి. ఉదా.— రత్నావళియందు.— ‘రాజు.— దేవిని ప్రసన్నురాలిని చేసికొనుట తప్ప ఇందులకు వేఱుపాయముం గానను.’ అని దేవీరూపమయిన యపాయమును నివారించుకొనుటచేత నియత ఫల ప్రాప్తి సూచితము.

౩౨౯. సమగ్రఫలోదయ మేదో ఆయవస్థ ఫలయోగ మనఁబడును.

ఉదా.— రత్నావళియందు రత్నావళీ లాభము చక్రవర్తిత్వలక్షణ ఫలాంతర లాభ సహితము. ఇట్లు అన్యస్థలములందును.

౩౩౦. ఈ యైదవస్థలతో యథాసంఖ్యముగా కూడికచేత ఇతివృత్తముయొక్క యయిదు భాగములు అయిదు సంధు లగును.

సంధిలక్షణమును చెప్పుచున్నాఁడు.—

౩౩౧. ఏకాన్వయము కలిగియున్నవానికి అవాంతరైకార్థముతో సంబంధము

సంధి యనంబడును.

ఒక ప్రయోజనముతో అన్వితములయిన కథాంశములకు అవాంతరైక ప్రయోజన సంబంధము సంధి యనంబడును.

దాని భేదములం జెప్పుచున్నాఁడు.—

332 ముఖము ప్రతిముఖము గర్భము విమర్శము ఉపసంహారము అని దీనికి అయిదు భేదములు కలవు; వరుసగా వాని లక్షణములు చెప్పఁబడు చున్నవి.—

ఉద్దేశక్రమమున లక్షణములం జెప్పుచున్నాఁడు.—

333 ఎచట నానావస్తురసములను కలిగించుచు బీజ సముత్పత్తి ప్రారంభముతో కూడుకొని యుండునో అది ముఖ మనఁబడును.

ఉదా.— రత్నావళియందు ప్రథమాంకమున.

334. ముఖసంధిలో ఉంపఁబడినట్టిది ఫలప్రధానోపాయము అగపడియు నగపడనియట్లు ఉద్భేదముం బొందుట ఎచటనో అది ప్రతిముఖము నాఁబడును.

ఉదా.— రత్నావళియందు ద్వితీయాంకమున.—వత్సరాజ సాగరికా సమాగమ హేతు వయిన యనురాగ బీజము ప్రథమాంకమందు సూచింపఁబడినట్టిది సుసంగతా విదూషకులకు తెలియుటచేత ఇంచుక అగపడునదియు వాసవదత్త చేత చిత్రఫలక వృత్తాంతమువలన ఇంచుక ఊహింపఁబడినదియు నై ఉద్దేశరూపమయిన యుద్భేదముం (= మొలతెంచుట) బొందినది.

335. ఫలప్రధానోపాయము మున్ను ఒకపాటి యుద్భేద మొందినట్టిది ఎచట సముద్భేదము (= నిండుగాఅంకురించుటయు) మాటిమాటికి హ్రాసము (= అడ్డుపొందుటయు) అన్వేషణమును (= వెదకుటయును) గలదిగా నుండునో అది గర్భసంధి యనఁబడును.

ఫలమును గర్భీకరించుటవలన గర్భము. ఉదా.— రత్నావళియందు ద్వితీయాంకమున—

* సుసంగత.— సఖి నీవు ఇపుడు అదక్షిణురాలవుగా నున్నావు, ఈవిధముగా ఏలినవారు చేయి పట్టినను కోపము మానవు '

ఇత్యాదియందు సముద్భేదము, వెండియు వాసవదత్తా ప్రవేశమున అద్భుపొందుట. తృతీయాంకమున.—

‘ ప్రియావార్తను అన్వేషించుటకై పోయిన వసంతకుఁడు తామసించుచున్నాఁ డేమి? ’
అని యన్వేషణము.

‘ విదూషకుఁడు — హీహీ! ఓహోహో! ఆశ్చర్య మాశ్చర్యము! ఇప్పుడు నావలన ప్రియ వయస్యునికి ఎంత హృదయానందము కలుగునో అంత యానందము కౌశాంబీ రాజ్య లాభముచేతఁ గూడ కలుగదు.’

ఇత్యాదియందు ఉద్భేదము. వెండియు వాసవదత్త కనిపట్టుటవలన ప్రాసము. సాగరిక సంకేతస్థానమునకు పోవుటయందు అన్వేషణము. వెండియు లతాపాశముం గావించుకొనుటయందు ఉద్భేదము.

ఇఁక విమర్శ.—

336. ఎందు ముఖ్యఫలోపాయము గర్భసంధియందు ఏపాటి యుద్భిన్నమైనదో అంతకన్న అధికముగా నుద్భిన్నమై శాపాదులచేత సవిఘ్నంబునో అది విమర్శ యనఁబడును.

ఉదా.— శాకుంతలమున చతుర్థాంకాదియందు.—

‘ అనసూయ.— ప్రియంవదా, ప్రియసఖి శకుంతల గాంధర్వవివాహముచేత నిర్వృత్తకల్యాణయై తగిన భర్తనుం బొందిన దని నాహృదయము నిర్వృతమయినది, కాని నన్ను ఈచింత బాధించుచున్నది. ’

అనుట మొదలుగా సప్తమాంకమందు శకుంతలను రాజు కని మెఱుఁగు పర్యంతము అర్థసంచయము శకుంతలా విస్మరణ రూప విఘ్నముచే ఆలింగితమై యున్నది.

ఇఁక నిర్వహణము.—

337. ఎందు బీజమును ముఖాదు లగు నితివృత్త భాగములును తమతమ తావుల నెలకొల్పఁబడినట్టివి ఏకప్రయోజనముం బొందింపఁబడునో అది నిర్వహణము.

ఉదా.— వేణియందు.— ‘ కంచుకి— [సమీపించి] మహారాజా, వర్ధిల్లుచున్నావు. వీఁడుగో భీమసేనుఁడు దుర్యోధనుని రక్తముతో సర్వశరీరమును ఎఱ్ఱనై గుర్తు తెలియక యున్నాఁడు. ’

ఇత్యాదిచేత ద్రౌపదీకేశసంయమనాది ముఖసంధ్యాది బీజములకు తమతమ స్థానములందు ఉపక్షిప్తములయినవానికి ఏకార్థయోజనము.— ఉదాహరణాంతరము- శాకుంతలమున సప్తమాంకమున శకుంతలను రాజు తెలిసికొన్న పిమ్మటి యుత్తరోత్తరార్థరాశి.

వీని యంగములం జెప్పుచున్నాఁడు.—

౩౩౮. ఉపక్షేపము పరికరము పరిన్యాసము విలోభనము యుక్తి ప్రాప్తి సమాధానము విధానము పరిభావన ఉద్భేదము కరణము భేదము ఇవి ముఖసంధ్యంగములు.

ఉద్దేశక్రమమున వీనికి లక్షణములం జెప్పుచున్నాఁడు.

౩౩౯. కావ్యార్థము తలసూపుట(=సముత్పన్నమగుట) ఉపక్షేప మనఁబడును.

* ఉదా.— వేణియందు— ' లక్కయింటి నిప్పుచేతను విషాన్నముచేతను జూదమునం జొప్పించుటచేతను ప్రాణములయందును ధనసంచయములందును మమ్ము కొట్టి పాండవ భార్యా వస్త్ర శిరోజములను లాగినట్టి ధార్తరాష్ట్రులు నేను బ్రతికియుండఁగా స్వస్థముగా (సుఖముగా-స్వస్థులుగా) ఉందురు!

౩౪౦. అట్లు సముత్పన్నమయిన యర్థము విరివిం జెందుట పరికర మనఁబడును.

† ఉదా.— అచటనే.—'నాకు శిశుత్వమందే కౌరవులతో ఏవైరము పెరిఁగెనో దానికి అన్న కారణము గాఁడు, అర్జునుఁడు గాఁడు, మీరునుం గారు. జరాసంధుని యురఃస్థలమును బోలె దిట్టముగా అదికిన సంధిని భీముఁడు క్రోధముచేత వెండియు విడఁజేయును, మీరు కూర్పుఁడు.'

౩౪౧. దాని నిష్పత్తి పరిన్యాసము.

[నిష్పత్తి=నిశ్చయముం బొందుట].

---

* లాక్షాగృహానల విషాన్న సభాప్రవేశైః ప్రాణేషు విత్తనిచయేషు చ నః ప్రహృత్య
ఆకృష్య పాణ్డవవధూ పరిధాన కేశాన్ స్వస్థా భవన్తి మయి జీవతి ధార్తరాష్ట్రాః!

† ప్రవృద్ధం యద్వైరం మమ ఖలు శిశోరేవ కురుభి
ర్న తత్రార్యో హేతు ర్న భవతి కిరీటీ న చ యువాం;
జరాసన్ధ స్యోరఃస్థల మివ విరూఢం పునరపి
క్రుధా భీమః సన్ధిం విఘటయతి, యూయం ఘటయత.

* ఉదా.— అచటనే ‘ సుడియుచున్న బాహువుచేత త్రిప్పఁబడిన దెబ్బదంపు గదయొక్క వ్రేటుచేత దుర్యోధనుని రెండు తొడలను విఱుగఁగొట్టినవాఁడై పేరుకొని దట్టముగా మెత్తుకొనియున్న వాని నెత్తుటితోడి యెఱ్ఱని చేతులతో దేవీ నీశిరోజములను భీముఁడు. కై సేయును. ’

ఇచట ఉపక్షేప మనఁగా కావ్యాభిధేయమైన యితివృత్తమును సంక్షేపముగా ఉపక్షేపించుట (ప్రస్తావించుట) మాత్రమే; పరికర మనఁగా దానినే పెంచుట; పరిన్యాస మనఁగా నిశ్చయరూపత్తిరూపమున దానినే అంతటను హృదయమందు ఉంచుట; అని వీనిలో భేదము. ఈ మూఁడంగములును ఈచెప్పిన వరుసనే వచ్చును. కడమ యంగములు వేఱు విధంబుగను వచ్చును.

౩౪౨. గుణములను ఉగ్గడించుట విలోభనము.

ఉదా.— అచటనే— ‘ ద్రౌపది—నాథ పరికుపితుఁడ వగుచువేని నీకు దుష్కర మేమి యుండును? ’ ఒండె— మదీయ చంద్రకళయందు చంద్రికశా వర్ణనంబున— “ ఈరమణి ‘ యౌవనముయొక్క విలాసము ’ ” ఇత్యాది (౧౩౧).

శాకుంతలాదులయందు ‘ గ్రీవా భంగాభిరామమ్ ’ ( ‘ శ్రీమిూఱం ద్రిప్పి గ్రీవఁ ’) ఇత్యాది పదికలదో మృగాదివర్ణనము అది బీజార్థసంబంధము లేనందున సంధ్యంగము గాదు. ఇట్లే ఇతరాంగములకును ఊహించుకొనవలయును.

౩౪౩. అర్థముల సంప్రధారణము యుక్తి.

[సంప్రధారణము= కర్తవ్యత్వ నిశ్చయము].

† ఉదా — వేణియందు సహదేవుఁడు భీమునిఁగూర్చి— ‘ ఆర్యా, ఏమి మహారాజ సందేశమును నీవు అవ్యుత్పన్నముం బోలె గ్రహించితివి? ’ ఇదిమొదలు ‘ మీకు క్రోధముచేత శత్రుకులమును సమయించుట లోకములో లజ్జాకరము, భార్యను సభలో సిగ పట్టి యీడ్చుట లజ్జాకరము కాదు. ’ అను భీమవచనమువఱకు.

౩౪౪. సుఖము వచ్చుట ప్రాప్తి.

* చఞ్చద్భుజభ్రమితచణ్డగదాభిఘాతసఞ్చూర్ణితోరుయుగళస్య సుయోధనస్య
స్త్యానావనద్ధఘనశోణితశోణపాణి రుత్తంసయిష్యతి కచాంస్తవ దేవి భీమః.

† యుష్మాన్ హ్రేపయతి క్రోధా ల్లోకే శత్రుకులక్షయః,
న లజ్జయతి దారాణాం సభాయాం కేశకర్షణం.

ఉదా.— అందే— ‘ యుద్ధమున క్రోధమున నూర్వుర ఇత్యాది (౨౬౬).

‘ ద్రౌపది— [విని హర్షముతో] నాథా, పూర్వ మెప్పుడును విననిది సుమా యీవచనము. కావున మరల మరలం జెప్పుము. ’

౩౮౭. బీజముయొక్క యాగమనము సమాధాన మనంబడును.

[ఆగమనము = ప్రధాన నాయకాభిమతమని ఎఱుకపడుట].

* ఉదా.— అందే.— ‘[నేపథ్యమున] ఓహోయి విరాటు ద్రుపద ప్రభృతులారా, వినుఁడు.— ఏదేని సత్యవ్రతమునకు భంగము వచ్చెడు నని మనస్సులో భయపడి (యుధిష్ఠిరుఁడు) పూనికతో అణఁచిపెట్టుకొనెనో, శమవంతుఁడై కులమునకు శాంతిం గోరి మఱువనుం గూడఁగోరెనో, ఏది ద్యూతారణియందు ద్రౌపదీ కేశాంబరముల యాకర్షణములచే నుప్పతిల్లెనో ఆ దొడ్డ కోపాగ్ని యిదె యౌధిష్ఠిరము కౌరవకాననమున పేర్చుచున్నది.

ఇచట ‘ నేను జీవించియుండఁగా స్వస్థులగుదురు ’ (౩౩౯) ఇత్యాది బీజము ప్రధాననాయకాభిమతముగా చక్కఁగా ఆహితమయినందువలన సమాధానము.

[ఆహితము=ప్రతిష్ఠితము]

౩౮౮. సుఖ దుఃఖ కృత మయిన యర్థము ఏదో అది విధాన మని చెప్పఁబడును.

† ఉదా.— బాలచరితమందు ‘ వత్సా, నీ యుత్సాహాతిశయమును నీ బాల్యమును చూడఁగా నా మనస్సు హర్షవిషాదములచేత ఒక్కుమ్మడి నాక్రాంతము. ’

‘ ఒండె, ఉదా.— మదీయమైన ప్రభావతియందు— ‘ ఎంత చూచినను కనుఁగవకు’ ఇత్యాది (౨౪౯).

౩౮౯. కుతూహలోత్తరములైన వాక్యములు పరిభావన యనంబడును.

ఉదా.— వేణియందు ద్రౌపది యుద్ధ మగునా కాదా యని సంశయించుచున్నదై తూర్యశబ్దానంతరము ‘ నాథా, ఏమి యిపుడు ఇది ప్రళయాభ్ర నిర్ఘోష మంథరము క్షణక్షణమునను రణభేరి వాయింపఁబడుచున్నది? ’

---

* యత్సత్యవ్రత భఙ్గ భీరు మనసా యత్నేన మన్దీకృతం,
యద్విస్మర్తు మపీహితం శమవతా శాన్తిం కుల స్యేచ్ఛతా,
తద్ద్యూతారణి సమ్భృతం నృపసుతా కేశామ్బ రాకర్షణైః
క్రోధజ్యోతి రిదం మహ త్కురువనే యౌధిష్ఠిరం జృమ్భతే.

† ఉత్సాహాతిశయం వత్స తవ బాల్యం చ పశ్యతః
మమ హర్షవిషాదాభ్యా మాక్రాన్తం యుగప న్మనః.

3౪౮. బీజార్థము మొలకెత్తుట ఉద్భేద మనఁబడును.

ఉదా.— అందే— 'ద్రౌపది.— నాథా, మరల నీవు నన్ను సమాశ్వాసింపవలయును.

* భీముఁడు.— అవమానదైన్యంపు లజ్జచే మాసిన మోము గలవానిని కౌరవ్యులను నిశ్శేషులం జేయనివానిని వృకోదరుని మరల చూడవు.'

3౪౯. కరణ మనఁగా ప్రకృతార్థ సమారంభము.

ఉదా.— అందే— 'దేవీ, కురుకులమును నాశ మొందించుటకు నేను పోయెదను.' అని.

3౫౦. భేద మనఁగా సంఘాతమును భేదించుట.

ఉదా.— అందే— 'కావుననే ఇప్పటినుండి నేను మీతో వేఱయితిని.'

కొందఱు 'భేదము ప్రోత్సాహనము' అని వచింతురు.

ఇఁక ప్రతిముఖ సంధ్యంగములు.—

3౫౧. విలాసము పరిసర్పము విధూతము తాపనము నర్మము నర్మద్యుతి ప్రగమనము విరోధము పర్యుపాసనము పుష్పము వజ్రము ఉపన్యాసము వర్ణసంహారము అనునవి ప్రతిముఖమందు అంగములు.

అందు.—

3౫౨. రతిభోగముకొఱకైన కోరిక విలాస మనఁబడును.

రతిలక్షణమయిన భావమునకు హేతుభూతమయిన భోగము అనఁగా విషయము ప్రమదయేని పురుషుఁడేని ఏదో దానికొఱకు కోరిక విలాసము. ఉదా.— శాకుంతలమున—

† 'సతి సులభ గా దెలుఁగుదుఁ గా మతి మఱి తద్భావ దర్శనంబునఁ దనిసెఁ గా;
కృతి గాకయె మరుఁ డున్నను రతి నుభయ ప్రార్థనము తిరంబుగఁ జేయుఁ గా.'

3౫3. దృష్టమై నష్టమైన దానిని వెదకుట పరిసర్ప మనఁబడును.

ఉదా.—శాకుంతలమందు.—

* భూయః పరిభవ క్లాన్తి లజ్జా విధురి తాననం
అనిఃశేషిత కౌరవ్యం న పశ్యసి వృకోదరం.

† కామం ప్రియా న సులభా మన స్తు త ద్భావ దర్శ నాశ్వాసి
అకృతార్థేఽపి మనసిజె రతి ముభయప్రార్థనా కురుతే

* 'మును దెస నభ్యున్నతముగా ఘన జఘనముచేత వెనుకకడ నిమ్నంబుగా
, గన నగు నిదె ద్వారమ్మున వినూతన మడుగు జాడ వెలఁది యిసుమునన్.'

31౮. చేసిన యనునయమును తొలుత పరిగ్రహింపమి విధుతము.

ఉదా.— అందే— 'అంతఃపుర విరహ పర్యుత్సుకుని రాజర్షిని మీరు నిర్బంధింపకుఁడు.' కొందఱు 'విధుత మన నరతి' అని చెప్పుదురు.

319. ఉపాయాదర్శన మేదో అది తాపన మనఁబడును.

‡ ఉదా.— రత్నావళి యందు.— 'సాగరిక— దుర్లభజనునియందు దనురాగము, లజ్జ అధికము, నేను పరాధీనురాలను, ప్రియసఖి నా ప్రేమ విషమముగా నున్నది. ఇఁక మరణ మొక్కటే నాకు శరణము.'

32౦. పరిహాస వచనము నర్మము.—

ఉదా.— రత్నావళి యందు.— 'సుసంగత— సఖి, దేనికొఱకు (ఎవనికొఱకు) నీవు వచ్చితివో అది (అతఁడు) నీ యెదుర నున్నది (నున్నాఁడు). సాగరిక— [అభ్యసూయతో]— ఎవనికొఱకు నేను వచ్చితిని? సుసంగత— ఏల వేఱుగా శంకించెదవు? చిత్రఫలకముకొఱకుఁ గాదా?'.

321. పరిహాసమువలన జనించిన హర్షము నర్మద్యుతి యనఁబడును.

ఉదా.— అందే.— 'సుసంగత— సఖి నీవు అదక్షిణురాలవు సుమా, ఏలన ఇట్లు భర్త చేతితోఁ బట్టుకొన్నను కోపము మానవు. సాగరిక.— (బొమముడి దాల్చి యించుక నవ్వి) సుసంగతా ఇప్పటికిని ఎగతాళి మానవు.

కొందఱు దోషమును కప్పునట్టి హాస్యమును నర్మద్యుతి యందురు.

322. ఉత్తరోత్తరమయిన వాక్యము ప్రగమన మనఁబడును.

† ఉదా.— విక్రమోర్వశియందు.— 'ఊర్వశి— జయము జయము మహారాజునకు. రాజు.—

---

* అభ్యున్నతా పురస్తా దవగాఢా జఘన గౌరవా త్పశ్చాత్
ద్వారేఽస్య పాణ్డుసికతే పదపఙ్క్తి ర్దృశ్యతేఽభినవా.

‡ దుల్లహ జ ణాను రాఓ, లజ్జా గురుఈ, పరఅసో అప్పా;
పిఅసహి విసమం పెమ్మం; మరణం సరణం ణవరి ఎక్కం.

[ఛాయా]

దుర్లభ జ నానురాగో, లజ్జా గుర్వీ, పరవశ ఆత్మా;
ప్రియసఖి విషమం ప్రేమ; మరణం శరణం న వర మేకం.

† మయా నామ జితం యస్య త్వయా జయ ఉదీర్యతే

జయ మనఁగ నాదె తరుణి యే జయపదంపుఁ బ్రాప్తి లేదొ సహస్రాక్షునకున్నఁ బెఱకు
ఆ జయపదంబు మోదమానాస్య వగుచుఁ జెలువ నా కిప్పు డుచ్చరించితివి గాన.'

౩౫౯. విరోధ మనఁగా కీడుం జెందుట.

ఉదా.— చండకౌశికమందు— 'రాజు.— నిక్కముగా జాల్మఁడనై నేను గ్రుడ్డివాని వలె వెలుంగుచున్న జ్వాలా కలాపములతోడి నిప్పును పాదములతో ఆక్రమించితిని.'

౩౬౦. చేసినదానికై మన్నింపు వేఁడుకొనుట పర్యుపాసనము.

ఉదా.— రత్నావళి లో— 'విదూషకుఁడు.— ఓయి కోపముచేయకు, ఇదిగో అది అరఁటిచెంట్రిలోనికి పోయినది.' ఇత్యాది.

౩౬౧. విశేషవచనము పుష్పము.

ఉదా.— అందులోనే— '(రాజు చేయిపట్టుకొని స్పర్శను నటించును.) విదూషకుఁడు— ఓయి వయస్యుఁడా, ఈమెను అపూర్వశ్రీని నీవు పొందితివి. రాజు.— వయస్యా, సత్యము.

* శ్రీదేవియ యగు నిజ మీ పైదలి, కేల్ పారిజాత పల్లవమ యగుఁ
గాదేని యేల తొరఁగుఁ గ స్వేదచ్ఛద్మమున నమృతశీకరగణముఁ గ.'

౩౬౨. ప్రత్యక్షనిష్ఠురము వజ్ర మనఁబడును.

ఉదా.— అందులోనే— 'రాజు—ఇచ్చటనున్న నన్ను నీ వెట్లెఱింగితివి? సుసంగత — నిన్ను మాత్రమే గాదు, చిత్రఫలకమును గూడను. మఱి పోయి దేవికి నివేదించెదను.'

౩౬౩. ప్రసాద మొందించుట ఉపన్యాసము.

ఉదా.— అందులోనే— 'సుసంగత— ప్రభూ, శంక వలదు; నేనును భర్తృనీప్రసాదముచేత ఇట్టి పసదనములం బొంది క్రీడించుచునే యున్నాను. అంతకన్న నాకు ఈగొప్పప్రసాదముం గావింపుము; ఏమన, నన్నేల నీ విక్కడ వ్రాసితి వని ఈనాప్రియసఖి సాగరిక నాపై కోపము చేయుచున్నది. కావున ఈమెనే కోపము తీర్పుము.

కొందఱు 'ఉపపత్తి కృత మయిన యర్థము ఉపన్యాస మని కీర్తితము' అని చెప్పుదురు.

అందుల కుదాహరింతురు.— రత్నావళి యందే— 'బలునోట్రిది గర్భదాసి యిది.' అని.

౩౬౪. చాతుర్వర్ణ్యముయొక్క మేళనము వర్ణసంహార మనఁబడును.

---

జయశబ్దః సహస్రాక్షా దగతః పురుషాన్తరం.

* శ్రీ రేషా పాణి ర ప్యస్యాః పారిజాతస్య పల్లవః
కు తోఽన్యథా స్రవ త్యేష స్వేదచ్ఛ ద్మామృతద్రవః?

* ఉదా.— మహావీరచరితమందు తృతీయాంకమున— 'ఇవి ఋషుల పరిషత్తు, ఈయన వీరుఁడు మంత్రులతోఁగూడ వృద్ధరాజు లోమపాదుఁడును, అవిరతయజ్ఞుఁడు పురాణబ్రహ్మవాది జనకులప్రభువు ఈతఁడు సయితము నిన్ను వేఁడుకొనుచున్నారు.'

అను నిట ఋషి క్షత్త్రాది వర్ణముల మేళనము.

అభినవగుప్తపాదులవారో 'వర్ణ శబ్దముచేత పాత్రాదులు ఉపలక్షింపఁబడుచున్నవి, సంహార మనఁగా మేళనము.' అని వివరించి అందులకు రత్నావళీ ద్వితీయాంకమున 'ఇంతకన్న నాకు ఇది ఎక్కువ ప్రసాదము' ఇత్యాదికము మొదలుకొని 'అయ్యా చేయి పట్టుకొని యీమెను కోపము తీర్పుము. రాజు.— ఎక్కడ ఈసకి ఎక్కడ' ఇత్యాదిని ఉదాహరణముగా చూపినారు.

ఇఁక గర్భాంగములు.—

౩౬౫. అభూతాహరణము మార్గము రూపము ఉదాహరణము క్రమము సంగ్రహము అనుమానము ప్రార్థన క్షిప్తి త్రోటకము అధిబలము ఉద్వేగము విద్రవము ఇవి గర్భాంగములు. అందు వ్యాజాశ్రయ మగు వాక్యము అభూతాహరణము.

‡ ఉదా.— అశ్వత్థామాంకమున—'అశ్వత్థామ హతిఁ జెందెను' అని స్పష్టముగా చెప్పి యుధిష్ఠిరుఁడు సత్యవచనుఁడు మెల్లఁగా వాక్యసమాప్తికై ఏనుఁగు అని పలికెను.'

౩౬౬. తత్త్వార్థ కథనము మార్గము.

† ఉదా.— చండకౌశికమందు.— "రాజు— భగవానుఁడా భార్యా తనయ విక్రయముచేత ఆర్జించిన దీనిని పుచ్చుకొమ్ము. శేషముకొఱకు చండాలునికైనను నన్ను అమ్ముకొని యొదను."

---

* పరిష దియ మృషీణా మేష వీరో యుధాజి—
త్సహ నృపతి రమాత్యై ర్లోమపాద శ్చ వృద్ధః
అయ మవిరతయజ్ఞో బ్రహ్మవాదీ పురాణః
ప్రభు రపి జనకానా మద్రు భో యాచక స్తే.

‡ అశ్వత్థామా హత ఇతి పృథాసూనునా స్పష్ట ముక్త్వా
స్వైరం శేషే గజ ఇతి కిల వ్యాహృతం సత్యవాచా
[త చ్ఛ్రుత్వాసౌ దయితతనయః ప్రత్యయా త్తస్య రాజ్ఞః
శస్త్రా ణ్యాజౌ నయనసలిలం చాపి తుల్యం ముమోచ.]

† గృహ్యతా మర్జిత మిదం భార్యా తనయ విక్రయాత్
శేషస్యార్థే కరిష్యామి చణ్డాలే ష్వాత్మవిక్రయం.

3౬౭. వితర్కము కలదైన వాక్యము రూపము.

‡ ఉదా.— రత్నావళి యందు— ‘ రాజు—

ప్రకృతిచేతనె మన సస్థిరమ్ము మఱియు వీకు గోచరము గుఱివెట్టి యేయ
అట్టు లైనను నా మన సెట్టు లేసెఁ గాముఁ డొక్కట సర్వ శిలీముఖములఁ. ’

3౬౮. ఉత్కర్షతోఁ గూడుకొన్న వచనము ఉదాహరణ మనంబడును.

* ఉదా.— అశ్వత్థామాంకములో—

‘ పాండవసేనలలో నిజ భుజ గురు మదము కలవాఁడై ఎవఁడెవఁడు శస్త్రముం దాల్చెనో, పాంచాలవంశములో శిశువు గాని అధికవయస్కుఁడు గాని తల్లికడుపులోనే ఉన్న వాఁడు గాని ఎవఁడెవఁడు కలఁడో, ఆపనికి ఎవఁడెవఁడు సాక్షియో, నేను రణమునం జరించుచుండఁగా నన్నెవఁడెవఁ డెదిరించునో, వాఁడు వాఁడు జగదంతకుఁ డైనను వానికి వానికి క్రోధాంధుఁడను నే నిట సంతకుఁడను. ’

3౬౯. భావ తత్త్వమును కనుంగొనుట క్రమ మగును.

† ఉదా.— శాకుంతలమున.— ‘ రాజు.— యుక్తము గదా మాయ మఱచిన కంటితో నేను ప్రియను చూచుట—

పదములఁ గూరుచుచో నీ ముదిత ముఖాంబురుహ మొక్క బొమలత నిక్కఁ బొదివిన క్రొంబులకల గండదర్పణముచేతఁ దెలుపు నాపై వలపుఁ.

3౭౦. సంగ్రహ మనఁగా సామదానములచే నొక యర్థము నెఱవేఱుట.

ఉదా.— రత్నావళియందు.— ‘ రాజు— సరియే వయస్యుఁడా, ఇదిగో నీకు పారితోషికము. (అని కడియ మిచ్చును.) ’

3౭౧. లింగముచేత నూహించుట అనుమానము.

[లింగము= గుర్తు].

---

‡ మన శ్చలం ప్రకృ త్యైవ; దుర్లక్ష్యం చ; తథాపి మే
కామేన త త్కథం విద్ధం సమం సర్వైః శిలీముఖైః ?

* యో యః శస్త్రం బిభ ర్తి స్వభుజగురుమదా త్పాణ్డవీనాం చమూనాం
యో యః పాఞ్చాలగోత్రే శిశు రధికవయా గర్భశయ్యాం గతో వా
యో య స్త త్కర్మ సాక్షీ చరతి మయి రణే యశ్చ యశ్చ ప్రతీపః
క్రోధాన్ధ స్తస్య తస్య స్వయ మిహ జగతా మన్తక స్యాన్త కోఽహం.

† ఉన్నమి తైక భ్రూలత మానన మస్యాః పదాని రచయన్త్యాః
కణ్టకితేన ప్రథయతి మ య్యనురాగం కపోలేన.

* ఉదా.— జానకీరాఘవనాటకమందు— రాముఁడు.— 'భూమిని అదరఁజేయు విలాసపు నడకలచేతను, ఎల్లలోకములఁ దనకు నతశరములం జేయు తన చూపులచేతను, బంగారు పసిమి దేహముచేతను, అతఁడు తన సూర్యతనయత్వమును అధృష్యత్వమును ఊహింపఁ జేయుచున్నాఁడు.'

32౨. రతి హ ర్షోత్సవములను ప్రార్థించుట ప్రార్థన యనఁబడును.

† ఉదా.— రత్నావళి యందు.— 'ప్రియా, సాగరికా,

మ. అమృతాంశుండు మొగంబు, కల్వలు కనుల్, హస్తంబు లంభోజముల్,
విమలోరుల్ కదళోదరంబులు, బిసాభిఖ్యంబు లౌ బాహువుల్;
రమణీ, హ్లాదకరాఖిలాంగకవు మార కూరిర బాణాగ్నిచేఁ
గమలం గ్రాఁగిన నాదు గాత్రములఁ గాఁక న్గాఁగిట న్మాన్పవే.'

ప్రార్థన యనుపేరి యీయంగము ఎవరి మతంబున నిర్వహణ సంధియందు అవసరము కడచిపోయినందున ప్రశస్తి యను నంగము లేదో వారి మతము ననుసరించి చెప్పఁబడినది. అటుగాదేని అంగములకు అఱువదియై దనెడి సంఖ్య ప్రసక్తించును.

323. రహస్యార్థము బయలువడుట క్షిప్తి యనంబడును.

‡ ఉదా.— అశ్వత్థామాంకమునందు.— 'కేశగ్రహమున నొకటికే దారుణమైన విపాకము భూమిలో పేర్చుచున్నది. ఈ రెండవ కేశగ్రహముచేత ప్రజలు నిశ్చయముగా నిశ్శేషితులగుదురు.

324. రుష్టుని వచనము త్రోటక మగును.

ఉదా.— చండకౌశికమున— 'కౌశికుఁడు— ఆ యిప్పటికిని స్వర్ణదక్షిణలు చెల్లలే దేమి!'

---

* లీలాగతై రపి తరఙ్గయతో ధరిత్రీ—
మాలోకనై ర్నమయతో జగతాం శిరాంసి
త స్యానుమాపయతి కాఞ్చన కాన్తి గౌర—
కాయస్య సూర్యతనయత్వ మధృష్యతాం చ.

† శీతాంశు ర్ముఖ, ముత్పలే తవ దృశౌ, పద్మానుకారౌ కరౌ,
రమ్భాస్తమ్భనిభం త థోరుయుగళం, బాహూ మృణాళోపమౌ,
ఇ త్యాహ్లాదకరాఖిలాఙ్గి, రభసా న్నిఃశఙ్క మాలిఙ్గ్య మా
మఙ్గాని త్వ మనఙ్గతాపవిధురా ణ్యేహ్యేహి నిర్వాపయ.

‡ ఏకస్య తావ త్పాకోఽయం దారుణో భువి వర్తతే
కేశగ్రహే ద్వితీ యేఽస్మి న్నూనం నిఃశేషితాః ప్రజాః.

3౭౫. మిష చేత నభిప్రాయము నెఱుంగుట అధిబలము.

ఉదా.— రత్నావళియందు— ‘ కాంచనమాల— భట్టినీ, ఇదియే ఆచిత్రశాల. వసంతకునికి సంజ్ఞచేసెదను. ’ ఇత్యాది.

3౭౬. నృపాదులచేత జనితమయిన భయము ఉద్వేగ మనఁబడును.

* ఉదా.— వేణియందు— ‘ ఏకరథారూఢులై ఇటునటు నిన్నడుగుచు కర్ణశత్రుఁ డాతఁడును, తోడేటిపనిచేయువాఁడు ఆక్రూరుఁడు వృకోదరుఁడును వచ్చియున్నారు. ’

3౭౭. శంకా భయ త్రాసములచేఁ గలుగు వేగిరపాటు విద్రవ మనఁబడును.

† ఉదా.— ‘ కాలాంతక ఘోర వక్త్రుని క్రోధోత్కంపితుని దశముఖుని చూడఁగా క్రోఁతుల సేనలో ఒకానొక వేగిరపాటు జనించెను. ’

ఇఁక విమర్శసంధ్యంగములు—

3౭౮. అపవాదము సంఫేటము వ్యవసాయము ద్రవము ద్యుతి శక్తి ప్రసంగము ఖేదము ప్రతిషేధము విరోధనము ప్రరోచన ఆదానము ఛాదనము అని విమర్శయందు అంగములు.

దోషప్రఖ్యాపనము అపవాదము.

ఉదా.— వేణియందు— ‘ యుధిష్ఠిరుఁడు— పాంచాలకుఁడా, ఆకౌరవ్యాపశదుని దురాత్ముని దుర్యోధనుని జాడ ఏమైన తెలిసినదా? పాంచాలకుఁడు— ఒక్క జాడమాత్రమే గాదు, ఆదురాత్ముఁడే దేవీ కేశపాశ స్పర్శ పాతక ప్రధానహేతుభూతుఁడు దొరకినాఁడు. ’

3౭౯. రోషభాషణము సంఫేట మనఁబడును.

‡ ఉదా.— అందులోనే— ‘ రాజు— ఓరి యోరి గాలికొడుకా, ముసలిరాజు మ్రోల నిందితమయిన నీపనిని పొగడుకొనుచున్నావేమిరా! వినరా—

---

* ప్రాప్తావేకరథారూఢౌ పృచ్ఛన్తౌ త్వామితస్తతః
స కర్ణారిః స చ క్రూరో వృకకర్మా వృకోదరః.

† కాలాన్తకకరాళాస్యం క్రోధోద్ధూతం దశాననం
విలోక్య వానరానీకే సంభ్రమః కోఽప్యజాయత.

‡ కృష్టా కేశేషు భార్యా తవ, తవ చ పశోః, తస్య రాజ్ఞ స్తయోర్వా
ప్రత్యక్షం భూపతీనాం మమ భువనపతే రాజ్ఞయా ద్యూతదాసీ
అస్మి న్వైరానుబన్ధే వద కి మపకృతం తై ర్హతా యే నరేన్ద్రా?
బాహ్వో ర్వీర్యాతిరేక ద్రవిణ గురుమదం మా మజిత్వైవ దర్పః.

జగత్పతినైన నేను భూపతులయెదుర నాయాజ్ఞచేత ద్యూతదాసిని సిగపట్టి యీడ్పించితిని. నీభార్యను నీ యొక్కనిదే? పశువా నీది, వానిది, ఆరాజుది, ఆయితువురది. ఆవైరముం జెప్పుకొని నీవు చంపితివే ఆనరేంద్రులు అందు ఏమి యపకారము చేసినారు చెప్పుము. బాహువుల వీర్యాతిభారముచేతను ద్రవిణాతిశయముచేతను మదమెక్కిన నన్ను జయింపక నీకు గర్వ మనఁగా నేమిరా? భీముఁడు— [సక్రోధముగా] ఓరి పాపాత్ముఁడా!' ఇత్యాది.

౩౮౦. ప్రతిజ్ఞయొక్కయు హేతువుయొక్కయు సంభవము వ్యవసాయ మనఁబడును.

[ప్రతిజ్ఞ = కార్యనిర్దేశము; హేతువు = సాధననిర్దేశము; సంభవము = మేళనము.]

* ఉదా.— అందులోనే— 'భీముఁడు—నిహతాశేషకౌరవ్యుఁడు దుశ్శాసనుని నెత్తుటిచేత మత్తెక్కినవాఁడు దుర్యోధనుని తొడలను విఱుగఁగొట్టినవాఁడు వీఁడుగో భీముఁడు శిరస్సుతో మ్రొక్కుచున్నాఁడు.'

౩౮౧. ద్రవ మనఁగా శోకావేగాదులవలనం గలిగిన గురువ్యతిక్రమణము.

† ఉదా.— అందులోనే— 'యుధిష్ఠిరుఁడు.— భగవానుఁడా, కృష్ణునియగ్రజుఁడా, సుభద్రయన్నా,— నాయెడ బంధుప్రీతిని మనస్సున వహింపవైతివి, క్షత్రియుల ధర్మమును గణింపవైతివి, నీతమ్మునికి అర్జునునితోడ ప్రసిద్ధమైన యాసఖ్యమునేని పాటింపవైతివి, నీకు శిష్యులిరువుర యెడను ప్రేమబంధము సమానమే అయిన నగుఁగాక, మందభాగ్యుఁడనయిన నాకు విముఖుఁడవైతివే ఇది న్యాయమా?'

౩౮౨. తర్జనోద్వేజనములు ద్యుతి యనఁబడును.

[తర్జనము = బెదిరింపుమాట. ఉద్వేజనము = భయపడంజేయుట.]

‡ ఉదా.— అందులోనే దుర్యోధనుంగూర్చి భీముఁడు వచించుట:— 'చంద్రనివిమలవంశ

---

* చూర్ణితాశేష కౌరవ్యః క్షీబో దుఃశాసనాసృజా
భఙ్క్త్వా సుయోధనస్యోర్వో ర్భీమోఽయం శిరసాఞ్చతి.

† జ్ఞాతిప్రీతి ర్మనసి న కృతా, క్షత్రియాణాం న ధర్మో,
రూఢం సఖ్యం త దపి గణితం నానుజ స్యార్జునేన,
కామం తుల్యో భవతు భవతః శిష్యయోః స్నేహబన్ధః
కోఽయం పన్థా య దసి విముఖో మన్దభాగ్యే మ యీత్థం?

‡ జ న్మేన్దో ర్మలే కులే వ్యపదిశ; స్యద్యాపి ధత్సే గదాం;
మాం దుశ్శాసన కోష్ణ శోణిత మధు క్షీబం రిపుం భాషసే;

మందు పుట్టువుం జెప్పుకొనుచువు; ఇప్పటికిని గదం దాల్చియే యున్నావు; దుశ్శాసనుని గోరువెచ్చ నెత్తురను మధువుచే మత్తాగొన్న నన్ను రిపునిఁగా తలంచెదవు; గర్వాంధుఁడవై మధుకైటభులం బొలియించిన హరియెడల నయితము ఔద్ధత్య మాచరించెదవు; ఓరి నర పశువా, నాకు అడలి పోరొగ్గి అడుసులోఁ దాఁగెదవు.'

౩౮౩. విరోధము నార్చుట శక్తి.

* ఉదా.— అందులోనే.— ‘ ఆప్తులు కోట్లల నిహతులైన జనుల దేహభారములను అగ్ని సాత్కరింతురుగాక, బంధువులు వీరు బంధులకై కన్నీళ్ళతోఁ గూడిన జలమును ఎట్టకేని ఇత్తురుగాక, హతనరుల యీయడవిలో గద్దలచేతను రాబందులచేతను ఖండితములైన జ్ఞాతిదేహములను వెదకుదురుగాక; సూర్యుఁడు పగతునతోఁగూడ అస్తమిల్లినాఁడు. సైన్యములను వెనుదివియుఁడు.'

౩౮౪. (తన) గురులం గీర్తించుట ప్రసంగము.

† ఉదా.— మృచ్ఛకటికయందు — ‘ చాండాలుఁడు— ఇదుగో ఈతఁడు సాగరదత్తుని కొడుకు ఆర్యవిశ్వదత్తుని మనుమఁడు చారుదత్తుఁడు వధదండనకై వధ్యస్థానమునకు నడిపింపఁబడుచున్నాఁడు; ఈయన పసిఁడిమీఁది లోభముచేత గణికను వసంతసేనను చంపినాఁడఁట యని. చారుదత్తుఁడు— యజ్ఞశతములచేత పవిత్రమయిన యే నాగోత్రమును పూర్వము సభలో ఇల్లు నిండినవారు వేదఘోషములతో పొగడినారో, అదే నాగోత్రము ఇప్పుడు నేను నిధనదశలో నుండుటం బట్టి వారికి విసదృశులైన మనుష్యులు పాపులు చాటింపులో ఉద్ఘోషించుచున్నారు.' అనెడి యిది చారుదత్తుని వధార్థమై కొనిపోవు సమయమందు అతనిగురువులం గీర్తించుట గావున ప్రసంగము.

౩౮౫. మనస్సునందును చేష్టలయందును జనించిన శ్రమ ఖేద మనఁబడును.

మనఃసముత్పన్నమునకు మాలతీమాధవమందు—

---

దర్పాన్ధో మధుకైటభద్విషి హరావప్యుద్ధతం చేష్టసే;
మత్త్రాసా న్నృపశో విహాయ సమరం పఙ్కేఽధునా లీయసే.

* కుర్వన్త్వాప్తా హతానాం రణశిరసి జనా వహ్నిసా ద్దేహభారా,
నశ్రూన్మిశ్రం కథంచి ద్దదతు జల మమీ బాన్ధవా బాన్ధవేభ్యః,
మార్గన్తాం జ్ఞాతిదేహా న్హతనరగహనే ఖణ్డితా న్కఙ్కగృధ్రైః;
రస్తం భాస్వా న్ప్రయాతః సహ రిపుభి రయం. సంహ్రియన్తాం బలాని.

† మఖశతపరిపూతం గోత్ర ముద్భాసితం మే
సదసి నిబిడచైత్యబ్రహ్మఘోషైః పురస్తాత్,
మమ నిధనదశాయాం వర్తమానస్య పాపై-
స్త దసదృశమనుష్యై ర్ఘుష్యతే ఘోషణాయాం.

* 'వ్రీలునుగాని గుండె భయవేగముచే, మఱి గాదు రెండుగా;
సోలునుగాని విహ్వలత సొమ్మల మై, విడ దొర చేతనల్;
కాలుచుఁగాని లోనిసెగ కాయముఁ, జేయదు బుగ్గిగా హతిన్;
గూలుచుఁగాని మర్మములఁగోసెడి దైవము, కోయ దాయువుల్.'

ఇట్లు చేష్టాసముత్పన్నమును.

౩౮౬. ఈప్సితార్థమునకు ప్రతిహతి ప్రతిషేధ మనఁబడును.

ఉదా.— మదీయమైన ప్రభావతియందు విదూషకుంగూర్చి- 'ప్రద్యుమ్నుఁడు— సఖుఁడా, ఏమి నీ వికు నొంటిగా నున్నావే. మఱి ప్రియసఖీజనానుగమ్యమాన నాప్రియతమ ప్రభావతి ఎక్కడ? విదూషకుఁడు— అసురపతి పిలిచి ఎక్కడికో తోడ్కొనిపోయి నాఁడు. ప్రద్యుమ్నుఁడు— (దీర్ఘముగా నిట్టూర్పు పుచ్చి)

† హా పూర్ణచంద్రముఖి మత్తచకోరాక్షి ఓనతాంగి నన్ను విడనాడి ఎట కేఁగితివి? ఓజీవితమా, నీ విపుడు త్వరగాఁ జనుము; ఏఁపనే చూచెడి దైవము కృతకృత్య మగునుగాక.'

౩౮౭. కార్యమునకు భంగము కలుగున ట్లగుట విరోధన మనఁబడును.

ఉదా.— వేణియందు— 'యుధిష్ఠిరుఁడు—

‡ భీష్మమహాసముద్రమును దాఁటి, ఎట్టకేలకు ద్రోణాగ్నిని ఆర్పి, కర్ణవిషసర్పమును సమయించి, శల్యుని దివికిం బంపి, యుండఁగా, జయము స్వల్పావశిష్టమయి యుండఁగా, భీముఁడు ప్రియసాహసుఁడు, మాటచేత మనల నందఱను ప్రాణసంశయమునం గూల్చినాఁడు.'

---

* దళతి హృదయం గాఢోద్వేగం, ద్విధా తు న భిద్యతే;
వహతి వికలః కాయో మోహం, న ముఞ్చతి చేతనాం;
జ్వలయతి తనూ మన్తర్దాహః, కరోతి న భస్మసా;
త్ప్రహరతి విధి ర్మర్మచ్ఛేదీ, న కృన్తతి జీవితం.

† హా పూర్ణచన్ద్రముఖి మత్తచకోరనేత్రే
మా మానతాఙ్గి పరిహాయ కుతో గతాసి?
గచ్ఛ త్వ మద్య నను జీవిత తూర్ణ మేవ;
దైవం కదర్థనపరం కృతకృత్యమస్తు.

‡ తీర్ణే భీష్మమహోదధౌ, కథమపి ద్రోణానలే నిర్వృతే,
కర్ణాశీవిషభోగిని ప్రశమితే, శల్యే చ యాతే దివం,
భీమేన ప్రియసాహసేన రభసా దల్పావశేషే జయే
సర్వే జీవితసంశయం వయ మమీ వాచా సమారోపితాః.

३౮౮. సంహారార్థ ప్రదర్శిని ప్రరోచన యనఁబడును.

[సంహారార్థ ప్రదర్శిని = ఉపసంహ్రియమాణమగుచున్న ప్రయోజనమును ప్రతిపాదించున దగు ప్రోత్సాహన.]

* ఉదా.— వేణియందు.— 'పాంచాలకుఁడు.— నన్ను దేవుఁడు చక్రపాణి పంపినాఁడు. (అని సమీపించి) సందేహము వలదు.

నీ రాజ్యాభిషేకమునకై రత్నకలశములను నీటితో నింపుదురుగాక; ద్రౌపది చిరకాలము ఉపేక్షించియున్న ధమ్మిల్లబంధమును కైసేయును గావుత; తీక్ష్ణ కుఠార భాస్వర కరుఁడై క్షత్త్రియ ద్రోహిచ్ఛేది పరశురాముఁడును క్రోధాంధుఁడు భీమసేనుఁడును యుద్ధములో పైకొనుచుండఁగా (జయమున) పతి సంశయ మెక్కడిది? "

३౮౯. కార్యమును సంగ్రహించుట ఆదాన మనఁబడును.

† ఉదా.— వేణియందు.— 'ఓహోయి శమంతపంచక చారులారా,

నేను రాక్షసుఁడను గాను భూతమను గాను పగతుర రుధిరోదకముచే నిండార చల్లనయిన యొడలుగల క్షత్త్రియుఁడను, గడ్డయిన గొప్ప ప్రతిజ్ఞాసముద్రమును దాఁటినవాఁడను, క్రోధనుఁడను; ఓహోయి యుద్ధాగ్నిజ్వాలలు కాల్చివైవఁగా మిగిలిన రాజన్యులారా, హత గజాశ్వముల బొందులలో దాఁగ నేల? ఇఁక మీకు భయము లేదు. "

ఇచట సమస్త రిపువధకార్యము సంగృహీతమగుటనందున ఆదానము.

३౯౦. కార్యార్థమై యవమానాదికమును ఓర్చుట యేదో అది ఛాదనము.

‡ ఉదా.— అందులోనే 'అర్జునుఁడు.— అన్నా,

వీఁడు అప్రియములు సేయునుగాక, మాటలో శక్తుఁడే గాని చేఁతలో శక్తుఁడు గాఁడు. నూర్గురు తమ్ములు హతులు కాఁగా దుఃఖితుఁడై యున్నాఁడు. వీని ప్రలాపములకు వెతఁ జెంద నేల? "

---

* పూర్యన్తాం సలిలేన రత్నకలశా రాజ్యాభిషేకాయ తే;
కృష్ణాత్యన్త చిరోజ్ఝితే తు కబరీబన్ధే కరోతు క్షణం;
రామే శాత కుఠార భాస్వర కరే క్షత్త్రద్రుమోచ్ఛేదిని
క్రోధాన్ధే చ వృకోదరే పరిపత త్యాజౌ కుతః సమ్భ్రమః?

† నాహం రక్షో, న భూతో, రిపురుధిరజలాహ్లాదితాఙ్గః ప్రకామం
నిస్తీర్ణోరుప్రతిజ్ఞా జలనిధి గహనః క్రోధనః క్షత్త్రియోఽస్మి.
భో భో రాజన్యవీరాః సమరశిఖిశిఖాదగ్ధశేషాః కృతం వ,
స్త్రాసే నానేన లీనై ర్హతకరితురగాన్తర్హితై రాస్యతే యత్.

‡ అప్రియాణి కరోత్యేష, వాచా శక్తో న కర్మణా.
హతభ్రాతృశతో దుఃఖీ. ప్రలాపై రస్య కా వ్యథా?

ఇఁక నిర్వహణాంగములు.—

౩౯౧. సంధి విబోధము గ్రథనము నిర్ణయము పరిభాషణము కృతి ప్రసాదము ఆనందము సమయము ఉపగూహనము భాషణము పూర్వవాక్యము కావ్యసంహారము ప్రశస్తి అని నిర్వహణాంగములు.

అందు —

౩౯౨. బీజమును మరల తెచ్చుకొనుట సంధి యనఁబడును.

ఉదా.— వేణియందు.— "భీముఁడు- యజ్ఞవేదిసంభూతురాలా, ‹ సుడియుచున్న బాహువుచే... కైసేయును. " (౪౪౧) అని నే నన్నమాట నీకు జ్ఞప్తియున్నదా?

ఇందువలన ముఖసంధిలో క్షిప్తమయిన బీజమును మరల తెచ్చుకొన్నందున సంధి.

౩౯౩. విబోధము కార్యమును వెదకుట.

ఉదా.— అందులోనే— ‹ భీముఁడు— అన్నా, న న్నొకక్షణము విడువుము. యుధిష్ఠిరుఁడు.— ఇంకను ఏమి మిగత యున్నది? భీముఁడు.— గొప్పదే మిగిలియున్నది; ఇదే పోయి సుయోధనుని రక్తముతోఁ దోఁగిన యీచేతితో పాంచాలికి దుశ్శాసనావకృష్టమయిన కేశపాశమును ముడిచి వచ్చెదను. యుధిష్ఠిరుఁడు.— పో నీవు, పాపము, ఆ వీనురాలు వేణిసంయమనము ననుభవించునుగాక. '

ఇట కేశసంయమన మను కార్యమును వెదకుటచేత విబోధము.

౩౯౪. కార్యములను వాక్రుచ్చుట గ్రథనము

ఉదా.— అందులోనే— ‹ భీముఁడు.— పాంచాలీ, దుశ్శాసనుఁడు కలంచిన వేణిని నేను బ్రదికియుండఁగా నీవు స్వయముగా ముడుచుకొనఁగూడదుగదా. ఉండు, నేనే ముడిచెదను.

ఇట కార్యమును ఉపక్షేపించుటవలన గ్రథనము.

౩౯౫. నిర్ణయ మనఁగా అనుభవించిన యర్థమును జెప్పుట.

‡ ఉదా.— అందులోనే— ‹ భీముఁడు.— దేవరా, అజాతశత్రూ, ఇప్పుడును దుర్యోధనహతకుఁడా! నేను వాని దేహమును నేల వైచితిని; వాని రక్తమును ఎఱ్ఱచందనము వోలె

‡ భూమౌ క్షిప్తం శరీరం, నిహిత మిద మసృ క్చన్దనాభం నిజాఙ్గే,
లక్ష్మీ రార్యే నిషిక్తా చతురుదధిపయఃసీమయా సార్ధ ముర్వ్యా,
భృత్యా మిత్రాణి యోధాః కురుకుల మఖిలం దగ్ధ మేత ద్రణాగ్నౌ,
నామైకం య ద్బ్రవీషి క్షితిప త దధునా ధార్తరాష్ట్రస్య శేషం.

నా దేహమునం బూనికొంటిని; అన్నయందు లక్ష్మిని చతుఃసాగరజలసీమయగు పృథివి తోఁ గూడ అభిషేకించితిని; ధార్తరాష్ట్రుని భృత్యులు, మిత్రులు, జోదులు, కురుకులము, తమ్ములు, అందఱును రణాగ్నిలో మాడిపోయినారు; ఓభూనాథా వాని పేరు చెప్పితివే ఇప్పుడు వానికి మిగిలియున్నట్టిది అది యొకటే. '

౩౯౬. పరివాదకృతమయిన వాక్యము పరిభాషణము.

ఉదా:—శాకుంతలమందు.— (రాజు.— అమ్మా ఆపూజ్యురాలు ఏ పేరుగల రాజర్షి పత్ని ?
తాపసి.— ధర్మదారపరిత్యాగి నాతని నెవరు పేర్కొందురు?

౩౯౭. సమకూడిన యర్థమును స్థిరపఱుచుట కృతి.

ఉదా:—వేణియందు.— (కృష్ణుఁడు.— వీరే భగవంతులు వ్యాస వాల్మీకి ప్రభృతులు అభిషేకార్థ జలమును పెట్టుకొనియున్నారు. '

ఇచట ప్రాప్తరాజ్యమును అభిషేకమంగళములచే స్థిరపఱుచుట కావున కృతి.

౩౯౮. శుశ్రూషాదికము ప్రసాద మనఁబడును.

ఉదా.— అందులోనే భీముఁడు ద్రౌపదికి తలవెండ్రుకలను ముడుచుట.

౩౯౯. వాంఛితాప్తి ఆనందము.

ఉదా.— అందులోనే— ( ద్రౌపది.— మఱచిపోయిన యీపనిని వెండియు నాథుని ప్రసాదముచేత నేర్చెదను. '

౪౦౦. దుఃఖము తీఱుట సమయము.

ఉదా.— రత్నావళియందు— ( వాసవదత్త— (రత్నావళిం గౌఁగిలించుకొని) ఊఱడిల్లుము చెల్లెలా, ఊఱడిల్లుము. '

౪౦౧. అద్భుత సంప్రాప్తి ఉపగూహనము.

† ఉదా.— మదీయ ప్రభావతియందు నారద దర్శనమువలన ( ప్రద్యుమ్నుఁడు— (ఊర్ధ్వము గాంచి) పరిమళముకై మూఁగుచున్న తుమ్మెదబారుల ధ్వనులు పాటలుగా నొప్పుచున్నట్టి పువుమాలను మెఱపుఁదీగం బోని దానిని దాల్చి చంద్రధవళములైన కాంతులచే దిగంతములను తెలుపుచేయుచు ఇచట మింటినుండి కైలాసాద్రి యేమయినఁ బడుచున్నదో? '

౪౦౨. సామము దానము లోనగునది భాషణము.

---

† దధ ద్విద్యుల్లేఖా మివ కుసుమమాలాం పరిమల -
భ్రమ ద్భృఙ్గశ్రేణీ ధ్వనిభి రుపగీతాం తత ఇతః
దిగన్తం జ్యోతిర్భి స్తుహినకరగౌరై ర్ధవళయ-
న్నితః కైలాసాద్రిః పతతి వియతః; కిం పున రయం. ?

ఉదా.— చండకౌశికమందు— ' ధర్ముఁడు.— కావున రమ్ము ధర్మలోకము నధిష్ఠింపుము.

४०३. మున్ను చెప్పిన యర్థమును హెచ్చరించుట పూర్వవాక్యము.

ఉదా.— వేణియందు ' భీముఁడు.— బుద్ధిమతికా, ఏదీ ఆభానుమతి? పాండవభార్యను ఇప్పుడు ఇప్పుడు హేళనము సేయుమను. '

४०४. వరప్రదానప్రాప్తి కావ్యసంహార మనఁబడును.

ఉదా.— అన్నిటిలోను— ' నీకు ఇంకను ఏమి ప్రియముం జేయవలయును. ' అని.

४०५. నృపులు దేశములు ఇత్యాదులకు శాంతి ప్రశస్తి యనఁబడును.

* ఉదా.— ప్రభావతియందు— ' రాజులు ఎల్లప్పుడును ప్రజలను తమ సుతులంబోలె భేదము లేకుండ చూచుకొందురుగాక; సదసద్వివేక సమర్థులు గుణగ్రాహులు నగు సజ్జనులు సర్వోత్కర్షము ననుభవింతురుగావుత; భూమండలమందు వెల్లుగా సస్య స్వర్ణ సమృద్ధులు వెలయునుగాత; మూఁడులోకములకును నారాయణునియందు అవ్యభిచారిణి యగు భక్తి నెగడుఁగాక. '

ఇందు అంతమున ఉపసంహార ప్రశస్తులు (ఈ)యొకటే క్రమమున రావలయును. ' మఱియు నిట ముఖసంధిలో ఉపక్షేప పరికర పరిన్యాస యు క్త్యుద్భేద సమాధానములకును, ప్రతిముఖములో పరిసర్పణ ప్రగమన వ జ్రోపన్యాస పుష్పములకును, గర్భములో అభూతాహరణ మార్గ తోటక అధిబల క్షేపములకును, విమర్శలో అపవాద శక్తి వ్యవసాయ ప్రలోభ నాదానములకును ప్రాధాన్యము. ఇతరములకు యథాసంభవముగా స్థితి. ' అని కొందఱు.

४०६. ఇట్లు మనీషులచేత అంగము అఱువదినాలుగు భేదములుగా చెప్పఁబడినది. రసమే ప్రధాన మగుటం బట్టి రసానుగుణతం గని అంగములను అనియతమైన సంధియందు సముితము పొందుపఱుపవచ్చును.

ఉదా.— వేణీసంహారమందు తృతీయాంకమున దుర్యోధన కర్ణులకు గొప్ప సంప్రధారణము. ఇట్లు ఇతరంబును. రుద్రటాదులు ' నియమము లే ' అని చెప్పుట ఏది కలదో అది లక్ష్య విరుద్ధము.

४०७. ఇష్టార్థరచన ఆశ్చర్యలాభము వృత్తాంతవిస్తరము ప్రయోగమందు

* రాజానః సుతనిర్విశేషం మధునా పశ్యన్తు నిత్యం ప్రజాః ;
జీయాసుః సదసద్వివేకపటవః సన్తో గుణగ్రాహిణః ;
సస్య స్వర్ణ సమృద్ధయస్సమధికాః సన్తు క్షమామణ్డలే;
భూయా దవ్యభిచారిణీ త్రిజగతో భక్తిశ్చ నారాయణే.

రక్తి కలుగుట గోప్యములకు గోపనము ప్రకాశ్యములకు ప్రకాశనము అని అంగములకు ఆఱువిధముల ఫలము. అంగహీనుఁ డయిన నరుఁడు ఎట్లు పనికి సమర్థుఁడు కాఁడో అట్లే అంగహీనమయిన కావ్యము ప్రయోగమునకు ఉపయోగపడదు. సంధ్యంగమును నాయక ప్రతినాయకులు సంపాదింపవలయును, దానిని గాని చో పతాకాదులను, వానినిం గాని రెండల అట్లే ఇతరమును (సంపాదింపవలయును.)

ప్రాయికముగా సంధ్యంగములు ప్రధాన పురుషులు ప్రయోగింపవలసినవి. అయినను ప్రత్యేపాదులను మూఁటిని బీజము అల్పమాత్రసముద్దిష్ట మగుటవలన అప్రధాన పురుషులు ప్రయోగించుటయే సాధువు.

४०७. రసవ్యక్తిని అపేక్షించియే యీయంగములను ఉంపవలయును. అంతియ కాని కేవలము శాస్త్రస్థితిని నెలకొల్పుటకై యుంపఁగూడదు.

ఉదా.— వేణీయందు దుర్యోధనునికి భానుమతితోడి విప్రలంభము చూపఁబడినది, అది అట్టి యవసరమున కర మనుచితము.

४०८. ఏవృత్తము రసాద్యభివ్యక్తికి అవిరుద్ధ మయినను అనావశ్యకమో దానిని బుద్ధిమంతుఁడు మార్పనైనను మాననైనను వలయును.

ఈరెంటికి నుదాహరణము సత్ప్రబంధములందు ప్రసిద్ధమే.

ఇఁక వృత్తులు.—

४१०. శృంగారమున కైశికి, వీరమున సాత్త్వతి, రౌద్రమునను బీభత్సమునను ఆరభటి, సర్వత్ర భారతి. ఈనాలుగును వృత్తులు, ఇవి సర్వ నాట్యమునకును తల్లులు. ఇవి నాటకాదులయందు నాయకాదుల వ్యాపార విశేషములు.

అందు కైశికి.—

४११. ఏవృత్తి మనోరమమైన భూషణవిశేషములచేత చిత్రంబును, స్త్రీసంకులయు, నిండుగా నృత్యగీతములతో నొప్పారినదియు, కామోపభోగమునకు ప్రభవములైన యుపచారములు గలదియు నగునో, సుందరమైన విలాసముతోఁ గూడుకొన్నట్టిది ఆవృత్తి కైశికి యనఁబడును. దానికి నర్మము నర్మస్ఫూర్జము నర్మస్ఫోటము, నర్మగర్భము నని నాలుగంగములు.—

అందు

౪౧౨. జాణతనముతోడి పరిహాసము ఇష్టజన ప్రీతికరము నర్మము. శుద్ధహాస్యముతోను శృంగారముతోఁ గూడిన హాస్యముతోను భయముతోఁ గూడిన హాస్యముతోను చేయఁబడినదిగా అది మూఁడు విధములు.

అందు కేవలహాస్యముతో చేయఁబడినదానికి ఉదా.— రత్నావళి యందు— 'వాసవదత్త—(ఫలకముంగూర్చి నవ్వుచు) మఱి నీప్రక్క నొకతె వ్రాయఁబడియున్నదే ఇది యేమి వసంతకయ్యవిన్నాణమా? '

సశృంగార హాస్యముతో— ఉదా.— శాకుంతలమున రాజుంగూర్చి— 'శకుంతల— అసంతుష్టుఁడేని అతఁడేమి సేయును? రాజు— ఇట్లు సేయును. (అని ముద్దుగొన నుద్యమించును, శకుంతల పెడమొగము సేయును. )

సభయహాస్యముతో— ఉదా.— రత్నావళి యందు చిత్రరువుం జూచు నవసరమున— 'సుసంగత— నేను ఈవృత్తాంతమును చిత్రఫలకమునుం గూడ ఎఱింగితిని. మఱి పోయి దేవికి నివేదించెదను. '

ఇది వాక్యసంబంధినర్మకు ఉదాహరణము; ఇట్లు వేషసంబంధియు చేష్టాసంబంధియును.

౪౧౩. నర్మస్ఫూర్జ మనఁగా సుఖారంభము భయాంతము నగు నవసంగమము.

* ఉదా.— మాళవిక సంకేతమందు నాయకుని అభిసరింపఁగా—

'నాయకుఁడు—

తే. విడుము సుందరి, కూటమివెఱపు విడుము
తడవుగా నిన్ను వలచిన దయితు నెడల;
ఏను సహకారుఁడనుగ నాయెడను దాల్పు
బండిగురివెందలతిక విభ్రమము నీవు. '

మాళవిక— ప్రభూ, దేవివలని భయముచేత తనకు సయితము ప్రియము చేసికొనలేకున్నాను. 'ఇత్యాది.

ఇఁక నర్మస్ఫోటము—

౪౧౪. ఎందు భావలేశములచే రసము అల్పముగా సూచింపఁబడునో అది

---

*. విసృజ సున్దరి సఙ్గమ సాధ్వసం నను చిరాత్ప్రభృతి ప్రణయోన్ముఖే,
పరిగృహాణ గతే సహకారతాం త్వమతిముక్తలతా చరితం మయి.

నర్మస్ఫోటము.

† ఉదా.— మాలతీమాధవమున—

‘ నడక అలసము, దృష్టి శూన్యము, ఒడలు పసిలేమి, ఊర్పు అధికము; ఇది ఎందున నైయుండును? కాక ఇంతకన్న మఱే మున్నది? లోకములో మన్మథుని యాన చరించు చున్నది, యౌవనము చిత్తవికారమును చేయుచున్నది, అతిమధురములైన యాయా భావములు ధైర్యమును తూలించుచున్నవి. ’

ఇచట అలసగమనాది భావలేశములచేత మాధవునికి మాలతియందు గల యనురాగము ఇంచుక వెలిఁబుచ్చఁబడినది.

౨౧౫. నాయకుఁడు మఱుఁగియుండి కావించు వ్యవహారము నర్మగర్భము.

ఉదా.— అంతలోనే సఖీరూపమును ధరించియున్న మాధవుఁడు మాలతిని మరణప్రయత్నమునుండి వారించుట.

ఇఁకను సాత్త్వతి—

౨౧౬. సత్త్వ శౌర్య త్యాగ దయార్జవములతో నొండుకొనియుండు వృత్తి సాత్త్వతి. అందు హర్ష ముండును, శృంగారము అల్పము, శోకము లేదు, అద్భుతము కలదు. ఉత్థాపకము సాంఘాత్యము సంలాపము, పరివర్తకము నని దాని విశేషములు నాలుగు చెప్పఁబడినవి. శత్రువునకు ప్రోత్సాహము గలిగించు వాక్కు ఉత్థాపక మనఁబడును.

‡ ఉదా.— మహావీరచరిత్రమందు—

‘ నిన్నుఁ జూడఁగా నాకు ఆనందము కలుగుచున్నది, ఆశ్చర్యంబును గలుగుచున్నది. దుఃఖ మొండెఁ గలుగుచున్నది. నిన్నుఁ జూచు నాకంటికిపుడు తనివి తీఱుట యెక్కడిది? ఆమాంగల్యసుఖమునకు భాజనమను గానైతిని; మఱి పెక్కు మాటలవలనం బ్రయోజనమేమి? జామదగ్న్య విజయమును మఱచిన యీబాహువున ధనుస్సు పేర్చునుగాక. ’

---

† గమన మలసం, శూన్యా దృష్టిః, శరీర మసౌష్ఠవం,
శ్వసిత మధికం, కి న్వేతత్స్యాత్? కి మన్య దతోఽథవా?
భ్రమతి భువనే కన్దర్పాజ్ఞా, వికారి చ యౌవనం,
లలిత మధురా స్తే తే భావాః క్షిపన్తి చ ధీరతాం.

‡ ఆనన్దాయ చ విస్మయాయ చ మయా దృష్టోఽసి; దుఃఖాయ వా,
వైతృష్ణ్యం తు కుతోఽద్య సత్ప్రతి మమ త్వద్దర్శనే చక్షుషః?
య న్మాఙ్గళ్య సుఖస్య నాస్మి విషయః; కింవా బహువ్యాహృతైః?
రస్మి న్విస్మృత జామదగ్న్య విజయే బాహౌ ధను ర్జృమ్భతాం.

౪౧౭. మంత్రార్థ దైవ శక్త్యాదులవలన సంహతిని భేదించుట సంఘాత్యక మనఁబడును.

మంత్రశక్తిచేత నెట్లన ముద్రారాక్షసంబున రాక్షససహాయులను చాణక్యుఁడు స్వబుద్ధిచేత భేదించుట, అర్థశక్తిచేత భేదనంబును అందులోనే కలదు. దైవశక్తిచేత నెట్లన రామాయణమందు రావణునియెడనుండి విభీషణుఁడు విడుట.

౪౧౮. నానాభావసమాశ్రయమైన గంభీరోక్తి సంలాప మనఁబడును.

ఉదా — వీరచరితమందు ' రాముఁడు — ఇది సపరివారుని కార్తికేయుని నోర్చినందులకు మెచ్చుకొని భగవంతుఁడు నీలలోహితుఁడు వేయేండ్లఘాతుకునిక నీకు ప్రసాదించినాఁడఁట ఆగండగొడ్డలియా యిది? పరశురాముఁడు — రాముఁడా దాశరథీ, అదే యిది నాగురువు గారికి ప్రియమైన గండగొడ్డలి. ' ఇత్యాది.

౪౧౯. తొడంగిన (పనుల) కంటె వేఱు పనులను ప్రారంభించుట పరివర్తకము.

ఉదా — వేణియందు — ' భీముఁడు — సహదేవుఁడా, నీవు పోయి అన్నగారిఁగొలుచు నుండుము; నేను ఇంతలో ఆయుధాలయమునకుం బోయి ఆయుధసహాయుఁడ నయ్యెదను. కాదు నేను పోయి పాంచాలివలన పీడుకోలు వడయవలయును. ' అని.

ఇఁక నారభటి —

౪౨౦. మాయ ఇంద్రజాలము యుద్ధము క్రోధము ఉద్భ్రాంతాది చేష్టితములు చంపుట చెఱఁబట్టుట ఇత్యాదులతోఁ గూడుకొన్నట్టి యుద్ధత వృత్తి యారభటి. ఆరభటికి వస్తూత్థాపనము సంఫేటము సంక్షిప్తి అవపాతనము అని నాలుగు భేదములు చెప్పఁబడినవి. మాయాదులచేత లేపఁబడిన వస్తువు వస్తూత్థాపన మనఁబడును.

ఉదా — ఉదాత్తరాఘవంబున —

' ఏమిది! ప్రకాశమానములయిన సూర్యుని కిరణములు సయితము పటిష్ఠము లయ్యును అన్నియు ఒక్కటి మింటఁ బర్వుచున్న దట్టంపుఁ జీఁకటిముత్తములచేత పరాహతము లగుచున్నవి! ఇవె నక్కలును ఘోరంపు మొండెముల కుత్తుకల నెత్తుటితో పొట్ట లుబ్బి నోటిగుహల నిప్పులం గ్రక్కుచు తీవ్రముగా నూళలం బెట్టుచున్నవి! ' ఇత్యాది.

---

జీయన్తే జయినోఽపి సాన్ద్రతిమిరవ్రాతై ర్వియ ద్వ్యాపిభి
ర్భాస్వన్తః సకలా రవే రపి కరాః కస్మా దకస్మా దమీ!
ఏతే చోగ్రకబన్ధకణ్ఠరుధిరై రాధ్మాయమానోదరా
ముఞ్చ న్త్యాననకన్దరానలముచ స్తీవ్రా నవా న్ఫేరవాః !

౪౨౧. సంఫేట మనఁగా క్రోధముచే సత్వరులై యిద్దఱు ఒండొరులను డీకొనుట.

ఉదా.— మాలతియందు మాధవాఘోరఘంటు లొండొరుం దాఁకుట.

౪౨౨. శిల్పములచేత నేనిబ ంధువగ నేని సంక్షిప్తమయిన వస్తు రచన సంక్షిప్తి. నేత యెడలఁగా వేఱునేత గ్రహించుటయు సంక్షిప్తియే.

ఉదా.— ఉదయనచరితమందు కిలింజ హస్తిని ప్రయోగించుట. రెండవ భేదమునకు ఉదా.— వాలి నివర్తిల్లఁగా సుగ్రీవుఁడు; ఉదాహరణాంతరము— పరశురామునికి ఔద్ధత్యము నివర్తిల్లఁగా, శాంతత్వము కలుగుట.

౪౨౩. ప్రవేశనము, త్రాసము, నిష్క్రమణము, హర్షము, పలాయనము వీని కూడిక అవపాతన మని చెప్పఁబడినది.

ఉదా.— కృత్యరావణమందు షష్ఠాంకమున [ఖడ్గహస్తుఁడు పురుషుఁడు ప్రవేశించి] అనునది మొదలుగా నిష్క్రమణ పర్యంతము.

౪౨౪. భారతి పూర్వము చెప్పఁబడినదే.

౪౨౫. ఇతరులు వినఁగూడని దేదో అది ఇట స్వగత మని యంగీకృతము. అందఱు వినఁదగినది ప్రకాశము. తాను చోటు మాఱి అన్యునికి చెప్పెడి రహస్యము అపవారితకము, కథామధ్యమున త్రిపతాకా హస్తముతో ఇతరులను ఎడసేసి జనసమీపమున ఇరువురు ఒండొరులతో రహస్యము భాషించుట జనాంతిక మనఁబడును. నాట్యమున పాత్రము లేకయే 'ఏమి చెప్పెదవు?' అని చెప్పనియర్థమునే వినుట నభినయించి ప్రయోగించుట ఏదికలదో అది ఆకాశభాషితము.

[పాత్రము= వినెడుపాత్రము. ప్రయోగించుట= ఆలేనివాని వాక్యమునే తాను తెలుపుట.]

ఏదేని యొక యర్థమును ఎవనికి తెలియనీయక దాఁపవలయునో వానికిని తన కును నడుమ మూఁడు వ్రేళ్లు పైకి నిగిడ్చి అనామికను వంచి త్రిపతాకా లక్షణ మయిన హస్తమును కావించి ఇతరునితో మంతనమాడుట జనాంతిక మనఁబడును. పరావర్తిల్లి [= అవలికరిగి.] ఇతరునితో పలుకుట అపవారితము. కడమ స్పష్టము.

౪౨౬. వేశ్యానామములు తుదిని దత్త, లేక సిద్ధ, లేక సేన అను శబ్దము ఉండ

వలయును, వణిజుల పేళ్ళు ప్రాయకముగా దత్తశబ్దాంతములుగా నుండవలయును. అట్లే చేటులకును చేటికలకును పేరు వసంతాదుల యందు వర్ణ్యమగుదాని పేరుగా నుండవలయును.

వేశ్యకు ఉదా.— వసంతసేనాది; వణిజుఁడు విష్ణుదత్తాది; చేటుఁడు కలహాంసాది; చేటి మందారికాది.

౪౨౭. నాటకమునకు గర్భితార్థ ప్రకాశముగా పేరు పెట్టవలయును.

ఉదా.— రామాభ్యుదయాది.

౪౨౮. ప్రకరణాదులకు నాయికా నాయకుల నామములను బట్టి పేరిడవలయును.

ఉదా.— మాలతీమాధవాది.

౪౨౯. నాటికా సట్టకాదులకు నాయికలవలనం బేరు.

ఉదా.— రత్నావళీ కర్పూరమంజర్యాది.

౪౩౦. ప్రాయికముగా ణిజంతమయిన సాధి గమిస్థానమునం బ్రయోగింపఁబడును.

ఉదా.— శాకుంతలములో— ఋషులు (ఇరువురు) 'గచ్ఛావః' అను నర్థమున "సాధయావ స్తావత్" అనుట - [గచ్ఛావః = సాధయావః = మేమిరువురము పోవుచున్నాము.]

౪౩౧. రాజును 'స్వామీ', 'దేవా' అని భృత్యులును 'భట్ట' అని అధములును వచింతురు. రాజర్షులు 'వయస్యా' అందురు, అట్లే విదూషకుఁడును. 'రాజా' అనియు అపత్యప్రత్యయముచేత నేనియు ఋషులు తమ యిచ్ఛవచ్చినట్లు అపత్యప్రత్యయముచేత నేని పేరిచేత నేని విప్రుని విప్రులు వచింపవలయును, ఇతరులు 'విప్రుఁడా' 'ఆర్యా' (అయ్యా) అని వచింపవలయును. విదూషకుని రాజు 'వయస్యుఁడా' అని యేని పేరిచేత నేని వచింపవలయును. నటీ సూత్రధారులు ఒండొరులను 'ఆర్య' నామముచేత వచింపవలయును. పారిపార్శ్వకుఁడు సూత్రధారుని 'భావ' అనవలయును, సూత్రధారుఁడు వానిని 'మారిష' అనవలయును. అధములు సములను 'హణ్డే' అనునది, ఉత్తములు సములను 'వయస్య' అనియు, మధ్యములు సములను 'హంహో'

అనియు వచింపవలయును; అన్నను తమ్ముఁడు 'ఆర్యా' అనవలయు; దేవర్షి లింగులను అందఱును 'భగవంతుఁడా' అనునది. రాణిని చేటిని విదూషకుఁడు 'భవతి' అనవలయును, రథిని సారథి 'ఆయుష్మంతుఁడా' అనవలయును; వృద్ధుని ఇతరుఁడు 'తాత' (నాయనా) అనవలయును; సుతుని శిష్యుని 'వత్సా' 'పుత్త్రక' 'తాతా' (నాయనా) అని యేని పేర నేని గోత్రాపత్యయమునచేత నేని సంబోధించునది; అట్లే శిష్యునిని తమ్మునిని; అమాత్యుని అధములు 'ఆర్యా' (అయ్యా) అనవలయు, విప్రులు 'అమాత్యా' 'సచివా' అందురు తపస్విని ప్రశాంతునిని బుధులు 'సాధుఁడా' అందురు; పూజ్యుఁడు శిష్యాదులచేత 'సుగృహీతనామధేయుఁడు' అని చెప్పఁబడును; ఉపాధ్యాయుఁడు 'ఆచార్యా' అనఁబడును; భూపతిని 'మహారాజ' 'స్వామి' అనవలయును; యువరాజు 'కుమారుఁడు, 'భర్తృదారకుఁడు' అనంబడును. అధములు కుమారకుని 'సౌమ్యా', 'భద్రముఖా' అని యిట్లు వచింపవలయును; ప్రకృతులు రాజుకూఁతును 'భర్తృదారిక' అనవలయును; జ్యేష్ఠ మధ్య మాధములు స్త్రీని తత్పతి నెట్లో అట్లు సంబోధింపవలయును, సమానురాలిని 'హలా' అనియు ప్రేష్యను 'హఞ్జే' అనియు, సంబోధింపవలయును; వేశ్యను 'అజ్జుకా' అనవలయును; కుంటెనగత్తెను తదనుగతులు 'అమ్మా' అనుదురు; అట్లే పూజ్యురాలైన వృద్ధను జనులు ('అమ్మా' అనవలయును); పాషండులను వారివారి సమయమువలన వచ్చిన పేరులం బిలువవలయును; శకాదులను భద్రదత్తాది నామముల వచింపవలయు; ఎవనికి ఏది పనియో శిల్పమో విద్యయో జాతియో దాని పేరనే వానిని పిలువవలయును; ఇతరులకు యథోచితముగా నెఱుంగవలయును.

ఇఁక భాషా విభాగము.

౪౩౨. అనీచులును పండితులు నగు పురుషులకు (భాష) సంస్కృతము; అట్టి స్త్రీలకు శౌరసేనిం బ్రయోగింపవలయును; ఆస్త్రీలకే గాథలయందు మహారాష్ట్రిని ప్రయోగించునది; రాజాంతఃపురచారులకు మాగధీభాష చెప్పఁబడినది; చేటులకును రాజపుత్రులకును శ్రేష్ఠులకును (ఏకవచనము శ్రేష్ఠి) అర్ధమాగధి; విదూషకాదులకు ప్రాచ్య

(గౌడీయ); జూదరులకు అవంతిక, జూదమాడుచుండు జోదులకు అట్టి నగరవాసులకును దాక్షిణాత్య (వైదర్భి); శకారులకును శకాదులకును శాకారిని ప్రయోగింపవలయును; ఉదీచ్యులకు బాహ్లీకభాషను ద్రవిడాదులకు ద్రావిడిని, ఆభీరులకు ఆభీరిని, చండాలాదులకు చాండాలిని, కట్టెలవలన ఆకులవలన జీవించువారికిని అట్లే, బొగ్గుచేయువారికిని ఆభీరిని శాబరిని, పిశాచులకు చేటికలకును గూడ పైశాచిని, అనీచలయిన చేటికలకు శౌరసేనిని పెట్టవలయును. బాలకులకు, షండులకు నీచులగు జోస్యులకు ఉన్మత్తులకు రోగులకును శౌరసేనియే. ఒక్కొక్కపుడు సంస్కృతమును ప్రయోగింపవలయును. ఐశ్వర్యము చేత మదించిన వానికి దారిద్ర్యపీడితునికిని భిక్షులకు నారచీరలందాల్చు వారు లోనగువారికి ప్రాకృతము పెట్టవలయును. ఉత్తములైన సన్న్యాసచిహ్నములుగల స్త్రీలకు సంస్కృతము పెట్టవలయును; దేవి మంత్రి సుతా వేశ్యలకును సంస్కృతమే అని కొందఱు చెప్పిరి; నీచ పాత్రము ఏదేశమువో దాని భాష ఆదేశముదిగా నుండవలయును. ఉత్తమాదులకు కార్యవశమున భాషను మార్పవలయును: స్త్రీ సఖీబాల వేశ్యలకు జూదరులకు అచ్చరలకును వైదగ్ధ్యముకొఱకు నడుమనడుమ సంస్కృతము పెట్టవలయును.

వీని కుదాహరణములను ఆకరములందుఁ గనవలయును. భాషాలక్షణములను మానాయనగారి భాషార్ణవ మను గ్రంథమువలనం దెలిసికొనునది.

౪౩౩. ఇందు రసాక్షాంక్షం బట్టి ముప్పదియాఱు లక్షణములును, ముప్పది మూఁడు నాట్యాలంకారములును, పీథ్యంగములు పదుమూఁడును, లాస్యాంగములు పదియు, యథాలాభముగా ప్రయోగింపవలయును.

ఇందు అనఁగా నాటకమున.

అందు లక్షణములు.—

౪౩౪. భూషణము అక్షరసంఘాతము శోభ ఉదాహరణము హేతువు సంశయము దృష్టాంతము తుల్యతర్కము పదోచ్చయము నిదర్శనము అభిప్రాయము ప్రాప్తి విచారము దిష్టము ఉపదిష్టము గుణాతిపాతము అతిశయము విశేషణము నిరుక్తి సిద్ధి భ్రంశము విపర్యయము దాక్షిణ్య

ము అనునయము మాల అర్థాపత్తి గర్హణము పృచ్ఛ ప్రసిద్ధి సారూ
ప్యము సంక్షేపము గుణకీర్తనము లేశము మనోరథము అనుక్తసిద్ధి
ప్రియవచనము అనునవి లక్షణములు.

అందు.—

४3౫. సాలంకారములగు గుణములతో యోగము భూషణ మనఁబడును.

ఉదా.— ' ఓముగుదా, అరవిందములు నీముఖశ్రీని నిందించుచున్నవి. కోశ దండ సమ
గ్రములకు వీనికి దుష్కర మే మున్నది. '

४3౬. చిత్రార్థములైన మితాక్షరములచే వర్ణన అక్షరసంఘాత మనఁ
బడును.

ఉదా.— శాకుంతలమున— ' రాజు— ' మీసఖిని శరీరసంతాపము హెచ్చు బాధింపదు
గదా? ప్రియంవద–ఇప్పుడు లబ్ధావధమై ఉపశమముం బొందఁగలదు. '

४3౭. ఏవర్ణనలో సిద్ధమైన యర్థములతో అప్రసిద్ధమైన యర్థము బయలుఁ
బడునో శ్లిష్టస్వరూపంబును చిత్రార్థంబును నగు నావర్ణన శోభ
యనంబడును.

* ఉదా.— 'సద్వంశప్రభవుండును శుద్ధుండును కోటిరుండును గుణాన్వితుండును అగు నేగాక,
కార్యరుఁడైన ప్రభువు ధనుస్సు వోలె సజ్జనులకు త్యాజ్యుఁడు.

४3౮. ఎందు తుల్యార్థమైన వాక్యముచేత చూపుటవలన అభిమతార్థము
సాధింపఁబడునో అది ఉదాహరణ మనఁబడును.

† ఉదా.— ' నీవు జనాతీతునిం గాంతుని అనుగమించుట సరియైన పని; సూర్యుఁడు లేని
దినలక్ష్మి యెక్కడిది? చంద్రుఁడు లేని రాత్రి యెక్కడిది? '

४3౯. హేతువుం బ్రదర్శించుటవలన ఇష్టార్థబోధకముగా సంక్షేపముగా
చెప్పఁబడిన వాక్యము హేతు వనఁబడును.

ఉదా.— వేణియందు— భీమునిఁగూర్చి " చేటి— నేని ట్లంటిని.— ' భానుమతీ, మీకేశ
ములం ఎట్లు ముడువంబడును? ' అని. "

---

* సద్వంశ సమ్భవశ్ శుద్ధః కోటిదోఽపి గుణాన్వితః
కామం ధను రివ క్రూరో వర్జనీయః సతాం ప్రభుః .

† అనుయాన్త్యా జనాతీతం కాన్తం సాధు త్వయా కృతం;
కా దినశ్రీ ర్వి నార్కేణ? కా నిశా శశినా వినా?

౪౪౦. సంశయ మనఁగా తత్త్వ మెఱుఁగనివాని వాక్యమందుఁ గల యనిశ్చయము

‡ ఉదా.— యయాతివిజయమున— ‘ ఈలేమ స్వర్గాధినాథునిలక్ష్మియా యక్షకన్యకయా ఈదేశముయొక్క యధిదేవతయా ఒండె పార్వతియా? ’

౪౪౧. పక్షమందు అర్థమును సాధించుటకై హేతుప్రదర్శనము దృష్టాంత మనంబడును.

ఉదా.— వేణియందు— ‘ సహదేవుఁడు— అన్నా ఇది ఆమెకు తగినదే, ఏలన, ఆమె దుర్యోధనుని కళత్రము గదా. ’

౪౪౨. ప్రకృతి నతిక్రమింపని వస్తువుచేత భావ్యర్థసూచనము తుల్యతర్కము.

* ఉదా.— అందులోనే— ‘ స్వప్నములు శుభములును అశుభములునుంగా వచ్చుట ప్రాయికమే, అట్లయినను నా ఱనెడి యీసంఖ్య తమ్మిలతోఁడి నన్నుఁ దాకునది బలె నున్నది. ’

౪౪౩. అర్థానురూపములయిన పదముల కూర్పు పదోచ్చయ మనఁబడును.

† ఉదా — శాకుంతలమున—

క. మోవి కిసలయారుణ మిద్ధి, లేవిటపంబులను దొరయు లేమభుజంబుల్,
పూవుబలె లోభనీయము యౌవనపు శోభహర మిది యంగములందుక్.

ఇట పదపదార్థములకు సౌకుమార్యము సమానమే.

౪౪౪. పరపక్ష నిరాసార్థము ఎచ్చట ప్రసిద్ధార్థములే వర్ణింపఁబడునో అది నిదర్శన మనంబడును.

§ ఉదా.— ‘ క్షాత్త్ర ధర్మమునకు ఉచితములైన ధర్మములచే శత్రువులం బరిమార్చుట నరపతులకుఁ దగును; అట్లుండ, రాముఁడు పరాఙ్ముఖుఁడైన వాలిని కోల నేసినాఁడు. ’

౪౪౫. అసంభవియైన వస్తువును సాటిచేత కల్పించుట అభిప్రాయము.

---

‡ ఇయం స్వర్గాధినాథస్య లక్ష్మీః కిం? యక్షకన్యకా?
కిం చాస్య విషయ స్యైవ దేవతా? కిము పార్వతీ?

* ప్రాయే ణైవ హి దృశ్యన్తే కామం స్వప్నాః శుభాశుభాః;
శతసఙ్ఖ్యా పున రియం సానుజం స్పృశ తీవ మాం.

† అధరః కిసలయరాగః, కోమల విట పానుకారిణౌ బాహూ,
కుసుమ మివ లోభనీయం యౌవన మఙ్గేషు సన్నద్ధం.

§ క్షాత్రధర్మోచితై ర్ధర్మై రలం శత్రువధే నృపాః;
కింతు వాలిని రామేణ ముక్తో బాణః పరాఙ్ముఖే.

‡ ఉదా.— శాకుంతలమందు.—

ఆ. 'ఘూని సహజకాంతి పూరంబు నీమెయిఁ దపము సైపఁజేయఁ దలచుమౌని
తొలఁగ కల్ల నల్లతొగ రేకు ధారతో సమిధ కొయ్యఁ గోయ సంభ్రమించు.'

౨౨౬. ఏదే నొక యంశముచేత నొకదానిని అనుమానించుట ప్రాప్తి యనంబడును.

ఉదా.— మదీయ ప్రభావతియందు— 'ఎల్లెడలం జరించునదైన యీతుమ్మెద నా ప్రియతమను ప్రభావతిని ఎఱుంగఁగలదు.'

౨౨౭. యుక్తి బోధక వాక్యములచే అభిప్రాయార్థమును సాధించుట విచారము.

* ఉదా.— మదీయ చంద్రికలయందు— 'రాజు— నిశ్చయముగా నీచెలువ మదనవికారమును లోపలఁ దాఁచుచున్నది. ఎట్లన— పరితోషము లేకయే నవ్వుచున్నది, కన్నులు తెఱచుకొనియే యుండియు దేనినిం గానదు, సఖి చెప్పెడి దానికి అసంబద్ధముగా నుత్తరము వచించును.'

౨౨౮. దేశ కాల స్వరూపముచేత వర్ణన దిష్ట మనఁబడును.

ఉదా.— వేణియందు— 'ఇపుడు కోపించిన యన్నయందు ఏది మెఱపుజ్యోతి బలె నిండి యున్నదో దానిని నిక్కముగా కృష్ణ ప్రాపృట్టువలె పెంపఁగఁజేయఁగలదు.'

౨౨౯. శాస్త్రానుసారమున మనోహారియగు వాక్యము ఉపదిష్టము.

‡ ఉదా.— శాకుంతలమున—

గురువులఁ గొల్వు (భక్తిఁ) జెలికూటముగాఁ గనుమీ సపత్నులన్
వరుఁడు శరించినం గినుకవట్టి కువాళము సల్ప కెప్పుడున్
పరిజనులన్ దయ న్మనుపు భాగ్యము లైనను బొంగ కింతు లీ
సెరవున గాంతురమ్మ గృహిణీపదమున్ గుటిల ల్మనోవ్యథల్.

---

‡ ఇదం కి లావ్యాజమనోహారం వపు స్తపఃక్షమం సాధయితుం య ఇచ్ఛతి
ధ్రువం స నీలోత్పలపత్రధారయా సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి.

* హాసతి పరితోషరహితం, నిరీక్ష్యమాణాపి నేక్షతే కిఞ్చిత్,
సఖ్యా ముదాహరన్త్యా మసమఞ్జస ముత్తరం దత్తే.

‡ శుశ్రూషస్వ గురూన్, కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే,
భర్తు ర్విప్రకృతా2పి రోషణతయా మాస్మ ప్రతీపం గమః,
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే, భాగ్యే ష్వనుత్సేకినీ;
యాన్త్యేవం గృహిణీపదం యువతయో, వామాః కుల స్యాధయః.

౪౭౦. (ఉన్న) గుణములకు విపరీతమయిన చేత గుణాతిపాతము.

† ఉదా.— మదీయ చంద్రికళయందు చంద్రుంగూర్చి—

‹ చీఁకటిని సమయించెదవు గాన ఎల్లవారును నీపాదములం బట్టుదురు; పరమశివుని శిరమున వసింతువు, అటులైనను హా, స్త్రీయొక్క యసువులను హరించెదవు! ›

౪౭౧. సాధారణగుణముకన్న ఆధిక్యము గుణాతిశయ మనఁబడును.

* ఉదా.— అందులోనే— ‹ రాజు— (చంద్రికళ ముఖమును నిర్దేశించి)

‹ ఓసుముఖీ, లోపల చంచలములైన విచ్చిన క్రొత్త నల్లగలువల జతయు, అడుగున వెలుఁగొందుచున్న శంఖంబును, పైని విలసిల్లుచున్న తుమ్మెదపిండునుం గలిగి దోషాసంగము లేక ఎప్పుడును సకలకలాపరిపూర్ణుఁడై కళంక మెడలిన యీచంద్రుఁడు నీకు ఎక్కడ దొరకినాఁడు? ›

౪౭౨. ప్రసిద్ధములైన యర్థములను పెక్కింటిం జెప్పి విశేషముం జెప్పుట విశ్లేషణ మనఁబడును.

† ఉదా.— ‹ మడుగు కూడ తృష్ణం దీర్చును విమలము ద్విజావాసము జనప్రియము పద్మాకరంబును; కాని నీవు బుధుఁడవు, అది జలాశయము. ›

౪౭౩. పూర్వసిద్ధమైన యర్థమును చెప్పుట నిరుక్తి యనఁబడును.

‡ ఉదా.— వేణియందు—

‹ కౌరవ్యుల నందఱం జంపినవాఁడు దుశ్శాసనుని రక్తముచే మత్తాగొన్నవాఁడు దుర్యోధనుని తొడలను విఱుగఁగొట్టినవాఁడు వీఁడె భీముఁడు నీకు తలతో మ్రొక్కుచున్నాఁడు.›

---

† జఇ సంహరిజ్జఇ తమో ఘెయ్యఇ సఅలేహిం తే పాఓ;
వససి సిరే పసుబఇణో తహవి హ ఇత్థిఅ జీఅణం హరసి.

[ఛాయా.]

యది సంహ్రియతే తమో గృహ్యతే సకలై స్తే పాదః;
వససి శిరసి పశుపతే స్తథాపి హ స్త్రియా జీవనం హరసి

* అసౌ వక్త్ర శ్చఞ్చ ద్వికచ నవనీలాబ్జ యుగల,
స్తల న్స్ఫూర్జ త్కమ్బు,ర్విలస దలిసఙ్ఘాత ఉపరి,
వినా దోషాసఙ్గం, సతత పరిపూ ర్ణాఖిల కలః,
కుతః ప్రాప్త శ్చన్ద్రో విగలితకలఙ్కః సుముఖి తే ?

† తృష్ణాపహారీ, విమలో, ద్విజావాసో, జనప్రియః,
హ్రదః, పద్మాకరః; కిన్తు బుధ స్త్వం, స జలాశయః.

‡ నిహతాశేషకౌరవ్యః క్షీబో దుఃశాసనాసృజా
భఙ్క్తా సుయోధన స్యోర్వో ర్భీమోఽయం శిర సాఞ్చతి.

౪౫౪. ఉద్దేశించిన యర్థము సిద్ధించుటకై పెక్కింటిని కీర్తించుట సిద్ధి యనఁబడును.

* ఉదా.— 'కార్తవీర్యరాజుయొక్క బల మేదో శేషుని విక్రమంబు నేదో భూమిని రక్షించుటయందు అది యెల్ల నీయొక్క నియందే కలదు.'

౪౫౫. గర్వితప్రభృతులు వచింపదొరకొన్న దానికి విపరీతమును పలుకుట భ్రంశ మగును.

‡ ఉదా.— వేణియందు— కంచుకితో దుర్యోధనుఁడు—

'సభృత్యగణుని సబాంధవుని సమిత్రుని ససుతుని సానుజుని సంయుగంబున తన బలము చేత అచిరమున సుయోధనుని పాండుసుతుఁడు సంహరించును.'

[చిరమునకును ఎప్పటికిని సంహరింపలేఁడు అని వచింపం దలంపు.]

౪౫౬. సందేహమువలన విచారము వేఱుతీరుం జెందుట విపర్యయము.

[విచారము=తత్త్వనిశ్చయము.]

† ఉదా.—

'ఓరాజా, లోకులు దాతలు గా రని యెవరు సంతుష్టిం జెంద నిశ్చయించుకొనిరో వారు నీవు రాజవు కాఁగా అపూనికను మాసుకొనిరి.'

౪౫౭. చేష్టచేతను వాక్కుచేతను ఒకరిచిత్తము ననువర్తించుట దాక్షిణ్యము.

వాక్కునకు ఉదా.—

§ 'విభీషణా, లంకాపురిని అలంకరింపుము, ఏలన నీవు రాజవు గదా. మాయన్న యను గ్రహించినవానికి సిద్ధికి విఘ్నము కలుగదు.'

ఇట్లు చేష్టచేతనుం గూడ.

---

* య ద్వీర్యం కార్తవీర్యరాజస్య యచ్చ శేషస్య విక్రమః
పృథివ్యా రక్షణే రాజ న్నేకత్ర త్వయి త త్స్థితం.

‡ సహభృత్యగణం సబాన్ధవం సహమిత్రం ససుతం సహానుజం
స్వబలేన నిహన్తి సంయుగే నచిరా త్పాణ్డుసుతః సుయోధనం.

† మత్వా లోక మదాతారం సన్తోషే యైః కృతా మతిః
త్వయి రాజతి తే రాజ న్న తథా వ్యవసాయినః.

§ ప్రసాధయ పురీం లఙ్కాం, రాజా త్వం హి విభీషణ.
ఆర్యే ణానుగృహీతస్య న విఘ్నః సిద్ధి మన్తరా.

౪౫౮. స్నేహయుక్తములయిన వాక్యములచే ప్రయోజనమును సాధించుట అనునయము.

ఉదా.— వేణియందు— [అశ్వత్థామం గూర్చి] 'కృపుఁడు— దివ్యాస్త్ర గ్రామ కోవిదుఁడవు భారద్వాజునికి సమానుఁడవు నీయందు ఏది సంభవింపదు? '

౪౫౯. అభీష్ట సిద్ధికై పెక్కు ప్రయోజనములను జ్ఞప్తి సేయుట మాలయగును.

* ఉదా.— శాకుంతలమున— 'రాజు—

క్లమము వినోదిగాఁ జలువగ్రిమ్మెడు తామరపాకువీవనం
గొమరుగ నీటితెమ్మెరల కోమలసంచలనం బొనర్తునా?
తమిఁ గరభోరుకాండ, నలతామ్రము నీచరణద్వయం బొడికి
గమిచి ధరించి యల్ల నొడికంబుగ సంవహనం బొనర్తునా? '

౪౬౦. ఒకటి చెప్పుటచేత మఱియొకటి తోఁపింపఁబడుట అర్థాపత్తి యనఁబడును.

‡ ఉదా.— వేణియందు— ద్రోణుఁడు అశ్వత్థామను రాజ్యమున నభిషేకింపఁ గోరుచున్నాఁడని చెప్పుచున్న కర్ణునిఁ గూర్చి 'రాజు— బలీ అంగరాజా బలీ, అట్లు కాదేని, అతిరథుఁ డాతఁడు అభయమిచ్చియు అర్జునునిచే వధ్యమానుని సింధురాజును అట్లు కాదేని మఱి యెందులకు ఉపేక్షించును? '

౪౬౧. దూషణోద్ఘోషణారూపమున భర్త్సించుట గర్హణ మనఁబడును.

† ఉదా.— అందులోనే— కర్ణుం గూర్చి 'అశ్వత్థామ— ముక్కిడి పగతురు గావించిన యప్రియమును నేను అస్త్రమునం గాక అస్రమునం బ్రతీకరించుటకు, నాయాయుధము నీయాయుధము వోలె గురువు పల్కిన శాపముచేత నిర్వీర్య మయినదా? ఇప్పుడే నీవలె భయంబున పోరు మాని నేను వచ్చితినా? స్తుతులను వంశములను కీర్తింప నేర్చిన సారథుల కులమందు జనించితినా ఏమి? '

---

* కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతా న్సంచారయామి నలినీదళ తాలవృన్తైః?
అఙ్కే నిధాయ కరభోరు యథాసుఖం తే సంవాహయామి చరణా వుత పద్మతామ్రౌ?

‡ దత్త్వాభయం సోఽతిరథో వధ్యమానం కిరీటినా
సిన్ధురాజ ముపేక్షేత నైవం చే త్కథ మన్యథా?

† నిర్వీర్యం గురుశాపభాషితవశా త్కిం మే త వే వాయుధం ?
సమ్ప్రత్యేవ భయా ద్విహాయ సమరం ప్రాప్తోఽస్మి కిం త్వం యథా?
జాతోఽహం స్తుతివంశకీర్తనవిదాం కిం సారథీనాం కులే?
క్షుద్రారాతికృతాప్రియం ప్రతికరో మ్యస్రేణ నాస్త్రేణ యత్.

౪౬౨. వినయోక్తులతో ప్రయోజనమును వెదకికొనుట పృచ్ఛ యనం బడును.

ఉదా.— అందులోనే— ‘ సుందరకుఁడు— అయ్యలారా సారథిద్వితీయుని మహారాజును మీరు చూచినారా లేదా అని. ’

౪౬౩. ఉత్కృష్టములైన లోకసిద్ధార్థములచేత అర్థమును సాధించుట ప్రసిద్ధి.

* ఉదా.— విక్రమోర్వశీయందు— ‘ రాజు—

క. ఎవనికి రవియుఁ శశియుఁ దవుదురో మాతామహుఁడుఁ బితామహుఁడును నై
ఎవని వరించిరో యిరువుర ధవునిఁగ స్వయ ముర్వరయును దా నుర్వశియుఁ. ’

౪౬౪. అనురూపునికి సారూప్యముం బట్టి క్షోభను పెంచుట సారూప్యము.

ఉదా.— వేణియందు— దుర్యోధనభ్రమచేత భీమునిం గూర్చి ‘ యుధిష్ఠిరుఁడు— దురాత్ముఁడా దుర్యోధనహతకుఁడా— ’ ఇత్యాది.

౪౬౫. సంక్షేప మనఁగా తన్ను ఒకరి ప్రయోజనమునకై అవిశేషముగా నిర్దేశించుకొనుట.

‡ ఉదా.— నాచంద్రికయందు— ‘ రాజు— ప్రియా, శిరీషకుసుమ సుకుమారములను నీయంగములను ఏల యలయించెదవు?

(తన్నుఁ జూపుకొని,)

ఇదె నే నున్నాఁడను నీవు కోరిన పువ్వులను సమకూర్ప నీదాసజనుఁడను. ’

౪౬౬. గుణములం గీర్తించుట యేదో అదే గుణకీర్తన మనఁబడును.

ఉదా.— అందులోనే— ‘ నేత్రములు కాటుకపిట్టలను ’ ఇత్యాది (౧౦౧).

౪౬౭. సాదృశ్య పురస్సరముగా చెప్పఁబడు వాక్యము లేశ మనఁబడును.

† ఉదా.— వేణియందు— ‘ రాజు—

‘ శిఖండిని చాటుంచుకొని వృద్ధుని భీష్ముని చంపుటలో పాండవులకు ఏమి పొగడ్తయో మాకును అదియే కాఁగలదు. ’

---

* సూర్యాచన్ద్రమసౌ యస్య మాతామహ పితామహౌ
స్వయం వృతః పతి ర్ద్వాభ్యా ముర్వశ్యా చ భువా చ యః.

‡ అఙ్గాని ఖేదయసి కిం శిరీషకుసుమ పరిపేలవాని ముధా
అయ మీహితకుసుమానాం సమ్పాదయితా త వాస్తి దాసజనః

† హతే జరతి గాఙ్గేయే పురస్కృత్య శిఖణ్డినం
యా శ్లాఘా పాణ్డుపుత్రాణాం సైవాస్మాకం భవిష్యతి.

౪౬౮. అభిప్రాయమును భంగ్యంతరమునం జెప్పుట మనోరథము.

* ఉదా.— 'చూడుము సుభ్రువా, ఈయంచ మదనమంథరంబును రతికేళి లాలసంబును నై ఆదరాతిశయముతో ప్రియను అలంతిగ చుంబించుచున్నది.'

౪౬౯. విశేషార్థమయిన యూహాయొక్క విస్తారము అనుక్తసిద్ధి యనంబడును.

† ఉదా.— 'గృహవృత్తివార్తికయందు—

తన్వీ సుందరచంద్రమసుని యెదుర ఏయీయిరువురు అగపడుచున్నరో ఓప్రాజ్ఞురాలా మంగళనామధేయులు ఆయిరువురును తిష్య పునర్వసువులు.'

౪౭౦. పూజ్యుని ప్రమాణీకరించుటకు హర్షభాషణము ప్రియోక్తి యగును.

‡ ఉదా.— శాకుంతలమున—

ఆ. పూవు దోంచు ముందు, పూప పుట్టం బిఱుంద, వారిదంబు మున్ను వాన వెన్కం;
హేతుకార్యములకు నిట్టి దొంగ్రమ మెందు, నీదు కృపకు మున్న నెగడు సిరులు.

ఇంకను నాట్యాలంకారములు—

౪౭౧. ఆశీస్సు ఆక్రందము కపటము అక్షమ గర్వము ఉద్యమము ఆశ్రయము ఉత్ప్రాసనము స్పృహ అక్షోభము పశ్చాత్తాపము ఉపపత్తి ఆశంస అధ్యవసాయము విసర్పము ఉల్లేఖము ఉత్తేజనము పరీవాదము నీతి అర్థవిశేషణము ప్రోత్సాహనము సాహాయ్యము అభిమానము అనువర్తనము ఉత్కీర్తనము యాచ్ఞ పరీహారము నివేదనము ప్రవర్తనము ఆఖ్యానము యుక్తి ప్రహర్షము ఉపదేశనము అను నివి నాట్య భూషణ హేతువులు నాట్యాలంకారము లనంబడును.

ఇష్టజనుల దీవన ఆశీస్సు.

ఉదా.— శాకుంతలమున—

---

* రతికేలికలః కిఞ్చిదేష మన్మథమన్థరః
పశ్య సుభ్రు సమాలమ్బ్య కాదమ్బశ్చుమ్బతి ప్రియామ్.

† దృశ్యేతే తన్వి యావేతౌ చారుచన్ద్రమసం ప్రతి
ప్రాజ్ఞే కల్యాణనామానావుభౌ తిష్యపునర్వసూ.

‡ ఉదేతి పూర్వం కుసుమం తతః ఫలం, ఘనోదయః ప్రాక్తదనన్తరం పయః,
నిమిత్తనైమిత్తికయోరయం క్రమః, స్తవ ప్రసాదస్య పురస్తు సమ్పదః.

‡ ‘ పతికి బహుమతవు గమ్ము యతులిత శర్మిష్ఠ యల యయాతికిఁ బోలెఁ
సుతుఁ గల్యాణీ నీ వాసతి పూరునిఁ బోలెఁ బొందు సమ్రాట్ప్రభువుగ్ .

४२७. దుఃఖముచే ప్రలపించుట ఆక్రందము.

ఉదా.— వేణియందు— ‘ కంచుకి— హా దేవీ, కుంతీ, రాజభవనపతాకా’ ఇత్యాది.

४२३. మాయచేత వేఱు రూపమును చూపుట కపటము.

ఉదా.— కులపత్యంకమందు—

† ‘ మృగరూపమును మాని కపటదేహముం గావించుకొని ఆరక్కసుఁడు పోరిలో సంశయము నొందింపఁబడుచున్నాఁడు. ’

४२४. ఇంచుక యేని పరాభవము నోర్వమి అక్షమ.

ఉదా.— శాకుంతలమున— ‘ రాజు— ఓహో యి సత్యవాతి మే మెప్పుకొనియెదము, కాని, ఈయబలను వంచించుటచే మా కేమి ప్రయోజనము? శార్ఙ్గరవుఁడు— విని పాతము—’ ఇత్యాది.

४२५. అహంకార జాతమయిన వాక్యము గర్వము.

ఉదా.— అందులోనే— ‘ రాజు— నాయింటిని గూడ సత్త్వములు పైకొనుటయా! ’

४२६. కార్య మారంభించుట యుద్యమము,

ఉదా.— కుంభాంకమున— ‘ రావణుఁడు— శోక వివశుఁడను నేను అంతకునే గాంచెదను.

४२२. ఉత్కృష్టమయిన కార్యముకొఱకు ఆశ్రయించుట గ్రహణ మనఁబడును.

ఉదా.— విభీషణ నిర్భర్త్సనాంకము— ‘ విభీషణుఁడు— రామునే ఆశ్రయించెదను? అని.

४२८. సాధువు గాకయే సాధు వని తలఁచుకొనువానిని ఎత్తిపొడుచుట ఉత్ప్రాసము.

ఉదా.— శాకుంతలమున— ‘ రాజా, మఱి పూర్వవృత్తము నన్యసంగముచేత మఱచిన వాఁడవు, అట్లని అధర్మభీరువవు దారం బరిత్యజించితి వెట్లు? ’ ఇత్యాది.

४२९. రమణీయ మగుటవలన వస్తువుమీఁద కోర్కి వహించుట ఆకాంక్ష.

---

‡ యయాతే రివ శర్మిష్ఠా భర్తు ర్బహుమతా భవ
సుతం త్వమపి సమ్రాజం సేవ పూరు మవాప్నుహి.

† మృగరూపం పరిత్యజ్య విధాయ కపటం వపుః
నీయతే రక్షసా తేన లక్ష్మణో యుధి సంశ

ఉదా.— అందులోనే— ‘ రాజు—

* అపరిక్షత కోమలము ప్రియాధరం బిది ఆనంగోరుచున్న నాకు అందంపు స్ఫురితముచేత అనుజ్ఞ యిచ్చుచున్నది వోలె నొప్పుచున్నది. ’

౪౮౦. అధిక్షేప వచనముం బలికించు క్షోభము క్షోభమనఁబడును.

ఉదా.—

† ‘ ఓయి మునిచండాలుఁడా, చాటునుండి చంపుటకుం గడంగిన నీచేత వాలి హతుఁడగుట మాత్రమే గాదు పరలోకమునుండి నీ యాత్మకూడ హతమయినది. ’

౪౮౧. అజ్ఞానముచేత కార్యము చెడఁగొట్టుకొన్న వాఁడు పిమ్మట చింతించుట పశ్చాత్తాప మనఁబడును.

ఉదా — అమతాపాంకమున— ‘ రాముఁడు—

ఏమి? అప్పుడు దేవి నన్ను వేడుకకై నిందించి పలుమాఱు ముద్దుగొనియుండలేదా?’ అని.

౪౮౨. అర్థసిద్ధికై హేతువు నుపన్యసించుట ఉపపత్తి యనఁబడును.

ఉదా.— వధ్యశిలయందు—‘ జీమూతవాహనుఁడు—

‡ నీవు చత్తు వేని నిజముగాఁ దాఁ జచ్చు
నీవు బ్రతుకు దేని నెమ్మి బ్రదుకు
అట్టి యమ్మ బ్రదుక నాస గొందువ యేని
నన్నుఁ గాచికొనుము న న్నొసంగి. ’

౪౮౩. కోరుకొనుట ఆశంస యగును.

ఉదా.— శ్మశానమందు— ‘ మాధవుఁడు—

‘ ఆ యనంగ మంగళ గృహమును మాలతీవదనమును మరలం గాంతునుగాక. ’ అని.

౪౮౪. కార్యమును చేయ నిశ్చయించుకొనుట ప్రతిజ్ఞ.

§ ఉదా.— మదీయ ప్రభావతియందు— ‘ వజ్రనాభుఁడు— ఇదె నేను అవలీలగా ఈ

---

* చారుణా స్ఫురితే నాయ మపరిక్షత కోమలః
పిపాసతో మ మానుజ్ఞాం దదా తీవ ప్రియాధరః.

† త్వయా తపస్విచణ్డాల, ప్రచ్ఛన్నవధవర్తినా
న కేవలం హతో వాలీ స్వాత్మా చ పరలోకతః.

‡ మ్రియతే మ్రియమాణే యా త్వయి జీవతి జీవతి
తాం య దీచ్ఛసి జీవన్తీం రక్షాత్మానం మ మాసుభిః.

§ అస్య వక్షః క్షణే నైవ నిర్మథ్య గద యానయా
లీల యోన్మూలయా మ్యేష భువనద్వయ మద్య వః.

గదతో వీని యురమును త్రిచ్చివైచి మీ రెండు లోకములను నిర్మూలించెదను. '

౪౮౫. అనిష్ట ఫల మిచ్చు పని నారంభించుట విసర్పము.

ఉదా.— వేణియందు— 'కేశగ్రహణమున కొకట్రికే' ఇత్యాది (323)

౪౮౬. చేయవలసిన పనిం దెలుపుట యుల్లేఖము.

ఉదా.— శాకుంతలమున— రాజుం గూర్చి 'తాపసులు (ఇరువురు)— మేము (ఇరువురము) సమిధలం దెచ్చుకొనుటకై తరలినారము. ఇచటనే మాలిని దరి నిమాగురువులవారి యాశ్రమము కనఁబడుచున్నది. అందు తదధిదేవత వోలె శకుంతల యున్నది. వేఱుపని మిగిలి పోదేని నీవచటికిం బోయి యతిథిసత్కారమును గ్రహింతువు గాక.' అని.

౪౮౭. తన కార్యము సిద్ధించుటకు ఒరుని ప్రేరించుటకొఱకు కఠినవాక్య— ఉత్తేజన మనఁబడును.

ఉదా.—

* 'ప్రచండపరాక్రముఁడవోయి యింద్రజిత్తా, నీబలము నీపేరిలోనే యున్నది. ఛీ ఛీ మాట వెఱచి ప్రచ్ఛన్నరూపుఁడవై పోరుచున్నావు!'

౪౮౮. నిందించుట భర్త్సనము.

ఉదా.— సుందరాంకమున— 'దుర్యోధనుఁడు— ఇసీ ఇసీ నూత ఏమి చేసితివి! ఈపాపుఁడు దుండగపు స్వభావమువాఁడైన నాతమ్ముని యెడ పాపము సేయును న్నాఁడు—' ఇత్యాది.

౪౮౯. శాస్త్రముబడి వర్తించుట నీతి.

ఉదా.— శాకుంతలమున— 'దుష్యంతుఁడు— తపోవనములలోనికి వినీతవేషముతోఁ బ్రవేశింపవలయును.'

౪౯౦. చెప్పిన యర్థమును పలుదెఱంగుల నుపాలంభవిశేషముతో నుగ్గడించుట ఏదో అది అర్థవిశేషణ మనఁబడును.

ఉదా.— శాకుంతలమున రాజుంగూర్చి 'శార్ఙ్గరవుఁడు— ఆ ఏమి యిది ఏమి చెప్పితివి అని యడుగుట! ఓయి నీవే లోకవృత్తాంతనిపుణుఁడవు.

‡ శా. పాతివ్రత్య మహానిధాన మయినన్ భావింతు రట్టట్టుగా
జ్ఞాతివ్రాతము లైకసంశ్రయరత న్నానాథ్యభద్రిన్ జనుల్

---

* ఇన్ద్రజి చ్చణ్డవీర్యోఽసి, నామ్నైవ బలవా నసి.
ధిగ్ధి క్ప్రచ్ఛన్నరూపేణ యుద్ధ్యసేఽస్మద్భయాకులః.

‡ సతీ మపి జ్ఞాతికులైకసంశ్రయాం జనోఽన్యథా[illegible]ర్తృమతీం విశఙ్కతే
అతః సమీపే పరిణేతు [illegible] వా ప్రమదా స్వబన్ధుభిః.

కాతర్యంబు వహించి యీ కతమునం గాంక్షింపుదు ర్బాంధవుల్
నేతం గూర్పఁగ నప్రియన్ బ్రియను గానీ నెవ్వడిక్ జవ్వనిక్. '

౪౯౧. ఉత్సాహవాక్కుచేత ఎవని నేని పనిగొనుట ప్రోత్సాహన మనఁబడును.

ఉదా.— బాలరామాయణమందు—

* కాళరాత్రివలె దారుణురాలు ఇది, స్త్రీ యని యేల సంశయించెదవు? కావున బాబూ, ముల్లోకములం గాచుకొఱకు తాడకను తాడింపుము.

౪౯౨. సంకటమందు ఒరునికి అనుకూలపడుట సాహాయ్య మగును.

ఉదా.— వేణియందు— కృపునిఁగూర్చి ' అశ్వత్థామ— నీవును త్వరగా పోయి రాజునకు పార్శ్వవర్తివి కమ్ము. కృపుఁడు— నేను ఇప్పుడు బదులు సేయఁ గోరుచున్నాను.' ఇత్యాది.

౪౯౩. గర్వమే అభిమానము.

ఉదా.— అందులోనే— ' దుర్యోధనుఁడు— అమ్మా నీమాటలు తగనివిగాను దీనములుగాను ఉన్నవి.' ఇత్యాది.

౪౯౪. వినయముతోడి యనువర్తనము అనువృత్తి.

ఉదా.— శాకుంతలమున— ' రాజు— (శకుంతలంగూర్చి) అమ్మాయీ, తపస్సు వర్ధిల్లుచున్నదా? అనసూయ— ఇప్పుడు, అతిథివిశేషలాభముచేత. ' ఇత్యాది.

౪౯౫. కడచిన కార్యమును వక్కాణించుట ఉత్కీర్తన మనబడును.

ఉదా.— బాలరామాయణమందు—

' నాగపాశములతోఁ గట్టుట ఇచటఁ జరిగినది; ఇచట ఈ వెతో నీమఱఁది త్రొమ్మన గాటముగా నేటుపడఁగా హనుమంతుఁడు ద్రోణపర్వతముం దెచ్చినాఁడు. ' ఇత్యాది.

౪౯౬. స్వయముగాఁగాని దూతముఖమునఁగాని వేడుట యాజ్ఞ.

ఉదా.—

† ' ఇప్పుడైనను వైదేహిని అర్పింపుము, రాముఁడు నీయెడ దయ వహించును; ఏల వానరులచేత నీతలకాయలతో బంతియాట లాడించెదవు? '

౪౯౭. కావించిన యనుచితమును తుడిచివైచుట పరిహార మనఁబడును.

---

* కాలరాత్రికరాలేయం స్త్రీతి కిం విచికిత్ససి
జగత్త్రితయం త్రాతుం తాత తాడయ తాడకాం.

† అద్యాపి దేహి వైదేహీం దయాళు స్త్వయి రాఘవః;
శిరోభిః కన్దుకక్రీడాం కిం కారయసి వానరాన్?

ఉదా.—

† ‘ ఓప్రభూ, ప్రాణనిర్యాణశోకపీడితుఁడనై అనుచితము వల్కితిని, దానిని మన్నింపుము; సుగ్రీవుని నీకు సమర్పించితిని ’

౪౯౮. ఒప్పరికించిన కర్తవ్యమును హెచ్చరించుట నివేదనము.

ఉదా.— రాఘవాభ్యుదయమున— ‘ లక్ష్మణుఁడు— అన్నయ్యా, సముద్రమును వేఁడుకొనుటచేత దాట నుద్యమించితివి. మఱి యిదేమి? ’

౪౯౯. కార్యమును సాధువుగా ప్రవర్తిల్లఁజేయుట ప్రవర్తనము.

ఉదా.— వేణియందు— ‘ రాజు— కంచుకీ, తమ్మునికి భీమసేనునికి విజయమంగళార్థము అందులకు తగిన సమారంభములను భగవంతుని దేవకీనందనుని బహుమానించి జరిపింపుము.

౫౦౦. పూర్వవృత్తములను వచించుట ఆఖ్యానము.

ఉదా.— అందులోనే—

‘ ఎందు శత్రువుల నెత్తురునీళ్ళతో మడుగులు నింపఁబడినవో యాప్రదేశము ఇదే. ’

౫౦౧. అర్థావధారణము యుక్తి.

ఉదా.— అందులోనే—

‡ ‘ యుద్ధమునఁ దప్ప మృత్యుభయము ఉండదేని, అప్పుడు ఇటనుండి అవలికి తొలఁగుట న్యాయ్యమే। మఱి ప్రాణికెల్లను చావు తప్పదు, ఏల వృథాగా కీర్తిని మలినము చేసికొనెదరు? ’

౫౦౨. ప్రమదాతిశయము ప్రహర్షము.

ఉదా.— శాకుంతలమున— ‘ మఱి యిప్పుడేల నన్ను పూర్ణమనోరథుని అభినందించుకొనను? ’

౫౦౩. ఉపదేశించుట శిక్ష.

ఉదా.— అందులోనే— సఖి, తగదు సుమా ఆశ్రమవాసిజనులకు గొప్పయతిథిని సత్కరింపక స్వచ్ఛందముగాఁ జనుట. ’

ఈనాట్యాలంకారములు సామాన్యముగా ఏకరూపముల యయినను భేదముగాఁ జెప్పఁబడుట గతానుగతికన్యాయంబున. మఱియు నిందుం గొన్ని గుణాలంకారభావసంధ్యంగవిశేషములయందు అంతర్భూతముల యైనను నాటకమున అవశ్య

---

† ప్రాణప్రయాణదుఃఖార్త ఉక్తవాన స్మ్యనక్షరం
తత్ క్షమస్వ విభో కించ సుగ్రీవ స్తే సమర్పితః.

‡ యది సమర మపాస్య నాస్తి మృత్యో ర్భయ మితి యుక్త మితోఽన్యతః ప్రయాతుం,
అథ మరణ మవశ్య మేవ జన్తోః కి మితి ముధా మలినం యశః కురుధ్వం.?

ము ప్రయోక్తవ్యము లని వానిని విశేషించి చెప్పుట.
ఇవియు—

'పంచసంధి చతుర్వృత్తి చతుష్షష్ట్యంగసంయుతము ముప్పదియాఱులక్షణములుగలది అలంకారోపశోభితము మహారసము మహాభోగము ఉదాత్తరచనతోఁగూడినది మహాపురుషగుణవర్ణనముగలది సాధ్వాచారము జనప్రియము సంధియోగములు చక్కఁగా అదికినట్టిది సుప్రయోగము సుఖాశ్రియము మృదుశబ్దనిబద్ధమునుంగా కవి నాటకమును రచించునది.'
అని ముని చెప్పినందున నాటకమునఅవశ్యము ప్రయోక్తవ్యములే. వీథ్యంగములు పిమ్మట చెప్పఁబడును.

లాస్యాంగములను చెప్పుచున్నాఁడు.—

౫౦౪. గేయపదము స్థితపాఠ్యము ఆసీనము పుష్పగండిక ప్రచ్ఛేదకము త్రిగూఢము సైంధవాఖ్యము ద్విగూఢకము ఉత్తమోత్తమకము ఉక్తప్రత్యుక్తముఅని లాస్యమందుపదివిధముల యంగములు విద్వాంసులచేఁ జెప్పఁబడినవి.

అందు.

౫౦౫. ఆసనమందుఁ గూర్చున్నవాఁడు వీణను ముందుంచుకొని శుష్క(నృత్యములేని) గానము చేయుట గేయపద మనఁబడును.

* ఉదా.— గౌరీగృహమందు వీణ వాయించుచు ; మలయవతి—

'కోరరానిది కోరితిఁ సమకూరు నంచెదఁ జేరఁగా
నేర నీకరుణాంసంబున నేరుతుఁ దరి సేరఁగా
నీరజోదరభూరజంబున నేర మెంచెదు సౌర చె
న్నారు మే గల గౌరి కైకొనుమా రయంబున నారతిఁ.'

౫౦౬. ఎందు మదనోత్తాపిత యింతి నిలుచున్నదై ప్రాకృతమును పఠించునో అది స్థితపాఠ్యమనఁబడును.

అభినవగుప్తపాదులు వచించిరి— 'ఇది యుపలక్షణము, క్రోధోద్భ్రాంతుని ప్రాకృతపఠనము సంయుతము స్థితపాఠ్యమే.' అని.

౫౦౭. ఎందు శోకచింతాకుల అబల వాద్యము లేమియు లేక దేహామును

* ఉత్ఫుల్లకమల కేసరపరాగగౌరద్యుతే మమ హి గౌరి
అభివాఞ్ఛితం ప్రసిధ్యతు భగవతి తవ ప్రసాదేన.

గానేసికొనక కూర్చుండునో అది ఆసీన మనఁబడును.

వాదిత్రమిశ్రితమయిన పాటయు నానాచ్ఛందంబులును కలుగునట్లుగా స్త్రీపురుషుల విపర్యాసచేష్ట పుష్పగండిక.

పతి యన్యాసక్తుఁడని తలఁచి ప్రేమభంగమునకైన శోకముచేత వీణావాదనపూర్వకముగా స్త్రీ పాడుట ప్రచ్ఛేదక మనఁబడును.

స్త్రీవేషధారులైన పురుషులయొక్క సుకుమారనాట్యము త్రిగూఢక మనఁబడును.

ఉదా.— మాలతియందు— ' మకరందుఁడు— ఇదె నేను మాలతి నైతిని. '

౫౦౫. ఎవఁడేని భ్రష్టసంకేతుఁడై సువ్యక్తమయిన వీణాదివాదనముతో ప్రాకృతవచనమును ఎందు పలుకునో అది సైంధవ మనఁబడును.

కరణ మనఁగా వీణాదిక్రియ.

౫౦౬. మనోహరమయిన పదములుగలిగి ఉక్తిప్రత్యుక్తిసమన్వితమై రసభావాఢ్యమయిన గీతము ద్విగూఢ మనఁబడును.

౫౦౭. (అ) ఉత్తమోత్తమక మనఁగా కోపప్రసాదములవలన కలిగినదియు, అధిక్షేపయుక్తంబును రసోత్తరంబును హావహేలాన్వితంబును చిత్రశ్లోకబంధమనోహరంబును నగు గీతము.

౫౦౮. (ఇ) ఉక్తిప్రత్యుక్తిసంయుక్తము నిందాసహితము అప్రియమువలె నుండునది విలాసముతోఁడిగీతార్థముకలదియు అగు గీతము ఉక్తప్రత్యుక్త మనఁబడును.

ఉదాహరణములు స్పష్టములు.

౫౧౦. నాటకమునే పతాకాస్థానకము లన్నిటితోను గూడి పదియంకములు గలదైనచో పండితులు మహానాటక మందురు.

ఉదా.— బాలరామాయణము.

1. ఇఁక ప్రకరణము:—.

౫౧౧. ప్రకరణమందు వృత్తము లౌకికము, కవికల్పితము. శృంగారము అంగి, నాయకుఁడు విప్రుఁడుగాని అమాత్యుఁడుగాని వణిజుఁడుగాని, అపాయముతోఁగూడిన ధర్మకామార్థములయందు ఆసక్తుఁడు, ధీరప్రశాంతుఁడును.

విప్రనాయకము మృచ్ఛకటికము, అమాత్యనాయకము మాలతీమాధవము, వణిఙ్నాయకము పుష్పభూషితము.

౫౧౨. నాయిక కొన్నిట కులకన్యగాను కొన్నిట వేశ్యగాను, కొన్నిట ఆయిరువురునుంగాను ఉండును. అందువలన దీనియందు మూఁడు భేదములు కలవు. అందు మూఁడవభేదమున వంచకులు ద్యూతకారాదులు విటులు చేటులు మెండుకొనియుందురు.

కులస్త్రీ పుష్పభూషితమున, వేశ్య రంగవృత్తమున, ఇరువురును మృచ్ఛకటికంబున ఇది నాటకప్రకృతి కలది గావున దీని కడమ లక్షణము నాటకంబునకుం బోలె (నెఱుఁగునది.)

ఇఁక భాణము.

౫౧౩. భాణము ధూర్తచరిత్రము, నానావస్థావిశేషస్వరూపము; అందు ఒకటే అంకము; నిపుణుఁడును పండితుఁడును నగు విటుఁడు రంగమందు తనయనుభూతమును గాని యితరుని యనుభూతమును గాని వెల్లడిసేయును: సంబోధనోక్తిప్రత్యుక్తులను ఆకాశభాషితములచే కావింపవలయును; శౌర్యసౌభాగ్యవర్ణనములచేత వీరశృంగారములను సూచింపవలయును ఇందు ఇతివృత్తము ఉత్పాద్యము, వృత్తి ప్రాయికముగా భారతి; ముఖ ప్రతిముఖ సంధులును లాస్యాంగములు పదియును ఉండును.

ఇందు— ఆకాశభాషితరూపమయిన పరవచనమును గూడ తానే అనువదించుచు ఉత్తరప్రత్యుత్తరములను కావింపవలయును. శృంగార వీరరసములను సౌభాగ్యశౌర్యవర్ణనచే సూచింపవలయును. ప్రాయికముగా భారతి, ఎక్కడనేని కైశికీవృత్తియుం గలుగును; లాస్యాంగములు గేయపదాదులు.

ఇఁక వ్యాయోగము.

౫౧౪. వ్యాయోగమున ఇతివృత్తము ప్రఖ్యాతము, స్త్రీజనము స్వల్పము, గర్భవిమర్శసంధులుండవు, పలుపురు నరులకు ఆశ్రయము, ఒకటే అంకము, స్త్రీనిమిత్తము గాని యుద్ధోద్యమము కలది. కైశికీవృత్తి యుండదు; ప్రఖ్యాతుఁడు, రాజర్షి యేని దివ్యుఁడేని ధీరోద్ధతుఁడు నాయకుఁడు; హాస్యశృంగారశాంతములు గాక ఇతరరసములు ఇందు ప్రధానములు.

ఉదా.— సౌగంధికాహరణము.

ఇఁక సమవకారము—

౫౧౫. సమవకారమందు వృత్తము ప్రఖ్యాతము దేవాసురాశ్రయము, విమర్శ తప్ప కడమ సంధులు, మూఁడు అంకములు; అందు మొదటియంకమున రెండు సంధులును, తుది రెంటను ఒక్కొక్కసంధియు నుండును; నాయకులు పన్నిద్దఱు, ఉదాత్తులు ప్రఖ్యాతులు దివ్యాదివ్యులు; వారికి ఫలము వెవ్వేఱు; వీరప్రధానములుగా అన్నిరసములును; కైశికీవృత్తి వలదు; ఇందు బిందు ప్రవేశకములు లేవు; యథాలాభముగా వీథ్యంగములు పదుమూఁడును ఉండును. గాయత్ర్యుష్ణిక్ప్రముఖములుగా ఇందు నానాఛందస్సు లుండును; దీనిని త్రిశ్శృంగారముగాను త్రికపటముగాను త్రివిద్రవముగాను చేయవలయును; వస్తువును ప్రథమాంకమున పండ్రెండు నాడికలదిగాను ద్వితీయాంకమున నాల్గునాడికలదిగాను తృతీయమున రెండునాడికలదిగాను ఉండవలయును.

నాడిక యనఁగా రెండు గడియల కాలము, బిందుప్రవేశకములు నాటకమున చెప్పఁబడినను ఇందుఁగూడవు. అందు—

౫౧౬. ధర్మార్థకామములచేత శృంగారము త్రివిధము; మఱి కపటము స్వాభావికమును కృత్రిమమును దైవజంబును; విద్రవము అచేతనకృతము చేతనకృతము చేతనాచేతనకృతంబును.

అందు ధర్మశృంగారము శాస్త్రావిరోధముగా జేయఁబడినట్టిది, అర్థశృంగారము అర్థలాభముకొఱకుఁ జేయఁబడినది; కామశృంగార మనఁగా ప్రహసనశృంగారము; అందు కామశృంగారము ప్రథమాంకమందే అనియు కడమ రెంటికిని నియమము లేదనియు చెప్పుదురు. చేతనాచేతనములు గజాదులు; ఇందు పెక్కులు అర్థములు (సమవకీర్యన్తే) నిబంధింపఁబడును గాన సమవకారము. ఉదా.— సముద్రమథనము.

ఇఁక డిమము—

౫౧౭. డిమమందు ఇతివృత్తము ప్రఖ్యాతము; మాయ ఇంద్రజాలము యుద్ధము క్రోధము ఉద్భ్రాంతాది చేష్టితములు ఉపరాగములు మెండుకొని

యుండును. రౌద్రరసము అంగి, అన్నిరసములు అంగములు, నాలు గంకములు, విష్కంభక ప్రవేశకములు లేవు; దేవగంధర్వయక్షరాక్ష సమహోరగభూతప్రేత పిశాచాదులు మహోద్ధతులు పదునాఱుగురు నాయకులు కైశికి తప్ప కడమ వృత్తులు, విమర్శ తప్ప కడమ సంధులు, నుండును. శాంతహాస్యశృంగారేతరములు దీప్తములు ఆఱు రసములు. ఇందులకు ఉదాహరణము త్రిపురదాహ మని మహర్షి

ఇక ఈహామృగము—

౨౬౭. ఈహామృగమందు వృత్తము మిశ్రము; నాలుగు అంకములు; ముఖము ప్రతిముఖము నిర్వహణమును సంధులు; నరదివ్యులు అనియ మముగా నాయకప్రతినాయకులు; వారు ఖ్యాతులు ధీరోద్ధతులు; అందు ప్రతినాయకుఁడు గూఢముగా అయుక్తము చేయువాఁడు; ఒల్లనిదివ్యాంగనను బలిమిలోనగు తీరుల హరింపఁగోరుచున్న యాత నికి కొంచెము కొంచెము శృంగారాభాసమును గూడ చూపవలయు ను; పతాకానాయకులు దివ్యులుగాని మర్త్యులుగాని పదుగురు ఉద్ధ తులు. ప్రతినాయకునికి క్రోధము పుట్టించి ఏదో వ్యాజమున యుద్ధ ము నిలిచిపోవును. ఇందు మహాత్ములు వధముం బొందినను వధా ర్హులు గారు. ఇందు ఒకటే అంకమనియు దివ్యుఁడే నాయకుఁడనియు కొందఱ మతము. యుద్ధము దివ్యస్త్రీహేతుకమనియు నాయకులు ఆఱుగు రనియు మఱికొందఱ మతము.

మిశ్రమనఁగా ఖ్యాతాఖ్యాతము; పతాకానాయకులు నాయకప్రతినాయ కులకు మొత్తమున పదుగురు. నాయకుఁడు మృగమునుం బోలె అలభ్యను నాయి కను ఇందు కోరును (ఈహతే) కావున ఈహామృగము. ఉదా.— కుసుమశేఖర విజయము.

ఇక అంకము—

౨౬౮. ఉత్సృష్టికాంకమున ఒకటే అంకము. నాయకులు అతికోవిదులుగాని నరు లు; రసము కరుణము స్థిరతరము; పెక్కు స్త్రీల యేడ్పు; ప్రఖ్యాతమ యిన యితివృత్తమును కవి స్వబుద్ధిచేత పెంపవలయును. ఇందు సంధి వృత్త్యంగములు భాణమందుం బోలె. జయపరాజయమ్ములను యుద్ధము

ను మాటలచేతనే రచింపవలయును; నిర్వేద వాక్యములు మెండు.
దీనిని కొందఱు నాటకాద్యంకమునుండి వేఱుసేయుటకుఁగాను ఉత్సృష్టికాంకమని పేరొ్కందురు. ఇతరులు ' ఇందు సృష్టి వ్యుత్క్రాంత అనఁగా విలోమరూప, కావున ఉత్సృష్టికాంకము. ' అందురు. ఉదా.— శర్మిష్ఠాయయాతి.

ఇఁక వీథి—

సూ ౨౦. వీథియందు ఒకటే అంకము, నాయకుఁడు ఎవఁడో ఒకఁడు కల్పింపఁబడును. చెప్పఁబడిన యాకాశభాషితములచే చిత్రమయిన ప్రత్యుక్తిని ఆశ్రయించియుండును. శృంగారమును మెండుగా సూచింపవలయును, ఇతరరసములను ఇంచుకగాను; ముఖనిర్వహణసంధులును, అర్థప్రకృతులన్నియును ఉండును.

ఎవఁడో ఒకఁ డనఁగా ఉత్తముఁడు గానీ మధ్యముఁడు గానీ. ఇందు శృంగారము బహుళము గాన కైశికీవృత్తి బహుళము.

సూ ౨౧. దీనికి పదుమూఁడు అంగములను విద్వాంసులు చెప్పుదురు.— ఉద్ఘాత్యకము అవలగితము ప్రపంచము త్రిగతము ఛలము వాక్కేళి అధిబలము గండము అవస్యందితము నాళిక అసత్ప్రలాపము వ్యాహారము మృదవము అనునవి.

వానిలో ఉద్ఘాత్యకావలగితములు ప్రస్తావనా ప్రస్తావమందు సోదాహరణముగాఁ జూపఁబడినవి.

సూ ౨౨. మిథ్యారూపమయిన పరస్పరవాక్యము హాస్యకారి ప్రపంచ మనఁబడును.

ఉదా.— విక్రమోర్వశియందు వలభియందలి చేటీవిదూషకుల యన్యోన్యవచనము

సూ ౨౩. శ్రుతిసామ్యముచేత అనేకార్థములను యోజించుట త్రిగతము.

* ఉదా.— అందులోనే— ( రాజు—

సర్వభూభృదధిప సర్వాంగసుందరి రామ సన్నుతాభిరామకమున
గానసానంతరముసఁ గానంగఁబడియెనే నాకుఁ బాసినయది నీకుఁ బ్రియుండ?

---

* సర్వక్షితిభృతాం నాథ దృష్టా సర్వాఙ్గసున్దరీ
రామా రమ్యే వనాన్తేఽస్మిన్ మయా విరహితా త్వయా.

[నేపథ్యమున ఆక్షేప ప్రతిధ్వని] రాజు—ఏమి! చూచితి నన్నాఁడు! '

ఇచ్చట ప్రశ్న వాక్యమే ఉత్తరముగా యోజింపఁబడినది. ' ఇది నటాదులకుమువ్వురకే సంబంధించినది ' అని యొకఁడు.

౧౨౮. ప్రియములవలె తోఁచెడి యప్రియవాక్యములచేత బెలిపించి వంచించుటచేత ఛలము.

* ఉదా.— వేణియందు— ' భీమార్జునులు.—

జూదపుమోసములం జేయువాఁడు, లక్కయింటికి నిప్పుపెట్టువాఁడు, అతఁడు అభిమాని రాజు, దుశ్శాసనాదులగు నూర్వుర తమ్ములకు అన్న, అంగరాజునకు చెలికాఁడు, ద్రౌపదీకేశోత్తరీయములను లాగింప సమర్థుఁడు, పాండవులను దాసులనుగా నేలువాఁడు ఎక్కడ నున్నాఁడు ఆదుర్యోధనుఁడు చెప్పుఁడు, చూడ వచ్చితిమి, కోపముతోఁ గాదు. '

౧౨౯. కొందఱ మతంబున ఛల మనఁగా ఏదో ఒకకార్యము నుద్దేశించి ఎవనికేని వంచనాహాస్యరోషకారిగా చెప్పిన వచనము.

వాక్కేళి యనఁగా హాస్యసంబంధమైనది, రెండు మూఁడు ప్రత్యుక్తులచేత నగునది.

రెండు మూఁ డనుట యుపలక్షణము.

‡ ఉదా.— ' భిక్షుఁడా, మాంసమును భుజించెదవే! సారాయి లేక మాంస మేల? సారాయి కూడ నీకుఁ బ్రియమా? ఆహా ప్రియమే వారాంగనలతోఁ గూడ; వారాంగన ధనము కోరునే, నీకు ధన మెక్కడిది? జూదమునఁ గాని దొంగతనమునఁ గానీ; జూదము దొంగతనముం గూడ తెలియునా తమకు? భ్రష్టునికి వేఱు గతి యేమి? '

కొందఱు ' ఆరంభించిన వాక్యము ఆకాంక్ష తీఱకుండఁగానే నిలిచిపోవుట వాక్కేళి ' యందురు. ఇతరులు ' పెక్కు ప్రశ్నలకు ఒక్కటే యుత్తరము వాక్కేళి' యందురు.

---

* కర్తా ద్యూతచ్ఛలానాం జతుమయశరణోద్దీపనః సోఽభిమానీ
కృష్ణా కేశోత్తరీయ వ్యపనయన మరు త్పాణ్డవా యస్య దాసాః
రాజా దుశ్శాసనాదే ర్గురు రనుజశత స్యాఙ్గరాజస్య మిత్రం
క్వాస్తే దుర్యోధనోఽసౌ కథయత న రుషా ద్రష్టు మభ్యాగతౌ స్వః.

‡ భిక్షో మాంసనిషేవణం ప్రకురుషే! కిం తేన మద్యం వినా?
మద్యం చాపి తవ ప్రియం! ప్రియ మహో వారాఙ్గనాభిః సహ.
వేశ్యా ప్యర్థరుచిః, కుత స్తవ ధనం? ద్యూతేన చౌర్యేణ వా.
చౌర్యద్యూతపరిగ్రహోఽపి భవతో! నష్టస్య కాన్యా గతిః. ?

సూ. ౨౬. స్పర్థచేత ఒకరిని మించి యొకరు పలుకుట అధిబల మనఁబడును.

* ఉదా.— మదీయ ప్రభావతియందు — 'వజ్రనాభుఁడు—
'ఈగదతో అవలీలగా వీని యురమును క్షణములో చదిపి ఇదె యిపుడు మీ రెండు లోకములను నిర్మూలించెదను.

‡ ప్రద్యుమ్నుఁడు— ఓరోరి అసురాధముఁడా, ఈబలుపేరిలుడును నిలుపు; చూచుకో ఇదె నాయొక్క ప్రచండభుజదండంబున దాల్చిన వెనువింటినుండి వెలువడు బాణపరంపరల వ్రేటులచేత క్షణములో ఈభూమి సమస్తదైత్యుల నెత్తుటం దోఁగి పిశితాశనులకు లోభనీయ మయ్యెడిని.'

సూ. ౨౭. ప్రస్తుతార్థసంబద్ధమై భిన్నార్థమైన సత్వర వచనము గండము.

ఉదా.— వేణియందు— 'రాజు— ఓ కరభోరుకా నీజఘనస్థలము చిర మధివసించుటకు చాలును నాయూరుయుగ్మము. (అనంతరము) కంచుకి— (ప్రవేశించి) దేవా, భగ్నము భగ్నము' ఇత్యాది.

ఇచట రథకేతనభంగార్థమయిన వచనము ప్రస్తుతమయిన యూరుభంగార్థమందు సంబద్ధము.

సూ. ౨౮. స్వరసంబునం జెప్పిన వాక్యమునకు వేఱు విధముగా వ్యాఖ్యానము చేయుట అవస్యందితము:

ఉదా.— ఛలితరామమునందు— 'సీత— పుత్రా, ప్రొద్దున అయోధ్యకుం బోవలయును, అచట నారాజునెడ వినయముతో వర్తింపవలయును. లవుఁడు— ఇఁక మేము రాజోపజీవులము కావలసినదా? సీత— పుత్రా, ఆయన మీజనకుఁడు గదా. లవుఁడు — ఏమి, మాకు రఘుపతి తండ్రియా? సీత— (ఆశంకతో) వేఱుగా శంకింపకుఁడు, మీకే గాదు, సకలమయిన పృథివికిని.'

సూ. ౨౯. ప్రహేళికయే హాస్యముతోఁ గూడిన నాళిక యగును.

మఱుఁగుసేయునట్టి యుత్తరము ప్రహేళిక.

ఉదా.— 'రత్నావళియందు— 'సుసంగత— సఖి, నీవు దేని(ఎవరి)కొఱకు వచ్చితివో అది (అతఁడు) ఇచటనే ఉన్నది(ఉన్నాఁడు). సాగరిక— ఎవరికొఱకు నేను వచ్చితిని?

---

* అస్య వక్షః క్షణేనైవ నిర్మథ్య గదయానయా
లీలయోన్మూలయామ్యేష భువనద్వయ మద్య వః.

‡ అద్య ప్రచణ్డ భుజదణ్డ సమర్పితోరు కోదణ్డ నిర్గళిత కాణ్డసమూహపాతైః
ఆస్తాం సమస్త దితిజ క్షత శోణితేయం క్షోణిః క్షణేన పిశితాశనలోభనీయా.

సుసంత.— చిత్రరమ్యఫలకకొఱకుఁ గాదా.'

ఇట 'నీవు రాజుకొఱకు వచ్చితివి' అను నర్థము దాఁపఁబడినది.

౫౩౦. అసంబద్ధమయిన వాక్యంబును అట్టియుత్తరమును. మూర్ఖుఁడు గ్రహింపక పోయినను వానికి హితవచనము చెప్పుటయు అసత్ప్రలాపములు.

అందు తొలివానికి ఉదా.— మదీయ ప్రిభావతియందు,—'ప్రద్యుమ్నుఁడు.— (మామిడి తీఁగను గాంచి ఆనందముతో) ఏమి యిచట నే—

* తుమ్మెదపిండువంటి యందంపుఁ గురు లొప్ప పరిమళము బుగులుకొన రసావహయై సన్ననిదై చివుళ్ళవలె కోమలములయిన కరతలములతోను కోకిలలవలె మధురభాషిణి నాప్రియతమ?'

ఇట్లు అసంబద్ధోత్తరమునకును. మూఁడవది యెట్లన వేణీయందు దుర్యోధనునికి గాంధారివాక్యము.

౫౩౧ ఇతరునికొఱకు హాస్యశోభకరమయిన వాక్యము వ్యాహారము

ఉదా.— మాళవికాగ్నిమిత్రమందు— '(లాస్యప్రయోగావసానమున మాళవిక నిర్గమింపఁ గోరును) విదూషకుఁడు.— నిలువు, ఉపదేశము శుద్ధ మనిపించుకొని మఱి వెళ్లు. (అనుట మొదలుగా) గణదాసుఁడు.— (విదూషకుం గూర్చి) ఆర్యా, నీవు కనిపట్టిన క్రమభేదమేమో చెప్పుము. విదూషకుఁడు.— తొలుత బ్రాహ్మణపూజ చేయవలసినది. దానిని ఈమె అతిక్రమించినది. (మాళవిక ఎలనవ్వు నవ్వును)' ఇత్యాదికముచేతను విశుద్ధశాలింగా నాయికను చూపుటకై ప్రయోగించిన హాస్యశోభకారి వచనముచేత వ్యాహారము.

౫౩౨. ఎందు దోషములు గుణములును గుణములు దోషములును అగునో అది మృదవము.

‡ వరుసగా ఉదా.—'ప్రియుఁడా, బ్రదికియుండుట యనెడు కాఠిన్యంబును అనురక్తిలేమియు చేసినమేలు మఱచుటయు నాయవి యివి రెండియు నిన్నుం గాంచినందున గుణములే అయినవి.'

'యౌవనశ్రీచేత నలంకృతము సుఖైకాస్పదము నైన యాయిఁతియొక్క యారూపసౌందర్యము నాకిప్పుడు దుఃఖమునకే అయినది.'

---

* అలికుల మఞ్జులకేశీ పరిమల బహులా రసావహా తన్వీ
కిసలయపేశలపాణిః కోకిలకలభాషిణీ ప్రియతమా మే.

‡ ప్రియ జీవితతాక్రౌర్యం నిఃస్నేహత్వం కృతఘ్నతా
భూయస్త్వద్దర్శనా దేవ మమైతే గుణతాం గతాః.

ఈయంగములు నాటకాదులయందు సంభవించునవే అయినను విస్పష్టముగా నాటకాదులయందుఁ బెట్టంబడినవి యైనను వీథియందు అవశ్యముగా నిబంధింపవలసినవి గావున నిట నుదాహృతములు. వీథివలె నానారసములు ఇందు మాలగా ఉండును గావున వీథి యిది. ఉదా.— మాళవిక.

ఇఁక ప్రహసనము.

౫౩౩. ప్రహసన మనఁ గవికల్పితము యగు నింద్యులచరిత్రము; ఇందు సంధిసంధ్యంగలాస్యాంగాంకములు భాణమున నెట్లో అట్లే నిర్మింపఁబడును. ఇందు ఆరభటి లేదు. విష్కంభక ప్రవేశకములును లేవు.

౫౩౪. హాస్యరసము అంగి, వీథ్యంగములను ఉంపవచ్చును. లేక మానను వచ్చును.

౫౩౫. ఎందు తపస్వి సన్న్యాసి బ్రాహ్మణ ప్రభృతులలో నొకఁడు ధృష్టుఁడు నాయకుఁడో అది శుద్ధప్రహసన మనఁబడును.

ఉదా.— కందర్పకేళి.

౫౩౬. ఎవని నేని ఆశ్రయించి రచించిన అది సంకీర్ణ మనఁబడును.

ఉదా.— ధూర్తచరితము.

౫౩౭. ఎందు పలువురు ధృష్టులచరితమో అది సంకీర్ణ మని కొందఱు వచించిరి. ఇందు రెండంకము లేని ఒకటే యంకమేని యుండవచ్చును.

ఉదా.— లటకమేళకాది

మునియో యిట్లు చెప్పినాఁడు.—

'వేశ్య చేటుఁడు నపుంసకుఁడు విటుఁడు ధూర్తుఁడు బంధకియు ఎందు నైసర్గికమయిన వేషపరిచ్ఛదచేష్టితములతో వ్యవహరింతురో అది సంకీర్ణము' అని.

౫౩౮. ఎందు షండకంచుకితాపసులు భుజంగనటభటాదుల వేషభాషల నవలంబింతురో దానిని వికృతప్రహసన మందురు.

వికృతప్రహసనమును ముని, సంకీర్ణముచేతనే గతార్థ మగుటం బట్టి, ప్రత్యేకముగాఁ జెప్ప లేదు.

ఇఁకను ఉపరూపకములు— అందు—

---

* తస్యా స్తద్రూపసౌన్దర్యం భూషితం యౌవనశ్రియా
సుఖైకాయతనం జాతం దుఃఖా యైవ స మాథునా.

౫౩౯. నాటికయందు వృత్తము కవికల్పితము, స్త్రీల బాహుళ్యము, అంక ములు నాలుగు, ప్రఖ్యాతుఁడు ధీరలలితుఁడు నగు. నృపుఁడు నాయ కుఁడు; రాణికి చెందినది గాని సంగీతవ్యాపారమున నున్నది గాని నృపకులముది నవానురాగ కన్య నాయిక.

నాయకుఁడు దేవివలని వెఱపుచేత అకులుఁడగుచు ఆనాయికయందు వర్తిల్లును. దేవి నాయికకన్న వయోధికురాలు నృపవంశసంభూత ప్రగల్భ మాటిమాటికి మానము బూనునది. ఆయిరువురకు సంగ మము ఆమెవశములో నుండును. ఇందు వృత్తి కైశికి, విమర్శసంధి యుండదు.

ఆయిరువుర=నాయికానాయకుల. ఉదా — రత్నావళీ విద్ధసాలభంజికాది.

ఇఁక తోటకము.—

౫౪౦. త్రోటకమున ఏడు ఎనిమిది తొమ్మిది అయిదు అంకము లుండును, దివ్యాదివ్యుఁడు నాయకుఁడు, ప్రతియంకమునను విదూషకుఁ డుండును.

ప్రత్యంకసవిదూషకత్వమువలన నిందు శృంగారము అంగి. సప్తాంకమునకు ఉదా.— స్తంభితరంభము. పంచాంకమునకు ఉదా.— విక్రమోర్వశి.

ఇఁక గోష్ఠి.—

౫౪౧. గోష్ఠియందు ప్రాకృతులు తొమ్మండ్రోని పదుగురోని పురుషు లుం దురు. గర్భ విమర్శ సంధు లుండవు, వచనము ఉత్కృష్టము గాదు, కామశృంగారము గూడి యుండును, ఒకటే అంకము; వృత్తి కైశికి.

ఉదా.— రైవతమదనిక [కామశృంగారము వ్యాఖ్యాతము.]

ఇఁక సట్టకము—

౫౪౨. సట్టకమున పాఠ్య మెల్ల ప్రాకృతము, ప్రవేశక విష్కంభకము లుం డవు, అద్భుతరసము ప్రచురము, అంకములకు జవనిక లని పేరు. కడమ యంతయు నాటికయం దెట్లో అట్లే.

ఉదా.— కర్పూరమంజర్యాది.

ఇఁక నాట్యరాసకము.—

౫౪౩. నాట్యరాసకమున ఒకటే అంకము, తాళముతోను లయతోను మెండుగాఁ గూడియుండును; నాయకుఁడు ఉదాత్తుఁడు, అట్లే ఉపనాయకుఁడు పీఠమర్దుఁడు, సశృంగారము హాస్యము అంగి, నాయిక వాసకసజ్జిక, ముఖ నిర్వహణ సంధులు, లాస్యాంగములు పదియును, ఉండును. కొందఱు ఇందు ప్రతిముఖసంధి మాత్రమే కూడ దందురు.

అందు రెండు సంధులు కలదానికి ఉదా.—— నర్మవతి. నాలుగు సంధులు కలదానికి ఉదా.—— విలాసవతి.

ఇఁక ప్రస్థానకము.——

౫౪౪. ప్రస్థానకమున నాయకుఁడు దాసుఁడు; ఉపనాయకుఁడు తక్కువవాఁడు; నాయిక దాసి; వృత్తి కైశికి, భారతియు; సురాపాన సమాయోగమువలన ఉద్దిష్టార్థము సమాపనము చెందును; రెండంకములు, లయ తాళాదికమయిన విలాసము ఇందు ప్రచురము.

ఉదా.—— శృంగారతిలకము.

ఇఁకను ఉల్లాప్యము.——

౫౪౫. ఉల్లాప్యమున నాయకుఁడు ఉదాత్తుఁడు; వృత్తము దివ్యము; అంకము ఒకటే; శిల్పకముయొక్క యంగములును హాస్యశృంగారకరుణరసములును ఒప్పును; కొందఱమతంబున ఉల్లాప్యము పెక్కు యుద్ధములతో నొప్పును, అస్రగీతముచే మనోహర మగును, అందు నాయికలు నలువు రుందురు, అంకములు మూఁ డుండును.

శిల్పకాంగములు పిమ్మట చెప్పఁబడును. ఉదా.—— దేవీమహాదేవము.

ఇఁకను కావ్యము.——

౫౪౬. కావ్యము ఏకాంకము హాస్యసంకులము ఆరభటీహీనము, ఖండమాత్రాచేతను ద్విపదికచేతను భగ్నతాళముచేతను, శోభిల్లుచుండును, వర్ణమాత్రితోను ఛడ్డలికతోను కూడియుండును, శృంగారమును సూచించును; ఇందు నాయకుఁడు ఉదాత్తుఁడు, నాయికయు ఉదాత్త; సంధులు ముఖ ప్రతిముఖములును నిర్వహణంబును.

ఉదా.—— యాదవోదయము.

ఇఁక ప్రేంఖణము.——

౫౪౭. ప్రేంఖణమున గర్భావమర్శము లుండవు, నాయకుఁడు హీనుఁడు, సూత్రధారుఁ డుండఁడు, ఒకటే అంకము, విష్కంభకప్రవేశకములు లేవు, నియుద్ధమును రోషభాణమును కలుగును, వృత్తు లన్నియు ఆశ్రితము లగును, నాంది నేపథ్యమున పాడఁబడును, అట్లే అదటనే ప్రరోచన కావింపఁబడును.

ఇఁక రాసకము.—

౫౪౮. రాసకమున అయిదుగురు పాత్రములు, ముఖ నిర్వహణములు సంధులు, భాషావిభాషలు మెండుకొనును, వృత్తులు భారతియు కైశికియు, సూత్రధారుఁడు లేఁడు, ఒకటే అంకము, వీథ్యంగము లుండును. కళలు రాజిల్లును, నాంది శ్లిష్టము, నాయిక ప్రసిద్ధురాలు, నాయకుఁడు మూర్ఖుఁడు. ఉత్తరోత్తరముగా నాయకుని గొప్పతనంపు వర్ణన ఆశ్రిత మగును. కొందఱు ఇందు ప్రతిముఖసంధియు నుండు నందురు.

ఉదా.— మేనకాహితము.

ఇఁక సంలాపకము.—

౫౪౯. సంలాపకమున అంకములు నాలుగేని మూఁడేని; నాయకుఁడు పాషండుఁడు; రసము శృంగారకరుణములు గాక ఇతర మేదయినను; ఊరి ముట్టడి ఛలము సంగ్రామము విద్రవంబును గలుగును; భారతీకైశికీ వృత్తు లుండవు.

ఉదా.— మాయాకాపాలికము.

ఇఁక శ్రీగదితము.—

౫౫౦. శ్రీగదితమున వృత్తము ప్రసిద్ధము, అంకము ఒకటి, నాయకుఁడు ప్రఖ్యాతుఁడు ఉదాత్తుఁడును; నాయిక ప్రసిద్ధురాలు, గర్భవిమర్శ సంధు లుండవు; ఇది భారతీవృత్తిబహుళమై 'శ్రీ' అనుశబ్దముతో సంకులమై యుండును, అని విద్వాంసులచే చెప్పఁబడినది.

ఉదా.— క్రీడారసాతలము.

కొందఱ మతంబున శ్రీగదితమున శ్రీ కూర్చున్నదై ఏదేని పాడును పఠించును; అంక మొకటి భారతీప్రాయము; ఉదాహరణము నూహించుకొనునది.

ఇఁక శిల్పకము.—

౨౫౧. శిల్పకమున— నాలు గంకములు, నాలుగు వృత్తులు, శాంతహాస్య ములు దప్ప కడమ రసములు, నాయకుఁడు బ్రాహ్మణుఁడు, ఇందు శ్మశానాదివర్ణన యుండును; ఉపనాయకుఁడు తక్కువవాఁడు, దీనికి ఇరువదియేడు అంగములు కలుగును; అవి వేపస— ఆశంస తర్కము సందేహము తాపము ఉద్వేగము ప్రసక్తి ప్రయత్నము గ్రథనము ఉత్కంఠ అవహిత్థ ప్రతిపత్తి విలాసము ఆలస్యము వామత్వము ప్రహర్షము అశ్లీలము మూఢత సాధనానుగమము ఉచ్ఛ్వాసము విస్మయము ప్రాప్తి లోభము విస్మృతి సంఫేటము విశారదత్వము ప్రబోధనము చమత్కృతి అనునవి; స్పష్టములు గావున వీనికి లక్షణము చెప్పలేదు.

సంఫేటగ్రథనములకు లక్షణము పూర్వము చెప్పినందున సిద్ధమే.

ఉదా.— కనకావతీమాధవము.

ఇఁక విలాసిక.—

౨౫౨. విలాసిక శృంగారబహుళ, ఏకాంక, పది లాస్యాంగములతోఁ గూడినది, విటవిదూషకపీఠమర్దులచే నొప్పునది; ఇందు గర్భవిమర్శసంధు లుండవు, నాయకుఁడు హీనుఁడు, వృత్తములు స్వల్పములు, నేపథ్యములు ప్రశస్తములు; ఇట్టిదిగా ప్రసిద్ధమైనది.

కొందఱట 'విలాసికా' అనుటకు మాఱుగా 'వినాయికా' అని పఠింతురు. మఱి కొందఱు దీనికి దుర్మల్లికలో అంతర్భావముం జెప్పుదురు.

ఇఁక దుర్మల్లిక.—

౨౫3. దుర్మల్లియందు నాలుగు అంకములు కైశికీభారతులు ఉండును, గర్భసంధి లేదు, నగరవాసినరులు (చతురులు) ఉందురు, నాయకుఁడు (కులము)తక్కువవాఁడు; ప్రథమాంకము మూఁడునాడికలదై విటక్రీడామయముగా నుండును; ద్వితీయాంకము అయిదునాడులదై విదూషకవిలాసమయముగా నుండును; మూఁడవయంకము ఆఱునాడికలది, పీఠమర్దవిలాసముతో చెలువారును; నాలుగవయంకము పదినాడికలది, అందు నాగరజనులు క్రీడింతురు.

ఉదా.— బిందుమతి.

ఇఁకను ప్రకరణిక.—

౫౫౪. నాటికయే ప్రకరణి; అందు నాయకుఁడు సార్థవాహాది; నాయిక నాయకునివంశముదే.

ఉదాహరణము మృగ్యము.

ఇఁక హల్లీసకము.—

౫౫౫. హల్లీసకమున ఒకటే అంకము; ఏడుగురు ఎనమండ్రు పదుగురేని స్త్రీలు; వాక్కు ఉత్తమము; పురుషుఁడు ఒకఁడు; కైశికీవృత్తి తేజ రిల్లును; ముఖోపసంహారములు సంధులు; తాళలయములు పెల్లు విలసి ల్లును.

ఉదా.— కేళీరైవతకము.

ఇఁక భాణిక.—

౫౫౬. భాణికయందు వేషము రుచిరము, ముఖనిర్వహణములు కలవు, కైశికీభారతీయుక్తములయిన యంకములతో రచింపఁబడును. నాయిక యుదాత్తురాలు, నాయకుఁడు హీనుఁడు; ఏడు అంగములు; ఉపన్యా సము విన్యాసము విబోధము సాధ్వసము. సమర్పణము నివృత్తి సం హారము అనునవి; ఉపన్యాసమనఁగా ప్రసంగవశమున కార్యమును కీర్తించుట; నిర్వేదవాక్యములను విస్తరించుట విన్యాస మనఁబడును;. భ్రాంతి తొలఁగుట విబోధము; అనృతము చెప్పుట సాధ్వసము; కోపపీడచేత నిందతోడి వాక్యము సమర్పణము; నిదర్శనము నుపన్య సించుట నివృత్తి యనఁబడును; కార్యమును సమాప్తి నొందించుట సంహార మనఁబడును.

వీనికి ఉదాహరణములు స్పష్టములు. (భాణికకు) ఉదా — కామదత్త. ఇవన్నియు నాటకప్రకృతికములే అయినను నాటకోక్తవిశేషములను యథాలాభ ముగాను యథౌచిత్యముగాను నిబంధింపవలయును. ఏది నాటకోక్త మయినను మరల నిందు చెప్పఁబడినదో దానిని గ్రహింపవలయునని నియమము.

ఇఁక శ్రవ్యకావ్యములు —

౫౫౭. శ్రోతవ్యమాత్రము శ్రవ్యము, అది పద్యమయము గద్యమయము

నని యిరుదెఱంగులు.

అందు పద్యావయవముల జెప్పుచున్నాఁడు.—

౫౫౮. (గాయత్ర్యాదులగు) ఛందస్సులచేత కట్టఁబడిన పదములు గలది పద్యము. అది పద్యాంతరనిరపేక్షమేని ముక్తక మనఁబడును; అట్టి రెండొక్కటిగాఁ జేరిన యుగ్మక మగును; మూఁడొక్కటిగాఁ జేరిన సందానితకము, నాల్గింటిచే కలాపకము, ఏనింటిచే కుళకము అనఁబడును.

అందు ముక్తకమునకు ఉదా.— మదీయము—

* 'సాంద్రానందము అనంత మవ్యయము అజము నగు దేనిని క్షణము సాక్షాత్కరించుటకై యోగులు సయితము ప్రతిక్షణము ఏకాగ్రచిత్తులై ధ్యానములచేత ఉపాసింతురో ఆపరబ్రహ్మమును ఏమధురాపురీ యువతులు కౌతూహలముతో కౌఁగిలింతురో సల్లాపింతురో నూఱువగల తిరియుదురో ముద్దుగొందురో వారు ధన్యులు.'

యుగ్మకమునకు ఉదా.— మదీయము—

† 'ఓసుందరీ ఏల అఱచేతిచెంత గండస్థలము నుంచుకొనెదవు, అనురాగవశంవదుఁడును త్వదేకపరాయణుఁడు నగు కాంతునిమీఁద కోపములు తగవు— ఇట్లని కురంగాక్షిని మేము హెచ్చరింపఁ గోరునంతట మావియందు మధురమయిన తుమ్మెదస్వనము ఉద్భవించినది.'

ఇట్లు ఇతరములును గూడ.

౫౫౯. మహాకావ్య మనునది సర్గబంధము; అందు నాయకుఁడు వేలుపేని సద్వంశుఁడు క్షత్రియుఁడేని ధీరోదాత్తగుణాన్వితుఁడు ఒకఁడు నాయకుఁడు; ఏకవంశభవులయిన భూపులు కులజులు పలువురు గాని; శృంగా

---

* సాన్ద్రానన్ద మనన్త మవ్యయ మజం యద్యోగినోఽపి క్షణం
సాక్షాత్కర్తు ముపాసతే ప్రతిముహు ర్ధ్యానైకతానా పరం
ధన్యాస్తా మధురాపురీయువతయ స్తద్బ్రహ్మ యాః కౌతుకా
దాలిఙ్గన్తి సమాలపన్తి శతధా కర్షన్తి చుమ్బన్తి చ.

† కిం కరోషి కరోపాన్తే కాన్తే గణ్డస్థలీ మిమాం
ప్రణయ ప్రవణే కాన్తేఽనైకాన్తే నోచితాః క్రుధః.

† ఇతియావత్కురఙ్గాక్షీం వక్తు మీహామహే వయం
తావ దావిర్భభూ చ్చూతే మధురో మధుపధ్వనిః.

రవీరశాంతములలో ఒకరసము అంగి, కడమ రసము లన్నియు అంగములు; నాటకసంధు లన్నియు నుండును; ఇతివృత్తము ఇతిహాసోద్భవము గాని, సజ్జనాశ్రయము ఇతరము గాని; నాలుగు పురుషార్థములును ఉండును, అందొకటి ఫల మగును. ఆదియందు నమస్కారమేని ఆశీస్సేని వస్తునిర్దేశమేని (వలయును); కొన్నిమెడల ఖలనిందసజ్జనగుణస్తుతియు నుండును; ఏకవృత్తమయములగు పద్యములతోను తుదను ఇతరవృత్తములతోను మఱియు చిన్నదియుం గాక మఱియుం బెద్దదియుంగాక సర్గములు ఎనిమిదింటికి హెచ్చుగా నుండును. ఎక్కడనేని ఒకసర్గము నానావృత్తమయముగాను గనంబడును; సర్గాంతమున అనంతరసర్గయొక్క కథాంశము సూచితమగును; ఇందు సంధ్యలు సూర్యుఁడు చంద్రుఁడు రాత్రి ప్రదోషము చీఁకటి పగలు ప్రాతఃకాలము మధ్యాహ్నము వేఁట కొండ ఋతువులు వనము సాగరము సంభోగము విప్రలంభము మునులు స్వర్గము పురము జన్నము యుద్ధము పయనము వివాహము మంత్రము పుత్రోదయము ఇత్యాదులను యథాయోగముగా సాంగోపాంగముగా వర్ణింపవలయును. దీనిని కవిపేరఁ గాని ఇతివృత్తముపేరఁ గాని నాయకునిపేరఁ గాని ఇతరునిపేరఁగాని పేర్కొనవలయును. సర్గమందు గ్రాహ్యమయిన కథచే సర్గముం బేర్కొనునది.

ఇందులో సంధ్యంగములు యథాలాభముగా నివేశనీయములు. 'తుదను ఇతరవృత్తములతోను' అనునెడ బహువచనము అవివక్షితము. 'సాంగోపాంగముగా' అనుటచే జలకేళి మధుపానాదులు; ఉదా.— రఘువంశము శిశుపాలవధము నైషధము లోనగునవి; మదీయరాఘవవిలాసాదికమేని.

౫౬౦. ఇది ఋషిప్రణీతమగు నేని సర్గములు ఆఖ్యానము లనఁబడును.

ఇది యనఁగా మహాకావ్యము. ఉదా.— మహాభారతము.

౫౬౧. ఇది ప్రాకృతభాషానిర్మితమేని ఇందలి సర్గలకు ఆశ్వాసములని పేరు. స్కంధకమును ఛందమునఁగాని ఒక్కెడ గళితకములను ఛందోవిశేషమునం గాని రచింపఁబడును.

ఉదా.— సేతుబంధము; ఒండె— మదీయము కువలయాశ్వచరితము.

సూ. ౨. ఇట అపభ్రంశభాషామయమేని సర్గములు కుడబకము లనఁబడును. అట్లే అందు అపభ్రంశయోగ్యములయిన నానాచ్ఛందములచే రచింపఁబడును.

ఉదా.— కర్ణపరాక్రమము.

సూ. ౩. భాషావిభాషానియమము కల్గదై సర్గవిభాగములును సంధిసామగ్ర్యంబును లేనిదై ఏకార్థప్రవణములగు పద్యములతో రచింపఁబడినట్టిది. కావ్య మనఁబడును.

ఉదా.— భిక్షాటనము, ఆర్యవిలాసంబును.

సూ. ౪. కావ్యముయొక్క యేకదేశము ననుసరించునట్టిది ఖండకావ్యము

ఉదా.— మేఘదూతాది.

సూ. ౫. అన్యోన్యనిరపేక్షములయిన శ్లోకముల సమూహము కోశమనంబడును. అదియే వ్రజ్యాక్రమమున రచితమైనచో అతిమనోహరము మగును.

సజాతీయములకు ఒకచోట సన్నివేశము వ్రజ్య. ఉదా. ముక్తావళ్యాది.

ఇఁక గద్యకావ్యములు— అందు గద్యము.—

సూ. ౬. వృత్తలేశవిహీనమయిన గద్యము ముక్తకము (1) వృత్తగంధి (2) ఉత్కలికాప్రాయము (3) చూర్ణకము (4) నని నాలుగు విధములు. తొలిది సమాసరహితము; రెండవది వృత్తభాగములతో కూడుకొన్నట్టిది; మూఁడవది దీర్ఘసమాసాఢ్యము; నాలవది అల్పసమాసకము.

[భాగములతో = పాదములతో]

ముక్తకమునకు ఉదా.— "వచస్సునగుపవు, ఉరస్సు పృథువు;" ఇత్యాది.

వృత్తగంధికి ఉదా.— మదీయము— 'సమరకండూలిత నిబిడభుజదండ కుండలీకృత కోదండ శింజినీ టంకారోజ్జాగరిత వైరినగర—' ఇత్యాది.

ఇందు 'కుండలీకృతకోదండ—' అని యనుష్టుబ్వృత్తపాదము; 'సమరకండూల' అనియు తొలిరెండక్షరములుం గొఱవడినట్టి యనుష్టుప్పాదమే.

ఉత్కలికాప్రాయమునకు ఉదా.— మదీయమే— '(ఘా)' అనిశవిస్తర నిశితతర శర విసర విదళిత సమర పరిగత ప్రబల పరబల' ఇత్యాది.

చూర్ణకము మదీయము— 'గుణరత్నసాగర జగదేకనాగర కామినీమదన జనరంజన' ఇత్యాది.

౫౬౭. కథయందు వస్తువు సరసము, పద్యములచేతనే నిర్మితము. ఒక్కొక్కెడ ఇందు ఆర్య యుండును, ఒక్కొక్కెడ వక్త్రాపవక్త్రకము లుండును. ఆదిలో పద్యములతో నమస్కారమును (పద్యములతోనే) ఖలాదుల వృత్తము వర్ణించుటయు.

ఉదా.— కాదంబర్యాది.

౫౬౮. ఆఖ్యాయిక కథవలెనే ఉండును, కాని అందు కవియొక్క వంశాదిక ములు కీర్తింపఁబడును, ఒకకొన్నిట ఇతరకవుల వృత్తము సయితము చెప్పఁబడును. ఇందలి కథాంశ పరిచ్ఛేదములకు ఆశ్వాసములని పేరు, ఆశ్వాసముఖమందు ఆర్యావక్త్రాపవక్త్రాదులగు నేచందం బులఁగాని అన్యాపదేశముగా భావికథావస్తువును సూచింపవలయును.

ఉదా.— హర్షచరితాది. "అందును కథను ఇతరులు వచించుట కలదు గావున నియమము లేదు" అని దండ్యాచార్యులు చెప్పినందున 'ఆఖ్యాయికను నాయకుఁడే నిబంధింపవలయును' అను కొందఱమాట సరిగాదు. ఇట ఆఖ్యానా దులును కథాఖ్యాయికలలోనే అంతర్భూతము లగుటంబట్టి ప్రత్యేకించి చెప్పలేదం డండీ యిట్లు చెప్పినాఁడు.— 'కడమ యాఖ్యానజాతులును ఇందులోనే అంతర్భావ మొందును.'

ఇఁక గద్యపద్యమయములు—

౫౬౯. గద్యపద్యమయమయిన కావ్యము చంపు వనంబడును.

ఉదా.— దేశరాజచరితము.

౫౭౦. గద్యపద్యమయియగు రాజస్తుతి బిరుద మనంబడును.

ఉదా.— బిరుదమణిమాల.

౫౭౧. కరంభక మన్ననో వివిధ భాషలచేత నిర్మితము.

ఉదా.— మదీయము— షోడశభాషామయమైన ప్రశస్తిరత్నావళి.

ఇట్లు ఇంక నితరభేదములు నామమాత్రప్రసిద్ధములును ఉక్తభేదముల నతిక్ర మింపనివియు నగుటవలన ప్రత్యేకముగా లక్షితములుకావు.



# ఆంధ్ర-సాహిత్యదర్పణము.

## (ద్వితీయభాగము.)

[VII—X]

విశ్వనాథ కవిరాజ ప్రణీత
గీర్వాణగ్రంథమునకు అనువాదము.

'కళాప్రపూర్ణ', 'మహామహోపాధ్యాయ', 'సర్వతంత్ర
స్వతంత్రా,' ద్యసంఖ్యాక బిరుద విరాజిత

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారిచే
విరచితము.

ప్రథమ ముద్రణము

ప్రకాశకులు

తత్పుత్రులు

వేదము వేంకటరాయశాస్త్రులు అండ్ బ్రదర్స్
4. మల్లికేశ్వరస్వామిగుడిసందు,
లింగిశెట్టివీధి—మన్నాడి—మదరాసు.

# విషయసూచి.

## సప్తమ పరిచ్ఛేదము.

## అష్టమ పరిచ్ఛేదము.

## నవమ పరిచ్ఛేదము



## దశమ పరిచ్ఛేదము

# ఉదాహరణ శ్లోకసూచి.

ఓం నమో గణేశాయ.

# సాహిత్యదర్పణము.

## సప్తమ పరిచ్ఛేదము.

ఇట కావ్యమందు మొదట దోషగుణరీత్యలంకారములయొక్క యునికి ప్రకారపుం గ్రమము చూపంబడినది. ఇప్పుడు అవి యేవి అని యాశంక రాంగా ఉద్దేశక్రమముచేత వచ్చిన దోషములను చెప్పుచున్నాండు.

౫౭౨. రసమునకు అపకర్షం జెచ్చునవి దోషములు.

దీని యర్థము ఇంతకు ముందే స్పష్టీకరింపంబడినది. వాని విశేషములం జెప్పుచున్నాండు.—

౫౭౩. అది పదమందును పదాంశమందును వాక్యమందును అర్థమందును రసమందును సంభవించుటచే అయిదు విధము లగును.

స్పష్టము. అందు.—

౫౭౪. దుఃశ్రవత్వము త్రివిధమయిన యశ్లీలత్వము అనుచితార్థత అప్రయుక్తత గ్రామ్యత అప్రతీతత సందిగ్ధత నేయార్థత నిహతార్థత అవాచకత్వము క్లిష్టత్వము విరుద్ధమతికారిత అవిమృష్టవిధేయాంశభావమును అనునవి దోషములు. ఇవి పదములందును వాక్యములందును కలుగును. వీనిలో కొన్ని పదాంశములందు నయితముం గలుగును. నిరర్థకత్వము అసమర్థత్వము చ్యుతసంస్కారతయు పదమందే కలుగును.

వర్ణపారుష్యముచేత చెవికి దుఃఖము నొసంగుట (కటువుగా నుండుట) దుఃశ్రవత్వము.

ఉదా.— 'ఈతన్వంగి యెప్పుడు మదనవశంవదయై కార్తార్థ్యముం బొందునో!'

అశ్లీలత్వము వ్రీడాజుగుప్సామంగళములను తోఁపించుటచేత మూఁడు విధములు. క్రమముగా ఉదా.—

'రాజా, గర్వితులయిన వైరుల నోర్చుటయందు నీకు సాధనము కరము గొప్పది.'

'ఓ తన్వీ అప్పుడు నీవినాశమున వాయువు మెల్లఁగా ప్రసరించెను.'

ఇందు సాధన వాయు వినాశ శబ్దములు అశ్లీలములు.

'రణయజ్ఞమందు పశుభూతులై శూరులు దేవత్వమును పొందుదురు.'

ఇందు పశుశబ్దము కాతర్యమును అభివ్యంజించుచున్నది గావున అనుచితార్థత్వము.

అప్రయుక్తత్వ మనఁగా ప్రసిద్ధము మైనను కవులు ఆదరింపమి.

ఉదా.— 'భాతి పద్మః సరోవరే' [పద్మము మేలికొలనియందు వెలుఁగుచున్నది.]

ఇచట పద్మశబ్దము పుల్లింగము. ['దైవతులకు నమస్కారము'— దైవతశబ్దము పుల్లింగము కూడ నని నిఘంటువులలో నున్నను కవులు దానిని నపుంసకలింగ మందు మాత్రమే ప్రయోగింతురు.]

గ్రామ్యత్వమనఁగ— ఉదా.— 'నీకటి మనస్సును హరించుచున్నది.'

ఇందు కటిశబ్దము గ్రామ్యము [ 'నీపిఱ్ఱ మనోహరముగా నున్నది.']

అప్రతీతత్వము అనగా ఏకదేశమాత్రప్రసిద్ధత్వము.

ఉదా.— 'యోగముచేత ఆశయములను పగిల్చినవాఁడు.'

ఇచట ఆశయశబ్దము యోగశాస్త్రమందుమాత్రమే వాసనార్థకము.

'సమరాంగణసందీపితజయశాలి పురందరసుతవిక్రముఁడు రాముఁడు' అని నరస రాజీయము.

ఇచట రాముఁ డన దాశరథియో జామదగ్న్యుఁడో అని సందేహము.

నేయార్థమనఁగా రూఢిగాని ప్రయోజనముగాని లేకయే కవి (తన)యిచ్ఛ చేత లక్ష్యార్థమును తెలుపుట.

ఉదా.— 'ఓసుముఖీ, నీ ముఖము కమలమునకు కాలితాపును గావించినది.'

ఇచట చరణాఘాతముచేత నిర్జితత్వము లక్ష్యము.

నిహతార్థత్వ మనఁగా ఉభయార్థమయిన శబ్దమును అప్రసిద్ధార్థములో ప్రయోగించుట.

ఉదా.— 'అంబరమును యమునాశంబరముం గావించెను.'

శంబరశబ్దము దైత్యునియందు ప్రసిద్ధము, ఇట జలమందు నిహతార్థము.

'పాటలయందు చెవిని ఆదానము సేయును.'

ఇచట ఆఙ్పూర్వమయిన దాఞ్ ధాతువు దానార్థమున అవాచకము. [ఆదానము చేయును. అనఁగా ఇచ్చును అని యర్థముగా కవి ప్రయోగించినాఁడు.]

ఒండె— 'చీఁకటిలో మునింగినదైనను రాత్రి నీరాకచే నాకు దినము.'

ఇచట దినమునది ప్రకాశార్థమున అవాచకము.

క్లిష్టత్వ మన అర్థప్రతీతి వ్యవహితపడుట.—

ఉదా.— 'పాల్కడలిపుట్టువునింటి జన్మభూములు ప్రసన్నములు.'

ఇచట పాల్కడలిపుట్టువు లక్ష్మి, ఆమెయిల్లు పద్మము, దాని జన్మభూములు నీళ్లు.

'భవానీపతి సంపద నిచ్చుఁగాక'

ఇచట భవానీపతిశబ్దము భవానికి అన్యపతి యను ప్రతీతిం గావించుచున్నందున విరుద్ధమతికారి.

అవిమృష్టవిధేయాంశత్వమునకు ఉదా:—

'స్వర్గగ్రామటికావిలుంఠన వృథోచ్ఛూనములైన యీబాహువులవలన నేమి ప్రయోజనము?'

ఇచట వృథాత్వము విధేయము. అది సమాసమందు గుణీభావము నొందినందున అనువాద్యత్వప్రతీతిని గావించుచున్నది.

ఒండె—'రామానుజుఁడనగు నాయెదుర్ల రక్కసులును నిలువలేరు.'

ఇట 'రామునికి' అని చెప్పవలయును.

ఒండె— 'ఆసముద్రక్షితీశులైన'

ఇచట 'ఆసముద్రము' అనవలయును.

ఒండె— 'ఓసుభ్రూ నీకటాక్షము పంచబాణుని వక్రబాణమువోలె ఎటను పడుచున్నదో.'

ఇచట ఆఅవదియుంబోలె అని యుత్ప్రేక్షింపవలయును.

ఒండె— 'నాథా, నీచేత ఆమె పూర్వము మహాభాగ్యమయినను అముక్త.'

ఇచట 'అముక్త' అనుచో ప్రసజ్యప్రతిషేధత్వముగావున నఞునకు విధేయత్వమే యుక్తము. ఇట్లు చెప్పిరి.—

'ఎచ్చట విధికి అప్రాధాన్యంబును ప్రతిషేధమునకు ప్రాధాన్యంబునో
అది ప్రసజ్యప్రతిషేధము, అందు నఞు క్రియతో నుండవలయును.'

ఎట్లన

'ఇది సన్నద్ధము నూత్న వారిదము, గాఁ డింద్రారి గర్వాంధుఁడు'

పూర్వోదాహరణమందు తత్పురుషసమాసమున గుణీభావము కలిగినందున నఞునకు పర్యుదాసత్వముంబట్టి నిషేధముయొక్క విధేయత బోధపడకున్నది. చెప్పుదురు గదా.—

'ఎచట విధికి ప్రాధాన్యంబునో ప్రతిషేధమునకు అప్రాధాన్యమునో నఞు
ఉత్తరపదముతో చేరునో, అది పర్యుదాస మనఁబడును.'

అందుచేత.—

* 'అత్రస్తుఁడు తన్నుఁ గాచుకొనెను, అనాతురుఁడు ధర్మమును ఆచరించెను, అలుబ్ధుఁడు
అర్థములను స్వీకరించెను, అసక్తుఁడు సుఖ మనుభవించెను'

ఇచట అత్రస్తతాదిని అనువదించి ఆత్మగోపనాదికమే విధించుచున్నందున నఞునకు పర్యుదాసతచేత గుణీభావమే యుక్తము.

ఓయి, 'అశ్రాద్ధభోజి బ్రాహ్మణుఁడు' 'అసూర్యంపశ్యలు రాజదారలు' ఇత్యాదులందుంబోలె 'అముక్త' అనుచోటం గూడ ప్రసజ్యప్రతిషేధము కలుగును అనఁగూడదు; ఏలన ఇచటను భోజనాదిరూపక్రియాంశముతో నఞునకు సంబంధ మేని ఆపక్షముననే అందు ప్రసజ్యప్రతిషేధత్వమును చెప్పశక్యము. ఇచట ఆపక్షము కాదు; విశేష్య మగుటవలన ప్రధానమై ఆభోజ్యము ప్రయోజనముగాఁగల దైన కర్త్రంశముతోనే నఞునకు సంబంధము గావున. దాని నిట్లు చెప్పియున్నారు:—

కర్త్రర్థమున ఇక్ ప్రత్యయము విహితమగుటనందున శ్రాద్ధభోజనశీలుఁ డెవఁడో
ఆకర్త తోఁచుచున్నాఁడు; అభోజనము మాత్రము గాదు' అని

'అముక్త' అన్నచోటనో క్రియతోనే సంబంధము గావున (అవిమృష్ట విధేయాంశ) దోషమే.

ఈ క్లిష్టాదులు సమాసగతములయిననే పదదోషములు.

---

* జుగోపాత్మాన మత్రస్తో భేజే ధర్మ మనాతురః
అగృధ్ను రాదదే సోర్థా నసక్తః సుఖ మన్వభూత్

వాక్యమందు దుశ్శ్రవత్వమునకు ఉదా.—

'స్మరార్త్యంధుఁడను నీవిరహంబున కార్త్యార్థ్యము ఎప్పుడు పొందఁగలను.'

'పెఱ(కవు)లయర్థములందు ప్రవృత్తిచేసిన కవి వాంతమును తినును.'

ఇచట జుగుప్సావ్యంజకమయిన యశ్లీలత.

'ఉద్యత్కమలలౌహిత్యములచేత వామలు తనువును భూషించుకొనిరి.'

ఇచట కమలలౌహిత్య మనఁగా పద్మరాగము, వక్రి లనఁగా వామలు అని నేయార్థత్వము.

'కొప్పుయొక్క ఎవనియొక్క చూచి నిండుగా కురంగశాబాక్షియొక్క అపూర్వ బంధనైపుణ్యము గలదానియొక్క మనస్సు శోభను జెందదు?'

ఇచట "కొప్పుయొక్క శోభను చూచి ఎవనియొక్క మానసము రాగిల్లదు" అని సంబంధము క్లిష్టము.

'న్యక్కారము ఇదియే నాకు ఏదన.'

ఇచట "ఇదియే న్యక్కారము" అని న్యక్కారము విధేయముగా వివక్షితము, అయిన నది శబ్దరచనావైపరీత్యముచేత గుణీభూతమయినది. పదద్వయముది రచన విపరీతమైనది గావున వాక్యదోషము.

'ఓసుభ్రువా, నీ నేత్రములను ఆనందింపఁజేయును, ఏ యితఁడు వచ్చినాఁడో.'

ఇత్యాదులయందు "యత్తచ్ఛబ్దములకు నిత్యసంబంధము" అనెడి న్యాయముబట్టి తోడంగిన యచ్ఛబ్దమునకు నిరాకాంక్షత్వము తోఁచుటకై తచ్ఛబ్దసమానార్థకములుగా ప్రతిపాదింపఁబడెడివి ఇదమేతద దఃశబ్దములు విధేయములే అగుట యుక్తము. మఱి యిచ్చటనో యచ్ఛబ్దమునకు (ఏ—శబ్దమునకు) వెంబడి నుండుటవలన (ఇతఁడు అనునది) అనువాద్యత్వమును తోఁపించునదిగా నున్నది. తచ్ఛబ్దము సయితము యచ్ఛబ్దనికటస్థితమేని ప్రసిద్ధపరామర్శిమాత్రమే యగును.—

[ఉదా.— 'ఓసుభ్రువా ఏయితఁడు నీకు నయనానందకరుఁడో అతఁడు వచ్చినాఁడు.'

యచ్ఛబ్దమునకు వ్యవధానముతో నున్నట్టి నైనో నిరాకాంక్షత్వమును బోధించును.

ఉదా.— నీ నేత్రములను ఎవఁడు ఆనందింపఁజేయునో ఇప్పుడు ఆయితఁడు వచ్చినాఁడు.,]

ఇదమాదిశబ్దోపాదానంబునను ఇట్లే. ఎచటనైన యత్తచ్ఛబ్దములలో నొకదానికి అర్థ(వశలభ్య)త్వము కలిగియున్నదో అచట నొకదానినే ప్రయోగించినను నిరాకాంక్షత్వప్రతీతి యగును గావున క్షతి లేదు. అట్లే యచ్ఛబ్దమును ఉత్తరవాక్యగత

మునుగా ప్రయోగించనచో సామర్థ్యమువలన పూర్వవాక్యములో తచ్ఛబ్దమునకు అర్థత్వము.

ఉదా.— ఆత్మ యెఱుంగును ఏది పాపమో.'

ఇట్లు

'ఎవనిని కొండలన్నియు దూడం జేసి పిదుక నేర్పరి మేరువు పిదుకువాఁడు కాఁగా భాస్వంతములయిన రత్నములును మహౌషధములును—'

ఇత్యాదులయందును.

తచ్ఛబ్దము ప్రక్రాంతమును ప్రసిద్ధమును అనుభూతమును చెప్పుచో యచ్ఛబ్దమునకు అర్థత్వము. వరుసగా ఉదాహరణములు.—

* 'ఆవీరుఁడు వాలిం గూర్చి చిరకాంక్షితమయిన యాతని (వాలి) స్థానమున, ధాతువుస్థానమందు ఆదేశంబునుం బోలె, సుగ్రీవుని అభిషేకము చేసెను.'

'ఆచంద్రికళావతంసుఁడు మీకు తాదాత్మ్యమును కలిగించును గాక?'

'ఆ యిందుసుందరముఖిని హృదయమున ధ్యానించుచున్నాను.'

ఎక్కడనైన యచ్ఛబ్దైకటస్థితములైనను ఇదమాదిశబ్దములు భిన్నలింగవిభక్తికములగునో అక్కడ సంయుతము నిరాకాంక్షత్వమే. వరుసగా ఉదా.—

'ప్రకాశించుచున్నదో మృగశాబాక్షీ ఎదతె ఇది లోకమున కలంకారము.'

[అచ్చతెనుఁగున లింగములు లేవు. అది ఇది ఎది మహతియు అమహత్తునుం గూడ నగును.]

'చంద్రుఁడు ప్రకాశించుచున్నాఁడో ఎవ్వఁడు వానిచేత పథికస్త్రీలు దగ్ధలైనారు.'

కొన్నిచోట్ల రెంటికిం బ్రయోగము లేకున్నను సామర్థ్యమువలన బోధ గలుగును. ఉదా.—

† 'ఓభూమీ నీభారమును తగ్గించువాఁడు ఒక్కఁడును లేఁడని దుఃఖింపకుము; నందుని యింట అద్భుతపౌరుషుఁడు ఒకానొక బాలుఁడు కలఁడు'?

ఇచ్చట 'ఎవఁ డున్నాఁడో అతఁడు నీభారమును తగ్గించువాఁడు' అని బోధ పడుచున్నది.

---

* స హత్వా వాలినం వీర స్తత్పదే చిరకాఙ్క్షితే
ధాతోః స్థాన ఇ వాదేశం సుగ్రీవం సన్న్యవేశయత్.

† న మే శయయితా కోఽపి భార స్యే త్యుర్వి మా శుచః;
నన్దస్య భవనే కోఽపి బాలోఽ స్త్యద్భుతపౌరుషః.

'ఏది యేది నావిరహదుఃఖమో దానిని ఎవఁడు హరించును?'

ఇచ్చట ఒక యచ్ఛబ్దము సాకాంక్షమని చెప్పఁగూడదు; అట్లే గదా.— 'ఏది యేది' అనుదానిచేత ఏరూపమున నేని ఉన్నట్టిది సర్వాత్మకము వస్తువు వివక్షితము; అట్టి దైనదానిని తచ్ఛబ్దముచేత పరామర్శించుట. ఇట్లే ఇతరములకును వాక్యగతములకు ఉదాహరణము బోధ్యము.

పదాంశమున శ్రుతికటువునకు ఉదా.—

త ద్గచ్ఛ సిద్ధ్యై కురు దేవకార్యమ్. [పొమ్ము సిద్ధికొఱకు, దేవకార్యమును గావింపుము.]

ఇందు సిద్ధ్యై అనుచో పదాంశమున శ్రుతికటువు.

'ధాతుమత్తను గిరి ధరించెను.'

ఇచట మత్తాశబ్దము కైవెక్కినదను నర్థమున నిహతము.

ఎవనికి తారకుఁడు విజేయుఁడో (అ)వహా సేనాని వర్ణింపఁదరమా?'

ఇచట 'విజేయుఁడు' అనుపదమున క్తప్రత్యయార్థమున కృత్యప్రత్యయము అవాచకము.

'చేయి పల్లవపేలవము'

పేలవశబ్దమున తొలిరెండక్షరములు అశ్లీలములు [లాటభాషయందు 'పేల'శబ్దము వృషణవాచకము].

'సంగ్రామమున నిహతులైన శూరులు వచోబాణత్వమును పొందినారు.'

ఇచ్చట వచశ్శబ్దమునకు గీఃశబ్దవాచకత్వమున నేయార్థత్వము. అట్లే అందులోనే బాణ స్థానమున శర-అని పఠించినను; ఇచట పదద్వయంబును మార్పును సహింపదు. జలధ్యాదులయందు ఉత్తరపదమును, బాడబానలాదులయందు పూర్వపదమును, పరివృత్తిసహము గాదు; ఇట్లు ఇతరములును యథాసంభవముగా పదాంశదోషములు ఎఱుఁగఁదగినవి. నిర్థకత్వాదులకు మూఁటికిని పదమాత్రగతముగానే లక్ష్యము సంభవించును. వరుసగా ఉదా.—

'మానినిరో యుజ్జగింపు మానంబు నొగిన్.'

ఇచట ఒగిశబ్దము వృత్తపూరణమాత్రప్రయోజనము.

'అరుగుదెంచె నంత హంసహనన.'

ఇచట హనధాతువు గమనార్థమున పఠితమైనను అందు సమర్థము గాదు.

[తామరాకుతో వీచుదునో చెలీ'

ఇచట చుదునకు త్వాదేశము రావలయును. అది రామిచే వ్యాకరణలక్షణహీనత వలన చ్యుతసంస్కారత్వము.]

మూలమున 'గాణ్డీవీ కనకశిలానిభం భుజాభ్యా మాజఘ్నే విషమవిలోచనస్య వక్షః' ' ఆఙోయ మహానః' 'స్వాఙ్గకర్మకాచ్చ' అనెడి యనుశాసనములబలంబున ఆఙ్పూర్వమయిన హనధాతువునకు ఆత్మనేపదము నియతము, ఇటనో అది ఉల్లంఘితము గాన వ్యాకరణలక్షణ హీనముగుటవలన చ్యుతసంస్కారత్వము.

మఱియు నిట—"'ఆజఘ్నే' అను పదము స్వయముగా దుష్టముగాదు. మఱియెట్లన్న పదాంతరాపేక్షచేతనే; కావున నిట వాక్యదోషమే." అనుట సరిగాదు. అట్లే గదా. గుణదోషాలంకారములకు శబ్దార్థగతత్వంబున వ్యవస్థితికి తదన్వయ వ్యతిరేకానువిధాయిత్వము హేతువు. ఇటనో దోషము 'ఆజఘ్నే' అనుపదమాత్రమునకే అన్వయవ్యతిరేకములచే ననువిధాయిగా నున్నది, పదాంతరములను మార్చినను దానికి ఆయవస్థ మాఱదు గావున, నది పదదోషమే. అట్లే ఇచట ఆత్మనేపదమును మార్చినను పదదోషము కాదు, అట్లే హనధాతువును మార్చినను పదాంశదోషము గాదు.

ఇట్లు 'దైవతులు' అనుచో అప్రయుక్తత్వము పదగతమని యెఱుంగవలయును.

[ఇందు 'దైవతులు' అన్నచో మూలమున 'పద్మః' అని పుల్లింగ ముదాహృతము.] ఇట్లు ప్రాకృతాదివ్యాకరణలక్షణహానియందును చ్యుతసంస్కారత్వము నూహించునది.

మఱియు నిటనో శబ్దములకు బొత్తిగా ప్రయోగమే లేనియెడల అసమర్థత్వము; ప్రయోగము విరళమయినచో నిహతార్థత్వము; నిహతార్థత్వము అనేకార్థశబ్దవిషయము; అప్రతీతత్వమో శబ్దము ఏకార్థమే అయినను దానికి సార్వత్రిక ప్రయోగము లేమి; అప్రయుక్తత్వము ఏకార్థశబ్దవిషయము అసమర్థత్వము అనేకార్థశబ్దవిషయము; అసమర్థత్వమున హన్త్యాదులు గమనార్థమున పఠితములు; అవాచకత్వమున దినాదులు ప్రకాశమయాద్యర్థమున నట్లుగావు అని పరస్పరభేదము. ఇట్లు పదదోషములకు సజాతీయములగు వాక్యదోషములు చెప్పఁబడినవి. ఇప్పుడు వానికి విజాతీయము(లగు వాక్యదోషము)లు చెప్పఁబడును.

౧౭౨౧. వర్ణములప్రతికూలత, లుప్తవిసర్గత, ఆహతవిసర్గత, అధికపదత, న్యూనపదత, కథితపదత, ఆహతవృత్తత, పతత్ప్రకర్షత, సంధియందు విశ్లేషము, అశ్లీలత, కష్టతయు, అర్ధాంతైకపదత, సమాప్తపునరాత్తత, అభవన్మత సంబంధత, అక్రమత, అమతపరార్థత, వాచ్యమును చెప్పమి, అశ్లేష భగ్నప్రక్రమత, ప్రసిద్ధిని త్యజించుట, పదమును అస్థానమందు ఉంచుట, సమాసమును అస్థానమందుంచుట, సంకీర్ణత, గర్భితత,— ఇవి వాక్యమందుమాత్రమే కలుగు దోషములు.

వర్ణములు రసాననుగుణములగుట ప్రతికూలత్వము.

ఉదా.— మదీయము— (ప్రాకృతము.)

[ 'ఓవట్టఇ ఉల్లట్టఇ సఅణే కహింపి మోట్టాఅఇ ణో పరిహట్టఇ
హిఅఏణ ఫిట్టఇ లజ్జాఇ ఖుట్టఇ దిహీఏ సా.']

ఆమె శయనమందు ఇటకలం బొరలును, దొరలును, ఎవరికిని కామేంగితములం జూపదు,
ఎదలో లజ్జచే కలఁగును, తొట్రుపడును, జడనగును, ధృతిఁదప్పును.'

ఇట టకారములు శృంగారరసమునకు విరుద్ధములు, కేవలము శక్తిం జూపుటకు ప్రయోగింపఁబడినవి. వీనినే ఒకటి రెండు మూఁడు నాలుగు మాఱులు ప్రయోగించిన నట్టి రసభంగము కలుగదు గావున దోషము గాదు.

'గతా నిశా ఇమా బాలె.'

[ 'బాలా ఈరాత్రులు గడచినవి.']

ఇందు విసర్గలు లుప్తములు.

విసర్గలు ఆహతములు ఓత్వముఁబొందిన పయినందులకు ఉదా.—

ధీరో వరో నరో యాతి [=ధీరుఁడు వరుఁడునగు నరుఁడు పోవుచున్నాఁడు.] అని.

' పల్లవాకృతి రక్తోష్ఠి.'

ఇందు ఆకృతిపద మధికము. ఇట్లు

'పినాకపాణిని సదాశివుని మ్రొక్కెదను.'

అని. విశేషణ మధికము.

'హరునికిఁ బినాకపాణికిఁ గూడ చేసెదను.'

అను నిచటన్తో, పినాకపాణిపదము విశేషప్రతిపత్తికొఱకు ఉపాత్తము గావున యుక్తమే.

'కౌత్సుఁడు వాక్యను వచించెను.'

ఇచట 'వాక్యను' అనుట యధికము, చెప్పెననుటచేతనే గతార్థమైనందున. ఐనను ఉత్కర్షకమైన విశేషణము నొసంగినచో దానిని ప్రయోగింపదగును. ఉదా.—

'మధురమయిన వాక్యను వచించెను' అని.

ఆయినను కొందఱు వచింతురు.— ఎచ్చట విశేషణమునకుం గూడ క్రియావిశేషణత్వము సంభవించునో అచటను దాని ప్రయోగము ఘటింపదు; ఉదా.—

'ధీమంతుఁడు మధురముగా వచించెను' అని.

'నామీఁద చూపు ఉంపఁబడెనేని అపత్యమున నాకు ఇంద్రత్వమేల?'

ఇట ఆదిలో 'సీచేత' అను పదము న్యూనము.

'అనిలుఁడు సలీలముగా వీచుచు రతిలీలాశ్రమమును పోఁగొట్టును.'

ఇచట లీలాశబ్దము పునరుక్తము. ఇట్లు—

'బిసమును భక్షించి వికాసిబిసప్రసూనమును ధరించినవారు.'

ఇచట బిసశబ్దమునకు 'ధృతపరిస్ఫుటతత్ప్రసూనాః' అని సర్వనామముచేతనే పరామర్శ యుక్తము.

హతవృత్తము లక్షణము ననుసరించుచునే యున్నను అశ్రావ్యమును, రసాననుగుణమయ్యు అంతలఘువునకు గురుభావము రానిదియు నని యిరుదెఱంగులు.— వరుసగా ఉదా.—

'హన్త! సతత మేతస్యా హృదయం భిన్తే మనోభవః కుపితః.'

[అయ్యో ఎప్పుడును ఈచెలువహృదయమును కుపితుఁడు మనోభవుఁడు భేదించుచున్నాఁడు.]

'అయి మయి మానిని మా కురు మానమ్'

[ఓసిమానినీ నామీఁద కోపము చేయకు]

ఈవృత్తము హాస్యరసమునకుమాత్రమే అనుకూలము.

'వికసిత సహకార భారహారి
పరిమళ ఏష సమాగతో వసన్తః'

[వికసించిన సహకారపుష్పముల భారముచే మనోహరమయిన పరిమళముతోఁడిది ఇదె వసంతము వచ్చినది.]

పాదాంతమందు లఘువునకు సంయుతము గురుభావము ఏది చెప్పఁబడినదో అది సర్వత్రి ద్వితీయచతుర్థ పాదవిషయము. ప్రథమతృతీయపాదవిషయమో వసంతతిల కాదులకే. ఇచట 'ప్రముదితసౌరభ ఆగతో వసన్తః' అని పఠించుట యుక్తము. ఉదాహరణాంతరము —

' అన్యాస్తా గుణరత్నరోహణభువో, ధన్యా మృదన్యైవ సా,
సంభారాః ఖలు తేఽన్య ఏవ విధినా యైరేష సృష్టో యువా
శ్రీమత్కాన్తిజుషాం ద్విషాం కరతలాత్ స్త్రీణాం నితమ్బస్థలాద్
దృష్టే యత్ర పతన్తి మూఢమనసా మస్త్రాణి వస్త్రాణ్యపి చ.'

[ఎవనిని జూడఁగానే శ్రీమత్కాంతిఁ దాల్చినవారు శత్రువులును స్త్రీలును మూఢ మనస్కులై కరతలంబునుండియు నితంబస్థలమునుండియు అస్త్రంబులును వస్త్రంబులును జాఱ్చుకొందురో అయాతరణుని వేనితో బ్రహ్మసృజించెనో ఆ గుణరత్నరోహణభూములు వేఱు; ధన్యమయిన యా మన్ను వేఱు; ఆ సంభారములును వేఱు.

ఇట 'వస్త్రాణిచ' అనుటచే బంధమునకు శ్లథత్వము వినఁబడుచున్నది. 'వస్త్రాణ్యపి' అని పఠించిన దార్ఢ్యము కలుగును. దోషము తొలఁగును. ఇది అప్రాప్తగురు భావమగు నంతలఘు వని కావ్యప్రకాశకారుఁడు వాస్తవమున లక్షణ మనుసృత మంయినను అశ్రవ్య మని యుతరులు.

[' ప్రోజ్జ్వలజ్జ్వలనజ్వాలావికటోరుసటాచ్ఛటః
శ్వాసక్షిప్తకులక్ష్మాభృత్ పాతు వో నరకేసరీ.'

[మెండుగా మండుచున్న యగ్నిజ్వాలలవలె వికవియైన పెద్దజాలుజుత్తుగలవాఁడు ఊర్పులచేత తూల్పఁబడిన కులభూధరములుగలవాఁడు నరసింహుఁడు మిమ్ము రక్షించుఁ గాక.]

ఇందు క్రమముగా అనుప్రాసప్రకర్షము తగ్గిపోయినది.

' దళితే ఉత్పలే ఏతే అక్షిణీ అమలాఙ్గి తే.'
[ఓ యమలగాత్రి నీయా నేత్రములు విచ్చినకలువలు.]

ఈవిధమయిన సంధివిశ్లేషమును పలుమాఱు ప్రయోగించుటయే దోషము. అను శాసన మతిక్రమించిన సంధివిశ్లేషము ఒక్కమాఱయినను దోషమే. ఉదా.—

'వాసవాశాముఖే భాతి ఇన్దు శ్చన్దనబిన్దువత్.
[ఇంద్రదిఙ్ముఖమున చందురుఁడు చందనపుబొట్టువలె ప్రకాశించుచున్నాఁడు.]

'చలణ్డామరచేష్టితః'

[చలించుచు ఉద్భటమయిన చేష్టితము కలదై— ఇది ఒకపక్షికి విశేషణము.]

ఇచట సంధిలో [అపభ్రంశభాషయందు పురీషవాచకమయిన లండాశబ్దము వచ్చినందున] జుగుప్సావ్యంజకమయిన యశ్లీలత్వము.

'ఉర్వ్యసా వత్ర తర్వాలీ మర్వన్తే చార్వవస్థితిః'

[ఇచట మరుభూమి చివరయందు అందమయిన యవస్థానము కలదై చెట్లపరుస గొప్పది (కలదు.)]

ఇట సంధియందు కష్టత్వము.

'ఇన్దు ర్విభాతి కర్పూరగౌరై ర్ధవళయన్కరైః
జగ న్మా కురు తన్వఙ్గి మానం పాదానతే ప్రియే.'

[చంద్రుఁడు కర్పూరగౌరములయిన కరములతో జగత్తును ధవళీకరించుచు ప్రకాశించుచున్నాఁడు, ఓతన్వంగి పాదానతుఁడైన ప్రియునియందు కోపము త్యజింపుము.]

ఇచట 'జగత్' అను పదమును ప్రథమార్థమందు పఠించుట యుక్తము. [ఇది అర్థాంతరైక పదతాదోషము.]

'దట్టపుంజీఁకటిని దొలఁగించుచు వియోగినులను తపింపఁజేయుచు, చంద్రునిపాదములు పడుచున్నవి, భూతలమును వెలింగించుచు.'

ఇచట చతుర్థభాగము వాక్యసమాప్తియైనను పునరాత్తము.

అభవన్మత సంబంధ మెట్లన—

* 'ఎవతె మనోజ్ఞ జయశ్రీయో ఎవతె జగమున కలంకారమో, ఏహరిణాక్షి లేక నా ప్రాణములు నిష్ఫలములో, ఆ సుందరి యిపుడెట నున్నది?'

ఇచట యచ్ఛబ్ద [ఎవతె, ఎవతె, ఏ—శబ్ద] నిర్దిష్టములయిన వాక్యములు పరస్పర నిరపేక్షములుగా నుండుటంబట్టి వానిలో నొకదానిలోపల పడియున్న హరిణాక్షీ శబ్దమునకు కడమవానితో సంబంధము కవి కభిమతమయినట్టిది ఘటింపనే ఘటింపదు.

'ఎవతె లేక నాప్రాణములు వ్యర్థములో ఆహరిణాక్షి యిపుడెట నున్నది?'

అనితచ్ఛబ్ద (ఆ-శబ్ద) నిర్దిష్టమయిన వాక్యములోపల నైదినయెడల యచ్ఛబ్దనిర్దిష్ట వాక్యములన్నిటితోను సంబంధము ఘటించును.

ఇదియొండొ ఉదా.—

* యా జయశ్రీ ర్మనోజస్య యయా జగ దలఙ్కృతమ్
యా మేణాక్షీం వినా ప్రాణా విఫలా మే కుతో ఽద్య సా.

'ఎందువలన కటాక్షములోఁ గనుదువో అప్పుడు మనోభవుఁడు విలుకాఁడు.'

ఇచట ఎందువలన అనుశబ్దమునకు అప్పుడు అనుదానితో సంబంధము ఘటింపదు; 'కటాక్షములో కలదు వేని' అను పాఠము యుక్తము.—

ఇది రెండవ ఉదా.—

* 'వెన్నెలమొత్తము పయఃపూరము నక్షత్రములు తెల్లఁగలువలు ఆకాశకాసారమందు చంద్రుఁడు రాజహంసము ప్రకాశించుచున్నాఁడు.'

ఇచట కాసారశబ్దము సమాసమున గుణీభావము నొందినందున దానియర్థమునకు అన్నిటితోను సంబంధము ఘటింపదు. విధేయావిమర్శయందు ఏదిమాత్రమవిమృష్టమో అదిమాత్రమే దుష్టము, ఇటనో ప్రధానమయిన కాసారపదార్థముయొక్క ప్రాధాన్యము తోఁపనందున పయఃపూరాదిపదార్థములు అన్నియు దానియంగములుగా తోఁపవు; కావున సర్వవాక్యార్థవిరోధము అగపడుచున్నది, అని రెంటికిని భేదము.

‡ ఓయి భార్గవుఁడా, తల్లికంఠమును కోసిన యీనీపరశువుతో స్పర్ధవహించినదై నా యీఖడ్గము లజ్జ చెందుచున్నది.'

ఇచట భార్గవనిందయందు ప్రయుక్తమయిన మాతృకంఠచ్ఛేదనమునకు పరశువుతో సంబంధము యుక్తము కాదని ప్రాచీనులు; పరశునిందాముఖమున భార్గవనిందాధిక్యమే వైదగ్ధ్యమును తోఁపించుచున్న దని ఆధునికులు.

అక్రమతకు ఉదా.—

'సమయ ఏవ కరోతి బలాబలం ప్రణిగదన్త ఇతీవ శరీరిణామ్
శరది హంసరవాః పరుషీకృత స్వరమయూర మయూరరమణీయతామ్.'

[సమయమే ప్రాణులకు బలాబలమును చేయును అని ప్రకటించుచున్నవియుం బోలె శరత్కాలమున హంసరవములు నెమలిస్వరమును పరుషీకరించినవై మనోహరములయినవి.]

ఇచట పరామర్శింపఁబడువాక్యమున కనంతరమే ఇతిశబ్దమును ప్రయోగించుట యుక్తము; అంతియ గాని 'ప్రణిగదన్తః' అనుదానితర్వాతఁ గూడదు. ఇట్లు—

'ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా కపాలినః.

---

* జ్యోత్స్నాచయగ పయః పూర స్తారకాః కైరవాణి చ
రాజతి వ్యోమకాసార రాజహంసః సుధాకరః.

‡ అనేన చ్ఛిన్నతా మాతుః కణ్ఠం పరశునా తవ
బద్ధస్పర్ధః కృపాణోఽయం లజ్జతే మమ భార్గవ.

కలా చ సా కాన్తిమతీ కలావతః
త్వ మస్య లోకస్య చ నేత్రకౌముదీ'.

[ఈశ్వరుని ఆశ్రయింపఁగోరినందున ఇప్పుడు రెండు శోచనీయములయినవి; ఏవనగా-కాంతిగలదై లోకనేత్రకౌముదియైన యాచంద్రరేఖయు, కాంతిగలదానవై లోకనేత్రకౌముదివైన నీవును.]

ఇచట 'త్వమ్'అనుపదము వెంబడినే చకారము యుక్తము.

అమతపరార్థతకు— ఉదా.—

'అనిశాచరి దుస్సహమైన' ఇత్యాది (౧౫౫)

ఇచ్చట శృంగారరసవ్యంజకమగుచున్న రెండవ యర్థము ప్రకృతరసవిరోధి యగుటం బట్టి యనిష్టము.

వాచ్యమును చెప్పమికి ఉదా.—

'వామాక్షీ, నాయందు వ్యతిక్రమలేశమును దేనిని చూచి కోపగించుచున్నావు?'

ఇచట వ్యతిక్రమలేశము నైనను అని అప్యర్థకశబ్దమును అవశ్యము చెప్పవలయును; దానిని చెప్పలేదు. న్యూనపదత్వమందు వాచకపదమునకే న్యూనత వివక్షితము, అపిశబ్ద మట్టిది కాదు అని యీ రెంటికి భేదము. ఇట్లు ఇతరస్థలములందు. ఉదాహరణాంతరము—

తన్వీ, చరణానతకాంతవు అటుయినను నీకు కోపము'.

ఇచట 'చరణానతకాంత వైతివి' అని చెప్పవలయును.

భగ్నప్రక్రమతకు ఉదా.—.

'ఇట్లు మంత్రిముఖ్యులచే చెప్పఁబడినవాఁడై రావణుఁడు బదులుపల్కెను.'

ఇట చెప్పుధాతువుతో నారబ్ధము, ప్రతివచనంబును ఆధాతువుతోనే చెప్పుట యుచితము; అందువలన— 'రావణుఁడు బదులుచెప్పెను' అని పఠించుట యుక్తము ఇట్లైనచో కథితపదత్వదోషము ఉండదు. దానికి ఉద్దేశ్యప్రతినిర్దేశ్యవ్యతిరిక్తము విషయము గావున. ఇటనన్నచో వచన ప్రతివచనములకు ఉద్దేశ్యప్రతినిర్దేశ్యత్వము. ఉదా.—

'సూర్యుఁడు తామ్రుఁడుగా నుదయించును, మఱి తామ్రుఁడుగానే అస్తమించును.'

ఇచట ఆయర్థమునే వేఱుపదమునం జెప్పినచో వేఱర్థమువలె ప్రతిభాసించి ప్రతీతిని మఱఁగించును.

ఓండె, ఉదా.—

'వారి హితమాటయని కీడ్కొని మరల ఈ లిని గాంచి కార్యసిద్ధిని ఈయనకుం దెలిపి అతడు వీడ్కొనగా వింటి కానిపోయిరి.'

ఇచట ఈయన అని ఏతదర్థకముచే పరిక్రాంతనుయినదానికి దానిచేతనే పరామర్శ యుక్తము, కాని తదర్థకముచేతం గాదు.

ఒండె, ఉదా:—

'ఉదన్వచ్ఛిన్నభూమిః ఆ యపాంపతియు నూఱు యోజనములు'.

ఇచట భూమి అపాంపతిచేత మితమైయున్నది, ఆ యపాంపతియు, అను పాఠము యుక్తము. ఇట్లు.—

'యశోఽధిగన్తుం సుఖలిప్సయా వా
మనుష్యసంఖ్యా మతివర్తితుం వా
నిరుత్సుకానా మభియోగభాజాం
సముత్సుకే వాఙ్కముపైతిసిద్ధిః'.

[కీర్తిం జెందుటకేని సుఖలిప్సచేతనేని మనుష్యసామాన్యగణనను అతిక్రమించుటకేని ఎవరు తమకసడక ఫూనికనేయుదురో వారియొడిలో సిద్ధి సముత్సుకురాలవోలె చేరును.

ఇచట 'సుఖ మీహితుమ్' [సుఖముం బొందుటకు] అనుట యుచితము. ఇచట తొలిరెంటను ప్రక్రమభేదము ప్రకృతివిషయము, మూడవదానియందు పర్యాయవిషయము, నాలవదానియందు ప్రత్యయవిషయము. ఇట్లు కడమ తావులను సంయుతము.

ప్రసిద్ధిత్యాగమునకు ఉదా:—

'వారిదముల గవము ధీరము'.

ఇచట మేఘములకు గర్జితమే ప్రసిద్ధము. అట్లు చెప్పుదురు:—

'మంజీరాదులయందు రణితాదులను, పక్షులయందు కూజితాదులను, సురతమునందు స్తనితమణితాదులను, మేఘాదులయందు గర్జితాదులను (ప్రయోగింపవల యును).

అస్థానస్థపదతకు ఉదా:—

'తీర్థే తదీయే గజసేతు బన్ధాత్
ప్రతీపగా ముత్తరతోఽస్య గఙ్గామ్
అయత్న వాలవ్యజనీ బభూవు
హంసా నభోలఙ్ఘనలోలపక్షాః'

['దాసికేవున నీను గులకలచేత పడవటిక్కి పాఱుచున్న గంగను దాఁటుచున్న యీ రాజునకు మిటిక్కిగయు హంసలు చలపక్షములు అప్రియత్న లక్షణము యిన చారీ లయినవి']

ఇచట తదీయ(దాసి)పదమునకు ముందు గంగామ్(గంగను) అను పదమును పఠించుట యుక్తము. ఇట్లు—

'హితాన్న యః సంశృణుతే స కింప్రభుః'

[హితులను ఎవఁడు వినఁడో వాఁడు దుష్టప్రభువు.]

ఇచట 'సంశృణుతే' అనుటకు పూర్వము నఞ్ను ప్రయోగించుట యుక్తము.

ఇచ్చటఁగూడ పదమాత్రమును కానితాన్వయం బ్రయోగించుటవలన వాక్య మంతయు వివక్షితార్థముం దెలుపుటయందు మందమగును గావున వాక్యదోషత. ఇట్లు కడమస్థలములందును.

ఇటం గొందఱందురు— "పదశబ్దముచేత ప్రాయికముగా వాచకమే చెప్పఁబడును, నఞ్నకు స్వతంత్రముగా (పదాంతరయోగము లేక) అర్థబోధనము లేనందున వాచకత్వము లేమి నిర్వివాదము." అని; "ద్వయం గతమ్ ఇత్యాదులయందు 'త్వమ్' అన్నవెంటనే చకారము పఠింపనందున అక్రమత వెట్టిదో అట్లే ఇటను." అని.

అస్థానస్థసమాసతకు ఉదా.—

'అద్యాపి స్తనశైలదుర్గవిషమే సీమన్తినీనాం హృది
స్థాతుం వాఞ్ఛతి మాన ఏష ధిగితి క్రోధాదివాలోహితః
ప్రోద్యద్దూరతరప్రసారితకరః కర్షత్యసౌ తత్క్షణాత్
ఫుల్లత్కైరవకోశనిఃసరదళిశ్రేణీకృపాణం శశీ.'

[ఇసీ, ఇప్పుడుకూడ మానము స్తనశైలదుర్గవిషమమున సీమంతినుల హృదయమున నిలువం గోరుచున్నది! అని కోపముచేతనో యన నాలోహితుఁడై చంద్రుఁడు తటాలున ప్రోద్యద్దూరతర ప్రసారితకరుఁడై వికసిల్లుచున్న తెల్లగలువమొగ్గలనుండి వెడలుచున్న తుమ్మెదబారనెడు కత్తిని తివియుచున్నాఁడు]

ఇచట కుపితవాక్యమునందు సమాసము పెట్టఁబడలేదు. కవివాక్యమందు పెట్టఁబడినది.

ఒక వాక్యంపుఁబదములు వేఱొక వాక్యమందు అనుప్రవిష్టములగుట సంకీర్ణత్వము. ఉదా— "కురంగాక్షీ, చంద్రుని వదలుము చూడుము మానమును ఆకాశాంగణమున." ఇచట "ఆకాశాంగణమున చంద్రుని చూడు, మానమును వదలుము" అనుట యుక్తము.— "క్లిష్టత్వము ఏకవాక్యవిషయము" కావున దీనికన్న వేఱు.

ఒకవాక్యము మఱియొకవాక్యమందు ప్రవేశించుట గర్భితత. ఉదా.—

§ 'రమణుఁడు చరణప్రాంతమున ప్రణామతత్పరుఁడైయుండఁగా నిపుడు చెప్పెదను సఖీ నీకు తత్త్వమును ఎప్పుడును కోపములు తగవు.'

అర్థదోషములం జెప్పుచున్నాఁడు —

౧౭౬. అపుష్టత దుష్క్రమత గ్రామ్యత వ్యాహతత అశ్లీలత కష్టత అనవీకృతత నిర్హేతుత ప్రకాశిత విరుద్ధత సందిగ్ధత పునరుక్తత ఖ్యాతివిరుద్ధత విద్యావిరుద్ధత సాకాంక్షత సహచరభిన్నత అస్థానయుక్తత అవిశేషమున విశేషము అనియమమున నియమమును వాని విపర్యయములను విధ్యయుక్తత అనువాదాయుక్తత నిర్ముక్తపునరుక్తత్వము అర్థదోషములుగా చెప్పఁబడినవి.

వానివిపర్యయము లనఁగా విశేషమందు అవిశేషము నియమమున అనియమము. ఇందు అపుష్టత్వ మనఁగా ముఖ్యమునకు ఉపకారి కామి; ఉదా.—

'విశాలమైన యాకాశమున చంద్రునిఁ గాంచి కోపము మానుము ప్రేయసీ.'

ఇచట విశాల శబ్దము కోపము మానుటకు ఏపాటియు నుపకరింపదు. అధికపదత్వమందు పదార్థాన్వయ బోధతో సమకాలమందే బాధ ప్రతిభాసించును; ఇందో పిమ్మట నని విశేషము.

దుష్క్రమత్వమునకు ఉదా.—

'రాజా నాకు గుఱ్ఱము నిమ్ము మదాలసమయిన గజేంద్రము నేని.'

ఇచట గజేంద్రమును తొలుత చెప్పుట యుచితము.

'నీవు నాదగ్గఱ నిద్రింపుము, నేను ప్రేయసీ ఇపుడు నిద్రింపనే నిద్రించెదను.'

ఇందు అర్థము గ్రామ్యము.

దేనికేని మొదల ఉత్కర్షను గాని అపకర్షను గాని చెప్పి పిమ్మట దానికన్న వేఱుగా ప్రతిపాదించుట వ్యాహతత్వము. ఉదా,—

'హరన్తి హృదయం యూనాం న నవేందుకళాదయః
వీక్ష్యతే యైరియం తన్వీ లోకలోచన చన్ద్రికా.'

---

§ రమణే చరణోపాన్తే ప్రణతిప్రవణే సతి
వదామి సఖి తే తత్త్వం మాన ఏవ న శోభతే.

[లోక లోచన చంద్రికయైన యాతన్విని ఎవరు కాంతురో అతరుణవయస్కుల హృదయమును నవచంద్రకళాదులు హరింపవు.]

ఇచట ఎవరికి చంద్రకళ ఆనందహేతువు కాదో వారికే ఆనందార్థమై తన్వికి చంద్రికాత్వము నారోపించుట.

† 'కొట్టుటకే పూనుకొన్న వానికి (దానికి) స్తబ్ధునికి (స్తబ్ధమునకు) రంధ్రాన్వేషికి ఎట్లు వడిగా పాటు సంభవించునో అట్లు పెండియు నుత్థానము సంభవింపదు'

ఇచట అర్థము అశ్లీలము.

‡ 'ఈ యచ్ఛోదకమను కిరణములలోనిదానిని సూర్యుడు వర్షించుచున్నాడు, మేఘుడు వర్షించుటలేదు. అట్లు ఆమెచేత గంగాజలప్రవాహము వర్ధింపబడుచున్నది గాన నిక్కముగా నామె (యమున) సూర్యసుతయే. వ్యాసుని వచనములను నమ్మనివాడెవడు! వేదమందు నమ్మిక ఎవనికి లేదు! అట్లైనను జేల హరిణి సూర్యమరీచుల యందు జలవిశ్వాసమును పొందకున్నది'.

ఇచ్చట ఎందువలన సూర్యుని వలన నుండి వృష్టియు యమునయు బుట్టునో అందువలన వాని జలము సంయుతము సూర్యప్రభవమే. అందువలన సూర్యమరీచులు జలవిశ్వాసము కలిగించుట ఉచితము; అట్లయిన మృగి బహుగొన్నదై అందు జలవిశ్వాసమును పొందకున్నది. ఈ యప్రస్తుతార్థమే దుర్బోధము; దీనివలన ప్రస్తుతార్థబోధ యను మాట ఎక్కడిది; కావున నిట కష్టార్థత్వము.

* 'ఎప్పుడును సూర్యుడు మింట జరించును,
ఎప్పుడును వాయువు వీచును,
ఎప్పుడును శేషుడు భూమిని మోచును,
ఎప్పుడును ధీరుడు తన్ను పొగడుకొనడు.'

ఇచట 'ఎప్పుడును' అని అనవీకృతము. ఇచట ఈపదమును పర్యాయాంతరములచేత

---

† హన్తు మేవ ప్రవృత్తస్య స్తబ్ధస్య వివరైషిణః
యథాశు జాయతే పాతో న తథా పున రున్నతిః.

‡ వమ త్యేత దహర్పతి, నతు ఘనో, ధామస్థ మచ్ఛం పయః.
సత్యం సా సవితుః సుతా సురసరిత్పూరో యయా ప్లావితః.
వ్యాస స్యోక్తిషు విశ్వసి త్యపి న కః! శ్రద్ధా న కస్య శ్రుతౌ!
న ప్రత్యేతి తథాపి ముగ్ధహరిణీ భాస్వన్మరీచి ష్వపః.

* సదా చరతి ఖే భానుః సదా వహతి మారుతః
సదా ధత్తే భువం శేషః సదా ధీరో౽వికత్థనః

మార్చినను అంతకన్న విచ్ఛిత్తివిశేష మేమియు లేదేని యీదోషము సంభవించు నని కథితపదత్వముకన్న భేదము. (౧౭౧)

నవీకృతమునకు ఉదా.—

* భానుఁ డొక్కమారె బాబాలఁ బూన్చును,
వాయు వట్టె వీచు రేయుఁ బవలు,
శేషుఁ డెప్పుడు మోచు శీర్షంబున జగంబు,
పన్నువడయువాని పాటు నిట్టె'.

§ 'ఓ శస్త్రమా, నీవు అనుచితమవ నైనను పరిభవభయంబున ఎతనిచేత ధరింపఁబడితివో, ఎతని ప్రభావమువలన నీకు విషయముకానిచే లేకపోయెనో, అతనిచేత భయమువలనఁ గాదు సుతశోకమువలన త్యజింపబడితివి; నేనును నిన్ను విడిచెదను, ఇందువలన నీకు మేలగుఁగాక'.

ఇచట రెండవ శస్త్రమోచనమునకు హేతువు ఉక్తముగాదు. కావున నిర్హేతుత్వము.

'ఓ నరేంద్రా, నీ కుమారుఁడు సిరిఁ బొందును గావుత.'

ఇచట 'నీవు చావుము' అను విరుద్ధార్థ ప్రకాశముచేత ప్రకాశితవిరుద్ధత్వము.

'అచలములనా అబలలనా సేవింపందగుచు చెప్పుఁడు మనీషులారా.'

ఇచట ప్రకరణము లేమిఁ జేసి వక్త శాంతుఁడో శృంగారియో నిశ్చయము లేనందున సంధిగ్ధత్వము.

‡ 'విమర్శించుకొనక పనిని చేయఁజనదు,
అవివేకము ఆపదలకు ముఖ్యమైన స్థానము ;
ఆలోచించుకొని చేయువానిని గుణలుబ్ధలం బోలె
సంపదలు స్వయముగానే వరించును'

---

* భానుః సకృద్యుక్తతురఙ్గ ఏవ రాత్రిన్దివం గన్ధవహః ప్రయాతి।
శేషః సదైవాహితభూమిభారః షష్ఠాంశవృత్తే రపి ధర్మ ఏషః॥

§ గృహీతం యే నాసీః పరిభవభయా న్నోచిత మపి
ప్రభావా ద్య స్యాభూ న్నఖలు తవ కశ్చి న్న విషయః।
పరిత్యక్తం తేన త్వ మసి సుతశోకా న్నతు భయా
ద్విమోక్ష్యే శస్త్ర త్వా మహ మపి యతః స్వస్తి భవతే.

‡ సహసా విదధీత న క్రియా
మవివేకః పర మాపదాం పదం
వృణతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయ మేవ సమ్పదః॥

ఇచట ఉత్తరార్ధమునకు వ్యతిరేకముగా ద్వితీయపాదముయొక్క యర్థమే కలదు; కావున పునరుక్తత.

ప్రసిద్ధి విరుద్ధతకు ఉదా.—

'అప్పుడు హరి వాఁడి శూలముం దాల్చి కలనం జరించెను'

ఇచట హరికి శూలము లోకములో అప్రసిద్ధము. ఇంకొక యుదా.—

'నీ పాదంపుఁదన్నుచేత అశోకమున అంకురములనెడి పులకలు పొడమినవి.'

ఇచట పాదాఘాతముచేత అశోకములందు పువ్వు జనించును అని ప్రసిద్ధి గాని అంకుర మని కాదు; కావున కవిసమయ ఖ్యాతి విరుద్ధత.

'మృగాక్షికి అధరమున నఖక్షతము.'

ఇచట శృంగారశాస్త్రమునకు విరుద్ధమగుటవలన విద్యావిరుద్ధత. ఇట్లు ఇతరశాస్త్ర విరుద్ధత్వము నయిుతము.

† 'శివధనుస్సునకు భంగమును, క్షత్త్రియునికి ఔన్నత్యమును, స్త్రీరత్నమును ఇపు డెట్లు పరశురాముఁడు ఓపును?'

ఇచట '(స్త్రీరత్నమును) ఒప్పరికించుటకు' అని యాకాంక్ష.

§ 'దారిద్ర్యములో మునిఁగిన సజ్జనుఁడును, స్తనములు జాఱిన కామినియు, సభ యందు పూజ్యుఁడగు ఖలుఁడును నా మతికి తాపము సేయుదురు.'

ఇచట సజ్జనుఁడును కామినియు శోభనులు, వారి సహచరుఁడు ఖలుఁడు అశోభనుఁడు, అని సహచర భిన్నత్వము.

‡ "ఆజ్ఞ ఇంద్రుని సిగమానికమునకు నెచ్చెలి, శాస్త్రములు క్రొత్త కన్ను, భక్తి భూతపతి యగు పినాకపాణియందు, తావలము లంకయనెడి దివ్యనగరము, పుట్టుకయు బ్రహ్మదేవుని సంతతిలో; ఇందువలన ఇతఁడు రావణుఁడు కాఁడేని ఇట్టి వరుఁడు దొరకఁడు; అన్ని చోట్లను అన్ని గుణములు ఉండునా?"

---

† ఐశస్య ధనుషో భఙ్గం, క్షత్త్రస్య చ సమున్నతిం,
స్త్రీరత్నం చ కథం నామ మృష్యతే భార్గవోఽధునా?

§ సజ్జనో దుర్గతౌ మగ్నః, కామినీ గళితస్తనీ,
ఖలః పూజ్యః సమజ్యాయాం తాపాయ మమ చేతసః.

‡ ఆజ్ఞా శక్రశిఖామణిప్రణయినీ, శాస్త్రాణి చక్షు ర్నవం,
భక్తి ర్భూతపతౌ పినాకిని, పదం లఙ్కేతి దివ్యా పురీ,
ఉత్పత్తి ర్ద్రుహిణాన్వయే చ; త దహో నేదృగ్వరో లభ్యతే
స్యా చ్చే దేష న రావణః; క్వను పునః సర్వత్ర సర్వే గుణాః?

ఇచట 'రావణుఁడు కాఁడేని' అను వఱకే సమాప్తి చేయవలసినది.

'వజ్రములకు నిధియైన యీసముద్రమును ఎట్లు వర్ణింతుము?'

ఇచట 'రత్నములనిధి' యని యవిశేషముగానే వచింపవలయును.

† 'సుడియే నీ నాభి, నల్లగలువలు నేత్రములు, తరంగములు వళులు; కావున నీవు లావణ్య జలంపు బావివి'.

ఇచట సుడియే అని నియమము చెప్పఁగూడదు.

'రాత్రులందు నల్ల దుప్పటి కప్పుకొని అభిసారికలు పోవుదురు.'

ఇచట తమిస్రలయందు అని రాత్రివిశేషమును చెప్పవలయును.

'ఆపాతసురసమయిన భోగమందు మునిఁగినవారు ఏమిసేయరు?'

'ఇచట ఆపాతమందే' అని నియమమును చెప్పవలసినది.

'వ్యతిక్రమలేశమును' లోనగు వాచ్యానభిధానమందు (౫౭౫) "అయినను" (అపి) లేదు, ఇచట 'ఏ' (ఏవకారము) లేదు; వీనిలో భేదమేమి అనినం గొందఱు చెప్పుదురు.— 'పృథగ్భూతముగా నియమమును వచింపమియే నియమపరివృత్తికి విషయము'అని. అది కాదు; అట్లగునేనియు రెంటికిని శబ్దార్థదోషత్వమందు నియామకము ఉండదు. మఱి యింక నేమి గతి యన, 'వ్యతిక్రమలేశము'ఇత్యాదులయందు శబ్దోచ్చారణానంతరమే దోషము ప్రతిభాసించును, ఇచ్చటనో అర్థము (అంతయు)బోధపడిన తర్వాత అని భేదము; ఇట్లయిన శబ్దపరివృత్తిని సహించుటచేతను సహింపమిచేతను ప్రాచీనులు ఆదరించిన శబ్దార్థదోషవిభాగము ఇట్లు పర్యవసించును- ఏదోషము శబ్దపరివృత్తి నొల్లదో అది శబ్దదోషమే, ఏదియైన పదార్థాన్వయప్రతీతికి ముందే బోధ్యమో అదియు శబ్దదోషమే, ఏదియైన అర్థప్రతీతికి తర్వాత బోధ్యమో అది అర్థాశ్రయమే అని. ఇట్లే అనియమపరివృత్తిత్వాదికి సంయుతము అధికపదత్వాదినుండి భేదమును ఎఱుంగనగును. '(ఆనిశాచరి...) రామమన్మథుని బాణముచేత' ఇత్యాది (౧౮౨)యగు అమత పరార్థత్వమందో అవశ్యముగా వాక్యమంతెల్ల వ్యాపించు ననుచితాభిప్రాయమువలన వాక్యదోషత. అశ్లీలత్వాదులయందన్నో అవశ్యముగా వాక్యవ్యాపిత్వము లేదు.

'ఇతఁడు తన పక్షమును ఆనందింపఁజేసినవాఁడు, పరపక్షమును కొట్టును'.

ఇచట పరపక్షమును కొట్టి స్వపక్షమును ఆనందింపఁజేయును అని విధేయము.

---

ఆవర్త ఏవ నాభి స్తే నేత్రే నీలసరోరుహే
భఙ్గాశ్చ వలయ స్తేన త్వం లావణ్యామ్బువాపికా.

† 'చండీశచూడాభరణమా, చంద్రుఁడా, లోకతమోహరుఁడా,
విరహిప్రాణహరణుఁడా, వృథాగా నన్నేఁపకు.'

ఇచట విరహియొక్క వచనమందు తృతీయపాదముయొక్క యర్థమును అనువదింపఁ గూడదు.

§ 'రాగావృతాంగియై పేరసియుష్టి (రొమ్ముటి) అరికంఠంబున మిక్కిలి బిగుస్తాగా తగులొక్క న్నదో, ఏది (ఎవతె) ఇట మాతంగంబుల (మాతంగుల) పైని పమ్ముచుండఁగా పర పురుషులు చూచియున్నారో, దానియందు సక్తుఁడై యితఁడు ఏమిను సంరునేయు చున్నాఁడు. నీకు తెలిసియుండునుగాక. అతనిచేత భృత్యులకు ఈఁబడితిని అని లక్ష్మి పంపున చెప్పుటకు అతని కీర్తి సముద్రునికడకు పోయినది వోలె.'

ఇచట వచనము 'నీకు తెలిసియుండునుగాక' అను దానిచే సమాపితమైనను 'అతని చేత' ఇత్యాది చేత పునరుపాత్తము.

ఇఁక రసదోషములను చెప్పుచున్నాఁడు.—

౫౨౨. రసమును తన శబ్దముచేత చెప్పుట, స్థాయి సంచారిణులను సయితము స్వశబ్దముచేత చెప్పుట, వైరి రసమునకు అంగమగు విభావాదులను పరిగ్రహించుట, అనుభావ విభావములకు కృచ్ఛ్రముగా ఆక్షేపము చేయుట, అకాలమున ప్రథన చ్ఛేదంబులు, మాటిమాటికిని దీప్తి, అంగిని అనుసంధింపమి, అనంగమును కీర్తించుట, అంగమునకు అతి విస్తరము, ప్రకృతులకు విపర్యయము, ఇంకను అర్థానౌచిత్యమును రసగత దోషములుగా చెప్పఁబడినవి.

రసముయొక్క స్వశబ్దము రసశబ్దమును శృంగారాదిశబ్దమును; క్రమముగా ఉదా.—

‡ 'ఆకురంగాక్షిని చూచి (చూడఁగా) మాకేమో రసము జనించెను, చంద్రమండలమును చూచి (చూడఁగా) శృంగారమున మనస్సు మునిఁగెను;

---

† చణ్డీశచూడాభరణ చన్ద్ర లోకతమోఽపహ.
విరహిప్రాణదమన కదర్థయ న మాం వృథా.

§ లగ్నం రాగావృతాఙ్గ్యా సుదృఢ మిహ యయైవాసియష్ట్యారికణ్ఠే
మాతఙ్గానా మపీ హోపరి పరపురుషై ర్యాచ దృష్టా పతన్తీ
త త్సక్తోఽయం నకిఞ్చి ద్గణయతి విదితం తేఽస్తు తే నాస్మి దత్తా
భృత్యేభ్యః శ్రీనియోగా ద్గదితు మితి గతే వామ్బుధిం యస్య కీర్తిః.

‡ తా ముద్వీక్ష్య కురఙ్గాక్షీం రసో నః కోఽప్యజాయత,
చన్ద్రమణ్డల మాలోక్య శృఙ్గారే మగ్న మాన్తరం.

స్థాయిభావమునకు స్వశబ్దవాచ్యత్వమునకు ఉదా.—

'నీవు లోచనగోచరుఁడవు కాఁగా ఆమెకు రతి యుదయించెను.'

వ్యభిచారికి స్వశబ్దవాచ్యత్వమునకు ఉదా.—

'ప్రియుఁడు ముద్దుగొనునప్పుడు ముగుద లజ్జావతి యైనది.'

ఇచట ద్వితీయభాగమున 'ఆమె ముకుళితాక్షి యైనది, అని లజ్జను అనుభావముఖమునం జెప్పు పాఠము యుక్తము.

'యౌవన మస్థిర మని యెఱిఁగి తన్వంగీ మానము మానుము.'

ఇచట యౌవన మస్థిర మని నివేదించుట శృంగారమునకు వైరియైన శాంతరసమునకు అంగము శాంతమునకే విభావంబును అగుటచే శృంగారమందు దానిని పరిగ్రహించుట యుక్తముగాదు.

† 'చలివెలుఁగు లోకలోచనముల కానందంబిడుచు జగతీతలమును తెలుపుసేయుచుండఁగా,
కడకంటిచూపుల నించుక నిగుడించుచున్న నగుమోముదానిని ఈతన్వంగిని చూడుము.'

ఇచట రసముయొక్క యుద్దీపనాలంబనవిభావములు అనుభావపర్యవసాయులుగా నున్న వని కష్టకల్పన.

§ 'ఇతఁడు రతిని వదలుచున్నాఁడు, మతిని కోలుపోవుచున్నాఁడు, కడుం దొట్రిలుచు
న్నాఁడు. మాటికి పొరలుచున్నాఁడు; ఇట్టి విషమదశ యితని దేహమును బలాత్కార
మున వైకొనియున్నది; ఇందుల కేమి చేయుదుము?'

ఇచట రతిపరిహారాదులు* కరుణాదికమందును సంభవించుటం బట్టి కామినీరూపమయిన విభావము ఎట్టకేలకు ఆక్షేప్యము.

అకాండమున ప్రథనమునకు ఉదా.— వేణీసంహారమున ద్వితీయాంకములో అనేకవీరసంక్షయము ప్రవర్తిల్లుచుండఁగా, భానుమతితో దుర్యోధనుని శృంగారప్రథనము.

ఛేదమునకు ఉదా.— వీరచరితమందు రాఘవభార్గవుల యన్యోన్యసంరంభము

---

† ధవళయతి శిశిరరోచిషి భువనతలం లోకలోచనానన్దే
ఈషత్స్మితప్రకటాక్షా స్మేరముఖీ సా నిరీక్ష్యతాం తన్వీ.

§ పరిహరతి రతిం మతిం లునీతే స్ఖలతితరాం పరివర్తతే చ భూయః
ఇతి బత విషమా దశాస్య దేహం పరిభవతి ప్రసభం కి మత్ర కుర్మః?

ఆరబ్ధమైయుండఁగా 'కంకణమోచనార్థము పోయెద' నని రాఘవుఁడు వచించుట.

మాటిమాటికి దీప్తికి ఉదా.— కుమారసంభవములో రతివిలాపమున.

అంగియొక్క యననుసంధానమునకు ఉదా.—రత్నావళిలో చతుర్థాంకమున బాభ్రవ్యుని రాకయందు సాగరికనుగూర్చి (తేని) విస్మృతి.

అనంగమును కీర్తించుటకు ఉదా.— కర్పూరమంజరియందు తామే కావించిన వసంతవర్ణనమును ఒప్పరికించి రాజనాయికలు వందిచేసిన వర్ణనను ప్రశంసించుట.

అంగముయొక్క యతివిస్తృతికి ఉదా. కిరాతమందు సురాంగనావిలాసాది.

దివ్యులు అదివ్యులు దివ్యాదివ్యులు అను భేదములచేత ప్రకృతులు త్రివిధములు; వారిలో ధీరోదాత్తాదులు కలరు; వారిలోను ఉత్తములు అధములు మధ్యములు కలరు. వారిలో ఎవఁడు ఎట్టివాఁడో వానికి అయథావర్ణనము గావించుటచే ప్రకృతి విపర్యయము దోషము. ఉదా.— ధీరోదాత్తుఁడగు రాముఁడు ధీరోద్ధతుఁడుం బోలె కపటమున వాలిని వధించుట — ఒండెకుమారసంభవమున ఉత్తమదేవతలయిన పార్వతీపరమేశ్వరులకు సంభోగశృంగారవర్ణనము. ఇది 'తలిదండ్రుల సంభోగవర్ణనముం బోలె కడు ననుచితము' అని వచింతురు.

ఇతరమయిన యనౌచిత్యము దేశకాలాదులను అన్యథా వర్ణించుటయేదో అది; అట్టి వర్ణనమున కావ్యము అసత్యమని ప్రతిభాసిల్లుటం బట్టి వినేయులకు దానియందు శ్రద్ధ కలుగదు.

౫౭౨. ఇవి గాక యలంకారదోషములు సంభవింపవు.

ఇవి అనఁగా ఈచెప్పినవి. అట్లేగదా— ఉపమయందు అసాదృశ్యము అసంభవము అనునవియు, ఉపమానముయొక్క జాతిప్రమాణప్రయుక్తములయిన న్యూనత్వాధికత్వములును, అర్థాంతరన్యాసంబున ఉత్ప్రేక్షితార్థ సమర్థనంబును అనుచితార్థములలోఁ జేరును. వరుసగా ఉదా.

---

'వితతార్కకిరణునిగా కావ్యచంద్రునిఁ గుర్తిచ్చుచున్నాను.'

'పడుచున్న జలధారలవలె నీ బాణములు పడుచున్నవి.'

'ఈ రాజు యుద్ధములో చండాలునివలె అతిసాహసుఁడు.'

'చంద్రబింబము కర్పూరపుఁబెళ్ళవలె వెలుఁగుచున్నాఁడు.'

'హరునివలె నీలకంఠముగా ఈనెమలి ప్రకాశించుచున్నది'
'నీ స్తనములు కొండలకు సమానములు'

† 'ఆ హిమవంతుఁడు తన గుహలయందు దివాకరునివలననుండి భయముచేతనో యన దాఁగిన చీఁకటిని గుడ్లగూబనుం బోలె రక్షించుచున్నాఁడు; నిశ్చయముగా క్షుద్రునియం దైనను శరణాగతునియందు ఉచ్చైఃశిరస్కులకు తనవాఁ డను నభిమానము మిక్కిలి గొప్పది.'

ఏవమాదులయందు ఉత్ప్రేక్షితార్థమునకు అసంభూతముగానే ప్రతిభాసించుట స్వరూపము గావున దానిని సమర్థించుట అనుచితమే.

పాదత్రయమాత్రగతమైన యనుకమునకు అప్రయుక్తత్వము (౫౭౪) దోషము ఉదా.—

'సహ సాళిజనైః స్నిగ్ధైః సహసా కుఞ్జమందిరమ్
ఉదితే రజనీనాథే సహసా యాతి సుందరీ'

[అవిచారితముగా కూర్చు సకియలతోఁగూడ ఆమె పొదరింటికి చంద్రుఁడుదయింపఁగా నవ్వుతోఁగూడుకొన్నదై పోవుచున్నది సుందరి.]

ఉత్ప్రేక్షయందు యథాశబ్దమునకు ఉత్ప్రేక్షాద్యోతకత్వమేని అవాచకత్వము. ఉదా.—

'ఏష మూర్తో యథా ధర్మః క్షితిపో రక్షతి క్షితిమ్.'

[ఈరాజు మూర్తమయిన ధర్మమోయన పుడమిని కాచుచున్నాఁడు.]

ఇట్లు అనుప్రాసమందు వృత్తి విరుద్ధత్వమునకు ప్రతికూలవర్ణత్వము. ఉదా.—

'ఓవట్టఇ ఉల్లట్టఇ' ఇత్యాదియందు (౫౭౫)

ఉపమయందును సాధారణధర్మముయొక్క అధికత్వమును న్యూనత్వమును అధికపదత్వమును న్యూనపదత్వమును (అగును). వరుసగా ఉదా.—

§ 'విభూతిధవళప్రకాశుఁడు శంభుఁడు నయనజ్యోతిచేత నీలవారిదఖండధారియగు శరన్మేఘము మెఱుముచేతనుం బోలె ప్రకాశించుచున్నాఁడు.'

ఇచట నీలకంఠత్వమును ప్రతిపాదింపనందున నీలవారిదఖండధారి యను విశేషణము అధికము.

---

† నయనజ్యోతిషా భాతి శమ్భు ర్భూతిసితద్యుతిః।
విద్యు తేవ శరన్మేఘో నీలవారిదఖణ్డధృక్॥

§ దివాకరా ద్రక్షతి యో గుహాసు లీనం దివాభీత మి వాన్ధకారమ్
క్షుద్రేఽపి నూనం శరణం ప్రపన్నే మమత్వ ముచ్చైఃశిరసాం సతీవ॥

‡ "లక్ష్మీసమాలింగితుఁడు తారహారవనోహరుఁడు మురరిపుఁడు విద్యుద్విభూషితమయిన నీలమేఘమువలె నొప్పుచున్నాఁడు".

ఇచట ఉపమానమునకు సబలాకత్వమును చెప్పవలసినది.

ఉపమయందే ఉపమానోపమేయముల లింగవచనభేదము కాలపురుషవిధ్యాది భేదమును భగ్నప్రక్రమత్వ మగును. వరుసగా ఉదా.—

'చంద్రుఁడు సుధవలె విమలుఁడు.'

'కీర్తి వెన్నెలలవలె తెల్లనిది.'

* 'శుద్ధవేషులై చనుచున్న యా యిరువురకును, మంచు తొలఁగఁగా కూడిన చిత్రాచంద్రమసులకుం బోలె నొక యనిర్వచనీయశోభ కలిగెను.'

ఇచట అట్టి చిత్రాచంద్రమసులకు శోభ పూర్వ మొకానొకప్పుడు మాత్రము కలిగినట్టిది కాదు, మఱి యేమన ఎప్పుడు కలుగునట్టిదే.

'ఓ తన్వీ, లతవలె శోభిల్లుచున్నావు.'

ఇచట లత శోభిల్లుచున్నది, నీవో శోభిల్లుచున్నావు.

'నీ పుత్త్రుఁడు మార్కండేయమునివలె చిరము జీవించునుగాక.'

ఇచట మార్కండేయముని జీవించుచునేయున్నాఁడు, అతనికి జీవించునుగాక యని విధేయముగాదు.

ఈ క్రిందివాక్యములలో ఎచ్చట లింగవచనభేదము ఉన్నను సాధారణధర్మమునకు అన్యథాభావము (ఉపమానముతో అన్వయింపమి) లేదో అచ్చట దోషము లేదు. క్రమముగా ఉదా.—

'ముఖం చన్ద్ర ఇ వాభాతి.'

[ముఖము చంద్రునివలె ప్రకాశించును. ఆభాతి = ప్రకాశించుచున్నది, ప్రకాశించుచున్నాఁడు.

'తద్వేశో౽ సదృశో౽ న్యాభిః స్త్రీభి ర్మధురతాభృతః
దధతే స్మ పరాం శోభాం తదీయా విభ్రమా ఇవ.'

---

‡ కమలాలిఙ్గిత స్తారహారహారీ మురం ద్విషన్।
విద్యుద్విభూషితో నీలజీమూత ఇవరాజతే॥

* తా ప్ప్రభిఖ్యా తయో రాసీ ద్వ్రజతోః శుద్ధవేషయోః
హిమనిర్ముక్తయో ర్యోగే చిత్రాచన్ద్రమసో రివ.

[అనన్యస్త్రీ సాధారణంబును సౌందర్యపూరితమును ఐన యామెవేషము ఆమెయొక్క కామవిలాసములవలె ఉత్కృష్టమయిన శోభను వహించెడిని.]

[దధతే – ఇది 'దధధారణే' అను ధాతువుయొక్క వర్తమానార్థక ప్రథమపురుషైక వచనరూప మగును. అట్లే 'డుధాఞ్ ధారణపోషణయోః' అను ధాతువుయొక్క వర్తమానార్థక ప్రథమపురుష బహువచనరూపంబును అగును. కావున దీనికే 'వహించుచున్నది' అనియు, 'వహించుచున్నవి' అనియు నర్థములు.]

పూర్వోదాహరణములయందు ఉపమానోపమేయములలో నొకటికే సాధారణధర్మముతో నన్వయము సిద్ధించుటచేత ప్రకాన్తమగుచున యర్థమునకు అనిర్వాహము స్పష్టము. ఇట్లు అనుప్రాసమునందు వైఫల్యమునకు అపుష్టార్థత్వము కలుగును. ఉదా.—

'అనణురణ న్మణి మేఖల మవిరళ శిఞ్జాన మఞ్జు మఞ్జీరమ్
పరిసరణ మరుణచరణే రణరణక మకారణం కురుతే.'

[మణులమొలనూలి బలుమ్రోతతోను, అందియలదట్టంపు మనోహరంపుటులివుతోను కూడుకొన్న నీ సంచారము, ఓ యెఱ్ఱనిపాదములయింతీ అకారణముగా చింతను కలిగించుచున్నది.]

ఇట్లే సమాసోక్తియందు సాధారణవిశేషణవశంబున పరార్థము తెలియుచున్నను దానిని మరల శబ్దముచేత చెప్పుటకును అప్రస్తుతప్రశంసయందు వ్యంజనచేతనే ప్రస్తుతార్థము తెలియుచుండఁగా దానిని చెప్పుటకును పునరుక్తత్వము కలుగును. వరుసగా నుదాహరణములు.

† 'అనురాగవంతుఁడైనను నేత్రములకు సుఖకరమును అతాపకరమును అగు దేహము ధరించినవాఁడైనను, పడమటి దిక్కనెడివేశ్య వసుహీనుఁడైన సూర్యుని ఆకాశమనెడి గృహమునుండి వెడలఁగొట్టెను.'

ఇచట పడమటిదిక్కు అనుమాత్రనే దానివేశ్యాత్వము తెలియుచున్నది.

* 'పిలువంబడినపక్షులలో మున్నాడివచ్చుచున్న దోమ నివారింపఁబడదు, మణులలో నడు

---

† అనురాగవన్త మపి లోచనయో ర్దధతం వపుః సుఖ మతాపకరమ్
నిరకాసయ ద్రవి మపేతవసుం వియదాలయా దపరదిగ్గణికా.

* ఆహూతేషు విహఙ్గమేషు మశకో నాయా న్పురో వార్యతే,
మధ్యే వా ధురి వా వసం స్తృణమణి ర్ధత్తే మణీనాం ధురమ్,
ఖద్యోతోఽపి న కమ్పతే ప్రచలితుం మధ్యేఽపి తేజస్వినామ్,
ధి క్సామాన్య మచేతనం ప్రభుమి వానామృష్టతత్త్వాన్తరమ్.

మను గాని మునుమునఁ గాని వసించుచు తృణమణి (తృణాకర్షకమయిన యల్పమణి) యు (మణుల) గౌరవమును పొందును, మిశుంగులు సయితము తేజస్సులనదును నయి నను చరించుటకు వెఱవదు, ఇసీ, తెలివిలేని సామాన్యజనము తెలివిలేని ప్రభువువలె వస్తు తారతమ్యమును విచారింపదు.'

ఇచట తెలివిలేని ప్రభువును చెప్పుట అనుచితము.

ఇట్లు అనుప్రాసమందు ప్రసిద్ధిలేమి ఖ్యాతివిరుద్ధత్వ మగును. ఉదా.—

‡ 'ఈ రాజునకు చక్రాధిష్ఠితత్వమును చక్రియు, ఉచ్ఛ్రితమయిన గోత్రమును గోత్రి భేదియు, వృషమును వృషభకేతనుఁడును ఇచ్చినారు.'

చెప్పినదోషములకు ఒక్కప్పుడు అదోషత్వము ఒకప్పుడు గుణత్వము కలుగునని చెప్పుచున్నాఁడు.

౧౨౯. వక్త క్రోధసంయుక్తుఁడైనప్పుడును వాచ్యము సముద్ధతమయినప్పుడును, రౌద్రాదికము రసమయినప్పుడు అత్యంతముగాను, దుఃశ్రవత్వము గుణ మగును.

ఇవి ఆస్వాదస్వరూప విశేషాత్మకములయిన ముఖ్యగుణములవలని యతి శయమునకు ఉపకారములగుటం బట్టి వీనికి గుణవ్యవహారము గౌణము. వరుసగా ఉదా:—

'త్వద్విచ్ఛేదకృశస్య కణ్ఠవిలుఠత్ప్రాణస్య మే నిర్దయం
క్రూరః పఞ్చశరః శరై రతిశితై ర్భిన్ద న్మనో నిర్భరమ్
శమ్భో ర్భూతకృపావిధేయమనసః ప్రోద్దామ నేత్రానల
జ్వాలా జాల కరాళితః పున రసా వాస్తాం సమస్తాత్మనా.'

[నీతోడి యెడఁబాపుచే కృశించి కుత్తుకలో ఉరలుచున్న గుటుగుటు జీవముతో నున్న నాయొక్క మనస్సును కనికరములేక దుస్సహముగా కడు వాఁడి యలుగులతో భేదించు చున్న క్రూరుఁడు పంచబాణుఁడు భూతకరుణావశంవదచిత్తుఁడైన శంభునియొక్క ప్రోద్దా మమయిన నేత్రాగ్నిజ్వాలాజాలముచేత మరల సర్వశరీరమునను దగ్ధుఁడగుఁ గాక.— సర్వ శరీరమునను = లింగశరీరముతోఁగూడ.]

ఇచట శృంగారమందు వక్త కుపితుఁడు.

'మూర్ధ వ్యాధూయమానధ్వనద మరధునీ లోల కల్లోలజాలో
ద్ధూతామ్భః క్షోదదమ్భా త్ప్రసభ మభినభః క్షిప్త నక్షత్ర లక్షమ్

‡ చక్రాధిష్ఠితతాం చక్రీ గోత్రం గోత్రభి దుచ్ఛ్రితమ్
వృషం వృషభకేతు శ్చ ప్రాదా త్తస్య భూభుజః.

ఊర్ధ్వస్య స్తాక్షిప్తదణ్డ భ్రమిభర రభసోద్వ్యస్తనభస్వ త్ప్రవేగ
భ్రాన్త బ్రహ్మాణ్డభాణ్డం ప్రవితరతు శివం శామ్భవం తాణ్డవం వః'

[శంభుని తాండవము మీకు మేలు సేయుఁగాక.- ఆ తాండవ మెట్టిదన;- (శంభుని) మూర్ధమున ఊటాడింపఁబడినదై మ్రోయుచున్న సురనిర్ఝరిణియొక్క చంచలమహోత్తరంగముల సమూహముచేత పైకిమీటఁబడిన నీటిబొట్లసమిష్టిచేత బల్మిమెయి మింటికి విసరివేయఁబడిన నక్షత్రలక్షలు కలదియు, పైకెత్తఁబడిన (శంభుని) యంఘ్రిదండముల సుడిపాటు యొక్క మిక్కుటంపు వేగమువలనం బొడమిన గాలియొక్క వడిచేత గిఱగిఱం దిప్పఁబడిన బ్రహ్మాండభాండములు కలదియు.]

ఇచ్చట ఉద్ధతతాండవము వాచ్యము; ఈ రెండు పద్యములు నావి. రౌద్రాదికము రసముగా నున్నప్పుడు ఆ రెండింటను ఎట్లో అంతకన్న దుఃశ్రవత్వము అత్యంతము గుణమగును.

ఉదా.—

'ఉత్కృత్యోత్కృత్య కృత్తిం ప్రథమ మథ పృథూచ్ఛోఫభూయాంసి మాంసా
న్యంస స్ఫిక్పృష్ఠ పిణ్డాద్యవయవ సులభా న్యుగ్రపూతీని జగ్ధ్వా
ఆర్తః పర్యస్తనేత్రః ప్రకటితదశనః ప్రేతరఙ్కః కరఙ్కా
దఙ్కస్థా దస్థిసంస్థం స్థపుటగత మపి క్రవ్య మవ్యగ్ర మత్తి.'

['ప్రేతదరిద్రుండు' ఇత్యాది (౨౩౬)]

ఇచ్చట బీభత్సము రసము.

౧౮౦. అశ్లీలే సురతచేష్టాగోష్ఠ్యాదియందు అశ్లీలత్వము గుణమగును.

ఉదా.

§ 'కరిహస్తము సంబాధము బ్రవేశించి లోపల విరివిసేయఁగా పురుషుని ధ్వజము సాధనములోఁ జేరి ప్రకాశించుచున్నది.'

[కరిహస్తము= (1) ఏనుఁగుతొండము, (2) కామశాస్త్రోక్తమయిన కృత్రిమలింగము. ధ్వజము= (1) జెండా, (2) పురుషచిహ్నము. సాధనము= (1) సేన, (2) స్త్రీగుహ్యము.]

ఇచ్చట సురతారంభగోష్ఠియందు 'ద్వ్యర్థములయిన పదములచేత రహస్యవస్తువును సూచింపవలయును' అని కామశాస్త్రస్థితి గదా. ఆదిపదముచేత శమకథాప్రభృతులయందు నని యెఱుంగునది.

§ కరిహస్తేన సంబాధే ప్రవిశ్యాన్త ర్విలోడితే
ఉపసర్ప న్ధ్వజః పుంసః సాధనాన్త ర్విరాజతే.

గుం౧. నిహతార్థ త్వాప్రయుక్తత్వములు శ్లేషాదులయందు దోషములుగావు.

ఉదా.—

'పర్వతభేది పవిత్రం జైత్రం నరకస్య బహుమతం గహనమ్
హరి మివ హరి మివ హరి మివ సురసరిదమ్భః పత న్నమత.'

[పర్వతభేది (హిమాలయమును భేదించునది) పవిత్రము, నరకమును జయించునది పలువురచేత మతము (పూజితము) గహనము (మహావేగమువలనంజేసి దురవగాహము)ను అయి పడుచున్న సురనదీజలమును— గోవర్ధనోద్ధారి పవిత్రుఁడును నరకాసురజేతయు బహుపూజితుఁడును, దురోభ్రధుఁడును నగు విష్ణునివలెను, పర్వతపక్షముల భేదించువాఁడును వజ్రాయుధధారియు జయశీలుఁడును మనుష్యునికి మిక్కిలి పూజితుఁడును దుర్జయుఁడు నగు నింద్రునివలెను ('మృగములలో నేను మృగేంద్రుఁడను' అను గీతావచనముం బట్టి సింహము విష్ణుస్వరూపమగుటవలన పూజ్యము గావున) పర్వతవిశేషాశ్రయుయము, పవిత్రంబును, మనుష్యుని గెల్చునదియు పెక్కు మతంగములను (ఏనుఁగులను) చంపునదియు నగు సింహమునుంబోలెను నమస్కరింపుఁడు.]

ఇచ్చట ఇంద్రపక్షమున పవిత్రశబ్దము నిహతార్థము, సింహపక్షమున మతంగశబ్దము మాతంగపరముగా అప్రయుక్తము.

గుం౨ వక్తయు వాచ్యుఁడును తెలిసికొనువారేని అప్రతీతత్వము గుణమగును

ఉదా.—

§ 'నిన్ను పురుషార్థప్రవర్తియగు ప్రధానమునుగా వచింతురు, నిన్ను దానిం గనుచు నుదాసీనుఁడగు పురుషునిఁగాను నెఱుంగుదురు.'

[పురుషుఁడు= ఆత్మ. ప్రకృతి= ప్రధానము.]

గుం3. స్వయము పరామర్శించుకొనునప్పుడేని.

అప్రతీతత్వము గుణమని అనుషంగము.

ఉదా.—

* 'చీకట్లు వర్ధిల్లుటకై కళలతోఁగూడుకొన్నవాఁడును వాని నాశముకై వానిం బాసినవాఁడును, శుద్ధుఁడు నిరాలంబపదము నవలంబించువాఁడు నగు నతని సాత్మచంద్రుని పరిశీలించెదను.'

---

§ త్వా మామనన్తి ప్రకృతిం పురుషార్థప్రవర్తినీం
తద్దర్శిన ముదాసీనం త్వామేవ పురుషం విదుః.

* యుక్తః కలాభి స్తమసాం వివృద్ధ్యై క్షీణ శ్చ తాభిః క్షయె య ఏషామ్
శుద్ధం నిరాలమ్బపదావలమ్బం త మాత్మచన్ద్రం పరిశీలయామి.

[చీకట్లు = అజ్ఞానము; కళలు = పృథివ్యాదితత్త్వములు; నిరాలంబపదము = శిరఃస్థాధోముఖకమలకర్ణికామధ్యము.]

౫౭౮. కథితపదము మరలఁగొనుట- విహితమున నువాదించుటయందును, విషాదమందు, విస్మయమందు, క్రోధమున, దైన్యమున, లాటానుప్రాసమున, అనుకంపయందు, ప్రసాదింపఁజేయుటయందు, అర్థాంతరసంక్రమితవాచ్యమందు, హర్షమున, నిశ్చయించుటయందును—గుణము అనుటయే. ఉదా—

'సూర్యుఁడు తామ్రుఁడుగా' ఇత్యాది (౫౭౫)

ఇచట విహితానువాదము.

'అకటా అకటా సఖీ పోయినకాంతుఁడు వసంతమున రాఁడాయెను.'

ఇచటవిషాదము.

'సుముఖీ చిత్రము చిత్రము అనాకాశమున చంద్రుఁడెట్లు!'

ఇచట విస్మయము.

'సునయనే నయనే నిధేహి' అని

[ఓసునయనా నయనములను నిగిడింపుము.]

ఇట లాటానుప్రాసము.

'నయనములు వానివే నయనములు.'

ఇత్యాదులయందు అర్థాంతరసంక్రమితవాచ్యధ్వని. ఇట్లే కడమ తావులయందు.

౫౭౯. సందిగ్ధత్వము నట్లు వ్యాజస్తుతిపర్యవసాయి యేని. గుణమే అనుట ఉదా.—

* 'ఓరాజా ఇప్పుడు పృథుకార్తస్వరపాత్రమును భూషితనిశ్శేషపరిజనమును, విలసత్కరేణుగహనంబును నై మన యిరువురి యిల్లును సమానముగానున్నది.'

[పృథుకార్తస్వర పాత్రము = గొప్ప బంగారు పాత్రములుకలది— పృథుక ఆర్తస్వర పాత్రము = శిశువుల ఆర్తనాదములకు తావు. భూ ఉషిత = నేలయందు పరుండిన అని యొక భేదము; విలసత్ కరేణు = ఒప్పుచున్న పిడియేనుఁగులచేత—గహనమ్= చొరరానిది.—విల = బిల = బొఱియలయందు సత్క = వసించుచున్నమృక్కడుల

* పృథుకార్తస్వరపాత్రం భూషితనిఃశేషపరిజనం దేవ
విలసత్కరేణుగహనం సమ్ప్రతి సమ మావయోః సదనమ్.

యొక్క (మూషికాదిముక్కడి జంతువులయొక్క)— రేణు = ధూళి (చేత)— గహ నమ్ = సాంద్రమయినది.]

౧౮౬. వైయాకరణముఖ్యుఁడు ప్రతిపాద్యుఁడైనను వక్తయైనను అగునేని కష్టత్వము దుఃశ్రవత్వమేనియు,

గుణమే అనుట. ఉదా.—

† 'ఒకఁడు దీధీవేవీట్సముఁడు గుణవృద్ధులకు అభాజనము, మఱియొకఁడు క్విప్ప్రత్యయ నిభుఁడు, అచట నవి దాయనే దాయవు.'

ఇట నర్థము కష్టము, వైయాకరణుఁడు వక్త, ఇట్లే వైయాకరణుఁడు ప్రతిపాద్యుఁ డగునేనియు.

[దీధీవేవీ ధాతువులకు "దీధీవేవీటాం"మను సూత్రము గుణవృద్ధులను నిషే ధించుచున్నది. క్విప్ప్రత్యయనిభుఁడు వినష్టుఁడే అనుట. క్విప్ప్రత్యయము "వేర పృక్తస్య" అను సూత్రముచేత లోపించును.]

'ఉపాధ్యాయుఁడా ఇచట నిన్ను ప్వడను నేను స్మరింపలేదు.'

ఇచట దుఃశ్రవత్వము. వైయాకరణుఁడు, వాచ్యుఁడు. ఇట్లే ఇతఁడు వక్తయైనను.

౧౮౭. అధమోక్తులయందు గ్రామ్యత్వము.

గుణమే అనుట. ఉదా.— మదీయము.—

* 'ఇదే చంద్రబింబము హైయంగవీనంపుముద్దవలె అగపడుచున్నది. ఈ కిరణసమూహములు క్షీరధారలవలె పిక్కలంబడుచున్నవి.'

ఇది విదూషకోక్తి.

౧౮౮. ఖ్యాతార్థమున నిర్హేతుత దోషముకాదు.

ఉదా.—

'ఇపుడు సంధ్యాసమయము చక్రమిథునములను ఎడఁబాపుచున్నది.'

౧౮౯. విఖ్యాతమయిన కవిసమయమునందు ఖ్యాతవిరుద్ధత గుణము.

కవిసమయఖ్యాతము లెవ్వి యనః—

---

† దీధీవేవీజ్సమః కశ్చి ద్గుణవృద్ధ్యో రభాజనమ్
క్విప్ప్రత్యయనిభః కశ్చి ద్యత్ర సన్నిహితే న తే.

* ఏసో ససహరబింబో దీసఇ హేఅంగవీణ పిండోవ్వ
ఏదే అస్స మోహా పడంతి ఆసాసు దుద్ధధారవ్వ.

సూ. ౦. ఆకాశమందును పాపమందును మాలిన్యమును, యశస్సునందును హాస కీర్తులయందును ధవళిమయు వర్ణింపఁబడును; క్రోధ రాగములు రక్తములు, పంకజేందీవరాదులు నదీసముద్రములయందును వర్ణింపఁబడును; జలాధారములనెల్లను హంసాది పక్షిసంఘము చరించును చకోరములు వెన్నెలను త్రాగును, హంసలు జలధరసమయమున మానస సరస్సునకుం బోవును, (యువతులు) పాదముతోఁ దాచిన అశోకము పూచును, పొగడ స్త్రీల పుక్కిటి సురచేత; యౌవనవంతుల యంగములందు హారములును, అట్లే హృదయములును వియోగ తాపములచేత పెట్లును; మదనునికి వింటినారి తుమ్మెదలబారు, విల్లును బాణములును పువ్వులు; అతని బాణములచేతను అట్లే స్త్రీకటాక్షము చేతను యువజనుల హృదయము భిన్నమగును. పగలు కమలమును రాత్రి కుముదమును వికసించును, శుక్లపక్షమందు (సర్వదా) వెన్నెల (వెల్గును), మేఘము ఉఱుమఁగా నెమళ్లు నృత్యముసేయును, అశోకమందు ఫలము లేదు, వసంతమున జాజి యుండదు, చందనవృక్షములయందు కుసుమములు ఫలములును లేవు, ఇత్యాదిగా ఇతరమును కవిసమయగతమును సత్కవిప్రబంధములవలన నూహించుకొనవలయును.

వీని కుదాహరణములు ఆకరములయందు స్పష్టములు.

సూ. ౧. ధనుర్జ్యాది శబ్దములయందు ధనురాదిశబ్దములు ఆరూఢత్వాదిబోధకొఱకు.

ఉదా.—

‹ ధనుర్జ్యా స్ఫాల నోద్భవములయిన ధ్వానములచేత ద్యావాపృథివులు నిండినవి.›

ఇచట జ్యాశబ్దముచేతనే అర్థము వచ్చుచుండఁగా ధనుశ్శబ్దముచేత జ్యాను ధనుస్సునందు ఆయత్తముసేయుట బోధింపఁబడుచున్నది. ఆది-శబ్దముచేత "నీ కర్ణావతంసము భాసించుచున్నది." ఇచ్చట కర్ణమందు ఉన్న దని తెలుపుటకు కర్ణ—శబ్దము. ఇట్లే శ్రవణ కుండల శిరశ్శేఖర పరిభృతులును.

ఇట్లు నిరుపపదమయిన మాలాశబ్దము పుష్పస్రజమునే చెప్పును, కావున 'నీ పుష్పమాల ప్రకాశించుచున్నది' అనువాక్యమునం గల యీ పుష్పశబ్దము ఉత్కృ

ష్టపుష్పములం దెల్పుటకు. ఇట్లు 'ముక్తాహారము' అనుచో ముక్తాశబ్దము అస్థిరత్వా మిశ్రితత్వమును తెలుపుచున్నది.

సూ. 2. అట్లు పాదుకలో నున్నట్టివి ప్రయోగింపఁదగినవి.

ధనుర్జ్యాదులు సతాఽవ్యస్థితములే నిబంధింపఁదగినవి గాని లేనివి జఘనకాంచి, కర కంకణము ఇత్యాదులు కావు.

సూ. 3. ఆనందమగ్నాదుల వాక్యమునందు న్యూనపదత్వము గుణము.

* 'గాఢాలింగనముచేత క్రుంగిన కుచములందు పొడమిన పులకలు కలదై, గాటఁపు స్నేహ రసోద్రేకముచేత శోభావంతమయిన పిఱుఁదిమీఁది యంబరము జాఱుచుండఁగా, మానదా వలదు వలదు నన్ను అతి వలదు చాలును (వలదు) అని క్షామాక్షరములం బలుకుచు నిద్రించినదా, మృతిఁజెందినదా, నా మనస్సులో అణఁగినదా, కరఁగిపోయినదా ఏమి?'

ఇచట పీడ(వలదు-చాలును) అను పదము తక్కువ.

సూ. 4. కొన్ని సమయములందు గుణమునుం గాదు దోషమునుం గాదు. న్యూనపదత్వ మనుటయే.

ఉదా.—

† మ. 'కినుకన్ శక్తత దిచ్చుమోమయినదో, కిన్కంచు జిరం బూనదే;
చనెనో నాకముఁగూర్చి, నా యెడలఁ దత్స్వాంతంబు భావార్ద్రమా;
కొనిపో నా యెదురం దెగింపదురె రక్షోవీరులైనన్ సఖిన్;
కనుకట్టై ప్రియ యత్తమిల్లె; నిటులన్ గారింతువే దైవమా!'

ఇచ్చట 'దిచ్చుమోమయినదో' 'కూర్చి' అనువాని యనంతరము 'లేదు (కాదు) ఏలన' అనుపదములు తక్కువ. ఈ పదముల కొఱత ఈవాక్యమునకు వ్యంగ్య

---

* గాఢాలిఙ్గన వామనీకృత కుచ ప్రోద్భిన్న రోమోద్గమా,
సాన్ద్ర స్నేహరసాతిరేక విగళ చ్ఛ్రిమ న్నితమ్బామ్బరా,
మా మా మానద మాతి మా మల మితి క్షామాక్షరోల్లాపినీ
సుప్తా కిన్ను, మృతా ను కిం, మనసి మే లీనా, విలీనా ను కిం?

† తిష్ఠేత్ కోపవశాత్ప్రభావపిహితా, దీర్ఘం న సా కుప్యతి;
స్వర్గా యోత్పతితా భవే, న్మయి పున ర్భావార్ద్ర మస్యా మనః;
తాం హర్తుం విబుధద్విషోఽపి న చ మే శక్తాః పురోవర్తినీం;
సా చాత్యన్త మగోచరం నయనయో ర్యాతేతి కోఽయం విధిః!

మయిన వితర్కాఖ్య వ్యభిచారిభావమునకు ఉత్కర్ష కావింపనందున గుణము కాదు; 'కిన్కం జీవం బూనదే' అనువాక్యమువలన జనించెడి ప్రతిపత్తిచేత 'కినుక్ర' ఇత్యాది వాక్యజన్యమయిన ప్రతిపత్తియొక్క బోధస్ఫుటముగానే అవభాసించుచున్నది గావున దోషమునుం గాదు.

సూ ౫. ఒక్కొక సమయాన ఎక్కడు పదము గుణము.

ఉదా.—

* 'ఆ దుర్జనుఁడు అవిచారితముగా మనస్సునకు సయితము గోచరింపని చేఁతలను చేయుచుండుటను నేను ఎఱుఁగకుండ లేను. ఎఱుఁగుదును, ఐనను నామనస్సును కఠినత తాఁకకయే యున్నది.'

ఇచ్చట "ఎఱుఁగకుండ లేను" అను నయోగవ్యవచ్ఛేదమువలన విచ్ఛిత్తివిశేషము.

సూ ౬. సమాప్తపునరాత్తత్వము కొన్నిసమయములయందు దోషమునుం గాదు గుణమును గాదు.

ఉదా.—

'అన్యా స్త్రా గుణరత్న' [ఎవనిని జూడఁగానే] ఇత్యాది (౫౭౫)

ఇచట తొలిసగముచేత వాక్యము సమాప్తమయినను రెండవసగంపు వాక్యము పునరుపాత్తము. ఇట్లు విశేషణమాత్రమును మరలం జేర్చిన సమాప్తపునరాత్తత్వ (దోష) మగును గాని వాక్యాంతరమును చేర్చుటచేతఁ గాదని యెఱుఁగవలయును.

సూ ౭. ఒక్కొక్కప్పుడు గర్భితత్వము గుణము.

ఉదా.—

‡ 'నాలుగు మేరలను దిగ్గజములు పంచుకొన్నట్టి భూమి జయింపఁబడుచున్నది. జయింపఁబడ్డనుం జయింపఁబడినదయ్యె—మనము పలుకుచునే గగుర్పాటుతో చూడుఁడు—బ్రాహ్మణునికి ఈఁబడుచున్నది; ఇఁక నేమి? ఈ కథామృతము ఎవనినుండి పుట్టినదో ఆ యెవనియందే లీనము నైనదో ఆరామునికి నమస్కారము.'

---

* ఆచరతి దుర్జనో య త్సహసా మనసోఽప్యగోచరా నర్థాన్
త న్న న జానే; జానే, స్పృశతి మనః కిన్తు నైవ నిష్ఠురతాం.

‡ దిక్కాలత్కుటా విభక్త చతురాఘాటా మహీ సాధ్యతే.
సిద్ధా సాపి—వదన్త ఏవ హి వయం రోమాఞ్చితాః పశ్యత.—
విప్రాయ ప్రతిపాద్యతే; కి మపరం? రామాయ తస్మై నమో
యస్మా త్ప్రాదురభూ త్కథామృత మిదం యత్రైవ చాస్తంగతమ్.

ఇచట "పలుకుచునే" ఇత్యాది వాక్యము వాక్యాంతరమందుం జొచ్చుటచేత చమత్కారాతిశయమును పోషించుచున్నది.

౫౯. పతత్ప్రకర్షతయు అశ్లే.

అశ్లే అనఁగా ఒక్కొక్కచోట గుణము.

ఉదా.—

'చఞ్చద్భుజభ్రమితచణ్డగదాభిఘాత
సంచూర్ణితోరుయుగళస్య సుయోధనస్య
స్త్యానావనద్ధఘనశోణిత శోణపాణి
రుత్తంసయిష్యతి కచాం స్తవ దేవి భీమః'

'కుడిచేయు మన్న బాహువుచేత' ఇత్యాది (3౪౧)

ఇచట నాలవపాదమున సుకుమారార్థతచేత శబ్దాడంబరత్యాగము గుణము.

౫౬. అనుభావ విభావములచేత రచన యెచట తగదో అచ్చట ఒక్కెడ స్వశబ్దముచేత వ్యభిచారిని చెప్పుట దోషము గాదు.

ఎచట అనుభావ విభావ ముఖముగా ప్రతిపాదించినచో విశదప్రతీతి కాదో మఱియు నెచ్చట విభావానుభావ కృత పరిపుష్టి లేమియే అనుగుణమో, అచ్చట వ్యభిచారిని తన శబ్దముచేత చెప్పుట దోషముగాదు.

ఉదా.—

† మ. 'త్వర యౌత్సుక్యజ త్రోయఁగా, సహజ యీడ్వన్ లజ్జ వే వెన్కకున్
సరసోక్తంబుల చెండి బంధులలనల్ సాముఖ్యముం గొల్పఁగా
వరు మ్రోలం గని సాధ్వసంబు నగురుం బ్రాపించి, తొల్కూటమిన్
సరసం జేర హరుండు నవ్వి మెయిఁగొన్ శర్వాణి మిమ్మోముతన్.'

ఇచట ఔత్సుక్యమునకు త్వరారూపానుభావముచేత ప్రతిపాదించుటయందు శీఘ్రప్రతీతి కలుగదు; (ఏలన) త్వర భయాదులచేత నైనను సంభవించును గావున; హ్రియనెడి యనుభావమునకును వ్యావర్తనము కోపాదిచేతనుం గలుగును గావునను; సాధ్వస హాసములకును విభావాది పరిపోషము ప్రకృతరస ప్రతికూలప్రాయ మగుటంబట్టియు, నని వీనికి స్వశబ్దముచేత చెప్పుటయే న్యాయ్యము.

† ఔత్సుక్యేన కృతత్వరా, సహభువా వ్యావర్త్యమానా హ్రియా,
తైస్తై ర్బన్ధువధూజనస్య వచనై ర్నీతాభిముఖ్యం పునః,
దృష్ట్వాగ్రే వర మాత్తసాధ్వసరసా గౌరీ నవే సఙ్గమే
సంరోహత్పులకా హరేణ హసతా శ్లిష్టా శివా యాస్తు వః.

౬౦౦. విరుద్ధమయిన సంచార్యాదిని బాధ్యముగా వచించుట గుణము.

ఉదా.—

'అకార్య మెక్కడ, చంద్రుని వంశ మెక్కడ' ఇత్యాది (౭౪౯)

ఇచట ప్రశమాంగములయిన వితర్క మతి శంకా ధృతులకు అభిలాషాంగములయిన ఔత్సుక్య స్మృతి దైన్య చింతలచేత తిరస్కారము పర్యంతమున చింతాప్రధానమయిన యాస్వాదప్రకర్షమునే ఆవిర్భవింపఁజేయును.

౬౦౧. విరుద్ధ (రస)మును స్మరించుటయందుఁ గాని, సామ్యముతో వచించుటయందుఁ గాని, రెండు మూఁడు రసములు అంగియందు అంగభావము బొందినప్పుడును విరోధ ముండదు

వరుసగా ఉదా.—

'ఇది మొలనూలిని తివిచి' ఇత్యాది (౭౬౬)

ఇచట ఆలంబనము విచ్ఛిన్నమైనందున రతి రసాత్మతం బొందనందున స్మర్యమాణములైన తదంగములు శోకోద్దీపకములగుటంబట్టి కరుణానుకూలములైనవి.

* 'సరాగయు సుస్రితఘనఘర్మతోయయు కరాహతిధ్వనితపృథూరుపీఠయు మాటిమాటికిని దళనవిలంఘితోష్ఠయు నగు రుపచేత ప్రియతమచేతనుం బోలె రాజులు పొందఁబడిరి.'

ఇచట సంభోగశృంగారము వర్ణనీయముపీరవ్యభిచారియగు క్రోధమునకు అనుభావసామ్యముచేత వివక్షితమైనది.

§ 'ఒకటి ధ్యాననిమీలనముచేత ముకుళితప్రాయంబును, రెండవది పార్వతీ వదనారవిందస్తనభర సంభోగ భావముచేత నలసంబును, ఇతరము దవ్వున విల్లు తెగఁగొన్న మదనునిమీఁద కోపాగ్నిదీపితంబును, ఐన శంభుని సమాధిసమయంపు నేత్రత్రయము భిన్నరసము మిమ్ము కాచునుగాక.'

---

* సరాగయా స్రుతఘనఘర్మతోయయా కరాహతిధ్వనితపృథూరు పీఠయా
ముహుర్ముహుర్దశనవిలఙ్ఘితోష్ఠయా రుషా నృపాః ప్రియతమయేవ భేజిరే.

§ ఏకం ధ్యాననిమీలనా న్ముకుళితప్రాయం, ద్వితీయం పునః
పార్వత్యా వదనాంబుజ స్తనభరే సమ్భోగభావాలసమ్,
అన్య ద్దూరవికృష్టచాప మదన క్రోధాన లోద్దీపితం,
శమ్భో ర్భిన్నరసం సమాధిసమయే నేత్రత్రయం పాతు వః.

ఇచట శాంతశృంగారరౌద్రములచే పరిపుష్టమయిన భగవద్విషయకరతి.

మఱియొక యుదా.—

* 'అశ్రువులు గూరిన కనుఁగలువలతోడి త్రిపురయువతులచేత ఏది అప్పుడే తప్పొనర్చిన కామియుంబోలె చేయంట్రియు విదిర్చికొనఁబడెనో, వసనాంతమును క్రైకొనంబోయియు బలిమిమెయిం గొట్టఁబడినదో, శిరోరుహములందు గ్రహించుచుఁ దొలఁగఁద్రోయఁబడెనో, తొట్రుపాటున పదములందు వ్రాలుచు చూడఁబడలేదో, కౌఁగిలించుచు నెట్టివైవఁబడెనో ఆ శాంభవశరానలము మీ పాపములను ఏర్చునుగావుత.'

ఇచట కవిగతమైన భగవద్విషయకరతి ప్రధానము; తత్పరిపోషకముగా భగవంతుని త్రిపురధ్వంసమునుగూర్చిన యుత్సాహమునకు అపరిపుష్టమగుటంబట్టి రసపదవిం బొందక భావమాత్రముగా నున్నట్టిదానికి కరుణము అంగము, దానికిని సామ్యబలంబున వచ్చిన శృంగారము (అంగము). ఈ విధముగా కరుణము విశ్రాంతిధామ కానందున అంగత్వమే యగుటంబట్టి కరుణశృంగారములకు రెంటికిని భగవదుత్సాహపరిపుష్ట తద్విషయరతిభావాస్వాదప్రకర్షకతచేత యాగపద్యంబున సద్భావమునొందుటవలన అంగత్వమున విరోధము లేదు. "ఓయి సమూహాలంబనాత్మక పూర్ణఘనానందరూపమయిన రసమునకు అటువంటి యితరరసముతో విరోధము ఊహింపఁదగినదిగాదు, ఏలన, ఏకవాక్యనివేశ ప్రసురాభవ యాగపద్య విరహంబుచేత వానికి పరస్పరోపమర్దము లేనందున; మఱి, యంగాంగిభావమును లేదు, ఏలన, రెండును పూర్ణతతో స్వతంత్రములుగా విశ్రాంతినొందియున్నందున." సత్యమే చెప్పితివి. కావుననే యిట ప్రధానేతరములైన రసములయందు స్వాతంత్ర్యవిశ్రమరహితవలనను పూర్ణరసభావమాత్రమువలనను విలక్షణతచేత సంచారిరస మనుపేర వ్యవహారము పూర్వులు కావించిరి. అస్మత్పితామహానుజ కవిపండితముఖ్య శ్రీచండీదాసపాములవారు ఖండరసనామమున వ్యవహారముం గావించినారు. వారు ఏమి చెప్పినా రనఁగా—

---

* క్షిప్తో హస్తావలగ్నః, ప్రసభ మభిహతోఽప్యాదదానోంఽశుకాన్తం,
గృహ్ణన్ కేశే ష్వపాస్త, శ్చరణనిపతితో నేక్షితః సమ్భ్రమేణ,
ఆలిఙ్గ న్యోఽవధూత స్త్రిపురయువతిభిః సాస్రనేత్రోత్పలాభిః,
కామీ వార్ద్రాపరాధః స దహతు దురితం శామ్భవో వః శరాగ్నిః.

"అంగి (రసము) రసాంతరమందు అంగమేని బాధ్యమేని సంసర్గయోని అగునెడల అది సమగ్రముగా ఆస్వాదింపఁబడదు; అందువలన ఖండరసమని చెప్పఁబడును." అని

ఓయి— "శృంగారమునకు కరుణ బీభత్స రౌద్ర వీర భయానకములు విరోధులు" (౨౮౩) అని చెప్పినతీరున విరోధులగు వీరశృంగారములకు ఒక్కెడ

* 'కరికలభదంతకాంతిని చోరించిన కపోలమున స్మరస్మేరస్ఫారోదగ్రపులకములం దాల్చిన జానకీవదనమును మాటికిని కాంచుచును రజనిచర సేనా కోలాహలమును వినుచును రఘునాయకుఁడు జటాజూటంపుముడిని బిగించుచున్నాఁడు.'

ఇత్యాదులయందు సమావేశము ఎట్లు? అందులకు ఇదె యుత్తరము.— ఇట రసములయొక్క విరోధిభావమునకును అవిరోధిభావమునకును వ్యవస్థ మూఁడు విధములు; ఒకరెంటికి ఆలంబనైక్యముచేత, ఒకరెంటికి ఆశ్రయైక్యముచేత, ఒకరెంటికి నైరంతర్యమున. అందు వీరశృంగారములకు ఆలంబనైక్యముచేత విరోధము, అట్లే హాస్య రౌద్ర బీభత్సములతో సంభోగమునకును వీరకరుణరౌద్రాదులతో విప్రలంభమునకును; ఆలంబనైక్యముచేతను ఆశ్రయైక్యముచేతను వీరభయానకములకు, నైరంతర్య విభావైక్యములచేతను శాంతశృంగారములకు. మూఁడు విధములను అవిరోధము, వీరమునకు అద్భుతరౌద్రములతోను, శృంగారమునకు అద్భుతముతోను, భయానకమునకు బీభత్సముతోను. అందుచేత నిట వీరశృంగారములకు భిన్నాలంబనత్వమువలన అవిరోధము.

ఇట్లుగా వీరమును నాయకనిష్ఠముగాను భయానకమును ప్రతినాయకనిష్ఠముగాను నిబంధించునెడల భిన్నాశ్రయత్వముకతంబున విరోధము లేదు. నాగానందంబున ప్రశమాశ్రయునికి జీమూతవాహనునికి మలయవతిఁగూర్చిన యనురాగమును చెప్పుట యేది కలదో అచ్చట "అహో గీతము, అహో వాదిత్రము" అని అద్భుతమును నడునడుమ నుంచుటచేత శాంతశృంగారములకు విరోధము లేకపోయినది. ఇట్లే కడమతావుల నెఱుంగవలయును. "సఖీ, పాలిన కృశించిన నీముఖము' ఇత్యాది (౨౧౮) యందు పాండుతాదుల యంగభావము కరుణవిప్రలంభమందు నైతమని విరోధము లేదు.

---

* కపోలే జానక్యాః కరికలభ దన్త ద్యుతి ముషి
స్మరస్మేర స్ఫారోడ్డమర పులకం వక్త్రకమలం
ముహుః పశ్యఞ్ఛృణ్వ న్రజనిచరసేనా కలకలం
జటాజూటగ్రన్థిం ద్రఢయతి రఘూణాం పరిబృఢః.

౬౦౨. అనుకరణమందు దోషములకెల్ల దోషత్వము లేనే లేదు.

ఎల్లన — దుఃశ్రవత్వప్రభృతులకు. అట్లే.

'ఇదె దుశ్చ్యవనుని నమస్కరించుచున్నాను అని యొకఁడు ప్రేలుచున్నాఁడు.'
ఇట దుశ్చ్యవనశబ్దము అప్రయుక్తము.

౬౦౩. ఇట్లే ఇతరదోషములకుం గూడ బుద్ధిమంతులు ఔచిత్యముం బట్టి అదోషతను, గుణతను, అనుభయాత్మతను ఎఱుంగవలయును.

అనుభయాత్మత యనఁగా అదోషగుణాత్మత.



# సాహిత్యదర్పణము.

## అష్టమపరిచ్ఛేదము.

గుణములను జెప్పుచున్నాఁడు —

౬౦౪. అంగిత్వము పొందినట్టి రసముయొక్క ధర్మములు శౌర్యాదులవలె గుణములు.

ఎట్లుగా అంగిత్వ మొందిన యాత్మకు ఉత్కర్షహేతువు లగుటంబట్టి శౌర్యాదులు గుణశబ్దవాచ్యములో అట్లే కావ్యమందు అంగిత్వము పొందియున్న రసమునకు ధర్మములు అనఁగా మాధుర్యాదులు స్వరూపవిశేషములును గుణశబ్దవాచ్యములును. రసవ్యంజకమయిన వాక్యమునకు కావ్యవ్యవహారమునకు ఉపయోగించునట్టి యానుకూల్యము గలవి అని యర్థము. ఇవి రసమాత్రముయొక్క ధర్మము లని ఇంతకుముందే చూపఁబడియున్నది.

౬౦౫. మాధుర్యము ఓజస్సు ప్రసాదము నని గుణములు మూఁడు.

అందు.—

౬౦౬. చిత్తద్రవీభావమయమైన హ్లాదము మాధుర్య మనఁబడును.

ఒకానొకఁడు "మాధుర్యము ద్రుతికారణము" అని వచించినాఁడు, అది సరిగాదు; ఏలన ద్రవీభావము ఆస్వాదస్వరూపమయిన యాహ్లాదముకంటె వేఱుగానందున ద్రవీభావంబనఁగా—స్వాభావికంబును అనావిష్టస్వరూపంబును నగు కాఠిన్యముయొక్కయు, శోకక్రోధాదిజనితమగు దీప్తత్వంబుయొక్కయు విస్మయహాసాదులవలనం గలిగిన విక్షేపముయొక్కయు పరిత్యాగముచేత రత్యాద్యాకారముతోఁ గూడుకొన్న యానందము లేచుటచేతను సహృదయుల చిత్తము తడిసినట్లుగానగుట.

అందు.—

౬౦౭. సంభోగమందును కరుణమందును విప్రలంభమందును శాంతమందును క్రమముగా అధికమైయున్నది.

సంభోగాదిశబ్దములు ఉపలక్షణములు, అందువలన సంభోగాభాసాదులయందు సయితము దీనికి యునికి నెఱుంగవలయును.

౬౦౮. టఠడఢలుగాక శిరమున వర్గాంత్యముంబొరసిన వర్ణంబులును లఘువులయిన రణలును దానిని (మాధుర్యమును) తోఁపించుటయందు కారణములైయున్నవి. అవృత్తియేని యల్పవృత్తియేని యగు రచన మధుర యనఁబడును.

ఉదా.—

'అనఙ్గమఙ్గళభువ స్తదపాఙ్గస్య భఙ్గయః
జనయన్తి ముహు ర్యూనా మన్త స్సన్తాపసన్తతిమ్.'

[అనంగ మంగళభూములగు నాయింతి యపాంగభంగులు తరుణులకు సారెకును అంతస్సంతాపసంతతిని కావించుచున్నవి.]

మదీయ మిదియేని యుదా.—

'లతాకుఞ్జం గుఞ్జన్మదవదళిపుఞ్జం చపలయన్,
సమాలిఙ్గ న్నఙ్గం ద్రుతతర మనఙ్గం ప్రబలయన్,
మరు న్మన్దం మన్దం దళిత మరవిన్దం తరలయన్,
రజోబృన్దం విన్ద న్కిరతి మకరన్దం దిశి దిశి.'

[ఝుంఝుమ్మని యులియుచు మదమెక్కిన తేఁటిపిండులతోడి పొదరింటిని కదలించుచు, ఒడలింగవుంగిలించి కడు సరగున ననంగుని బలియించుచు, వికసితమైన యరవిందమును మందమందముగా నూఁపుచు పరాగబృందము నొందుచు, వాయువు దెసదెసను మకరందమును చల్లుచున్నది.]

౬౦౯. ఓజస్సని చిత్తముయొక్క విస్తారరూపమయిన దీప్తత్వము చెప్పఁబడును. వీర బీభత్స రౌద్రములయందు క్రమముగా ఓజస్సునకు ఆధిక్యము.

ఇటను వీరాది శబ్దములు ఉపలక్షణములు, అందువలన వీరాభాసాదియందుఁ గూడ నిది యుండును.

౬౧౦. వర్గమున ఆద్యతృతీయములతోఁ గూడుకొన్నట్టి ద్వితీయచతుర్థవర్ణములు మీఁదఁగాని క్రిందఁగాని రేఫగలవి, టఠడఢలతోఁగూడ ఢఙ్ఝున

నను వ్యంజకములు. అట్లే సమాసము బహుళము, ఘటన ఔద్ధత్య శాలి.

ఉదా — 'చఞ్చద్భుజ' ఇత్యాది (౫౮౯)

౬౧౧ ఏది ఎండుకట్టియలో నిప్పువోలె వడిగా చిత్తములో వ్యాపించునో అది ప్రసాదము ఎల్లరచనలయందు (నుండును).

వ్యాపించు ననఁగా ఆవిష్కరించు ననుట.

౬౧౨. తద్వ్యంజకములగు శబ్దములు శ్రవణమాత్రముననే అర్థబోధకములు.

ఉదా.—

'సూచీముఖేన సకృదేవ కృతవ్రణ స్త్వం ముక్తాకలాప, లుఠసి స్తనయోః ప్రియాయాః
బాణైః స్మరస్య శతశో వినికృత్తమర్మా స్వప్నేఽపి తాం కథ మహం న విలోకయామి.'

'ఓముత్యాలహారమా, సూదిమొనచే నొకమాఱే గాయపడిన నీవు ప్రియ స్తనములమీఁద దొరలుచున్నావు; స్మరుని బాణములచేత నూఱులమారులు నామర్మములు నఱుకఁబడియున్నవి; నేను ఆయింతిని స్వప్నమందయినను చూడనేమి?'

౬౧౩. పెద్దలు వీనిని శబ్దగుణములని వచించుట గౌణవృత్తిచేత.

'శరీరమునకు శౌర్యాదిగుణయోగము వోలె' అని శేషము.

౬౧౪. మఱి శ్లేషము సమాధి ఔదార్యము ప్రసాదము నని పూర్వులు చెప్పిన గుణము లేవి కలవో అవి ఓజస్సున అంతర్భవించును.

ఓజస్సన అనఁగా గౌణముగా శబ్దవాచ్యమయిన శబ్దార్థధర్మవిశేషమందు. అందు శ్లేషమునకు పెక్కుపదములు ఒక్కపదమువలె భాసించుట స్వరూపము.

ఉదా.—

'ఉన్మజ్జ జ్జలకుఞ్జరేన్ద్ర రభస సాస్ఫాలానుబన్ధోద్ధతః
సర్వాః పర్వతకన్దరోదరభువః కుర్వ న్ప్రతిధ్వానినీః
ఉచ్చై రుచ్చరతి ధ్వనిః శ్రుతిపథోన్మాథీ యథాయం తథా
ప్రాయః ప్రేఙ్ఖదసంఖ్యశఙ్ఖధవళా వేలేయ మాగచ్ఛతి.'

[జలకరు లూర్మిపై కెగసి చయ్యన మున్గ గభీగభీ ల్రొదల్
దలపడఁ గందరాస్యఘటిత ప్రతిఘోష లతిస్ఫుటంబులై
మలఁగఁ జెవు ల్చెవుడ్పడఁ గ్రమంబుగ రేఁగెను నీరొదల్ గనన్
లలవితిసంఖ్య శంఖధవళం బదె పో టుపదెంచెఁబో వడిన్.]

ఇది బంధవికటత్వాత్మకం బగుటవలన ఓజస్సే.

సమాధి యన నారోహావరోహక్రమము; ఆరోహము ఉత్కర్ష, అవరోహము అపకర్ష, వాని క్రమము వైరస్యమును ఆవహింపని రచన. ఉదా.— 'చఞ్చద్భుజ'ఇత్యాది (౧౮౯). ఇందు పాదత్రయమున క్రమముగా బంధము గాఢమంయినది. నాలవపాదమునందో అపకర్షము. దానికిని తీవ్రప్రయత్నోచ్చార్యతచేత ఓజస్విత. ఉదారతకు వికటత్వము లక్షణము, వికటత్వమనఁగా పదములు నర్తించునట్లుండుట. ఉదా.—

'సుచరణవినివిష్టై ర్నూపురై ర్నర్తకీనామ్ ఝణితి రణితమాసీ త్తత్ర చిత్రం కలం చ.'

[అచట అందంపుటడుగులయందు నెలకొన్న నర్తకీ నూపురములు ఝణ్ అని చిత్రమును అవ్యక్తమధురంబు నగు రణితమును గావించినవి.]

ఇచ్చటను, వారి మతముప్రకారము రసానుసంధానము లేకయే శబ్దప్రౌఢోక్తిమాత్రముచేత ఓజస్సు. ప్రసాదమునకు ఓజోమిశ్రితమయిన శైథిల్యము స్వరూపము.

ఉదా.— (౩౬౫)

"యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుబలః పాణ్డవీనాం చమూనామ్
యో యః పాఞ్చాలగోత్రే శిశు రధికవయా గర్భశయ్యాం గతో వా
యో య స్తత్కర్మసాక్షీ చరతి మయి రణే య శ్చ య శ్చ ప్రతీపః,
క్రోధాన్ధ స్తస్య తస్య స్వయ మిహ జగతా మన్తక స్యాన్త కోహమ్."

౬౧౫. మాధుర్యవ్యంజకత్వ మేది అసమాసమునకు చూపఁబడినదో దాని చేతనే పృథక్పదత్వము మాధుర్య మని యంగీకృతమైనది.

ఉదా.— (౧౪౭)

"శ్వాసా న్ముఞ్చతి భూతలే విలుఠతి త్వన్మార్గ మాలోకతే
దీర్ఘం రోదితి విక్షిప త్యత ఇతః క్షామాం భుజావల్లరీమ్
కిఞ్చ ప్రాణసమాన కాఙ్క్షితవతీ స్వప్నేపి తే సఙ్గమం
నిద్రాం వాఞ్ఛతి న ప్రయచ్ఛతి పున ర్దగ్ధో విధి స్తా మపి."

౬౧౬. అర్థవ్యక్తి ప్రసాదాఖ్యగుణముచేతనే పరిగృహీతము, పదములు ఝడితిగా అర్థమును సమర్పించుట యర్థవ్యక్తి

ఉదా.— స్పష్టము.

౬౧౭. గ్రామ్యత్వ దుశ్శ్రవత్వ త్యాగముచేత వరుసగా కాంతియు సుకుమారతయు నంగీకృతములు.

కాంతి యన నౌజ్జ్వల్యము. అది హాలికాదుల పదముల విన్యాసమున విపరీతముగా లౌకికశోభాశాలిత్వము. సుకుమారత అపారుష్యము. వీని కుదాహరణములు స్పష్టములు.

౬౧౮. మార్గాభేదస్వరూపిణియైన సమత ఒక్కొకచో దోషము కానిచో ఉక్తగుణములలో దీనికి యథాయథముగా అంతర్నిపాతము.

మసృణమార్గమునఁ గాని వికటమార్గమునఁ గాని ఉపక్రాంతమయిన సందర్భమునకు దానిచేతనే పరినిష్ఠానము మార్గాభేదము. అది కొన్ని చోట్ల దోషము అట్లెగదా.-

'అవ్యూఢాఙ్గ మనూఢపాణిజరాభోగం చ బిభ్రద్వపుః
పారీన్ద్రః శిశు రేష పాణిపుటకే సమ్మాతు, కిం తావతా?
ఉద్యద్దుర్ధర గన్ధ సిన్ధుర శత ప్రోద్దామ దానార్ణవ
స్రోతః శోషణరోషణా త్వన రితః కల్పాగ్ని రల్పాయతే.'

[ఈసింహశిశువుదేహమునకు ఇంకను అవయవములు పుష్టిం జెందలేదు, పాణులును కడుపును వికసిం జెందలేదు, అట్టిది యిది పిడికిట నిమిడినమాత్రాన నేమి? దుర్ధరగంధ మయిన సింధురశతమునుండి వెడలుచున్న ప్రోద్దామమయిన దానసముద్రమును ఇగురఁ గొట్టెడి దీని రోషముముందఱ కల్పాగ్ని అల్పముగు చున్నది.]

ఇచట (ఉత్తరార్థమందు) ఉద్ధతార్థము వాచ్యమంయియున్నందున సుకుమారబంధత్యాగము గుణమే, ఇట్టిదికాని స్థలమందు మాధుర్యాదులయందే అంతఃపాతము.

ఉదా.— 'లతాకుఞ్జంగుఞ్జత్' (౬౦౮)

౬౧౯. ఓజస్సు ప్రసాదము మాధుర్యము సౌకుమార్యము ఉదారతయు వాని లేమి దోష మగుటంబట్టి యర్థగతగుణములుగా గ్రహింపఁబడినవి.

ఓజస్సు సాభిప్రాయత్వము, ప్రసాదము అర్థవైమల్యము; మాధుర్యము ఉక్తివైచిత్ర్యము, సౌకుమార్యము అపారుష్యము; ఉదారత అగ్రామ్యత్వము; ఈయర్థగుణములు అయిదింటికి వరుసగా అపుష్టార్థ కాధికపద దానవీకృతామంగళరూపాశ్లీల గ్రామ్యముల నిరాకరణముచేతనే అంగీకారము. ఉదాహరణములు స్పష్టములు.

౬౨౦. స్వభావోక్త్యలంకారముచేత అర్థవ్యక్తియు; అట్లే రసధ్వనిచేతను గుణీభూతవ్యంగ్యములచేతను కాంతియు (అంగీకృతములు).

అర్థవ్యక్తి యనఁగా వస్తుస్వభావస్ఫుటత్వము; కాంతి యనఁగా దీప్తరసత్వము. ఉదా

హారణములు స్పష్టములు.

౬౨౧. వైచిత్ర్యమాత్రమగు శ్లేష అదోషము, సమత దోషాభావమే.

శ్లేష యనఁగా క్రమ కౌటిల్యానుల్బణత్వోపపత్తి యోగ రూప ఘటనాత్మకము. అందు క్రమము క్రియాసంతతి, కౌటిల్యము విదగ్ధచేష్టితము, అనుల్బణత్వము అప్రసిద్ధ వర్ణనావిరహము, ఉపపాదక యుక్తి విన్యాసము ఉపపత్తి, వీని యోగము అనఁగా సమ్మేళనము, అది ఏఘటనకు రూపమో అదే రూపముగాఁ గలదైన శ్లేష వైచిత్ర్యమాత్రము, అనన్యసాధారణ రసోపకారిత్వాతిశయము లేమిం జేసి యని భావము.

ఉదా.— 'ధూర్తుఁడు ఏకాసనమందు' ఇత్యాది (౧౦౭).

ఇచట— దర్శనాదులు క్రియలు, ఉభయసమర్థనరూపము కౌటిల్యము, లోకసంవ్యవహారరూపము అనుల్బణత, 'ఏకాసనమందుఁ గూర్చున్న' 'వెనుకవైపున వచ్చి' 'కన్నులు మూసినవాఁడై' 'మెడను కొంచెము వక్రీకరించుకొనియు' అనునవి యుపపాదకములు; వీనికి యోగము.

ఇందువలన వాచ్యోపపత్తిగ్రహణవ్యగ్రతచేత రసాస్వాదము వ్యవహితప్రాయము, అని దీనికి అగుణత. సమతయు ప్రక్రాంతప్రకృతిప్రత్యయముల యవిపర్యాసముచేత అర్థమునకు విసంవాదిత లేమి; అది ప్రక్రమభంగరూపదోషము లేమియే. స్పష్ట ముదాహరణము.

౬౨౨. సమాధికి గుణత్వము లేదు.

సమాధి యన అయోన్యన్యచ్ఛాయాయోని రూప ద్వివిధార్థదృష్టి రూపము. అందు అయోని యగు నర్థమునకు

ఉదా.—

'అప్పుడే గోటిగిన మత్తహాథుని గడ్డముతో స్పర్ధించు నారంగఫలము.'

అన్యచ్ఛాయాయోనికి

ఉదా.—

'తన కన్నుల ప్రతిబింబములచేత నీటిలో పలుమాఱు వంచింపఁబడినదై పువ్వులావి నీలోత్పలమందును కేలుంచుటకు సందేహించుచున్నది'

ఇచట నీలోత్పలములకును నయనములకు అతిప్రసిద్ధమైన సాదృశ్యము. విచ్ఛిత్తిని శేష

ముతో నిబంధింపఁబడినది. ఇదియు అసాధారణ శోభ నొసంగనందున అగుణమే; మఱి యేమన కావ్యశరీరమాత్ర నిర్వర్తకము.

కొన్నిచోట్ల 'చంద్రుని' అను నేకపదార్థమును చెప్పవలసివచ్చినప్పుడు 'అత్రియొక్క కంటియందు సముద్భూతమైన జ్యోతి' అని వాక్యముచే చెప్పుట; కొన్నిచోట్ల 'నిదాఘశీతలములును హిమకాలోష్ణములును సుకుమారములును అగు శరీరావయవములు గల స్త్రీ' అని వాక్యార్థమును చెప్పవలసినప్పుడు 'వరవర్ణిని' అని పదంబునం జెప్పుట; కొన్ని చోట్ల వాక్యార్థమునకు ఏదే నొకింత విశేషమును చేర్చి పెక్కు వాక్యములచేత చెప్పుట యనెడి వ్యాసము; కొన్నిట బహువాక్యప్రతిపాద్యమును ఏక వాక్యమునం జెప్పుట యనెడి సమాసమును; అను నేవమాదికము గా ఇతరులచే (జెప్పఁబడినట్టివానికి గుణత్వము తగదు. నుతేమన వైచిత్ర్యమాత్రావహత్వము.

౬౨3. అందువలన అర్థగుణములు వేఱుగావు.

అందువలన ననఁగా ఉక్తప్రకారమున అర్థగుణములు ఓజఃప్రభృతులు చెప్పఁబడినవి.



# సాహిత్యదర్పణము.

## నవమపరిచ్ఛేదము.

ఇఁక క్రమప్రాప్తమయిన యలంకారనిరూపణము బహువక్తవ్యతాకారణమున నుల్లంఘించి రీతిని చెప్పుచున్నాఁడు.

౬౨౪. అవయవసన్నివేశవిశేషమువంటిది పదసంఘటన రీతి యనఁబడును. అది రసాదులకు ఉపకర్త్రి.

రసాదులకు అనఁగా శబ్దార్థశరీరమగు కావ్యమునకు ఆత్మభూతములకు.

౬౨౫. అది వైదర్భి, గౌడి, పాంచాలి, లాటియు నని నాల్గువిధములు.

అది అనఁగా రీతి. అందు.—

౬౨౬. మాధుర్యవ్యంజకములయిన వర్ణములచే రచన లలిత (౬౦౬) మయినట్టిది అవృత్తియేనియు అల్పవృత్తియేనియు వైదర్భియనుపేరి రీతి.

ఉదా.— (౬౦౮) "అనఙ్గమఙ్గళభువః" ఇత్యాది.

రుద్రటుఁడో ఇట్లు చెప్పుచున్నాఁడు:—

'సమాసమే లేనిదియేని ఇంచుక కలిగినదియేని యై, పదిగుణములతోను గూడుకొన్నట్టిది వైదర్భి, వర్గద్వితీయబహుళ, స్వల్పప్రాణాక్షరగా చేయఁదగినది.'

ఇచట పదిగుణములు అతనిమతమందు చెప్పఁబడిన శ్లేషాదులు.

౬౨౭. ఓజఃప్రకాశకములైన వర్ణములతో ఉద్ధతమయిన బంధము సమాసబహుళము గౌడి.

ఉదా.— 'చఞ్చద్భుజ' ఇత్యాది (౫౯౮).

పురుషోత్తముఁడో ఇట్లు చెప్పుచున్నాఁడు:—

౬౩౦. ఒక్కొక్కచోట వక్త్రాద్యౌచిత్యవశంబున రచనాదులు అన్యవిధము లగును.

వక్త్రాది—అనుపదముచే వాచ్యప్రబంధములును రచనాది—యనుటచేత వృత్తివర్ణంబులును. అందు వక్త్రౌచిత్యాదికి ఉదా.—

'మన్థా యస్తార్ణవాంభః ప్లుత కుహర చల న్మందర ధ్వాన ధీరః
కోణాఘాతేషు గర్జ త్ప్రళయ ఘనఘ టాన్యోన్య సంఘట్ట చణ్డః
కృష్ణా క్రోధాగ్రదూతః కురుకుల నిధ నోత్పాత నిర్ఘాతవాతః
కే నాస్మ త్సింహనాద ప్రతిరసిత సఖో దున్దుభి స్తాడ్యతేఽయమ్.'

['మథనముచే ఇటునటుం ద్రోయఁబడిన సముద్రంపుజలముచే దాఁటఁబడిన గుహాలతో చలించుచున్న మందరపర్వతముయొక్క ధ్వనివలె ధీరంబును, కొడుపుతో గొట్టినప్పు డెల్ల గర్జించుచున్న ప్రళయకాలపు వర్షకాభ్రముల యన్యోన్య సంఘట్టమువలె ఘోరంబును ద్రౌపదీక్రోధంబునకు అగ్రదూతయు కురుశతమరణోత్పాత నిర్ఘాతవాతంబును మాసింహనాదంపుఁబ్రతిధ్వనికి సఖుఁడుంగా నీదుందుభి ఎవనిచేత తాడింపఁబడుచున్నది?']

ఇచ్చట వాచ్యమునకు క్రోధాద్యభివ్యంజకత్వము లేకున్నను భీమసేనుఁడు వక్తయగుటవలన రచనాదులు ఉద్ధతములయినవి.

ఉదాహృతమయిన 'మూర్ధవ్యాధూయమాన' (౫౭౯) ఇత్యాదియందు వాచ్యౌచిత్యమువలన రచనాదులు ఉద్ధతమయినవి. ప్రబంధౌచిత్యమువలన నాటకాదులయందు రౌద్రము దైనను అభినయప్రతికూలమగుటవలన దీర్ఘసమాసాదులు కావింపమి. ఇట్లు ఆఖ్యాయికయందు శృంగారమందైనను మసృణవర్ణాదులు లేవి. కథయందు రౌద్రమందయినను (రచనాదులు) అత్యంతోద్ధతములు గావు. ఇట్లు ఇతరమును కూడ ఎఱుంగునది.

# సాహిత్యదర్పణము.

## దశమ పరిచ్ఛేదము.

ఇఁకను అవసరప్రాప్తములయిన యలంకారములను చెప్పుచున్నాఁడు.—

౬౩౧. శబ్దార్థముల యస్థిరధర్మము లేవో శోభను పెంచునవి రసాదులకు ఉపకారకములు అవి అంగదాదులవలె అలంకారములు.

ఎట్లు అంగదాదులు శరీరశోభను పెంచునవై శరీరికి ఉపకారకములో అట్లు అనుప్రాసోపమాదులు శబ్దార్థశోభను పెంచునవి రసాదికి ఉపకారకములు. అలంకారములు అస్థిరములు అనఁగా గుణముల యునికివలె వీనియునికి ఆవశ్యకముగాదు. శబ్దార్థములలో ముందుగా శబ్దము బుద్ధివిషయ మగుటంబట్టి శబ్దాలంకారములను చెప్పవలసియుండఁగా శబ్దార్థాలంకారమయిన పునరుక్తవదాభాసమునకు పూర్వులు శబ్దాలంకారముల నడుమ లక్షణము గావించినందున ముందుగా దానినే చెప్పుచున్నాఁడు.

౬౩౨. తొలుత ఏట అర్థముయొక్క పౌనరుక్త్యముగా భాసించునో భిన్నరూపములగు శబ్దముల నాశ్రయించినట్టిది అది పునరుక్తవదాభాసము.

ఉదా.—

'భుజఙ్గకుణ్డలీ వ్యక్తశశిశుభ్రాంశుశీతగుః
జగన్త్యపి సదాపాయాదవ్యాచ్చేతోహరః శివః.'

[సర్పముచేత కుండలముగలవాఁడు (నాగకుండలుఁడు, భుజఙ్గ=సర్ప) కర్పూరమువలె తెల్లని కిరణములుగల చంద్రుఁడు (శిరమునఁ) గలవాఁడు (శశీ=కర్పూరము, శీతగుః=చంద్రుఁడు), చేతోహరుఁడు అగు శివుఁడు లోకములను ఎల్లప్పుడు అపాయమునుండి (అవ్యాత్=) కాచును గాక.]

ఇచట భుజంగ కుండల్యాది శబ్దములకు తొలుత సర్పాద్యర్థము తోఁచుటం బట్టి పౌనరుక్త్యము ప్రతిభాసించుచున్నది. పర్యవసానంబున 'భుజంగరూపమయిన కుండలము ఎవనికి కలదో అతఁడు' అను నిత్యాద్యర్థము వేఱు. 'పాయా దవ్యాత్' మనెడ ఈయలంకారము క్రియాగతము, ఎట్లన 'పాయాత్' అనుదానం బర్యవసానమగుటవలన; 'భుజఙ్గకుణ్డలీ' అను శబ్దములందు తొలిదే మార్పును సహించును; 'హరః శివః' అనుశబ్దంబులలో రెండవది మాత్రమే మార్పు నొప్పును; 'శశి శుభ్రాంశు' అనుచో రెండును మార్పును సహించును. 'భాతి స దాన త్యాగః' అనుదాన రెండును పరివృత్తిని సహింపవు, [సదా అనతిచేత (వంగమిచేత) అగము (కొండ) ప్రకాశించుచున్నది] అని శబ్దపరివర్తనమును సహించుటను సహింపమిని బట్టి దీనికి ఉభయాలంకారత్వము.

ఉ33. అనుప్రాస మనఁగా స్వరము వేఱయినను శబ్దము సమముగానుండుట.

స్వరమాత్రసాదృశ్యమునో వైచిత్ర్యములేమిచేత లెక్కసేయలేదు. రసాద్యనుగతత్వముచేత ప్రకర్షముగా న్యాసము అనుప్రాసము.

ఉ38. వ్యంజనసంఘమునకు ఇరుదెఱంగుల ఒక్కమాఱు సామ్యము ఛేకానుప్రాస మనఁబడును.

ఇరుదెఱంగుల ననఁగా స్వరూపముచేతను క్రమముచేతను. 'రసః' 'సరః' ఇత్యాదుల యందు క్రమము వేఱగుటవలన అందుఁగల సాదృశ్యము ఈ యలంకారమునకు విషయము గాదు. ఉదా.—మాతండ్రిగారి కవనము—.

'ఆదాయ వకుళగన్ధా నన్ధీకుర్వన్ పదే పదే భ్రమరాన్
అయ మేతి మన్దమన్దం కావేరీ వారి పావనః పవనః'

[వీఁడె కావేరీ వారిపావనుఁ డగు పవనుఁడు వకుళగంధములందెచ్చి అడుగడుగునను తుమ్మెదలను అంధీకరించుచు మెల్లమెల్లగా వచ్చుచున్నాఁడు.]

ఇచట గన్ధా నన్ధీ అనుచో సంయుక్తములకును కావేరీ వారి అనుచో అసంయుక్తములకును 'పావనః పవనః' అనుచో పెక్కు వ్యంజనములకును ఒక్కమాఱు ఆవృత్తి. ఛేకుఁ డనఁగా విదగ్ధుఁడు (జాణ), తత్ప్రయోజ్యము గావున ఛేకానుప్రాసము.

ఉ3౫. పెక్కింటికి ఒక్కతెఱంగున సామ్యమును, ఇరుదెఱంగుల పలుమాఱేనియు, ఒక్కటికి ఒక్కమాఱేనియు వృత్త్యనుప్రాస మనఁబడును.

ఒక్కతెఱంగున ననఁగా స్వరూపముచేత మాత్రమే, క్రమముచేతఁ గూడఁ గాదు. ఇరుదెఱఁగుల ననఁగా స్వరూపముచేతను క్రమముచేతను. ఒక్కమాఱేని అని పని శబ్దముచేత పలుమాఱు గూడ.— ఉదా.—

'ఉన్మీల న్మధుగన్ధ లుబ్ధ మధుప వ్యాధూత చూతాఙ్కుర
క్రీడ త్కోకిల కాకలీకలకలై రుద్గీర్ణ కర్ణజ్వరాః
నీయన్తే పథికైః కథఙ్కథమపి ధ్యానావధానక్షణ
ప్రాప్త ప్రాణసమా సమాగమ రసోల్లాసై రమీ వాసరాః.'

[గుబులుకొనుచున్న మకరందపు నెత్తావి వాసించిన తుమ్మెదలు కదలించిన మావియంకురములయందు క్రీడించుచున్న కోయిలలయొక్క మధురావ్యక్త నూత్న కోలాహల ధ్వనులచేత కర్ణములకు జ్వరముగొల్పుచున్న యీ దినములను పథికులు ధ్యానము నొసంగిన క్షణమునందే లభించిన ప్రాణసమలతోడి సమాగమరసోల్లాసములచేత ఎట్లో గడపుచున్నారు.]

ఇచట 'రసోల్లాసై రమీ' అనుచో రసలకు ఒకతెఱంగుననే సామ్యము, క్రమమున సామ్యము లేదు; రెండవపాదమున కలలకు పలుమాఱు క్రమము మాఱకయే; ప్రథమపాదమున ఒకమకారము ఒకమాఱు, ధకారమునకు పలుమాఱు; రసవిషయవ్యాపారముగలదైన వర్ణరచన వృత్తి, తదనుగతముగా ప్రకర్షముతోడి న్యసనంబునం జేసి వృత్త్యనుప్రాసము.

౬౩౬. వ్యంజనములకు మాత్రమే తాలురదాదికమయిన యేకస్థానమందే ఉచ్చరింపఁబడున వగుటంబట్టి కలిగెడు సాదృశ్యము శ్రుత్యనుప్రాస మనఁబడును.

ఉదా—

'దృశా దగ్ధం మనసిజం జీవయన్తి దృశైవ యాః
విరూపాక్షస్య జయినీ స్తాః స్తువే వామలోచనాః.'

[కంటిచేత దగ్ధుఁడయిన మదనుని కంటిచేతనే ఎవరు బ్రదికించుచున్నారో విరూపాక్షుని జయించినవారయిన యావామలోచనలను స్తుతించుచున్నాను.]

ఇచట 'జీవయన్తి'అని, 'యాః'అని, 'జయినీః' అనియు; ఇందు జకారయకారములు ఏకస్థానంబగు తాలువునందు ఉచ్చరింపఁబడుటచేత సాదృశ్యము. ఇట్లు దంత్యకంఠ్యములకుం గూడ నుదాహరింపవలయును. ఇదియు సహృదయులకు మిక్కిలి శ్రుతిసుఖావహంబగుటవలన శ్రుత్యనుప్రాసమనఁబడును.

౬-౩౭. వ్యంజనము యాథావస్థముగానే యుండి దానికి పూర్వమందున్న స్వరముతోఁగూడ ఆవర్తింపఁబడునేని తుదయందు యోగ్యముగుట వలన అంత్యాను ప్రాస మనంబడును.

యథావస్థము అనఁగా యథాసంభవము లయిన యనుస్వార విసర్గ స్వర యుక్తాక్షరములతోఁ గూడుకొన్నదిగానే; ఇది ప్రాయికముగా పాదమునకుఁగాని పదము నకుఁగాని తుదను ప్రయోగింపఁదగినది.

పాదాంతగతమునకు ఉదా.— మదీయము —

'కేశః కాశ స్తబకవికాసః కాయః ప్రకటితకరభవిలాసః
చక్షు ర్దగ్ధ వరాటక కల్పం త్యజతి న చేతః కామ మనల్పమ్.'

[తలవెంట్రుకలు తెల్లపూగుత్తి వికాసముకలవి, ఒంటె స్వరూపము దేహమున ప్రకట మయినది, కన్ను కాలినగవ్వవలె నున్నది, అట్లున్నను మనస్సు ఎక్కుడగు కామమును వదలకున్నది.]

పదాంతగతమునకు ఉదా.—

'మన్దం హస న్తః పులకం వహ న్తః' ఇత్యాది.

[మెల్లగా నవ్వువారును గగుర్పాటు వహించినవారును] లోనగునది.

౬-౩౮. తాత్పర్యమాత్రముచే భేదము కలుగునట్లుగా శబ్దార్థములను ఆవర్తించుట లాటానుప్రాసమని చెప్పఁబడును.

ఉదా.—

'స్మేర రాజీవ నయనే నయనే కిం నిమీలితే?
పశ్య నిర్జిత కన్దర్పం కన్దర్ప వశగం ప్రియమ్.'

[వికసించిన రాజీవమువంటి నేత్రములుగల చెలువా, నేత్రముల నేల మూసికొంటివి? కంద ర్పుని జయించినవానిని నీప్రియుని కందర్పునివశమునం బడినవానిని మూడు.]

ఇచట విభక్త్యర్థమునకు ఆవృత్తిలేకున్నను, ముఖ్యతరమైన ప్రాతిపదికాంశ ద్యోత్యధర్మిరూపము భిన్నార్థమైనందున లాటానుప్రాసత్వమే.

'నయనే తస్యైవ నయనే చ'

[వానికన్నులే కన్నులును.]

ఇచట ద్వితీయ నయనశబ్దము భాగ్యవత్త్వాది గుణవిశిష్టత్వమును నెడి తాత్పర్య ముచేత మాత్రమే భిన్నార్థము.

'యస్య న సవిధే దయితా దవదహన స్తుహినదీధితి స్తస్య
యస్యచ సవిధే దయితా దవదహన స్తుహినదీధితి స్తస్య.'

[ఎవనికి దయిత సమీపమున లేదో వానికి తుహినదీధితి (చంద్రుఁడు) దవదహనుఁడు (దావాగ్ని); ఎవనికి దయితసమీపమునఁగలదో వానికి దవ దహనుఁడు తుహినదీధితి.]

ఇచట అనేకపదములకు పౌనరుక్త్యముగలదు. ఇది ప్రాయికముగా లాటజనులకు ప్రియమగుటవలన లాటానుప్రాసము.

౬౩౯. ఈప్రకారము అనుప్రాసము అయిదువిధములు.

౬౪౦. అర్థము ఉన్నయెడల వేఱర్థమున స్వరవ్యంజన సంహతిని అక్రమముననే ఆవర్తించుట యమక మనఁబడును.

ఇచట రెండుపదములకును ఒక్కెడ సార్థకత్వము ఒక్కెడ నిరర్థకత్వము; ఒక్కెడ ఒకదానికి సార్థకత్వము ఇతరమునకు నిరర్థకత్వము. కావున 'అర్థము ఉన్నయెడల' అనుట. 'అక్రమముననే' అనుటచే 'దమోమోద' ఇత్యాది ఈయలంకారమునకు విషయము కాదని సూచితము. ఇది పదమునకు పాదమునకు శ్లోకార్థమునకును శ్లోకమునకును ఆవృత్తి యగుటచేతను పదాద్యావృత్తి అనేకవిధములు కలుగుటవలనను కడుం బెక్కులయిన భేదములుకలవి. దిఙ్మాత్రముగా ఉదా.—

['నవ పలాశ-పలాశవనం పురః స్ఫుటపరాగ-పరాగత-పఙ్కజమ్
మృదుల-తాన్త-లతాన్త మలోకయత్ స సురభిం సురభిం సుమనోభరైః']

[ఆతఁడు (శ్రీకృష్ణుఁడు) నూతన పత్రములతోడి కింశుకముల యరణ్యము కలదియు వికసిల్లిన పుప్పొడులచేత సంబద్ధములైన పంకజములు కలదియు మృదులములై (యెండకు) వాడిన పుష్పములుగలదియు, పుష్పభాగముల చేత పరిమళవంతమయిన వసంతమును విలోకించెను.]

ఇచట పదావృత్తి. "పలాశ పలాశ" అనునెడను "సురభిం సురభిమ్" అనునెడను రెంటికిని సార్థకత్వము. "లతాన్త లతాన్త" అనుచో తొలిదానికి నిరర్థకత్వము; "పరాగ పరాగ" అనుచో రెండవదానికి నిరర్థకత్వము. ఇట్లే ఇతరములనుకూడ నుదాహరింపఁదగును.

"యమకాదులయందు డలలకును బవలకును లరలకును ఐక్యముకలుగును." అని చెప్పిన నయమున "భుజలతా మబలాజనః" అనునెడ యమకత్వహాని లేదు.

౬౪౧. ఒకఁడు ఒకయర్థమునఁ బ్రయోగించిన వాక్యమును మఱియొకఁడు శ్లేషచేతఁగాని కాకువుచేతఁగాని వేఱుప్రకారమున యోజించునెడల నది ఇరుతెఱంగుల వక్రోక్తియగును.

ఇరుతెఱంగుల నఁగా శ్లేషవక్రోక్తి కాకువక్రోక్తియు. క్రమముగా నుదా.—

'కే యూయం? స్థల ఏవ సంప్రతి వయం. ప్రశ్నో విశేషాశ్రయః.
కిం బ్రూతే విహగః స వా ఫణిపతిర్యత్రాస్తి సుప్తో హరిః
వామా యూయమహో విడమ్బరసికః కీదృక్స్మరో వర్తతే!
యేనాస్మాసు వివేకశూన్యమనసః పుంస్వేవ యోషిద్భ్రమః.'

[ఎవరు మీరు? ఇపుడు నేల యందే మేము. ప్రశ్నము మీ విశేషమును గూర్చినది. పక్షియేని ఎట హరి నిద్రించునో ఆ ఫణిపతి యేని యేమి చెప్పినాడు? కుట్టిలులుగా నున్నారు మీరు. అహో! మన్మథుఁడు ఎట్టి విడంబరసికుఁడు! అతని చేత వివేకశూన్యమనస్కులనికి పురుషులయందే స్త్రీభ్రమ!-కే=ఎవరు=జలమందు; వామా=కుట్టిలులు=స్త్రీలు.]

ఇచట విశేషపదమునకు విః = పక్షి, శేషః=నాగుఁడు అని అర్థద్వయము కలిమిం జేసి సభంగశ్లేషము; కడమభాగములో అభంగము.

'కాలే కోకిల వాచాలే సహకార మనోహరే
కృతాగసః పరిత్యాగా త్తస్యాశ్చేతో న దూయతే.'

[కోకిలలచే వాచాలంబును సహకారములచే మనోహరంబును అగు కాలంబున అపరాధిని ప్రియుని పరిత్యజించుటవలన ఆమె చిత్తము నోవదు.]

ఇచట ఒకానొక సఖిచేత నిషేధార్థమందు ప్రయుక్తమయిన నఞ్ను అన్యకాకువుచేత (స్వరవిశేషముచేత) "తప్పక నొచ్చును" అని విధ్యర్థమున ఘటించినది.

౬౪౨. భాషలయందు ఏకశబ్దములచేత ఏవాక్యము రచింపఁబడునో అది భాషాసమ మనఁబడును.

ఉదా.—మదీయము—

'మఞ్జుల మణిమఞ్జీరే కలగమ్భీరే విహారసరసీ తీరే
విరసాసి కేలికీరే కిమాలి ధీరే చ గన్ధసార సమీరే?'

[ఓసఖీ, మనోహరగంభీరనాదమయిన మంజుల రత్ననూపురమునందును, కేళీసరస్తీరమునందును కేళిశుకమునందును మందమగు చందనసమీరమందును విముఖివైతివేమి?]

ఈశ్లోకము సంస్కృత ప్రాకృత శౌరసేనీ ప్రాచ్యావంతీ నాగ రాపభ్రంశములయందు ఏకవిధమే.

'సరసం కఇణ కవ్వం'

[సరసము కవియొక్క కావ్యము.]

ఇత్యాదులయందు "సరసం" అనుచో సంస్కృతప్రాకృతములందు సామ్యమున్నను (సర్వ) వాక్యగతత్వము లేమిచే వైచిత్ర్యము లేనందున ఈయలంకారము గాదు.

౬౪౩. శ్లిష్టపదములచేత అనేకార్థాభిధానము శ్లేష యనఁబడును. ఇది వర్ణ

ప్రత్యయ లింగములయు ఇరువప్రకృతులయు ఇరుపదములయు విభక్తి వచన భాషలయు శ్లేష చేత ఎనిమిదితెఱంగులయినది.

క్రమముగా ఉదాహరణములు.—

'ప్రతికూలతా ముపగతేహి విధౌ విఫలత్వమేతి బహుసాధనతా
అవలమ్బనాయ దినభర్తుర భూన్నపతిష్యతః కరసహస్ర మపి.'

[దైవము(చంద్రుఁడు) ప్రతికూలుఁడైయుండఁగా మెండుసాధనములు ఉన్నను ఫలింపమి నిశ్చయము. దినకరునికి వేయికిరణములు (చేతులు) ఉన్నను పడిపోవుచున్నప్పుడు పట్టుకొనుటకు కొఱగావాయెను.]

ఇచట "విధౌ" అని విధువిధిశబ్దముల యికారోకారములకు ఔకారరూపము వచ్చినందున (వర్ణ)శ్లేష.

'కిరణా హరిణాఙ్కస్య దక్షిణశ్చ సమీరణః
కాన్తోత్సఙ్గజుషాం నూనం సర్వఏవ సుధాకిరః'

[చంద్రునికిరణములును దక్షిణమారుతంబును కాంతయొక్క యొడిలోనున్న వారికి అన్నియు అమృతముం జల్లునవే (జల్లునది.)]

ఇచట "సుధాకిరః" అని క్విప్కప్రత్యయములకు (శ్లేష.) మఱియు నిట బహువచనైక వచనములు ఏకరూపముకలవైనందున వచనశ్లేషయుం గలదు.

'వికసన్నేత్ర నీలాబ్జే తథా తన్వ్యాః స్తనద్వయీ
తవ దత్తాం సదామోదం లసత్తరళహారిణీ.'

[తన్వియొక్క లసత్తరలహారము వికసించుచున్న నేత్రేందీవరములును అట్టి లసత్తరళ హారిణి స్తనద్వయియును నీకు సర్వదా ఆనందము నొసంగుఁగాక.]

ఇచట నపుంసక స్త్రీలింగములకు శ్లేష, వచనశ్లేషయు.

'అయం సర్వాణి శాస్త్రాణి హృది జ్ఞేషు చ వక్ష్యతి
సామర్థ్యకృదమిత్రాణాం మిత్రాణాంచ నృపాత్మజః.'

[ఈ రాజకుమారుఁడు సకలశాస్త్రములను హృదయమునను వహించును, విద్వాంసుల యెడం జెప్పును; అమిత్రులకు సామర్థ్యమును కోసివైచును, మిత్రులకు సామర్థ్యముం జేయును.]

ఇచట "వక్ష్యతి" అని వహివచులకును "సామర్థ్యకృత్" అని "కృన్తతి" "కరోతి"అను ప్రకృతులకును శ్లేష.

'పృథుకార్తస్వర పాత్రమ్' ఇత్యాది (౧౮౫).

ఇచట పదచ్ఛేదము చేసినచో విభక్తిసమాసములకుంగూడ వైలక్షణ్యము కలిమిచే పదశ్లేష, ప్రకృతిశ్లేషయో గాదు. మఱియు నిట్లు—

'నీతానాం మాకులీభావం లుబ్ధైర్భూరిశిలీముఖైః
సదృశే వనవృద్ధానాం కమలానాం త్వదీక్షణే.'

[అయింతి నేత్రములు—మకరంద లుబ్ధములైన పెక్కు తేంట్ల చేత—(వంటి వాలుగల పెక్కు బాణములతో) - ఆకులత్వమును పొందింపఁబడినవియు—నీటం బెరిగినవియు (అడవిలోఁ బెరిగినవియు) అగునట్టి తామరలకు (లేళులకు) సమానములు]

ఇచట లుబ్ధశిలీముఖాది శబ్దములు శ్లిష్టములైనను విభక్తిభేదము లేనందున ప్రకృతిశ్లేష. అటు గాదేని ఎల్లెడల పదశ్లేషయే ప్రసక్తమగును.

'సర్వస్వం హర సర్వస్య త్వం భవచ్ఛేద తత్పరః
నయోపకార సాముఖ్య మాయాసి తనువర్తనమ్.'

[శివునిఁగూర్చి భక్తుఁడు వేఁడుకొనుట:— ఓహరుఁడా, నీవు ఎల్లవారికి సర్వధనమును, సంసారమును ఛేదించుటయందు ఆసక్తుఁడవు, నయోపకారముల సమ్ముఖీకరించుచు తనువర్తనమును అవలంబింతువు.— పుత్రునిఁగూర్చి దాసి వచించుట:—నీవు ఎల్లవారి సర్వధనమును హరింపుము, (ధనికులకంఠములను) కోయుటయందు ఆసక్తుఁడవుకమ్ము, ఉపకారపరత్వమును మాను, కష్టమయినజీవనమును జరుపుము.]

ఇచట"హర"అనుచోట ఒకపక్షమున శివసంబోధనముగావున సుప్పు(సుప్), ఇంకొకపక్షమున హృధాతువునకు తిఙ్ఙు(తిఙ్) అని విభక్తిశ్లేష. ఇట్లే "భవ" ఇత్యాదులయందును. ఈభేదముప్రత్యయశ్లేషచేతనే గతార్థమయినను ప్రత్యయాంతరసాధ్యముగాక సుబంత తిఙంతముల నాశ్రయించినందునం గలిగిన విచ్ఛిత్తివిశేషము నవలంబించి వేఱుగా (విభక్తిశ్లేషయని) వ్యవహరించుట.

'మహదే సురసంధం మే తమవ సమాసఙ్గమాగమాహరణే
హర బహుసరణం తం చిత్తమోహ మవసర ఉమే సహసా.'

ఇచట సంస్కృత మహారాష్ట్రీయ భాషలకు శ్లేష.

[దీనికి సంస్కృతముగా నర్థము— ఉత్సవప్రదవగునో గౌరి, విద్యాగ్రహణమునకైన మదీయ ప్రసిద్ధ సమాసంగమును సురప్రార్థనీయమును రక్షింపుము; సమయమున బహువిషయగామిని, ఆ చిత్తమోహమును శీఘ్రముగా తొలఁగింపుము.

ప్రాకృతముగాఁ గొన్నచో దీనికి ఛాయ—

'పుణ్యాం దేహి రసం ధర్మే తమోవశా మాశాం సంసారా ద్ధర నః
హరవధు శరణం త్వం చిత్తమో హోపసరతు మే సహసా.'

దీనియర్థము.— ఓహరవల్లభా, నాకు ధర్మమందు కోర్కి నొసంగుము. సంసారముమీఁద అజ్ఞానవశమున మాకుం గలిగిన యాశను హరింపుము; నీవు మాకు శరణమవు. నా చిత్తమోహము తటాలున తొలఁగిపోవును గాక.]

౬౭౭. ఇది వెండియు సభంగము అభంగము ఉభయాత్మకము నని మూఁడు విధములై యున్నది.

ఈభేదములను మూఁటిని చెప్పిన యెనిమిది భేదములలోను యథాసంభవముగా నెఱుఁగఁదగును ఇదియు నొక యుదాహరణము.—

'యేన ధ్వస్తమనోభవేన బలిజిత్కాయః పురాస్త్రీకృతో
యశ్చోద్వృత్తభుజఙ్గహారవలయో గఙ్గాం చ యోఽధారయత్
యస్యాహుశ్శశిమచ్ఛిరోహర ఇతి స్తుత్యం చ నామామరాః
పాయాత్స స్వయమన్ధకక్షయకర స్త్వాం సర్వదో మాధవః.'

[శివపరము—ధ్వస్తమనోభవుఁడయిన ఎవనిచేత పూర్వము బలిజేతయొక్క దేహము అస్త్రముగాఁ జేయఁబడినదో, ఎవఁడు ఉత్కృష్టముగా చుట్టఁబడిన పాములు హారముగాను వలయముగాను గలవాఁడో, ఎవఁడు గంగను ధరించెనో, ఎవని శిరము శశిమంతమో (చంద్రుఁడు కలదో) హరుఁడని ఎవని వంద్యనామమును అమరులు పల్కుదురో అంధకాసురహంతయైన యా యుమాపతి సర్వదా స్వయముగా నిన్ను రక్షించునుగాక.

విష్ణుపరము—పుట్టుకలేని యెవనిచేత బండి ధ్వస్తము సేయఁబడినదో, ఎవనిచేత బలివశ్రివర్తని జయించిన తన దేహము పూర్వము (అమృతమథనసమయమున స్త్రీగా మోహినిగా) చేయఁబడెనో, ఎవఁడు మదించిన పామును గూల్చినాఁడో, (ఎవఁడు) శబ్దసమూహముల (అర) బలమును గూర్చి పోవువాఁడో, ఎవఁడు (కృష్ణావతారమున గోవర్ధన) పర్వతమును (కూర్మావతారమున) భూమిని ధరించెనో, ఎవనికి దేవతలు శశిని మథించిన రాహువుయొక్క శిరమును హరించువాఁడని వంద్యమయిన నామమును చెప్పుదురో అంధకులకు (యాదవులకు) (ద్వారకయందు) నివాసము చేయువాఁడును సర్వము నిచ్చువాఁడును అగు మాధవుఁడు నిన్ను స్వయముగా రక్షించుఁగాక.]

ఇచట— "యేన... వేన' అనుచో సభంగశ్లేష. "అన్ధకక్షయకర' అనుచో అభంగశ్లేష.

ఈరెండు నొక్కెడనే సంభవించినందున (సభంగాభంగాత్మకశ్లేషకు) గ్రంథగౌరవభీతిచే ప్రత్యేకముగా నుదాహరణము చూపలేదు.

[ఇచట కొందఱనుదురు.— సభంగశ్లేషమాత్రమే శబ్దశ్లేషకు విషయము,

అందు ఉదాత్తాది స్వరభేదమువలన భిన్నప్రయత్నముచేత ఉచ్చార్యములగుటవలన భిన్నములగు (రెండు) శబ్దములకు లక్క-కఱ్ఱన్యాయంబున శ్లేష. అభంగమో అర్థశ్లేషయే, అందు స్వరభేదము లేమిచేత, అభిన్నప్రయత్నముననే ఉచ్చార్యత కలిమిం జేసి శబ్దభేదము కానందున అర్థములు ఒక్క-తొడిమ నాశ్రయించిన యిరుఫలంబుల న్యాయంబున శ్లేష. ఏది దేని నాశ్రయించియుండునో అది దాని యలంకారమే. అలంకార్యాలంకార భావమునకు లోకమందుంబోలె ఆశ్రయాశ్రయిభావము చేత ఉపపత్తి.' అని.

దానిని ఇతరులు ఒప్పుకున్నారు.— అందులకుం దెలివిడి — ఇందు ధ్వని గుణీభూతవ్యంగ్య దోష గుణాలంకారములు శబ్దార్థగతములనెడి వ్యవస్థకు ఒక్క-దానినే ఆశ్రయించియుండుట నియమము; 'అంధక క్షయ' అనునెడ శబ్దభేదము లేదనగూడదు, ఏలన— 'అర్థభేదముచేత శబ్దభేదము' అని దర్శనము గావున. మఱియు నిట శబ్దమే ముఖ్యముగా వైచిత్ర్యబోధోపాయముగా కవిప్రతిభచేత విషయీకరింపఁబడుటచేత శబ్దాలంకారత్వమే; (ఎట్లన—) విసదృశములయిన శబ్దములను కూర్చుటయందు ఇట్టి వైచిత్ర్యము లేమిం జేసియు, వైచిత్ర్యమే అలంకారమగుటంబట్టియు. అర్థంపుమొగముం జూచి యర్థాలంకారమను పక్షమున అనుప్రాసాదులు రసాది పరములగుటం బట్టి వానికిఁ గూడ అర్థంపుమొగము చూచి అర్థాలంకారత్వము చెప్పవలసివచ్చును. అభిన్నప్రయత్నోచ్చార్యమగుటచేతనే శబ్దము అర్థాలంకారమగునేని 'ప్రతికూలతా ముపగతే హి విధౌ' ఇత్యాదులయందు శబ్దభేద మయినను అర్థాలంకారత్వము నీకును ప్రసక్తించును, కావున రెంటను శబ్దాలంకారత్వమే. ఎచ్చట శబ్దమును మార్చినను శ్లేష పోదో, అచ్చట—

* 'కొంచెమునకే ఉన్నతిం బొందును కొంచెమునకే అధోగతిం బొందును; అహో! తుని కోలకొనకును ఖలునికిని వృత్తి మిక్కిలి సదృశముగానున్నది!'

ఇత్యాదులయందు అర్థశ్లేషయే.

ఇది ఇతరాలంకారములతో చేరనిదిగా సంభవింపనందున, (దీనితో) కలసి యున్న యితరాలంకారములకు అపవాదముగా వానిని బాధించునదిగా వానిని తోఁపఁజేయు హేతువుగానున్నది, అని కొందఱు. ఈవిషయమునం దిట్లు విచారము —

* స్తోకే నోన్నతి మాయాతి స్తోకే నాయా త్యధోగతిమ్
అహో సుసదృశీ వృత్తి స్తులాకోటేః ఖలస్య చ.

సమాసోక్త్యప్రస్తుతప్రశంసాదులయందు రెండవయర్థము వచింపనక్కఱలేనందున అట దీని గంధమైనను లేదు, 'విద్వన్మానసహంస' ఇత్యాదియందు శ్లేషగర్భంబగు రూపకమందు మానసశబ్దమునకు చిత్తసరోరూపోభయార్థత్వము ఉన్నను రూపకము చేత శ్లేష బాధితమగును; సరోరూపమగు నర్థమే విశ్రాంతిస్థానమగుటంబట్టి ప్రధానమయినందున; శ్లేషయందో రెండర్థములకును సమప్రాధాన్యము గదా. 'సన్నిహిత బాలాంధకారయు భాస్వన్మూర్తియు' ఇత్యాది విరోధాభాసమునందు విరుద్ధార్థము పొడసూపుటమాత్రమే గాని మొలతేరనందున శ్లేష గాదు. ఇట్లే పునరుక్తవదాభాస మందును.

అందువలన 'యేనధ్వస్త' ఇత్యాదులయందు ప్రాకరణికములకు (రెంటికిని), 'నీతానామ్' ఇత్యాదులయందు అప్రాకరణికములకు (రెంటికిని) తుల్యయోగితయు,

'స్వేచ్ఛోపజాత విషయోఽపి నయాతి వక్తుం
దేహీతిమార్గణ శతైశ్చ దదాతి దుఃఖమ్
మోహాత్సముత్క్షిపతి జీవనమప్యకాణ్డే
కష్టం ప్రసూన విశిఖః ప్రభురల్పబుద్ధిః.'

[పుష్పబాణుడు అల్పబుద్ధియగు దొరయు (ఇద్దరును సమానముగా) పీడాకరులు. పుష్పబాణుడు తానే ఒకరికి ఒకరిపై కోర్కెపుట్టించినను పోయి చెప్పడు, వారికి దేహము కల దను సనూయచే అలుగుల వందలచేత దుఃఖము కలిగించును; తామసబుద్ధి చేత అకస్మికముగా వారి ప్రాణమును సయితము హరించును. అల్పబుద్ధి అకస్మికముగా వారిప్రాణమును సయితము హరించును. అల్పబుద్ధియగు దొర పలసిన విషయము లన్నియు సిద్ధముగానున్నను అనుభవింపడు, 'ఇమ్ము. ఇమ్ము' అని నూర్లకొలది పర్యాయములు అడిగడు దుఃఖమును కలిగించును. అజ్ఞానముచేత (సేవకుల) బ్రతుకు దెరువును గూడ హరించును.]

ఇత్యాదులయందు ప్రాకరణి కాప్రాకరణికములకు దీపకంబును,

'సకలకలం పుర మేత జ్జాతం సంప్రతి సుధాంశుబిమ్బ మివ'

[ఈ పుర మిప్పుడు కలకలసహితమై (సకలమై కలలతోఁ గూడుకొన్నదై) చంద్రబింబ ముపోలె నయినది]

ఇత్యాదులయందు ఉపమయును ఉన్నప్పటికిని శ్లేష ఇట్లు వీనితోఁ గాక ప్రత్యేక ముగా సంభవింపదుగావునను, ఇది శ్లేష విషయము గాని తావులందుఁ గూడ సంభవించునుగావునను, ఈవిషయమున శ్లేషవలననే ప్రాధాన్యముగా చమత్కారము తోఁచుచుండుటవలనను శ్లేషయనియే వ్యపదేశము తగును. అట్లుగాదేని ఆవ్యపదేశమునకు ఎల్లవిధముల అభావమే ప్రసక్తించును.

ఈవిషయమున చెప్పెదము.—

శ్లేషకు అలంకారాంతరముతో చేరని సితిలేమి వాస్తవముగాదు, 'యేనధ్వస్త' ఇత్యాదులయందు వివిక్తముగా నుండుటంబట్టి.

ఇట తుల్యయోగిత లేదు, ఏలన దానియందు రెండర్థములును వాచ్యములుగా నుండవలయు ననునియమము లేదుగావున. మఱి యిచట మాధవోమాధవులలో నొకనికి వాచ్యత్వమును నియమించినచో ఇతరునికి వ్యంగ్యత్వము సంభవించును.

మఱియు తుల్యయోగితయందు ఒకటే ధర్మము అనేకధర్ములతోడి సంబంధముకలదిగా తోఁచును; ఇటను పెక్కు ధర్ములు వేఱు వేఱు ధర్మములతో సంబద్ధములుగా తోఁచును. 'సకలకల' మిత్యాదులయందును శ్లేష ఉపమాప్రతీత్యుత్పత్తిహేతువు కాదు. ఆపక్షమున పూర్ణోపమకు విషయమే లేకపోవుట ఆపాదించును. పూర్ణోపమకు 'కమలమువలె ఈముఖము మనోజ్ఞము' ఇత్యాదికము విషయము కలదనుట సరిగాదు. 'సకలకల' మిత్యాదులయందు శబ్దశ్లేషయగుటచేత ఉపమ కాదేని 'మనోజ్ఞ'మిత్యాదులయందు అర్థశ్లేష యేమి యపరాధము కావించుకొన్నది?

'ఉపమా సముచ్చయ ము లను నీరెండును స్ఫుటముగా అర్థాలంకారములు;
మఱి, శబ్దమాత్రసామాన్యము నాశ్రయించియు అవి సంభవించును.'

అను రుద్రటోక్తిం బట్టి గుణక్రియాసామ్యమువలె శబ్దమాత్రసామ్యము సయితము ఉపమాప్రయోజక మగుటవలన [అదియు అర్థశ్లేష యేల కాదు?]

ఓయి, గుణక్రియాసామ్యమునకు మాత్రమే ఉపమా ప్రయోజకత్వము యుక్తము, అచట సాధర్మ్యము వాస్తవము గావున; శబ్దసామ్యమున అది తగదు, అందు సాధర్మ్యము వాస్తవము గానందున; అందువలన అన్యథా అనుపపత్తి కలుగును గావున పూర్ణోపమకు గుణక్రియా సామ్యముమాత్రమే పూర్ణోపమావిషయము గాని "సకలకల" మిత్యాదులయందలి శబ్దమాత్రసామ్యము తద్విషయము కాదు అనుట సరిగాదు. ఏలన— 'సాధర్మ్యము ఉపమ' అని అవిశిష్టమయిన యుపమాలక్షణమున శబ్దసామ్యవ్యావృత్తి లేనందున. మఱియు శబ్దసామ్యమున సాధర్మ్యము అవాస్తవమగుటచేత ఉపమా ప్రయోజకముగాదేని, ఆపక్షమున, 'విద్వన్మానస

ఇత్యాదులయందు ఆధారభూతమయిన చిత్తాదులకు సరోవరాద్యారోపము రాజాదులకు హంసాద్యారోప ప్రయోజకము కానేరదు.

మఱియు వాస్తవసామ్యమున మాత్రమే ఉపమ యంగీకరింపఁబడునేని నీవే యెట్లు 'సకలకల' మిత్యాదులయందు బాధ్యభూతమయిన యుపమను అంగీకరించెదవు? మఱియు నిట శ్లేషబంధముకన్న ముందే సామ్యము సంభవింపమింబట్టి శ్లేషయే సామ్యమును నిర్వహించుచున్నదిగాని సామ్యము శ్లేషను నిర్వహించుటలేదు. కావున 'ప్రధానముంబట్టి వ్యపదేశములు కలుగును' అను న్యాయంబున, ఉపమయే అంగియయినందున దానినే వ్యపదేశించుట సరి.

ఓయి, శబ్దాలంకారవిషయంబున అంగాంగి భావసంకరము అంగీకరింపఁబడదే, అట్లుండ ఇట నెట్లు శ్లేషోపమలకు అంగాంగిభావసంకరము? అని యడిగెదవేని-విను ఆయనంగీకారము అర్థానుసంధానవిరహితమైన అనుప్రాసాదులకే; ఇట్లు దీపకాదులందును ఎఱుంగనగును.

'సత్పక్షా మధురగిరః ప్రసాధితాశా సముద్ధతారమ్భాః।
నిపతన్తి ధార్తరాష్ట్రాః కాలవశాన్మేదినీపృష్ఠే'

[హంసలు మంచిఱెక్కలుగలవి మధురమైన వాక్కు గలవి దిక్కుల నలంకరించుచున్నట్టివి మదోత్కటములయిన చేష్టలుగలవియు నై ఋతువశంబున భూతలంబున వాలుచున్నవి.— ధృతరాష్ట్రసుతులు మంచిసహాయులుకలవారు, మంచిమాటలు పలుకువారు, దిక్కులను జయించినవారు, కడు నుద్ధతములైన వ్యాపారములుగలవారును నై కాలవశంబున భూతలంబునం గూలుచున్నారు.]

ఇచట శరద్వర్ణన ప్రకరణ మగుటంబట్టి ధార్తరాష్ట్రాదిశబ్దములు హంసాద్యర్థమును చెప్పుటయందు కట్టుఁబడియుండఁగా, దుర్యోధనాది రూపమయిన యర్థము శబ్దశక్తిమూలకమయిన వస్తుధ్వని. మఱియు నిట ప్రకృతప్రబంధమునకు అభిధేయమగు నయీరెండవయర్థము సూచ్యముగామాత్రమే వివక్షింపఁబడినదైనందున ఉపమానోపమేయభావము వివక్షితము కాదు, అందువలన నిట ఉపమాధ్వని గాని శ్లేష గాని లేదని సర్వ మవదాతము.

౬౮౫. వర్ణములు పద్మాద్యాకారమున రచితములగునేని చిత్ర మనఁబడును.

ఆదిశబ్దముచేత ఖడ్గ మురజ చక్ర గోమూత్రికాదులు. దీనికి (చిత్రమునకు) అట్టిలిపి సన్నివేశవిశేషవశమున చమత్కారము కావించువర్ణములకు అట్టిశ్రోత్రా

కాశసమ వాయువిశేషవశంబున చమత్కారము చేయునవైన వర్ణములతో నభేదము చేత ఉపచారమువలన శబ్దాలంకారత్వము. అందు పద్మబంధమునకు ఉదా.—మదీయము.

'మార మా సువమా చారు రుచా మారవధూ త్తమా
మా త్తధూర్తతమావాసా సా వామా మేఽస్తు మా రమా.'

[మన్మథునిలక్ష్మివంటి పరమశోభగలది సుందర కాంతిచేత మదనునిభార్యకన్న ఉత్కృష్టురాలు ధూర్తతముల యిండ్లకు పోనట్టిదియు నయిన యావామ నాకుం గలుగును గాక రమ వలదు.]

ఇది ఎనిమిది రేకుల పద్మబంధము. దిగ్దళములందు నిర్గమప్రవేశముల చేత శ్లిష్టవర్ణము (అనులోమ ప్రతిలోమ పాఠ్యమయిన యొకటే వర్ణముగలది), విదిగ్దళములందు రేఖువిధము (అనఁగా ఒకచో ప్రవేశము ఒకచో నిర్గమము అని శ్లిష్టవర్ణము); కర్ణికాక్షరము శ్లిష్టవర్ణమే. ఇట్లు ఖడ్గబంధాదికము కూడ ఊహ్యము.

౬౮౬. ప్రహేళిక కావ్యమునడుమ కణితివంటిది, రసమునకు విరోధి, గావున అది యలంకారము గాదు, దాని నిట వివరింపలేదు. చ్యుతదత్తాక్షరాదిక యగునది ఉక్తివైచిత్ర్యమాత్రము.

చ్యుతాక్షర దత్తాక్షర చ్యుతదత్తాక్షరయు— ఉదా.—

కూజన్తి కోకిలాః సాలే యౌవనే ఫుల్ల మమ్బుజమ్
కిం కరోతు కురఙ్గాక్షీ వదనేన నిపీడితా?'

[కోకిలలు (ర)సాలంబున కూయుచున్నవి, (యౌ)వనమందు (జలమందు) కమలము వికసిల్లుచున్నది. (వ) (మ)దనుని చేత నిపీడితయగు హరిణాక్షి యేమిచేయును?]

ఇచట "సాలె" అనుదానియందు "ర". చ్యుతము, "యౌవనే" అనుచోట "యౌ" దత్తము, "వదనేన" అనుచో "మ" చ్యుతము "వ" దత్తము. "ఆది" శబ్దము చేత క్రియా కారక గుప్త్యాదులు. అందు క్రియాగుప్తికి ఉదా.—

'పాణ్డవానాం సభామధ్యేఽదుర్యోధన ఉపాగతః
తస్మై గాంచ సువర్ణంచ సర్వాణ్యాభరణాని చ.'

[పాండవుల సభామధ్యలో అధనుఁడు ఎవఁడువచ్చెనో వానికి గోవును సువర్ణమును సర్వాభరణములను ఇచ్చిరి.]

ఇందు 'దుర్యోధనః' అనుచో 'అదుర్యోధనః' అనుట, అందు 'అదుః' అని క్రియాగుప్తి. ఇట్లే ఇతరస్థలములందును.

ఇఁకను అవసరప్రాప్తములగు నలంకారములందు ప్రాధాన్యముంబట్టి సాదృ

శ్యమూలములగునవి లక్షింపవలసినవిగావున వానికి ఉపజీవ్యముగుటచేత తొలుత ఉపమను చెప్పుచున్నాఁడు.—

౭౮౭. ఒకటే వాక్యమున రెంటికి వైధర్మ్యములేని సాదృశ్యముం జెప్పుట ఉపమ

రూపకాదులయందు సామ్యము వ్యంగ్యము, వ్యతిరేకమున వైధర్మ్యము కూడ చెప్పఁబడును, ఉపమేయోపమయందు వాక్యద్వయము, అనన్వయమునందో ఒకదానికే సామ్యోక్తి అని దీనికంటె భేదము.

౭౮౮. అది సాధారణధర్మము ఔపమ్యవాచకము ఉపమేయము ఉపమానంబును వాచ్యములుగా నుండెనేని పూర్ణ.

అది ఉపమ; సాధారణధర్మమనఁగా రెంటికి సాదృశ్యహేతువులగు గుణక్రియలు మనోజ్ఞత్వాదులు; ఔపమ్యవాచకము ఇవాది(వలె లోనగునవి); ఉపమేయము ముఖాది; ఉపమానము చంద్రాది.

౭౮౯. అది మెండియు యథాఇవవాశబ్దములుగాని ఇవార్థకమయిన వతిప్రత్యయముగాని కలదేని శ్రౌతియు, తుల్యసమానాదులుగాని తుల్యార్థమయిన వతిప్రత్యయముగాని కలదేని ఆర్థియు (నని యిఱుదెఱంగు లగును).

యథా ఇవవా లోనగుశబ్దములు ఉపమాన(వాచక)మునకు తర్వాత ప్రయోగింపఁబడు తుల్యాదిపదములకు సమానములే అయినను శ్రుతిమాత్రముచేతనే ఉపమానోపమేయగతమగు సాదృశ్యలక్షణసంబంధమును బోధించును గావున అవి యున్నయెడల శ్రౌతి యుపమ. ఇట్లు 'తత్రతస్యేవ' అను సూత్రముప్రకారము ఇవార్థమందు విధింపఁబడిన వతిని ప్రయోగించినను. తుల్యాదులలో 'కమలముతో ముఖము తుల్యము' ఇత్యాదులయందు ఉపమేయమునందే, 'కమలము ముఖమునకు తుల్యము' ఇత్యాదులయందు ఉపమానమునందే, 'కమలమును ముఖమును తుల్యము' ఇత్యాదులయందు ఉభయమునందును విశ్రమించుటంబట్టి అర్థానుసంధానమువలననే సామ్యము ప్రతిపాదించునవిగావున అవి యున్నయెడ ఆర్థి యుపమ. ఇట్లు 'తేనతుల్య' మిత్యాదిసూత్రముచే తుల్యార్థమున విహితమయిన వతిని ప్రయోగించినను.

౭౯౦. రెండును తద్ధితమందును సమాసమందును వాక్యమందును కలుగును.

రెండును అనఁగా శ్రౌతియు ఆర్థియు. ఉదా.—

'సౌరభ మమ్భోరుహవ న్ముఖస్య కుమ్భావివ స్తనౌ పీనౌ
హృదయం మదయతి వదనం తవ శరదిన్దు ర్యథా బాలే.'

[ఓబాలా, కమలమునకుంబోలె నీముఖమునకు సౌరభము, స్తనములు కుంభములవలె పీనములు, శరదిందునివలె వదనము హృదయమును ఆహ్లాదింపఁజేయుచున్నది.]

ఇచట వరుసగా మూఁడువిధములది శ్రౌతి.

'మధురః సుధావ దధరః పల్లవతుల్యోతి పేలవః పాణిః
చకితమృగలోచనాభ్యాం సదృశీ చపలే చ లోచనే తస్యాః.'

[ఆచెలువకు అధరము అమృతమువలె మధురము, చేయి పల్లవతుల్యము అతికోమలము, లోచనములును బెదరిన లేడికన్నులతో సదృశములు చపలములును.]

ఇందు వరుసగా త్రివిధ ఆర్థి.

౬౫౧. పూర్ణోపమ ఆఱువిధములు. సామాన్యధర్మాదులలో ఒకటియేని రెండేని మూఁడేని యు ప్రయుక్తములుకానిచో లుప్త యగును; అదియు పూర్ణవలెనే శ్రౌతియు ఆర్థియు నగును.

అది అనఁగా లుప్త. దానిభేదములం జెప్పుచున్నాఁడు.—

౬౫౨. ధర్మలోపమందు లుప్తోపమ పూర్ణవలెనే, తద్ధితమందుమాత్రము శ్రౌతియుండదు. లుప్తోపమ సాధారణ గుణక్రియారూపమయిన ధర్మము లోపించినప్పుడు పూర్ణోపమవలెనే మున్ను చెప్పిన విధమున ఆఱుప్రకారములు కలదియగును, కాని, ఇందు తద్ధితములో శ్రౌతిసంభవింపనందున అయిదుప్రకారములే గలదియగును.

ఉదా.—

'ముఖ మిన్దుర్యథా పాణిః పల్లవేన సమః ప్రియే
వాచస్సుధా ఇవోష్ఠస్తే బిమ్బతుల్యో మనోఽశ్మవత్.'

[ఓప్రియా, నీముఖము చంద్రుఁడువోలె, చేయి చిగురుతో సమానము, వాక్కులు అమృతమువలె, ఓష్ఠము బింబతుల్యము, మనస్సు ఱాతివంటిది.]

౬౫౩. ఆధారకర్మవిహితమయిన యిరువెఱంగుల క్యచ్ప్రత్యయమును, (కర్తృవిహితమయిన) క్యఙ్ప్రత్యయమును, కర్మకర్తలు ఉపపదములైనప్పుడు విహితమయిన ణముల్ప్రత్యయమును ప్రయుక్తములయినచో ధర్మలుప్త అయిదువిధము లగును.

క్యచ్—క్యఙ్—ణముల్ప్రత్యయములకు కలాపమతమందు యిన్నాగమము.

[ణిజ్ అని ఈయప్రత్యయమునకు సంజ్ఞ.]
క్రమముగా నుదాహరణము.—

'అన్తఃపురీయసి రణేషు, సుతీయసి త్వం
పౌరంజనం, తవ సదా రమణీయతే శ్రీః
దృష్టః ప్రియాభి రమృతద్యుతిధర్మ మిన్ద్ర
సంచారమత్ర భువి సంచరసి క్షితీశ.'

[ఓభూపతీ, నీవు రణములయందు అంతఃపురమందుం బోలె ఆచరించుచున్నావు, పౌర జనులను సుతులనుంబోలె చూచుకొనుచున్నావు, నీకు శ్రీ సదా రమణివలె ఆచరించుచున్నది, ప్రియలచేత అమృతద్యుతివలె చూడఁబడుచున్నావు, భూమియందు ఇంద్రుఁడు సంచరించునట్లు సంచరించుచున్నావు.]

ఇచట 'అంతఃపురీయసి' అనుచో సుఖవిహారమునకు తావగుట, 'సుతీయసి' అనుచో స్నేహనిర్భరత్వమును సాధారణధర్మములు; వానికి లోపము. ఇట్లే కడమ వానియందును (సాధారణధర్మము నూహించునది.)

మఱియు నిట యథాదితుల్యాది విరహమువలన శ్రౌత్యాదివిశేష చింత లేదు. దీనిని కొందఱు ఔపమ్యప్రతిపాదకమగు నివాదియొక్క లోపముగా నుదాహరింతురు. అది యుక్తముగాదు, ఏలన క్యజాదులు సంయుతము ఆయర్థమున విహితము లగుటంబట్టి ఔపమ్యప్రతిపాదకములు కావున. ఓయి, క్యజాదులు చక్కఁగా ఔపమ్యమును తెలుపవు, ప్రత్యయములగుటంబట్టి అస్వతంత్రము లయినందునను ఇవాది పద ప్రయోగము లేనందునను, అని వచింపఁగూడదు; ఏలన కల్పబాదులందును అట్లే ప్రసక్తించునుగావున; కల్పబాదులకుఁగూడ ఇవాదులతో సమానముగా ఔపమ్య వాచకత్వము లేదు. క్యజాదులకో ద్యోతకత్వము. ఇవాదులకుఁగూడ వాచకత్వమున నిశ్చయము లేదు. ఒకవేళ వాచకత్వమున్నను 'ప్రకృతి ప్రత్యయ సముదాయరూప మయిన పదము వాచకము' అనునట్టియు 'ప్రకృతి ప్రత్యయములు తమతమ యర్థములకు బోధకములు' అనునట్టియు రెండుమతములందును వత్యాదిక్యజాదులకు సామ్యమే.

కొందఱు ఇట్లందురు— 'వత్యాదులు ఇవాద్యర్థమందు అనుశాసింపఁబడుచున్నవి, క్యజాదులు ఆచారాద్యర్థమందు' అని. అదియు సరిగాదు; ఏలన—క్యజాదులు కేవలాచారార్థములుగావు, మఱి యేమన సాదృశ్యాచారార్థములు గావున. కావున నిట్లు ధర్మలోపమున లుప్త దశప్రకార.

౬౫౮. ఉపమానమును చెప్పని యెడల ఆదివాక్యసమాసములయందు రెండు విధము లగును.

ఉదా.—

'తస్యా ముఖేన సదృశం రమ్యం నాస్తి న వా నయన తుల్యమ్.,
[ఆమె ముఖముతో సాటి రమ్యము లేదు నయనతుల్యమేనియు లేదు.]

ఇచట ముఖనయన సదృశములగు వస్త్వంతరములు గమ్యమానములగుటం బట్టి యుపమానలోపము. ఇచటనే 'ముఖేన సదృశ' మనుచో 'ముఖం యథా భేదము' అనియు, 'నయన తుల్యమ్'అనుచో 'దృగివ' అనియు పఠించిన శ్రౌతియు సంభవించును. ఈరెండుభేదములకు ప్రత్యేకముగా శ్రౌతీత్వార్థత్వభేదముచేత చాతుర్విధ్యము సంభవించుచున్నను ప్రాచీనులరీతి ననుసరించి ద్విప్రకారత్వమునే చెప్పుట.

౬౫౯. ఔపమ్యవాచకము లోపించునెడల సమాసమందును క్విప్పునందును ఇరుదెఱంగుల నిది సంభవించును.

క్రమముగా ఉదా.—

'వదనం మృగశాబాక్ష్యా సుధాకర మనోహరమ్'
[మృగశాబనయనయొక్క ముఖము చంద్రునివలె మనోహరము.]

'గర్దభతి శ్రుతి పరుషం వ్యక్తం నినద న్మహాత్మనాం పురతః'
[మహాత్ములమ్రోల కర్ణకఠోరముగా వాగుచు గర్దభమువలె నాచరించుచున్నాఁడు.]

ఇచట "గర్దభతి"అనుచో ఔపమ్యవాచియగు క్విప్పునకు లోపము ఇచట ఉపమేయమునకుం గూడ లోపమని చెప్పఁగూడదు, ఏలన "నినదన్" (వాగుచు) అనుదానిచేతనే నిర్దేశించినందున.

౬౬౦. ధర్మోపమాన లోపమున సమాసమందును వాక్యమందును ఇరుప్రకారముల సంభవించును.

"తస్యా ముఖేన" ఇత్యాదికమందు "రమ్యమ్" అనుటకు మాఱుగా "లోకే" అని పఠించిన ఈరెంటికి నుదాహరణమగును.

౬౬౧. ధర్మేవాదిలోపమందు క్విప్సమాసగతగా ఇరుదెఱంగుల సంభవించును.

ఉదా.—

'విధవతి ముఖాబ్జ మస్యాః.'
[ఈమెముఖాబ్జము విధుఁడువోలె ఆచరించుచున్నది.]

ఇచట "విధవతి" అనుచోట మనోహరత్వ క్విప్ప్రత్యయములకు లోపము. కొందఱు ఇచటంగూడ ప్రత్యయలోపముం జెప్పుదురు. "ముఖాబ్జమ్" అని సమాసగత.

౬౫౮. ఉపమేయలోపమందో క్యచ్ప్రత్యయమున ఒకటే ప్రకారము.

'అరాతి విక్రమాలోక వికస్వర విలోచనః
కృపాణోదగ్ర దోర్దండః సహస్రాయుధీయతి.'

[శత్రువుయొక్క విక్రమమును చూచుటచేత వికసించుచున్నవాఁడై అతఁడు కత్తిచే నుగ్రమమైన బాహుదండము కలవాఁడై, తన్ను సహస్రాయుధునిఁగా భావించుకొనుచున్నాఁడు.]

ఇచట "సహస్రాయుధమివాత్మాన మాచరతి" [సహస్రాయుధునిగా తన్ను ఆచరించుచున్నాఁడు] అను వాక్యమున ఉపమేయమగు నాత్మకు (తనకు) లోపము. ఇచట ఔపమ్యవాచక లోపము గాదు, అందఱకు ఈచెప్పినదే న్యాయము. ఇట కొందఱు చెప్పుదురు.— సహస్రాయుధముతోఁగూడ వర్తించుచున్నాఁడు కావున సహస్రాయుధుఁడు, వానివలె ఆచరించుచున్నాఁడు అనువాక్యమువలన "స సహస్రాయుధీయతి" అని పదము సిద్ధించుచుండఁగా అందు విశేష్యము శబ్దానుపాత్తమయి నందున ఇట ఉపమేయలోపము అని. అది సరిపడదు, ఏలన కర్తయందు క్యచ్పునకు అనుశాసనము లేనందున.

౬౫౯. ధర్మోపమేయ లోపమున మఱియొకటి.

ఉదా.— 'యశసి ప్రసరతి భవతః క్షీరోదీయన్తి సాగరాః సర్వే.'
[నీయశస్సు ప్రసరించుచుండఁగా సముద్రములన్నియు క్షీరోదమువలె ఆత్మను ఆచరించుచున్నవి.]

ఇచట "క్షీరోదమునుంబోలె ఆత్మను ఆచరించుచున్నవి." అని ఉపమేయమయిన యాత్మయు (తానును) సాధారణ ధర్మమయిన శుక్లతయు లుప్తములు.

౬౬౦. మూఁడులోపించినచో సమాసగత.

ఉదా.— 'మృగలోచన ప్రకాశించుచున్నది.'

ఇచట 'మృగముయొక్క లోచనములవలె చంచలములయిన లోచనములు ఎవతెవో' అని సమాసమున ఉపమావాచకము సాధారణధర్మము ఉపమానమును లుప్తములు.

౬౬౧. అందుచే ఉపమలో ఇరువదియేడు భేదములు అగును.

పూర్ణ ఆఱువిధములు, లుప్త ఇరువదియొకవిధములు అని, కలసి ఈయుపమ ఇరువదియేడు భేదములుకలది. ఈయుపమాభేదములనడుమ సాధారణధర్మములో పింపన్న భేదములందు విశేషము ప్రతిపాదింపఁబడుచున్నది.

౬౬౨. సాధారణగుణము ఒక్కెడ ఏకరూపయు, ఒక్కెడ భిన్నయు; భిన్నయగు నపుడు బింబానుబింబత్వమేని శబ్దమాత్రముచేత భేదమేని యగును.

ఏకరూపకు ఉదా.—

'మధురః సుధావ దధరః' ఇత్యాది (౬౫౦)

బింబప్రతిబింబత్వమునకు ఉదా.—

* 'భల్లములతో ఖండితములయిన వారి శ్మశ్రులంపుశిరములతో నాతఁడు తేనెటీఁగలు పర్వియున్న తేనెపట్టులతోనంబోలె భూమిని కప్పెను.'

ఇచట "శ్మశ్రులంపు" అనుదానికి "తేనెటీఁగలుపర్వెన" అని దృష్టాంతమునంబోలె ప్రతిబింబము.

శబ్దమాత్రముచేత భిన్నత్వమునకు.—

§ 'వికసించిన నల్లగలువఁబోలె నేత్రమును స్మేరమునుగావించి ఆకృశాంగి నాయెడ మనస్సులోని యాకూతమునెల్ల వక్కాణించినది.'

ఇచట ఒకటియే అయిన స్మేరత్వవికసితత్వములు ప్రతివస్తూపమయందునుం బోలె శబ్దముచేత నిర్దిష్టములు.

౬౬౩. ఎచట సామ్యమునకు వాచ్యత్వగమ్యత్వములు కలుగునో అయుపమ ఏకదేశవివర్తిని.—

‡ ఉదా — 'కలువలచే కన్నులచేతనుం బోలెను, పద్మములచే ముఖముల చేతనుంబోలెను, అడుగడుగునను చక్రవాకములచేత స్తనములచేతనుం బోలెను, కొలఁకుసిరులు ప్రకాశించుచున్నవి.'

---

* భల్లాపవర్జితైస్తేషాం శిరోభిః శ్మశ్రులైర్మహీమ్
తస్తార సరఘావ్యాప్తైః స క్షౌద్రపటలైరివ.

§ స్మేరం విధాయ నయనం వికసితమివ నీలముత్పలం మయి సా
కథయామాస కృశాఙ్గీ మనోగతం నిఖిలమాకూతమ్.

‡ నేత్రైరివోత్పలైః పద్మైర్ముఖైరివ సరఃశ్రియః
పదేపదే విభాన్తి స్మ చక్రవాకైః స్తనైరివ.

ఏకవాక్యమందే అని అర్థలబ్ధము. ఉదా.—

1 'శరత్తు విజృంభింపం దొడంగుడు, రాజీవము రాజీవమువలెను జలము జలమువలెను అయి నది, చంద్రుఁడు చంద్రునివలె నిస్తంద్రుఁడు.'

ఇచట రాజీవాదులకు అనన్యసదృశత్వముం బ్రతిపాదించుటకై ఉపమానోపమేయభావము వివక్షింపఁబడినది. ఇందు 'రాజీవము పాథోజమువలెను' అనియుం జెప్పఁగూడియుండుటవలన నిది లాటానుప్రాసముకన్న భిన్నవిషయము. మఱి యిట ఔచిత్యమునుబట్టి ఏకశబ్దప్రయోగమే శ్రేయము. అది చెప్పఁబడినది:—

'అనన్వయమున శబ్దైక్యము ఔచిత్యముంబట్టి ఆనుషంగికము, లాటానుప్రాసమందో అది సాక్షాత్ప్రయోజకము.' అని.

౬౬౭. పర్యాయముగా రెంటికి ఉపమానోపమేయత్వము ఉపమేయోపమ యనఁబడును.

వాక్యద్వయమునం దనుట యే. ఉదా.—

2 'లక్ష్మివలె బుద్ధి, బుద్ధివలె లక్ష్మి, తనువువలె కాంతి, కాంతివలె తనువు, భూమివలె ధృతి, ధృతివలె భూమియు, ఆహా! ఎవనికి సంతతము ఒప్పారుచుండునో.'

ఇచ్చట ఈరాజుయొక్క శ్రీబుద్ధ్యాదులకు సాటియగునవి మఱి లేవని యభిప్రాయము.

౬౬౮. సదృశమును అనుభవించుటచేత వస్తుస్మరణము స్మరణాలంకార మనఁబడును.

3 ఉదా.— 'క్రీడించుచున్న కాటుకపిట్టలచే మనోహరమయిన యీతామరసముం గాంచి చంచలనేత్రమయిన యాతన్వి యందంపు వదనమును స్మరించుచున్నాను.'

'సకపటముగా దేనికేసి యో' ఇత్యాది (౯౯౦)యందు స్మృతి సాదృశ్యానుభవములేక యుదయించినందున ఈయలంకారముగాదు. రాఘవానంద మహాపాత్రు

---

1 రాజీవ మివ రాజీవం జలం జలమివా జని
చన్ద్రశ్చన్ద్ర ఇ వాతన్ద్రః శరత్సముద యోద్యమే.

2 కమలేవ మతిర్మతి రివ కమలా తనురివ విభా విభేవ తనుః
ధరణీవ ధృతి ధృతిరివ ధరణీ సతతం విభాతి బత యస్య.

3 అరవిన్ద మిదం వీక్ష్య ఖేలత్ఖఞ్జన మఞ్జులమ్,
స్మరామి వదనం తస్యా శ్చారు చఞ్చలలోచనమ్.

లవారో వైసాదృశ్యమువలనం గలిగిన స్మృతినిగూడ ఈయలంకారముగా నే భావింతురు. అందులకు వారిదే యీయుదా.—

1 'శరీషమృద్వి సీత ఎప్పుడెప్పుడు గిరులలో దుఃఖశతములం బొందెనో, అప్పుడప్పుడు కన్నీళ్లు విడుచుచు రాముఁడు ఇంట ఆమెకుఁ గలిగిన సౌఖ్యలక్షలను తలపోయుచుండెను.'

౬౬౯. దాఁపఁబడనట్టి విషయమునందు రూపితము నారోపించుట రూపకము.

'రూపిత'—అని పరిణామమునుండి వ్యవచ్ఛేదము; ఈవిషయమును పరిణామప్రస్తావమున వివేచించెదము; 'దాఁపఁబడనట్టి' అనుట అపహ్నుతివ్యవచ్ఛేదమునిమిత్తము.

౬౭౦. రూపకము పరంపరితము సాంగము నిరంగము అని మూఁడువిధములు.

అమూఁటిలో—

౬౭౧. ఎచట ఒకదానియారోపము మఱియొకదాని యారోపమునకు కారణమగునో అది పరంపరితము, శ్లిష్టాశ్లిష్టశబ్దములచే రచింపఁబడును, మఱియు కేవలము మాలారూపము నగుటచే నాలుగగును.

అందు శ్లిష్టశబ్దనిబంధనమయిన కేవల పరంపరితమునకు ఉదా.—

2 'శ్రీనృసింహమహీపాలుఁడా, ఆహవమున జగదుద్దండరాజమండల రాహువగు నీబాహువునకు స్వస్తి యగుఁగాక.'

ఇచట 'రాజమండలము' 'నృపసమూహ'మందు చంద్రబింబమనెడి యర్థమునకు రాజబాహువునందు రాహుత్వారోపమున నిమిత్తము.

మాలారూపమునకు ఉదా.—

3 'పద్మోదయ దినాధీశుఁడు సదాగతిసమీరణుఁడు భూభృద్దావళి దంభోళియు భూపుఁడొకఁ డీ వొకఁడవే.'

ఇచట పద్మయొక్క యుదయమే పద్మములయొక్క యుదయము, సత్పు

---

1 శిరీషమృద్వీ గిరిషు ప్రపేదే యదాయదా దుఃఖశతాని సీతా
తదాతదాస్యాః సదనేషు సౌఖ్యలక్షాణి దధ్యౌ గళదశ్రు రామః.

2 ఆహవే జగదుద్దణ్డరాజమణ్డల రాహవే
శ్రీనృసింహమహీపాల స్వస్త్యస్తు తవ బాహవే.

3 పద్మోదయ దినాధీశః సదాగతిసమీరణః
భూభృద్దావళి దమ్భోళి రేకఏవ భవాన్భువి.

1 'లావణ్యంపుఁదేనియలతో నిండిన యీమె వికస్వరంపువదనము ఏ జనలోచన మధుప సంఘములచేత త్రాగఁబడదు?'

ఇచట లావణ్యాదులయందు మధుత్వాద్యారోపము శాబ్దము; ముఖమునకు పద్మత్వారోపము ఆర్థము. ఇది ఏకదేశవివర్తిని ఉపమగాదు, ఏలన—వికస్వరత్వధర్మము ఆరోప్యమాణమగు పద్మమునందును ముఖ్యత చేత వర్తిల్లుచున్న ముఖమందును ఉపచరితవ్యమగుటం బట్టి.

౬౭౫. కేవలముగనే రూపణము సేయుట నిరంగము. అదియు మాలారూపము కేవలరూపమునని ఇరుదెఱంగులు.

అందు మాలారూపమైన నిరంగమునకు ఉదా.—

2 'ఈయిందీవర నయన బ్రహ్మయొక్క సృష్టినైపుణి. లోకనేత్రములకు వెన్నెల, అనంగునికి కేళీనిలయము.'

కేవలమునకు ఉదా.—

3 'సాపరాధుఁడైన దాసునియందు పాదప్రహారము ప్రభువులకు తగినదే. కనుక సుందరీ, అందులకు వగవను. పొడతెంచు కఠినంపుఁ బులకమొలక లనెడు ముండ్లమొనలచేత నీ పాదము మృదువు నొచ్చునని నాకు వ్యథ.'

౬౭౬. ఇట్లు రూపకమునందు ఎనిమిది భేదములు.

'ప్రాచీనులచేఁ జెప్పఁబడినవి' అని శేషము. ఒక్కొకచోట పరంపరితము కూడ, ఏకదేశవివర్తి యగును. ఉదా.—

'మాళవేంద్రునియొక్క కత్తి భూమియంగజాలయుద్ధమున విజయము పొందుచున్నది.'

ఇచట భూమియందు అర్థమయిన మహిషీత్వారోపము కత్తియందు అంగ

---

1 లావణ్యమధుభిః పూర్ణ మాస్య మస్యా వికస్వరమ్
లోకలోచన రోలమ్బకదమ్బైః కై ర్న పీయతే.

2 నిర్మాణకౌశలం ధాతు శ్చన్ద్రికా లోకచక్షుషామ్
క్రీడాగృహ మనఙ్గస్య సేయ మిన్దీవరేక్షణా.

3 దాసే కృతాగసి భవ త్యుచితః ప్రభూణాం
పాదప్రహార ఇతి సున్దరి నాస్మి దూయే
ఉద్యత్కఠోర పులకాఙ్కుర కణ్టకాగ్రై
ర్యత్ఖిద్యతే మృదుపదం ననుసా వ్యథా మే.

జాలతనముయొక్క యారోపమునకు నిమిత్తము. ఈభేదమునకు మునుపటినలె మా లారూపత్వమందు సయితము ఉదాహరణము మృగ్యము.

౹౹ ౨౨. సాంగరూపకమందును ఒక్కొకచో ఆరోప్యములు శ్లిష్టములుగాఁ గనఁబడుచున్నవి.

అందు ఏకదేశవివర్తి శ్లిష్టమునకు ఉదా.— మదీయము.—

'కర ముదయ మహీధర స్తనాగ్రే గళిత తమఃపటలాంశుకే నివేశ్య
వికసిత కుముదే క్షణం విచుమ్బత్యయ మమరేశ దిశో ముఖం సుధాంశుః.'

[కరమును తమఃపటలమనెడి వలువ యొడలిన ఉదయమహీధర స్తనాగ్రమందు ఉంచి సుధాంశుఁడు వికసిత కుముదేక్షణమును ఇంద్రదిశయొక్క ముఖమును చుంబించుచున్నాఁడు.]

సమస్తవస్తువిషయమునకు ఉదా.— ఇందులోనే 'విచుమ్బతి' ఇత్యాదియందు 'చుచుమ్బే—హరి దబలాముఖ—మిన్దు నాయకేన' ('ఇంద్రదిశాంగనా ముఖమును సుధాంశు నాయకుఁడు') అనుపాఠము. ఇట శ్లిష్టపరంపరిత మనఁగూడదు. ఏలన— అందు 'భూభృదావళి దమ్భోళి' ఇత్యాదులయందు రాజాదులయందు పర్వతత్వాద్యారోపము లేకుండ వర్ణనీయమయిన రాజాదికి దంభోళిత్వాది రూపణము బాత్తిగా సాదృశ్యములేమిచేత నసంగతము. అట్లగునేని 'పద్మోదయ దినాధీశుఁడు' ఇత్యాదులయందు పరంపరిత మెట్లగును? 'రాజాదులకు సూర్యాదులతో సాదృశ్యము తేజస్వితాదిహేతుకము సంభవించుటంబట్టి' అని చెప్పఁగూడదు. ఏలన—రాజాదులకు తేజస్వితాది హేతుకమయిన సువ్యక్త సాదృశ్యము ప్రకృతమున వివక్షితము గాదు, పద్మోదయాదకమే రెంటికిని సాధారణ ధర్మముగా వివక్షింపఁబడినందున— ఇటనో మహీధరాదికి స్తనాదితో సాదృశ్యము దినోత్తుంగత్వాదిచేత సువ్యక్తమేం కావున శ్లిష్టపరంపరిత గాదు.

ఒక్కొక్కెడ సమాసములేకున్నను రూపక మగపడుచున్నది. ఉదా.—

1 'ఓహారిణాక్షీ, నీముఖము సరోజము కాని యొండుగాదు.'

ఒక్కెడ వైయధికరణ్యమందును రూపము. ఉదా.—

2 'సౌజన్య జల మరుస్థలి, సుచరితాలేఖ్యాకాశభిత్తి, జ్యోత్స్నాకృష్ణచతుర్దశి, సరళతా

1 ముఖం తవ సరోజాక్షి సరోజమితి నాన్యథా.
2 సౌజన్యామ్బు మరుస్థలీ సుచరితాలేఖ్య ద్యుభిత్తి ర్గుణ
జ్యోత్స్నా కృష్ణచతుర్దశీ సరళతాయోగ శ్వపుచ్ఛచ్ఛటా
యై రేషాపి దురాశయా కలియుగే రాజావలీ సేవితా
తేషాం శూలిని భక్తిమాత్రసులభే సేవా కియత్కౌశలమ్.!

యోగశ్వప్రచ్ఛన్నట, అగు రాజావళిని కలియుగమందు దురాశచే నెవరుసేవించిరో
వారికి భక్తిమార్గసులభుఁడయిన శివునిసేవ ఏపాటి నేర్చు!'

ఇది మదీయము. ఇందు కొన్నిరూపకములకు శబ్దశ్లేషమూలకత్వమయినను రూపక విశేషత్వమువలన అర్థాలంకారమందు గణనము. ఇట్లే వక్ష్యమాణాలంకారముల యందు నెఱుంగునది.

౬౭౮. అధికముగా ఆరూఢమైన వైశిష్ట్యముగల రూపకము ఏదో అది.

అదే అధికారూఢవైశిష్ట్య సంజ్ఞకము. ఉదా.— మదీయము.—

1 'ఈవదనము సాక్షాత్తుగా కళంక మెడలిన శశాంకుఁడు, ఈయధరము సుధాధారాధార మగు పండిన దొండపండు, ఈకన్నులు రేయుంబవలు అధికకాంతిగల కువలయములు, ఈ దేహము మిక్కిలి సులువుగా అవగాహము సేయఁదగిన లావణ్యముల సముద్రము.'

ఇచట కళంకరహితత్వాదిచేత వైశిష్ట్యమధికము.

౬౭౯. ఆరోప్యము విషయాత్మతచేత ప్రకృతార్థోపయోగి యగునేని పరిణామాలంకారము, తుల్యాధికరణము అతుల్యాధికరణమునని యిరుదెఱంగులు.

ఆరోప్యమాణము ఆరోపవిషయాత్మతచే పరిణమించుటచే పరిణామము. ఉదా.—

2 'ఆసుందరి దూరమునుండి వచ్చినట్టినాకు నవ్వుచేత కానుక నొసఁగెను, స్తనముల రాయిడి తోడి బిగికౌఁగిటిని జూదమున పందెముగా నొడ్డెను.'

లాంఛిస్థలముల కానుకయు పందెమును వస్త్రాభరణాదిరూపమున నుపయోగింపఁ బడును. ఇచ్చటనో నాయక సంభావనద్యూతములందు స్మితాశ్లేషరూపమున. ప్రథమార్ధమున వైయధికరణ్యముచేత ప్రయోగము, ద్వితీయమున సామానాధికరణ్యముచేత. రూపకములో 'ముఖచంద్రునిఁజూచుచున్నాను' ఇత్యాదులయందు ఆరోప్యమాణమగు చంద్రాది ఉపరంజకమాత్రము. కాని ప్రకృతమగు దర్శనాదియందు ఉపయోగమునొందదు. ఇటనో ఉపాయనాదికమునకు విషయములో తాదాత్మ్యము

1 ఇదం వక్త్రం సాక్షాద్విరహితకళఙ్కః శశధరః
సుధాధారాధారశ్చిరపరిణతం బిమ్బమధరః
ఇమే నేత్రే రాత్రిన్దివమధికశోభే కువలయే
తనుర్లావణ్యానాం జలధిరవగాహే సుఖతరః.

2 స్మితేనోపాయనం దూరాదాగతస్య కృతం మమ
స్తనోపపీడమాశ్లేషః కృతో ద్యూతే పణస్తయా.

ప్రకృతమగు నాయక సంభావనాదియందు ఉపయోగము. అందువలననే రూపకమందు ఆరోప్యము వ్యావర్తకమాత్రముగా నన్వయించును; ఇటనో తాదాత్మ్యముచేత. 'సాపరాధుఁడైన దాసునియందు' ఇత్యాదుల (౬౭౪) యందు రూపకమేగాని పరిణామముగాదు, ఏలన ఆరోప్యమాణమయిన కంటకముయొక్క పాదభేదనకార్యము అప్రస్తుతమగుటవలన; అంతియగాని, యది ప్రస్తుతకార్యమును దేనిని ఘటింపఁజేయుటకు అనుసంధింపఁబడదు.

ఇదియు రూపకమువలె అధికారూఢవైశిష్ట్యముగాను గనఁబడుచున్నది. ఉదా.—

1 'అచట (హిమాలయమందు) వనితలతోఁ గూడియున్న వనేచరులకు గుహాగృహములలోన పర్విన వెలుఁగులుగలవైన తీఁగలు రాత్రులయందు తైలపూరము అక్కఱలేని సురత ప్రదీపములుగా నొప్పును.'

ఇచట ప్రదీపములకు ఓషధ్యాత్మతచేత ప్రకృతమునందు సురతోపయోగియగు నంధకారనాశమునందు ఉపయోగము. అతైలపూరత్వముచేత అధికారూఢ వైశిష్ట్యము.

౬౮౦. ప్రకృతమందు ఇతరముయొక్క సంశయము ప్రతిభోత్థితము సందేహాలంకారము. అది శుద్ధము నిశ్చయగర్భము నిశ్చయాంతము నని త్రివిధము.

దేనిలో సంశయమందే పర్యవసానమో అది శుద్ధము. ఉదా.—

2 ఈమె లావణ్యవృక్షమున రసభరముచే మొలచిన క్రొత్తపూగుత్తియా, పొంగిపొరలుచున్న లావణ్యసముద్రముయొక్క యలయా, కాదేని, మిక్కిలి గాఢంపుఁగోర్కిగల వారికి తనసిద్ధాంతమును చెప్పుటయందు ఆసక్తుఁడగు శృంగారదేవునియొక్క (మదనునియొక్క) సాక్షాదుపదేశంపు బెత్తమా

ఎందు ఆదియందును అంతమునను సందియమే అయి మధ్యమందు నిశ్చయము కల్గునో అది నిశ్చయమధ్యము. ఉదా.—

---

1 వనేచరాణాం వనితాసఖానాం దరీగృహోత్సఙ్గనిషక్తభాసః
భవన్తి యత్రౌషధయో రజన్యామతైలపూరాః సురతప్రదీపాః.

2 కిం తారుణ్యతరోరియం రసభరోద్భిన్నా నవా మఞ్జరీ?
వేలాప్రోచ్ఛలితస్య కిం లహరికా లావణ్యవారాన్నిధేః?
ఉద్గాఢోత్కలికావతాం స్వసమయోపన్యాసవిశ్రమ్భిణః
కిం సాక్షాదుపదేశయష్టిరథవా దేవస్య శృఙ్గారిణః?

1 'ఇతఁడేమి సూర్యుఁడా? అతనికి ఏడు గుఱ్ఱము లుండును గదా; అగ్నియా? అన్నిదిక్కులకును నియతముగా ప్రసరింపఁడు; యముఁడా? అతనికి సాక్షాత్తుగా దున్నపోతు వాహనము; అని మాటికిని యుద్ధములో నిన్నుచూచి ప్రతిభటులు పెక్కువికల్పములం గావింతురు.'

ఇచట మధ్యను సూర్యాద్యభావనిశ్చయము, రాజనిశ్చయ మగునేని రెండవ సంశయము జనించుట సంభవింపదు గావున.

ఎచట ఆదిలో సంశయమును అంతమున నిశ్చయమును కలుగునో అది నిశ్చయాంతము. ఉదా.—

2 'ఇదేమి సరస్సులో సమీపమున సరోజమా, కాదేని తరుణియొక్క ముఖము ప్రకాశించుచున్నదా? ఇంచుకసేపు ఇట్లు సందేహపడి యొకానొకఁడు బకసహవాసులకు పరోక్షములయిన బిబ్బోకముల చేత నిశ్చయముచేసికొనెను.'

'స్థాణువా పురుషుఁడా' అని అప్రతిభోత్థాపితమయిన సంశయము ఈయలంకారము గాదు.

3 'ఓ సరోజాక్షీ పాలిండ్లభారముచే పీడింపఁబడిన నడుము ఉన్నదా లేదా అను సందేహము ఎవరిమనస్సులోఁ గలుగదు?'

ఇచట అతిశయోక్తియే, ఉపమేయమందు ఉపమానసంశయమే ఈయలంకారమునకు విషయము గావున.

౭౮౧. అది కాని దానియందు సామ్యమువలన అది యనెడు బుద్ధి ప్రతిభోత్థితము భ్రాంతి యనఁబడును.

ఉదా.—

---

1 అయం మార్తాణ్డః కిం? స ఖలు తురగైః సప్తభి రితః;
కృశానుః కిః? సర్వాః ప్రసరతి దిశో నైష నియతం.
కృతాన్తః కిం? సాక్షాన్మహిషవహనోఽసా. ఇతి పునః
సమాలోక్యాజౌ త్వాం విదధతి వికల్పాన్ ప్రతిభటాః.

2 కిం తావ త్సరసి సరోజ మేత దారా
దాహో స్విన్ముఖ మవభాసతే తరుణ్యాః
సంశయ్య క్షణ మితి నిశ్చికాయ కశ్చి
ద్బిబ్బోకై ర్బకసహవాసినాం పరోక్షైః

3 మధ్యం తవ సరోజాక్షి పయోధరభరార్దితమ్
అస్తి నాస్తీతి సన్దేహః కస్య చిత్తే న జాయతే,

1 ‘జేలగు గొల్లలు పాలను తలంపుచే ఆవులక్రింద కుండలనుపట్టుచున్నారు, కాంతలును చెవులయందు తెల్లగలువలను భ్రమచే నల్లగలువలను దాల్చుచున్నారు, చెంచెత ముత్తెపుంబూస యను కోర్కెచే రేఁగుఁబండు కోయుచున్నది. చంద్రుని దట్టంపువెన్నెల ఎవనికి చిత్తభ్రమను గావింపదు?’

అస్వరసోత్థాపిత యగు భ్రాంతి ఈ యలంకారము గాదు. ఉదా.—

‘ముత్తెపుఁజిప్పయందు వెండి’ అని.

ఇది అసాదృశ్యమూలయుం గాదు. ఉదా.—

2 ‘ఆ సకి సంగమ విరహములలో ఏది యభీష్టమో విచారింపఁగా విరహమే మేలు, సంగము గాదు; సంగమందు సకి యొక్కతెయే, విరహమందు ముజ్జగంబును తన్మయమే.’

౬౮౨. గ్రహీతృభేదముచేత నేని విషయభేదముచేత నేని ఒక్కటికి పెక్కువిధముల నుల్లేఖము ఉల్లేఖాలంకార మనఁబడును.

వరుసగా ఉదా:—

3 ‘(ఆ)దేవుని ప్రియుఁడని గోపస్త్రీలును, శిశువని వృద్ధులును, అధీశుఁడని దేవతలును, నారాయణుఁడని భక్తులును, బ్రహ్మమని యోగులును గ్రహించిరి.’

ఇందు ఒకటికే (వస్తువునకు) అనఁగా భగవంతునికి ఆయాగుణముల సంబంధమువలన అనేకత్వోల్లేఖమున గోపాలవధూప్రభృతుల యభిలాషాదులు యథాయోగముగా ప్రయోజకములు. ఇట్లు దానిని చెప్పుదురు:—

‘అభిలాష యేదో, కోఁనప్రయోజన మేమో, భావన యేదో, దానిం బట్టి ఒకటే వస్తువునందు అనుసంధాన జనితమగు జ్ఞానము (తోఁపిక) భేదము నొందును.’

ఇచట భగవంతుని ప్రియత్వాదులు వాస్తవములగుట వలనను గ్రహీతృభేదమువలనను మాలారూపకము గాదు, భ్రాంతిమంతము గాదు, అభేదమున భేదమనెడి యతిశయోక్తిభేదమునుం గాదు. అందో ‘అన్యమే యంగలావణ్యము’ ఇత్యాదుల

---

1 ముగ్ధా దుగ్ధధియా గవాం విదధతే కుమ్భా నధో వల్లవాః
కర్ణే కైరవశఙ్కయా కువలయం కుర్వన్తి కాన్తా అపి
కర్కన్ధూఫల ముచ్చినోతి శబరీ ముక్తాఫలాకాఙ్క్షయా
సాన్ద్రా చన్ద్రమసో న కస్య కురుతే చిత్తభ్రమం చన్ద్రికా!

2 సఙ్గమ విరహవికల్పే వర మిహ విరహో న సఙ్గమ స్తస్యాః
సఙ్గే సైవ త థైకా త్రిభువన మపి తన్మయం విరహే.

3 ప్రియ ఇతి గోపవధూభిః శిశు రితి వృద్ధై రధీశ ఇతి దేవైః
నారాయణ ఇతి భక్తై బ్రహ్మే త్యగ్రాహి యోగిభి ర్దేవః.

యందు లావణ్యాదియగు విషయమునందు పృథక్త్వము అధ్యవసింపఁబడుచున్నది, అట్లు ఇట భగవంతునియందు గోపవధూపరిభృతులచే ప్రియత్వాదికము అధ్యవసింపఁబడుటకాదు, ఏమన ప్రియత్వాదికము భగవంతునియందు తత్కాలమున తాత్త్వికమే (అగుటంబట్టి).— కొందఱు చెప్పుదురు:— "ఈ యలంకారమునకు నియమముగా అలంకారాంతరము విచ్ఛిత్తిమూలము, అట్లే చెప్పిన యుదాహరణమందు శిశుత్వాదుల నియమాభిప్రాయముచేత ప్రియత్వాదులకు భిన్నత్వాధ్యవసాయము అని అతిశయోక్తి యున్నది. అది యున్నను గ్రహీతృభేదముచేత నానాత్వప్రతీతిరూపమయిన విచ్ఛిత్తివిశేషము ఉల్లేఖనామకమగు వేఱలంకారమునకు ప్రయోజకము* అని.

శ్రీకంఠదేశవర్ణనమందు 'వజ్రపంజరమని శరణాగతులచేతను, అంబరవివరమని [వాతికై: (?) వాతికులచేతను (?) వాతికములచేతను (?) చాతకములచేతను (?)]' ఇత్యాదికము ఈ యలంకారమునకు అతిశయోక్తి చేరని ప్రత్యేకవిషయము; ఇచట రూపకాలంకార యోగము. వాస్తవముగా 'అంబరవివరమని' ఇత్యాదియందు భ్రాంతిమంతమునే అంగీకరింతురుగాని రూపకమును గాదు; ఏలన భేదప్రతీతి పురస్సరమైన యారోపమే గౌణీమూలములైన రూపకాదులకు ప్రయోజకమగుటవలన. శారీరకమీమాంసా భాష్య వ్యాఖ్యానమందు శ్రీవాచస్పతిమిశ్రులవారు ఇట్లు చెప్పినారు: మఱియు ఉపమానాభిధాయక శబ్దము ఉపమేయమునందుఁ గనఁబడుచున్న సాధారణ గుణముల సంబంధముచేత వర్తిల్లును అని; ఎందువలన వక్తృశ్రోతలకు ప్రమాత్మకమయిన సాదృశ్యముయొక్క జ్ఞానము కలుగునో, అది గౌణమను శబ్దవ్యాపారము' అని. మఱి ఇచట శ్రీకంఠదేశవర్ణనమందు వాతికులయొక్క అంబరవివరారోపము భ్రాంతికృతమే అని. ఈ వాక్యమందే 'తపోవనమని మునులచేతను కామాయతనమని వేశ్యలచేతను' ఇత్యాదియందు పరిణామాలంకార యోగము.

'గాంభీర్యముచే సముద్రమవు గౌరవముచే పర్వతమవు.'

ఇత్యాదులయందును పలువగల నుల్లేఖించుటలో గాంభీర్యాది విషయభేదకము ప్రయోజకము. ఇందును రూపకయోగము.

'వచనమున గురుడవు, ఉరమున పృథువవు, యశమున అర్జునుఁడవు.'

ఇత్యాదులయందును దీనికి రూపకముకన్న విషయము భిన్నము. ఏలన నిటశ్లేషమూలాతిశయోక్తి యోగము.

ఉ॥ 3. ప్రకృతమును ప్రతిషేధించి అన్యమును స్థాపించుట యపహ్నుతి.

ఇది యిరుదెఱంగులు. కొన్నిచోట్ల అపహ్నవపూర్వకమైన యారోపము కొన్నిచోట్ల ఆరోపపూర్వకమైన యపహ్నవము నని. వరుసగా నుదా.—

1 'ఇది ఆకాశమండలము గాదు వారాశి, ఇవియు నక్షత్రములు గావు క్రొత్తనురుగుపుం దునియలు, ఇతఁడు చంద్రుఁడు గాఁడు చుట్టచుట్టుకొనిన నాగేంద్రుఁడు, ఇది మచ్చ గాదు పరున్న నారాయణుఁడు.'

2 'ఇదె పడమటికొండశిఖరముఁ దగులుచు నురువుముద్దవన్నెగలదై రాత్రియెల్లను మండిన మదనాగ్నియొక్క పొగను స్ఫుటమయిన మచ్చయను మిషచేత ధరించి చలివెలుఁగు బింబము ఒప్పుచున్నది.'

ఇదిమదీయము.

ఇట్లు 'ఆకాశమనెడి దేహముగలదై సముద్రము ప్రకాశించుచున్నది, అందు నురువుఁదునియలు తారామయములుగా నొప్పుచున్నవి' ఈ విధముగాఁ గూడ ప్రకృతనిషేధము నెఱుంగునది.

౬౮౪. దాఁచవలసిన యర్థమును ఎట్లో ద్యోతింపఁజేసి శ్లేషచేతగాని మఱి యొండువిధమునగాని వేఱుగా దమ్మాట యేదో అదియు అపహ్నుతియే.

శ్లేషచేత ఉదా —

3 'నీరదముల కాలమందు అపతిత నుండ శక్యముగాకయున్నది. ఓసి చపలా కొంగునిగ్గి ఉవ్విళ్ళూరుచున్నావా? కాదు కాదు, సఖీ, దారి జాఱుడుగానున్నది.'

[అపతితయా = పతిలేమిచేత—పడి పోవఁబోసి—పడనందున]

ఇచట అపతితయా అనుచో పతిలేకుండ అని చెప్పి పిమ్మట పతనాభావముగా అని వేఱుచేయఁబడినది. అశ్లేషముగా ఉదా.—

4 'ఇట తూర్పుగాలికి గ్రక్కదలినదై ఏ లత వనస్పతిం గూడదు? సఖి, కాంతుని రతోత్సవమును తలఁచుకొనుచున్నావా? కాదు, మేఘాగమనరీతి నుదాహరించితిని.'

---

1 నేదం నభోమణ్డల మమ్బురాశి ర్నైతాశ్చ తారా నవఫేనభఙ్గాః
నాయం శశీ కుణ్డలితః ఫణీన్ద్రో నాసౌ కళఙ్కః శయితో మురారిః॥

2 ఏత ద్విభాతి చరమాచలచూడచుమ్బి హిణ్డీరపిణ్డరుచి శీతమరీచిబిమ్బమ్
ఉజ్జ్వాలితస్య రజనీం మదనానలస్య ధూమం దధత్ప్రకటలాఞ్ఛనకైతవేన.

3 కాలే వారిధరాణా మపతితయా నైవ శక్యతే స్థాతుమ్
ఉత్కణ్ఠితాసి తరలే నహి నహి సఖి పిచ్ఛిలః పన్థాః॥

4 ఇహ పురోఽనిలకమ్పితవిగ్రహా మిలతి కా న వనస్పతినా లతా
స్మరసి కిం సఖి కాన్తరతోత్సవం నహి ఘనాగమరీతి రుదాహృతా.

వక్రో_క్తియందు పరో_క్తిని అన్యథాకరించుట, ఇందు స్వో_క్తినే అని భేదము. గోపనము సేయువాఁడే గోపనీయమును సయితము మున్నుగా చెప్పుటచేత వ్యాజో_క్తినుండియు భేదము.

౬౮౫. అన్యమును నిషేధించి ప్రకృతము మఱల స్థాపించుట నిశ్చయము.

ఉదా.— మదీయము.—

1 'ఇది ముఖము గాని కమలము గాదు, ఇవి కన్నులు గాని నల్లగలువలు గావు, ఇట ఈ ముగ్ధాక్షిచెంగట ఏల తుమ్మెదా పరిభ్రమించెదవు?'

మఱియొక యుదా.—

2 'ఇది యెదపై తామరతూఁటిహారము గాని పాపఱేఁడు గాఁడు, కంఠమున నల్లగలువ దండ గాని ఆ గరళకాంతి గాదు, ప్రియావిరహితుఁడనైన నా యొడల నిది చందనపుఁ బూడి గాని విబూదిపూఁత గాదు, అనంగుఁడా హరభ్రమచే నన్నుఁ గొట్టకు, కోపముతో ఏల పరుగెత్తెదవు?'

ఇది నిశ్చయాంతసందేహము గాదు, అందు సంశయనిశ్చయములు ఒక్కరివిగా నుండుటం బట్టి; ఇటనో భ్రమరాదులకు సంశయము, నాయకాదులకు నిశ్చయము. మఱియు భ్రమరాదులకును సంశయము లేదు. ఏలయన (వాని) జ్ఞానము ఏకకోట్య సధికమైననేగాని (అవి) సమీపమునకు వచ్చుట సంభవింపదు గావున. అట్లయిన భ్రాంతిమంత మగుఁగాక; కానిమ్ము భ్రమరాదులకు భ్రాంతియే అగుఁగాక; కాని యిట నది చమత్కారవిధాయి కాదు; మఱి యేమన ఆ విధమయిన నాయకాద్యు_క్తియే చమత్కారవిధాయి యని సహృదయు లెఱుంగుదురు. మఱియు భ్రమరాదుల పతన ము గాని భ్రాంతి గాని వివక్షితము కాకున్నను తాదృశో_క్తి నాయికం గూర్చిన చాట్వాదిగానైనను సంభవించును. ఇది రూపకధ్వనియుం గాదు, ముఖమును కమలత్వముచే నిర్ధారింపనందున; అపహ్నుతియుం గాదు, ప్రస్తుతమును నిషేధింపనందు న; కావున నిది పూర్వులు చెప్పిన యలంకారములకన్న వేఱే ఒక యలంకారము.

---

1 వదన మిదం న సరోజం నయనే నేన్దీవరే ఏతే
ఇహ సవిధే ముగ్ధదృశో మధుకర న ముధా పరిభ్రామ్య.

2 హృది బిసలతాహారో నాయం భుజఙ్గమనాయకః
కువలయదలశ్రేణీ కణ్ఠే న సా గరళద్యుతిః
మలయజరజో నేదం భస్మ ప్రియా రహితే మయి
ప్రహర న హర భ్రాన్త్యానఙ్గ, క్రుధా కిము ధావసి?

వెండి యనుకొని ముత్తెపుఁజిప్పకై వంగుచున్నవానింగూర్చి 'ఇది ముత్తెపుఁజిప్ప గాని వెండి గాదు' అని యెవఁడేని చెప్పుట యీ యలంకారము గాదు; నైచిత్రి లేసందుసు.

౬౮౬. ప్రకృతమును పరరూపమున సంభావించుట ఉత్ప్రేక్ష యనఁబడును; ముందుగా అది వాచ్యయు ప్రతీయమానయు నని యిరుదెఱంగుల సంగీకరింపఁబడియున్నది; ఇవాది ప్రయోగమున వాచ్య; తదప్రయోగమున ప్రతీయమాన; రెంటను జాతి గుణము క్రియ ద్రవ్యమును ఉత్ప్రేక్ష్యము లగుటచే ఎనిమిది విధములగును, ప్రత్యేక భావాభావాభిమానములచేతను, నిమిత్తము మరల గుణక్రియారూప మగుటవలనను అటు ముప్పదిరెండు భేదములగును.

అందు వాచ్యోత్ప్రేక్షకు దిఙ్మాత్రము ఉదా.—

1 'చంచలాంశుకాంచలముతోడిది కురంగాక్షి యూరువు కనకమయమయిన మదనుని విజయస్తంభమో యనం బ్రకాశించుచున్నది.'

ఇచ్చట విజయస్తంభము బహువాచకము కావున జాత్యుత్ప్రేక్ష.

2 'జ్ఞానము కలిగి మౌనము, శక్తి కలిగి ఓర్పు, త్యాగము చేసి పొగడ్త నొల్లమి, అని యతని గుణములు గుణప్రయోజకము లగుటవలన సప్రసవములో (కొన్నుతోఁగూడినవియో) యన నొప్పెను.'

ఇట సప్రసవత్వము గుణము.

3 'ఓయి సుల్తానా, నీపటహధ్వానము వైరివధూవర్గగర్భములను పడఁజేసి పాతకియై గంగాజలమందు స్నానము చేయుచున్న దన నొప్పుచున్నది.'

ఇట 'స్నానముచేయుచున్నడ' అని క్రియ.

4 'హరిణాక్షిముఖము వేఱు పూర్ణచంద్రుఁడో యన వెలుఁగుచున్నది.'

ఇచట 'చంద్రుఁ'డని ఒక్కటే వ్యక్తికి వాచకమగుటవలన ద్రవ్యశబ్దము. ఇవి భావాభిమానమున (నుత్ప్రేక్షలు).

---

1 ఊరుః కురఙ్గకదృశశ్చఞ్చలచేలాఞ్చలో భాతి
సపతాకః కనకమయో విజయస్తమ్భః స్మరస్యేవ.

2 జ్ఞానే మౌనం క్షమా శక్తౌ త్యాగే శ్లాఘావిపర్యయః
గుణా గుణానుబన్ధిత్వాత్తస్య సప్రసవా ఇవ.

3 గఙ్గామ్భసి సురత్రాణ తవ నిస్సాణనిస్వనః
స్నాతీవారివధూవర్గగర్భపాతనపాతకీ.

4 ముఖమేణీదృశో భాతి పూర్ణచన్ద్ర ఇవాపరః.

అభావాభిమానమందు ఉదా.—

1 'ఆయొక్క ఈ మిదియొక్క కపోలఫలకములు ఆంత సుందరములై ఒండొకటిం జూడని కతంబుననో యన ఈదినము గా కొర్శ్యము బొందినవి.'

ఇచట 'చూడనివి' అని క్రియకు అభావము. ఇట్లే ఇతరము. నిమిత్తము గుణక్రియా రూప మయినందులకు ఉదా.—

'ఓయి సుల్తానా' ఇత్యాదులలో 'స్నానముచేయుచున్న దన' అను నుత్ప్రేక్షకు నిమిత్తము పాతకిత్వము గుణము. 'చూడని' ఇత్యాదులయందు క్షామతాప్రాప్తిరూప మయిన నిమిత్తము క్రియ. ఇట్లే ఇతరము.

ప్రతీయమానోత్ప్రేక్షకు ఉదా.—

2 'తన్వంగియొక్క స్తనయుగ్మము ముఖమును చూపకున్నది, గుణియైన హారమునకు చోటియ్యలేదను లజ్జచేత.'

ఇట 'లజ్జచేతనుం బోలె' అని ఇవార్థకాభావముచేత ప్రతీయమానోత్ప్రేక్ష. ఇట్లే ఇతరము. అటయిన మఱి- ధ్వనినిరూపణప్రస్తావనుందు అలంకారముల కన్నిటికిని వ్యంగ్యత్వము కలుగునని చెప్పినారే ఇప్పుడో విశేషించి ఉత్ప్రేక్షకు ప్రతీయమానత్వము ఎట్లు? ఇందులకు సమాధానము చెప్పుచున్నాము. 'సొబగుండా వేగురు మహిళలు' ఇత్యాది (౨౫౦) యగు వ్యంగ్యోత్ప్రేక్షయందు ఉత్ప్రేక్షణము లేకున్నను వాక్యవిశ్రాంతి కలదు, ఇటనో స్తనములకు లజ్జ సంభవింపదు గావున 'లజ్జచేతనుంబోలె' అని ఉత్ప్రేక్షచేతనే అని వ్యంగ్యప్రతీయమానోత్ప్రేక్షలకు భేదము. ఇట వాచ్యోత్ప్రేక్షయొక్క పదునాఱుభేదముల నడుమ విశేషముం జెప్పుచున్నాఁడు.

౬౯౭. అందు వాచ్యోత్ప్రేక్షా భేదములు రెండియు ద్రవ్యము తప్ప అన్నియు మూఁడువిధముల స్వరూప ఫల హేతుగతము లగును.

అందు అనఁగా వాచ్యప్రతీయమానోత్ప్రేక్షలకుం జెప్పిన భేదములందు, మధ్య, వాచ్యోత్ప్రేక్షయొక్క పదునాఱు భేదములు ఏవి కలవో వానియందు జాత్యాదులకు మూఁడింటికిని ఏ పండ్రెండు భేదములో వానికి ప్రత్యేకము స్వరూపఫల

---

1 కపోలఫలకా వస్యాః కష్టం భూత్వా తథావిధా
అపశ్యన్తా వి వాన్యోన్య మీదృశీం క్షామతాం గతా.

2 తన్వఙ్గ్యాః స్తనయుగ్మేన ముఖం న ప్రకటీకృతం
హారాయ గుణినే స్థానం న దత్త మితి లజ్జయా.

హేతుగమ్యత్వముం బట్టి పండ్రెండు భేదములకును ముప్పదియాఱు భేదములు అగును. ద్రవ్యమునకు స్వరూపోత్ప్రేక్షణము మాత్రమే కలుగుటంబట్టి నాలుగు భేదములు అని అన్నియుం గలసి నలువది భేదము లగును. అందు స్వరూపోత్ప్రేక్షకు ఉదా.— 'మన్మథునివిజయ స్తంభము' (౬౮౬) అని. 'సప్రసవములో అన' (౬.౨౬.) ఇత్యాదులు జాతిగుణస్వరూపగతములు. ఫలోత్ప్రేక్షకు ఉదా.—

1 'మఱి రాముఁడు ప్రేరించిన బాణము రావణుని హృదయమునుగూడ భేదించి నాగులకు ప్రియము నివేదించుటకుం బోలె భూమిం జొచ్చెను.

ఇచ్చట 'నివేదించుటకు' అని భూప్రవేశమునకు ఫలము క్రియారూపముగా నుత్ప్రేక్షితము. హేతూత్ప్రేక్షకు ఉదా.—

2 'నిన్ను నేను వెదకుచుండఁగా భూమియందు ఎచట ఒక యందియ నీచరణము నెడఁ బాసిన దుఃఖముచేతనుం బోలె మౌనము పూనినదై కనఁబడెనో అస్థలము ఇది.'

ఇచట దుఃఖరూపమయిన గుణము హేతువుగా నుత్ప్రేక్షితము. ఇట్లే ఇతరము.

౬౮౮. అందు స్వరూపగతలు ఉక్తియు అనుక్తియు నిమిత్తము లగుటం బట్టి ఇరువదెనిమిది.

ఆ నలువది భేదముల నడుమ ఏవి స్వరూపగతయొక్క పదునాఱు భేదములో అవి ఉత్ప్రేక్షానిమిత్తమును చెప్పుటచేతను చెప్పమిచేతను ముప్పదిరెండు భేదము లగును, కాన కలసి ఏఁబదియాఱు భేదములు వాచ్యోత్ప్రేక్షకుఁ గలుగును. అందు నిమిత్తమునకు ఉపాదానమునకు పూర్వోదాహృతమందు 'స్నానముచేయుచున్న దన' అను నుత్ప్రేక్షకు నిమిత్తము పాతకిత్వము చెప్పఁబడినది. అనుపాదానమునకు ఉదా.— 'వేఱు చంద్రుఁడోయన' అనుచోట తథావిధసౌందర్యాద్యతిశయము ఉపాత్తముగాదు. హేతుఫలములయందో నియతముగా నిమిత్తమునకు ఉపాదానమే అగును. ఎట్లన 'ఎడఁబాసిన దుఃఖముచేతనుం బోలె' అన్నచోట ఏ బద్ధమౌనత్వము నిమిత్తమో 'నివేదించుటకుంబోలె' ననుచోట ఏ భూప్రవేశము నిమిత్తమో ఆ రెంటిని చెప్పకున్నయెడల వాక్యము అసంగతమే అగును. ప్రతీయమానయొక్క పదునాఱుభేదములయందును విశేషముం జెప్పుచున్నాఁడు.

---

1 రావణస్యాపి రామాస్తో భిత్త్వా హృదయ మాశుగః
వివేశ భువ మాఖ్యాతు మురగేభ్య ఇవ ప్రియమ్.

2 సైషా స్థలీ యత్ర విచిన్వతా త్వాం భ్రష్టం మయా నూపుర మేక ముర్వ్యామ్
అదృశ్యత త్వ చ్చరణారవిన్ద విశ్లేష దుఃఖా దివ బద్ధమౌనమ్.

౨౮౯. ప్రతీయమానా భేదములు ప్రత్యేకము ఫలహేతుగములు.

ఉదా.— 'తన్వంగియొక్క స్తనయుగ్మము' (౨౮౬) అనునెడ 'లజ్జచేతనుం బోలె' అని హేతువు ఉత్ప్రేక్షితము. దీనియందును నిమిత్తముయొక్క అనుపాదానము సంభవింపదు. ఇవాద్యనుపాదానమున నిమిత్తమును గూడ చెప్పకున్నయెడల ప్రమాత ఉత్ప్రేక్షను నిశ్చయించుకొనలేఁడు గావున. స్వరూపోత్ప్రేక్ష గూడ ఇట ఘటింపదు. ధర్మాంతర తాదాత్మ్య నిబంధనయగు దీనియందు ఇవాదిని (ఉత్ప్రేక్షావాచకమును) ప్రయోగింపనియెడల విశేషణయోగమున అతిశయోక్తి అంగీకరింపఁబడుటవలన. ఉదా.— 'ఈ రాజు అపరపాకశాసనుఁడు' అని. విశేషణము లేనియెడల రూపకము (అంగీకరింపఁబడును). ఉదా.— 'రాజు పాకశాసనుఁడు' అని. కనుక ఇట్లు ప్రతీయమానోత్ప్రేక్ష ముప్పదిరెండు ప్రకారములు.

౨౯౦. ప్రస్తుతమును చెప్పుటచేతను చెప్పనిచేతను ప్రత్యేకము అవియు నిరుదెఱంగులు.

అవి యనఁగా ఆయుత్ప్రేక్షలు. చెప్పుటకు ఉదా.—'చంచలాంశుకాంచలముతోఁడి యూరువు' ఇత్యాది.

చెప్పనికి ఉదా.— మదీయప్రభావతియందు—

1 'ప్రద్యుమ్నుఁడు— ఇట నిప్పుడు నిశ్చయముగా దిగంతరముం గప్పుచున్న చీకట్ల మొత్తముచేత లోకము కాటుకరాసులచేత చేయఁబడినదియుం బోలెను కస్తూరి ధూళిచేత నిండింపఁబడినది వోలెను చీఁకటి చెట్లచేత వ్యాప్తమువోలెను నల్లవలువలచేత కప్పఁబడినదివోలెను.'

ఇచట కాటుకచేత ఘటితత్వములోనగు నుత్ప్రేక్షణీయమునకు విషయవ్యాప్తత్వము ఉక్తముగాదు.

ఇదియు నుదా.—

2 'చీకటి యవయవములను పూసికొనుచున్నదో యననున్నది, ఆకాశము చీకటిని కురియుచున్నదో యననున్నది.'

---

1 ఘటిత మివాఞ్జనపుఞ్జైః పూరిత మివ మృగమదక్షోదైః
తత మివ తమాలతరుభి ర్వృత మివ నీలాంశుకై ర్భువనమ్.

2 లిమ్పతీవ తమోఽఙ్గాని వర్షతీవాఞ్జనం నభః
అసత్పురుషసేవేవ దృష్టి ర్నిష్ఫలతాం గతా.

ఇట తమముయొక్క లేపనమునకు వ్యాపనరూపమయిన విషయము ఉపాత్తము గాదు. అంజనవర్షణమునకు తమస్సంపాతము (ఉపాత్తముగాదు). మఱి ఈ రెంటను ఉత్ప్రేక్షానిమిత్తములు వరుసగా చీకటియొక్క యతిబహుళత్వంబును ధారారూపమ్మున క్రిందికి కురియుటయు. కొందఱు 'లేపనకర్తకాని దయినను తమస్సు లేపనకర్తగా నుత్ప్రేక్షితము; వ్యాపనము నిమిత్తము; ఇట్లు ఆకాశము కూడ వర్షణక్రియాకర్తగా (ఉత్ప్రేక్షితము),' అని చెప్పుదురు.

౬౧. అది అలంకారాంతరోద్భూత మేని ఎక్కుడు వైచిత్ర్యమును వహించును. అందు సాపహ్నవోత్ప్రేక్షకు ఉదా.— మదీయము.—

1 'పావకోద్గతమయిన హోమధూమముచేత నయనము కలుషమైన సునయన బాష్పమిషచేత లావణ్యవారియొక్క వెల్లి మేన నిముడక వెలికిఁబాఱుచున్నదో యన నొప్పుచున్నది.'

శ్లేష హేతుగకు ఉదా.—

2 'ఇఱుకటమయిన శుక్తిగర్భమనుండి వెలవడిన ముక్తోత్కరము. ఈ సరోజాక్షియొక్క శంఖమువంటి మెడయందు నెలకొనుటవలన గుణవత్త్వముఁ బొందెను జుమా.'

[గుణవత్త్వము ఉత్కృష్టగుణము (దారము—యోగ్యత) కలదగుట] ఇచట 'గుణవత్త్వము' అనుచో శ్లేష. 'శంఖమువంటి మెడయందు నెలకొనుటవలనఁ జుమా అని హేతూత్ప్రేక్షయందు హేతువు.

ఇచట 'చుమా' (జానీమహే) అని ఉత్ప్రేక్షావాచకము: ఇట్లు—

౬౨. మన్యే, శఙ్కే, ధ్రువమ్, ప్రాయః, నూనమ్ ఇత్యాదులు.

[అనక, బలెక, పోలెక, చుమా, ఇత్యాదులు]

ఒక్కొక్కెడ ఉపమోపక్రమోత్ప్రేక్ష: ఉదా.—

3 'మురారి సముద్రముయొక్క నీటి కవల నల్లని పలాశతరుపుంజములతోడి వనశ్రేణులను వేలకొలఁది యలలచేత గట్టుమీఁద పైవఁబడిన తూండ్లవంటివానిని (శైవలాభాః) కాంచెను.'

---

1 అశ్రుచ్ఛలేన సుదృశో హుత పావక ధూమ కలుషాక్ష్యాః
అప్రాప్య మానభఙ్గే విగళతి లావణ్యవారిపూర ఇవ.

2 ముక్తోత్కరః సఙ్కటశుక్తిమధ్యా ద్వినిర్గతః సారసలోచనాయాః
జానీమహేఽస్యాః కమనీయ కమ్బుగ్రీవాధివాసా ద్గుణవత్త్వమాప.

3 పారే జలం నీరనిధే రపశ్య న్మురారి రానీలపలాశరాశీః
వనావళీ రుత్కలికా సహస్ర ప్రతిక్షణోత్కూలిత శైవలాభాః.

అను నిట్టెడ ఆభాశబ్దము(వంటిశబ్దము) ఉపమావాచక మగుటంబట్టి ఉపక్రమములో ఉపమ. పర్యవసానమునందో సముద్రతీరమున తూండ్లు (శైవాలము) సంభవింపదు గావున సంభావన కలుగుటంబట్టి ఉత్ప్రేక్ష. ఇట్లే విరహావర్ణనమందు- 'కంకణములు బాహుపురులవలె ఆచరించినవి' అనునెడ, 'మృగాయతనేత్రయొక్క కుటిలకటాక్షము చెవియందు వికసించిన నల్లగలువవలె ఆచరించుచున్నది' ఇత్యాదులయందును ఎఱుంగవలయును. భ్రాంతిమదలంకారమున— 'బేలలగు గొల్లలు' (౬౮౧) ఇత్యాదికమున గొల్లలులోనగు భ్రాంతులకు చంద్రికాదికమనెడి విషయము యొక్క జ్ఞానమే లేదు, దానిని కవియే నిబంధించినందున; ఇచటనో సంభావనాకర్తకు విషయముయొక్కయు జ్ఞానము కలదు, అని రెంటికిని భేదము. సందేహమందో, కోటిద్వయము సమకక్షగా తోఁచును, ఇందో సంభావ్యభూతమగునది ఒకటె కోటి ఉత్కటం. అతిశయోక్తియందు ప్రతీతమగు విషయియందు పర్యవసానమున అసత్యత తోఁచును, ఇటనో ప్రతీతికాలమందే అని భేదము.

' రఞ్జితా ను వివిధా స్తరుశైలా నామితే న్ను గగనం స్థగిత న్ను
పూరితా ను విషమేషు ధరిత్రీ సంహృతా ను కకుభ స్తిమిరేణ.'

[చీకటి నానావిధములయిన తరుశైలములకు వన్నె వేసినదా ఏమి? ఆకాశమును దింపినదా, (భూమికి) తాపించినదా? పల్లములందు భూమిని నిండించినదా, దిక్కులను సంహరించినదా?]

అను నిట్టెడ తర్వాదులయందు తిమిరాక్రాంతత్వము రంజనాదికముగా సందేహింపఁబడుట సందేహాలంకారమని కొందఱు చెప్పుట యేది కలదో అది సరిగాదు; ఏలన, ఏకవిషయమందే సమానబలతచేత అనేకకోటి స్ఫురణమే సందేహమగుటవలన; ఇటనో తర్వాదివ్యాప్తికి ప్రతిసంబంధియెడను భేదమ్ము[1] వ్యాపనాదిని అర్థఃకరించుట వలన రంజనాదులయొక్క స్ఫురణంబును. ఇతరులో 'అనిర్ధారణరూపమగు విచ్ఛిత్తి కలిమింజేసి ఏకకోటి కెక్కుడయినను ఇది సందేహాలంకారమున నొకభేదము' అని వచింతురు; అదియును యుక్తముగాదు; ఏలయన నిగీర్ణస్వరూపమునకు అన్యతాదాత్మ్యప్రతీతిగదా సంభావన. అది యిట స్ఫుటముగా ఉండనేయున్నది, ను శబ్దము చేత ఇవ శబ్దముచేతనుం బోలె ద్యోతింపఁబడుచును ఉన్నది; కావున దీనిని ఉత్ప్రేక్ష అనుటయే యుక్తము. అదృష్టసందేహప్రకారకల్పన వలదు.

1 'చంద్రునిలోపలి ఏ యిది మబ్బుపట్టునియు చందమును వహించియున్నదో దానిని లోకము

1 య దేత చ్చన్ద్రా న్త ర్జలదలవ లీలాం వితనుతే
త దాచష్టే లోకః శశక ఇతి; నో మాం ప్రతి తథా.

కుందేలని చెప్పను, నాకు అట్లు తోఁపలేదు; నేనో ఇంద్రుని నీ స్తనముల పిరద్రాపీడితల యిన యువతుల యపాంగవీక్షణముల నెడి కొలవులు పడుటచేనైన వ్రణముల మచ్చల కళంకములచే నంకితమయిన దేహముగలవానినిగా (మన్యే) తలంచుచున్నాను,'

అను నియ్యెడ 'మన్యే' శబ్దప్రయోగమున్నను ఉక్తస్వరూపముగు సంభావన తోఁపనందున వితర్కమాత్రమే గాని అపహ్నవోత్ప్రేక్ష గాదు.

౬౯౩. అధ్యవసాయము సిద్ధమగునేని అతిశయోక్తి చెప్పఁబడును.

విషయనిగరణముచేత విషయియొక్క అభేదప్రతిపత్తి అధ్యవసాయము. ఉత్ప్రేక్షయందు విషయిని అనిశ్చితముగా నిర్దేశించుటంబట్టి అధ్యవసాయము సాధ్యము. ఇటనైన నిశ్చితముగానే తోఁచుటంబట్టి సిద్ధము. విషయనిగరణము ఉత్ప్రేక్షయందు విషయమునకు అధఃకరణమాత్రముచేత; ఇందు 'ముఖము గెండవ చంద్రుఁడు' ఇత్యాదులయందును అట్లే. ఇట్లు చెప్పుదురు.— 'విషయమును చెప్పి నను చెప్పకున్నను అధఃకరణమాత్రముచేత నిగీర్ణత్వ మని పెద్దలు చెప్పుదురు.'

౬౯౪. భేదమందు అభేదము, సంబంధమందు అసంబంధము, వాని విపర్యయములు, కార్యహేతువులకు పౌర్వాపర్యాత్యయము, అని అది అయిదు విధములు.

వాని విపర్యయములు అభేదమందు భేదము, అసంబంధమందు సంబంధము. అది యనఁగా అతిశయోక్తి. అందు భేదమందు అభేదమునకు ఉదా.— మదీయము—

1. 'ఎట్లు, పైని నెమలికుంచె విలసిల్లుచున్నది, దానిక్రింద అష్టమీచంద్రఖండము, దాని క్రింద చంచలమయిన కువలయద్వంద్వము, అటుక్రింద నవ్వుఁబువ్వు, దానిక్రింద పగడము!'

ఇట కాంతాకేశపాశాదులకు నెమలికుంచె లోనగువానితో అభేదముచే అధ్యవసాయము. ఇదియేని యుదా.— 'ఎడఁబాసిన దుఃఖముచేతనుం బోలె మాసము పూనినదై' (౬౮౭). ఇచట చేతనగతమైన మాలిన్యము వేఱు అచేతనగతమైన మాలిన్యము వేఱు అని రెంటికిని భేదము. ఇట్లే—

అహం త్విన్దుం మన్యే త్వ దరి విరహాక్రాన్త తరుణీ
కటాక్షోల్కాపాత వ్రణ కిణ కలఙ్కాఙ్కిత తనుమ్.

2 కథ ముపరి కలాపినః కలాపో విలసతి తస్య తలేఽష్టమీన్దు ఖణ్డమ్
కువలయ యుగలం తతో విలోలం తిలకుసుమం తదధః ప్రవాళ మస్మాత్.

'దీని యౌవనమందు అధరపల్లవముతోఁ గూడ ప్రియుఁడు రాగభాక్కు.'

ఇట అధరముయొక్క రాగము ఎఱుపు, ప్రియుని రాగము ప్రేమ, రెంటికిని అభేదము.

అభేదమందు భేదమునకు ఉదా.—

'ఆ పద్మపత్రనేత్రను అన్యమే యగు లావణ్యము, అన్యములే సౌరభ్యసంపదలు సరసత్వము అలోకసామాన్యము.'

సంబంధమున అసంబంధమునకు ఉదా.—

1 'సృష్టిఁజేయ నయ్యె విధి ప్రాశస్త్యమహోజ్జ్వలమూర్తి చంద్రుఁడో?
అగి రసైక కంపము స్వయం బసమాస్త్రుఁడో! పుష్పమాసమో?
వేదజడుండు ప్రౌఢపసి వీతసమస్తకుతూహలుం డెటుల్
శ్రద్ధాలంకరణ మనోహరముఁ జేయఁగ నేర్చెడి నిట్టి రూపమున్.'

ఇచట పురాణ ప్రజాపతి నిర్మాణ సంబంధమందే అసంబంధము చెప్పఁబడినది. అసంబంధమునందు సంబంధమునకు ఉదా.—

2 'చంద్రమండలమున ఇందీవరయుగళ ముండునేని అప్పుడు చారునేత్రమయిన యీ యింతివదనము పోల్పఁబడును.'

ఇచట ఏని (యది) శబ్దముయొక్క యర్థబలమున కల్పితమైన సంబంధముచేత సంభావనతో సంబంధము.

కార్యకారణములకు పౌర్వాపర్యవిపర్యయము రెండు విధముల నగును; కారణమునకుముందు కార్యము కలుగుట, రెండును సమకాలమం దగుట. వరుసగా ఉదా.—

3 'ముందుగానే హరిణాక్షుల హృదయము ఉత్కంఠావ్యాకులమయినది, రసాల వకుళ లక్ష్ములు పిమ్మట సంజాతముకుళము లయినవి.'

4 'ద్విరదగామియైన యీ రాజుచేత తండ్రినుండి వచ్చిన సింహాసనమును అఖిలమయిన రాజ మండలమును ఏకకాలమందే ఆక్రమింపఁబడినది.'

---

1 అస్యాః సర్గవిధౌ ప్రజాపతి రభూ చ్చన్ద్రో ను కాన్తప్రభః
శృఙ్గారైకరసః స్వయం ను మదనో మాసో ను పుష్పాకరః
వేదాభ్యాసజడః కథం ను విషయ వ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం రూపం పురాణో మునిః.

2 యది స్యా న్మణ్డలే సక్త మిన్దో రిన్దీవరద్వయమ్
త దోపమీయ తే తస్యా వదనం చారులోచనమ్.

3 ప్రాగేవ హరిణాక్షీణాం చిత్త ముత్కలికాకులమ్
పశ్చా దుద్భిన్నముకుళా రసాల వకుళ శ్రియః.

4 సమ మేవ సమాక్రాన్తం ద్వయం ద్విరదగామినా
తేన సింహాసనం పిత్ర్య మఖిలం చారిమణ్డలమ్.

ఇట కొందఱు చెప్పుదురు:— "కేశపాశాది గతమయిన లోకికాతిశయము లోకోకి కముగా అధ్యవసింపఁబడుచున్నది. కేశపాశాదులను నెమలిపించె లోనగువానినిగా అధ్యవసించుటలో 'అన్యమే యంగలావణ్యము' ఇత్యాదిప్రకారములందు లక్షణము నకు అవ్యాప్తి అని; అది యుక్తముగాదు, అచటను అన్యమయిన యంగలావణ్యము అన్యముగా అధ్యవసింపఁబడుచున్నది; అట్లే 'అన్యమే' అనుదానికి బదులుగా 'అన్య మువోలె' అని పఠించిన అసాధ్యత్వమేయని ఉత్ప్రేక్ష అంగీకరింపఁబడును. 'ముందు గానే హరిణాక్షులకు'— అనుచోట వకుళాదిశ్రీల ప్రథమభావిత్వము పశ్చాద్భా విత్వముగా అధ్యవసింపఁబడినది. ఇందువలననే ఇటను ఇవ(బలె) శబ్దప్రయోగమున ('ముందుగా బలె హరిణాక్షులకు') ఉత్ప్రేక్ష. ఇట్లె లాంటిచోట్ల.

౽౯౭. ఎప్పుడు ప్రస్తుతములేని అప్రస్తుతములేని యగు పదార్థములకు ఏక ధర్మాభిసంబంధము అగునో అప్పుడు తుల్యయోగిత.

ధర్మము గుణక్రియారూపము; ఉదా.—

1 'ఆ సమయముచేత మైపూఁతలును కుసుమములును పతులపై నలుకపూనిన కోమలులును, దీపవర్తులును, సుచిరశయిత ప్రతిబోధిత మదనుఁడు కలుగునట్లుగా మేల్కొలుపఁబడినవి.'

ఇచట సంధ్యావర్ణనము ప్రస్తుతమగుటవలన ప్రస్తుతములయిన యనులేపనాదులకు ఏకబోధనక్రియాభిసంబంధము.

2 'నీ యంగమార్దవము గాంచిన యెవరిమనస్సులో మాలతీ చంద్రకళా కదళుల కఠోరత స్ఫురింపదు?'

అను నిట్యెడ అప్రస్తుతములయిన మాలత్యాదులకు కఠోరతారూపమగునొక్క గుణముతో సంబంధము. ఇట్లు—

3 'ధనమునుండి దానమును, వాక్కునుండి సత్యమును, అట్లే ఆయువునుండి కీర్తిధర్మము లను, దేహమునుండి పరోపకరణమును, అసారమునుండి సారమును గ్రహింపవలయును.'

ఇచట కర్మభూతములయిన దానాదుల సారతారూపమయిన యేకగుణముతో సంబంధము గ్రహించుట యనెడి ఏకక్రియతోను సంబంధము.

---

1 అనులేపనాని కుసుమా న్యబలాః కృతమన్యవః పతిషు దీపశిఖాః
సమయేన తేన సుచిరం శయిత ప్రతిబోధిత స్మర మబోధిషత.

2 త్వ దఙ్గ మార్దవం ద్రష్టుః కస్య చిత్తే న భాసతే
మాలతీ శశభృల్లేఖా కదలీనాం కఠోరతా.

3 దానం విత్తా దృతం వాచః కీర్తిధర్మౌ తథాయుషః
పరోపకరణం కాయా దసారా త్సార మాహరేత్.

౬౮౬. అప్రస్తుత ప్రస్తుతములకు (ఏకధర్మాభిసంబంధము) దీపక మనఁబడును; పెక్కు క్రియలయందు ఒక్కటే కారక మయినను.

క్రమముగా ఉదా.—

1 'అతఁడు బలగర్వముచేత జయేచ్ఛునై ఇప్పుడును మనుపటివలెనే జగత్తును బాధించుచున్నాఁడు. పతివ్రతయగు స్త్రీయు నిశ్చలయగు ప్రకృతియు పురుషుని జన్మాంతరములయందును కూడుచుండును.'

ఇట ప్రస్తుతకు నిశ్చలయగు ప్రకృతికిని అప్రస్తుతకు సతి యగు స్త్రీకిని ఏకానుగమన క్రియా సంబంధము.

2 'ప్రాణనాథుఁడవు నీవు దూరమునకు వచ్చినప్పుడు ఆ తపస్విని మనసిజబాణములచేత భిన్నయై క్షణములో లేచును, నిద్రించును, నీ పడకటింటికి వచ్చును, పోవును, నవ్వును.'

ఇది మదీయము. ఇందు ఒకతెకే నాయికకు ఉత్థానాద్యనేక క్రియాసంబంధము. మఱియు నిట గుణక్రియలు ఆదిమధ్యావసానములయందుండుటచేత త్రైవిధ్యమును లక్షింపలేదు, ఏలన అట్టి వైచిత్ర్యము ఎల్లెడలను వేయిప్రకారముల సంభవించుట వలన.

౬౮౭. ఎచట సామ్యము గమ్యముగా రెండువాక్యములయందు ఒక్కటే సామాన్యధర్మము వేఱువేఱుగా చెప్పఁబడునో అది ప్రతివస్తూపమ యనఁబడును.

ఉదా.—

3 'వైదర్భి నీవు ధన్యురాలవు, ఎట్లన నీయుదారగుణములచే నైషధుని చిత్తము సమాకర్షింపఁబడి, చంద్రికకు సముద్రుని నయితము ఉత్తరళీకరించుటకన్న స్తుతి ఏమున్నది?'

ఇచ్చట సమాకర్షణమును ఉత్తరళీకరణమును ఒకటే క్రియ, పౌనరుక్త్యమునుతప్పించుటకు భిన్నవాచకములచే చెప్పఁబడినది. ఇది మాలగాఁ గూడ నగపడుచున్నది,

ఉదా.—

1 బలావలేపా దధునాపి పూర్వవత్ ప్రబాధ్యతే తేన జగ జ్జిగీషుణా
సతీ చ యోషి త్ప్రకృతి శ్చ నిశ్చలా పుమాంస మభ్యేతి భవాన్తరే ష్వపి.

2 దూరం సమాగతవతి త్వయి జీవనాథే భిన్నా మనోభవశరేణ తపస్వినీ సా
ఉత్తిష్ఠతి స్వపితి వాసగృహం త్వదీయ మాయాతి యాతి హసతి శ్వసితి క్షణేన.

3 ధన్యాసి వైదర్భి గుణై రుదారై ర్యయా సమాకృష్యత నైషధోఽపి
ఇతః స్తుతిః కా ఖలు చన్ద్రికాయా య దబ్ధి మ ప్యుత్తరళీకరోతి.

1 'సూర్యుడు విమలుడే, చంద్రుడు విశదుడే, అద్దము ప్రకృతిశోభనమే, కైలాసము శివహాసమునకు తోబుట్టువు, సజ్జనుడు స్వభావసుందరుడు గదా.'

ఇచట విమల విశదాదులు అర్థమున ఒకటే. వైధర్మ్యమునకు ఉదా.—

2 'చంద్రికను త్రాగుటయందు చకోరికలే జాణలు, అవంతీస్త్రీలు తప్ప సుదతులు రతినర్మమున నిపుణలు లేరు.'

౬౯౮. సధర్మమగు వస్తువుయొక్క ప్రతిబింబనము దృష్టాంతము.

సధర్మమనుటచేత ప్రతివస్తూపమా వ్యవచ్ఛేదము. ఇదియు సాధర్మ్యవైధర్మ్యములచేత రెండు విధములు. వరుసగా ఉదా.—

3 'గుణము విదితము కానిదే సత్కవిభణితి చెవులయందు తేనెధారలను గురియును. పరిమళము అనుభూతము కానిదే యైనను మాలతీమాల కన్నులను హరించును.'

4 'నిన్ను జూడగానే కురంగాక్షికి మదనవ్యథ తొలగిపోవును, చంద్రుడు ఉదయము పొందకుండగా కుముదసంహతియందు గ్లాని యగపడును.'

5 'ఒక్క వసంతలేఖయందే నిబద్ధభావమయిన నాకు మనస్సు ఇతరకాంతలయందు ఎక్కడిది? వికసిత మల్లీ మకరంద లంపటమయిన మధుపము 'వేఱు లతను కోరునా?'

ఇది నాపద్యము. ఇచట 'నాకు మనస్సు ఎక్కడిది' అనుదానికిని 'వేఱు లతను కోరునా' అనదానికిని ఏకరూపతయే పర్యవసించును గావున ప్రతివస్తూపమయే. మఱి యిచట చెవులయందు తేనెధారలొలుకుటకును, కన్నులను హరించుటకును సామ్యమే గాని ఏకరూపత్వము లేదు. సమర్థ్య సమర్థక వాక్యములయందుగలను సామాన్యవిశేషభావము అర్థాంతరన్యాసము, ప్రతివస్తూపమా దృష్టాంతములందు అట్లుగాదు అని భేదము.

---

1 విమల ఏవ రవి ర్విశదః శశీ ప్రకృతిశోభన ఏవ హి దర్పణః
శివగిరిః శివహాస సహోదరః సహజసున్దర ఏవ హి సజ్జనః.

2 చకోర్య ఏవ చతురా శ్చన్ద్రికాచామ కర్మణి
వి నావన్తీ ర్న నిపుణాః సుదృశో రతనర్మణి.

3 అవిదితగుణాపి సత్కవిభణితిః కర్ణేషు వమతి మధుధారామ్
అనధిగతపరిమలాపి హి హరతి దృశం మాలతీమాలా.

4 త్వయి దృష్టే కురఙ్గాక్ష్యాః స్రంసతే మదనవ్యథా
దృష్టానుదయభాజీన్దో ర్గ్లానిః కుముదసంహతేః.

5 వసన్తలేఖైక నిబద్ధ భావం పరాసు కాన్తాసు మనః కుతో నః
ప్రఫుల్ల మల్లీ మధు లమ్పటః కిం మధువ్రతః స్మరతి వల్లి మన్యామ్.

౬౯౯. సంభవించునదేని సంభవింపనిదేనియు నగు వస్తుసంబంధము ఎచట బింబప్రతిబింబభావమును బోధించునో అది నిదర్శనాలంకారము.

అందు సంభవద్వస్తుసంబంధ నిదర్శనకు ఉదా.—

1 "'ఈ భూమివలయములో వృథాగా జనులను తాపముపాలుసేయుచు ఎవఁడు చిరకాలము సంపదం బొందును' అని దినముచే తెలుపుచు భానుమంతుఁడు అనంతరము పడమటికొండం బొందెను."

ఇచట సూర్యునికి ఇట్టి యర్థమును బోధించు పనియందు వక్తగా అన్వయము సంభవించునట్టిదే, ఇట్టి యర్థమును తెలుప సమర్థమయిన చరమాచలప్రాప్తి రూప కర్మకు కలవాఁడగుటవలన. అదియు సూర్యుని యస్తాచలగమనమునకును పరితాప మొందించువారి విపత్ప్రాప్తికిని బింబప్రతిబింబభావమును బోధించుచున్నది. అసంభవద్వస్తుసంబంధ నిదర్శన ఏకవాక్యగత అనేకవాక్యగత యని యిరుదెఱంగులు. అందు ఏకవాక్యగతకు ఉదా.—

2 'ఈ కోమలియొక్క కుటిలకటాక్షవిక్షేపము కువలయమాలయొక్క లలితమును మోవి కిసలయముయొక్క సొంపును ఆననము కళానిధియొక్క విలాసమును వహించుచున్నది.'

ఇచట అన్యముయొక్క ధర్మమును అన్య మెట్లు వహించును అని కటాక్షవిక్షేపాదులకు కువలయమాలాదిగత లలితాదుల కలనము సంభవింపనిదై తల్లలితాది సదృశమయిన లలితాదికమును తెలుపుచు కటాక్షవిక్షేపాదికిని కువలయ మాలాదికిని బింబప్రతిబింబభావమును బోధించుచున్నది. ఇదియు నుదా.—

3 'రాజేంద్రా, నీవు పయనముకాఁగా, వైరిమృగీనయనల పదములు రాజహంసగతిని ముఖము చంద్రద్యుతిని వదలినవి.'

ఇచట పదములకు సంబద్ధము కాని రాజహంసగతిని త్యజించుట ఉపపన్నము కాదు గాన వానికి దానితోడ సంబంధము కల్పింపఁబడును. అదియు సంభవింపనిదై రాజహంసగతివంటి గతిని బోధించును. అనేకవాక్యగతకు ఉదా.—

---

1 కోఽత్ర భూమివలయే జనాన్ముధా తాపయన్సుచిర మేతి సమ్పదమ్
వేదయన్నితి దినేన భానుమా నాససాద చరమాచలం తతః.

2 కలయతి కువలయ మాలా లలితం కుటిలః కటాక్షవిక్షేపః
అధరః కిసలయలీలా మానన మస్యాః కలానిధి విలాసమ్.

3 ప్రయాణే తవ రాజేన్ద్ర ముక్తా వైరిమృగీదృశామ్
రాజహంసగతిః పద్భ్యా మాననేన శశిద్యుతిః.

1 'పూని సహజకాంతిపూరంబు నీమెయిఁ
దపము సైపఁజేయఁ దలఁచు నెవఁడు
తొలఁగ కతఁడు నల్ల తొగరేకు ధారతో
సమిధలీశఁ గోయ సంభ్రమించు.'

ఇచట యత్తదర్థక (ఎవఁడు అతఁడు) శబ్ద నిర్దిష్ట వాక్యార్థములకు అభేదముగా అన్వయము సరిపడక అట్టిమేనికి తపఃక్లమత్వము సాధింప నిచ్ఛ నీలోత్పలపత్త్రపుధార చేత సమిల్లతను ఛేదింప నిచ్ఛవలె నని బింబప్రతిబింబభావమందు పర్యవసించు చున్నది.

ఇదియు నుదా.—

2 'సంసార భోగములమీఁది యాసచేతను ఈజన్మమును వ్యర్థముచేసికొంటిని; అయ్యో!
నేను చింతామణిని గాజువెలకు అమ్ముకొంటిని.'

ఇచట సంసార భోగ లోభముచేత జన్మమును వ్యర్థతనొందించుట గాజువెలకు చింతామణి నమ్ముటవంటిది అని పర్యవసానము.

ఇట్లు.—

3 'సూర్యుఁడు మూలముగాఁ గల వంశ మెక్కడ! అల్పవిషయ యగు మతియెక్కడ!
మూఢతచే, తెప్పకొయ్యతో సముద్రమును దాఁటంగోరువాఁడ నయితిని.'

ఇచట నా మతిచే సూర్యవంశవర్ణనము తెప్పతో సముద్రమును దాఁటుటవంటిది అని పర్యవసానము. ఒకచో ఉపమేయవృత్తము ఉపమానమందు సంభవింపకున్నను ఈ యలంకారము కలుగును. ఉదా.—

4 'ఆ కురంగనయనయొక్క యధరమందు ఏమాధుర్యము అనుభూతమో, అది రసవిశారదుల చేత ద్రాక్షారసమందు ఆస్వాదింపఁబడినది.'

---

1 ఇదం కిలావ్యాజమనోహరం వపుస్తపఃక్షమం సాధయితుం య ఇచ్ఛతి
ధ్రువం స నీలోత్పలపత్త్రధారయా సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి.

2 జన్మేదం వన్ధ్యతాం నీతం భవభోగోపలిప్సయా
కాచమూల్యేన విక్రీతో హన్త చిన్తామణి ర్మయా!

3 క్వ సూర్యప్రభవో వంశః! క్వ చాల్పవిషయా మతిః!
తితీర్షు ర్దుస్తరం మోహా దుడుపే నాస్మి సాగరమ్.

4 యోఽనుభూతః కురఙ్గాక్ష్యా స్తస్యా మధురిమాధరే
సమాస్వాది స మృద్వీకారసే రసవిశారదైః.

ఇచట పరిష్కృతమయిన యధరముయొక్క మధురిమధర్మము ద్రాక్షారసమందు సంభవింపనందున పూర్వోదాహరణములయందువలెనే సామ్యమున పర్యవసానము.

ఇది మాలారూపయు నగు. ఉదా.— మదీయము:—

1 'మనస్సును భోగపరంపరయందు ఉంచుచు, చిలుకను పిల్లినోట నుంచుచున్నావు, సివంగిపంటిలో లేడిని పెట్టుచున్నావు, గుఱ్ఱమును దున్నకొమ్మున నిడుచున్నావు.'

ఇచట బింబప్రతిబింబభావమును ఆక్షేపింపక వాక్యార్థము పర్యవసానమును జెందదు; దృష్టాంతమందన్ననో పర్యవసితమయిన వాక్యార్థముచేత సామర్థ్యవశంబున బింబ ప్రతిబింబభావము తోఁచును. మఱి యిది యర్థాపత్తియునుం గాదు, అందు 'ఈ హారము హారిణాక్షుల' (252) ఇత్యాదియందు సాదృశ్యపర్యవసానము లేనందున.

200. ఉపమానముకన్న ఉపమేయమునకు ఆధిక్యము గాని న్యూనత్వము గాని వ్యతిరేకము. అది హేతువును చెప్పిన నొకటి, చెప్పకున్న మూఁడువిధములు; ఈ నాలుగును సామ్యమును శబ్దముచేతను అర్థముచేతను ఆక్షేపముచేతను బోధించుటవలనఁ బండ్రెండు విధము లగును. ఇవి శ్లేషయున్న లేకున్న ఇరువదినాలుగు తెఱఁగు లగును; అపకర్షచే నగునవియుం జేరి నలువదియెనిమిది భేదము లగును.

ఉపమేయమునకు ఉపమానమునకన్న ఆధిక్యమున హేతువు ఉపమేయగతమగు నుత్కర్షకారణమును ఉపమానగతమగు నికర్షకారణమును. ఆ రెంటిని చెప్పిన ఒకభేదము; ప్రత్యేకముగాను సముదాయముగాను చెప్పని పక్షములందు వేఱే మూఁడు భేదములు; ఈ నాలుగు విధములందును ఉపమానోపమేయములను శబ్దముచేతను అర్థముచేతను ఆక్షేపముచేతను తెలుపుటవలనను పండ్రెండు ప్రకారము లగును. వెండి శ్లేషయొక్క కలిమిలేములచేత ఇరువదినాలుగు భేదము లగును; ఉపమానముకన్న న్యూనతయందును ఈ చెప్పిన తీఱున ఇరువదినాల్గు భేదము లగును గావున కలసిన మొత్తము నలువదియెనిమిది భేదములు వ్యతిరేకమునం గల్గును. ఉదా.—

'అకళంక మామె ముఖము కళంకి విధునివలె గాదు.'

ఇచట ఉపమేయగతమగు నకళంకత్వము, ఉపమానగతమగు కళంకిత్వమును అను హేతుద్వయము చెప్పఁబడినది. వలె శబ్దమును జెప్పుటచేత ఔపమ్యము శాబ్దము.

---

1 క్షిపసి శుకం వృషదంశక వదనే మృగ మర్పయసి మృగాదన రదనే
వితరసి తురగం మహిషవిషాణే నిదధ చ్చేతో భోగవితానే.

ఇటనే 'కళంకి విధూపమము గాదు' అని పఠించిన ఆర్థ మగును. 'కళంకి విధుని జయించును' అని పఠించిన 'వలె, పోలె, సాటి' అను నిత్యాదిపదములు లేనందున ఆక్షిప్తమగును. ఇటనే అకళంక పదమును మానిన ఉపమేయగతనిమిత్తానుక్తి యగును, కళంకి పదమును మానిన ఉపమానగతనిమిత్తానుక్తి యగును. రెంటిని మానిన రెంటికిని అనుక్తి. శ్లేషయందు ఉదా.—

'అతిగాఢగుణాయా శ్చ నాబ్జవ ద్భఙ్గురా గుణాః'

[అతిగాఢగుణయొక్క గుణములు భంగురములగు నబ్జగుణములవంటివి గావు.]

ఇచట ఇవార్థమున వతి వచ్చినది గావున ఔపమ్యము శాబ్దము. ఉత్కృష్టనికృష్టకారణములకు రెంటికిని ఉక్తి. గుణశబ్దము శ్లిష్టము. కడమ భేదములను మునుపటివలెనే ఊహించుకొనునది. ఇవి ఉపమేయమునకు ఉపమానముకన్న ఆధిక్యమున నుదాహరణములు. న్యూనత్వమున దిఙ్మాత్రము ఉదా.—

1 'కృశించి కృశించియు చంద్రుడు మరలమరల పెరుగును, సత్యము; (కోపము) మానుము ప్రసన్న వగుము సుందరీ, జవ్వనము పోయిన మరి రాదు.'

ఇచట కొందఱు ఇట్లు చెప్పుదురు:— "ఉపమేయభూతమగుయౌవనమందు అస్థైర్యమే ఆధిక్యము, అందుచేత నిట 'ఉపమానముకన్న ఉపమేయముయొక్క యాధిక్యమందు విపర్యయమందు నేనియు వ్యతిరేకము' అను కొందఱి లక్షణమున 'విపర్యయమందు నేనియు' అనుట అనర్థకము" అని. అది విచారసహముగాదు; ఎట్లన— ఇట అధికత్వన్యూనత్వముల సత్త్వాసత్త్వములే (కలిమి లేములే) వివక్షితములు. ఇందును చంద్రాపేక్షచే యౌవనమునకు అసత్త్వము స్ఫుటమే. ఈ యుదాహరణమున ఎట్లో గతి యగుఁగాక,

2 'హనుమదాదులచేత దూతమార్గము యశముచే తెలుపు సేయఁబడినది, నాచేతనో వైరుల హాసములచేత.'

అను నిత్యాదులయందు ఏమి గతి? కావున 'న్యూనత్వము గాని' అని సుష్ఠూక్తమే.

౨౦౧. సహార్థకముయొక్క బలంబునం జేసి ఒకటి రెంటికి వాచకమగునేని

---

1 క్షీణః క్షీణోఽపి శశీ భూయో భూయోఽభివర్ధతే సత్యమ్.
విరమ ప్రసీద సున్దరి యౌవన మనివర్తి యాతం తు.

2 హనూమదాద్యై ర్యశసా మయా పున
ర్ద్విషాం హసై ర్దూతపథః సితీకృతః.

అది సహోక్తి యగును; దానికి అతిశయోక్తి మూలభూతముగా నుండ వలయును.

అతిశయోక్తియు నిట అభేదాధ్యవసాయమూల కార్యకారణ పౌర్వాపర్య విపర్యయ మూలయును. అభేదాధ్యవసాయమూల శ్లేషభిత్తికయు అన్యప్రకారయు. వరుసగా ఉదా.—

1 'ఆకొమ్మయొక్క యౌవనమున అధరపల్లవముతోఁ గూడ ప్రియుఁడు రాగ భాజనము.'
ఇచట రాగ పదమందు శ్లేష.

2 'కుముద కదంబములతోఁ గూడ కాముని ఉల్లసింపఁజేయుచు, దట్టంపుఁ జీకటి మొత్తములతోఁ గూడ ధైర్యమును తఱిమిమెట్టుచు, తామరతంపరలతోఁ గూడ హృదయమును ముకుళింపఁజేయుచు ఎల్ల దిక్కులను అమృతాంశుకిరణములు సంచరించుచున్నవి.'

ఇది నా పద్యము; ఇందు ఉల్లాసాదులకు సంబంధిభేదముచేతనే భేదముగాని శ్లేష చేతఁ గాదు.

3 'గురుసమ్మోహనష్టచేతన యామె నరాధిపునితోఁ గూడ తైలబిందువుతోఁ గూడ దీపజ్వాల వోలె భూతలమునకు వ్రాలెను.'

ఇది మాలగాఁ గూడ సంభవించును, 'కుముద కదంబములతోఁ గూడ' అను నీ యుదాహరించిన పద్యములోనగువానియందుం గనునది.

౭౦_౨. ఒకటి లేక యింకొకటి అసాధువు కాదు నేని చెప్పుట అసాధువు అగుట నేని చెప్పుట వినోక్తి.

అసాధువు అశోభనము; ఇట్లును శోభనత్వమందే పర్యవసానము. అట్లయినను అశోభనత్వాభావముఖమున శోభనము చెప్పుటయొక్క యభిప్రాయము— 'వర్ణనీయమునయొక్క అశోభనత్వము ఏదో అది పరసన్నిధియొక్క దోషము, వర్ణనీయమునకో స్వాభావికముగా శోభనత్వమే'-అని. ఉదా.—

---

1 స హాస్యరదశే నాస్యా యౌవనే రాగభాక్ ప్రియః.

2 సహ కుముద కదమ్బైః కామ ముల్లాసయన్తః సహ ఘనతిమిరౌఘై ర్ధైర్య ముత్సారయన్తః
సహ సరసిజషణ్డైః స్వాన్త మామీలయన్తః ప్రతిదిశ మమృతాంశో రంశవః సఞ్చరన్తి.

3 సమ మేవ నరాధిపేన సా గురుసమ్మోహవిలుప్తచేతనా
అగమ త్సహ తైలబిన్దునా నను దీపార్చి రివ క్షితే స్తలమ్.

1 'జలదకాలము గాక చంద్రుఁడు నిస్తంద్రతం బొందెను వేసవి వేఁడి లేక వనరాజి మంజులం బాయెను.'

అశోభనమునకు ఉదా.—

2 'జనాతీతుని కాంతుని అనుగమించుటచే నీవు సరియైన పని చేసితివి; సూర్యుఁడు లేని దినశ్రీ యేటిది, చంద్రుఁడు లేని నిశ యేటిది?'

3 'ఏది హిమకరుని బింబమును చూడదాయెనో ఆ నళినియొక్క జన్మము వ్యర్థముగా పోయెను; ఏవఁడు వినిద్రను నళినిం జూడఁడాయెనో ఆ చంద్రుని పుట్టుకయు వ్యర్థమే.'

ఇచట పరస్పర వినోక్తి భంగిచేత చమత్కారాతిశయము. వినార్థక శబ్ద ప్రయోగము లేకున్నను వినార్థ వివక్ష కలిమిం జేసి యిది వినోక్తియే. ఇట్లు సహోక్తియు సహ శబ్ద యోగము లేకున్నను సహార్థ వివక్షచేఁ గలుగును, అని యెఱుఁగునది.

౭౦౩. ఎచట సమములయిన కార్య లింగ విశేషణములచేత ప్రస్తుతమందు అప్రస్తుత వ్యవహార సమారోపమో అది సమాసోక్తి.

అందు సమమయిన కార్యముచే ప్రస్తుతమందు అప్రస్తుత వ్యవహార సమారోపమునకు ఉదా.—

4 'బంగరుగిండ్ల విలాసముగలవైన పద్మనయన పాలిండ్ల మీఁది వలువను ఎగురఁగొట్టి యీ సుందరి యంగము నెల్ల బలిమిమెయిం గౌఁగిలించుచున్నావు, నీవే కృతార్థుఁడవోయి మలయాచలగంధవాహుఁడా.'

ఇట గంధవాహునియందు హఠ కాముక వ్యవహార సమారోపము. లింగ సామ్యముచే నుదా.—

---

1 వినా జలదకాలేన చన్ద్రో నిస్తన్ద్రతాం గతః
వినా గ్రీష్మోష్మణా మఞ్జు వనరాజి రజాయత.

2 అనుయాన్త్యా జనాతీతం కాన్తం సాధు త్వయా కృతమ్
కా దినశ్రీ ర్వినార్కేణ కా నిశా శశినా వినా?

3 నిరర్థకం జన్మ గతం నళిన్యా యయా న దృష్టం తుహినాంశు బిమ్బమ్.
ఉత్పత్తి రిన్దో రపి నిష్ఫలైవ దృష్టా వినిద్రా నళినీ న యేన.

4 వ్యాధూయ యద్వసన మమ్బుజలోచనాయా
వక్షోజయోః కనకకుమ్భ విలాస భాజోః
ఆలిఙ్గసి ప్రసభ మఙ్గ మశేష మస్యా
ధన్య స్త్వమేవ మలయాచల గన్ధవాహ.

5 'జయేచ్ఛను గెలవేర్పని మనస్వికి స్త్రీచింత యన నెట్టిది? జగము నెల్ల నాక్రమింపక రవి సంధ్యను పొందఁడు.'

ఇట పుంస్త్రీలింగత్వమాత్రమున రవిసంధ్యలకు నాయక నాయికా వ్యవహారము. విశేషణ సామ్యము శ్లిష్టత్వముచేతను సాధారణ్యముచేతను ఔపమ్యగర్భత్వముచేతను మూఁడు విధములు. అందు శ్లిష్టతచే నుదా.— మదీయము—

'వికసితముఖియు రాగావేశఁబున జారిపోవుచున్న తిమిరావరణము గలదియు నయిన యింద్రునిదిక్కును దినకరుని కరముల స్పర్శను లోనగుచున్నదానిని ఎదురం గాంచిన వాఁడై హిమదీధితి ముదిరిన లవలిం బోని పాండుచ్ఛాయతో కలుషమయిన యంతరముతో ఆయ్యో! వరుణునిదిక్కును ఆశ్రయించుచున్నాఁడు.'

ఇచట ముఖ రాగాది శబ్దములు శ్లిష్టములు. ఇటనే 'తిమిరావరణము' అనుచో 'తిమిరాంశుకము' అని పఠించిన ఏకదేశముయొక్క రూపణ మయినను సమాసోక్తియే గాని ఏకదేశవివర్తి రూపకము గాదు; ఏలన అందు తిమిరాంశుకముల రూప్యరూపకభావము రెండును ఆవరకంబులె యగుటవలన సాదృశ్యము స్ఫుటమగుటవలన పరసాహాయ్యముంగోరకయే స్వమాత్రవిశ్రాంతమగుటచేత సమాసోక్తిబుద్ధిని అణఁగఁద్రొక్కుటకు సమర్థము గాదు. ఎచటనైన రూప్యరూపకములకు సాదృశ్యము అస్ఫుటమో అచట ఏకదేశాంతరరూపణము లేకయే అది యసంగతమగు నని అశాబ్దమయినను ఏకదేశాంతరరూపణము అర్థము అపేక్షింపకనే అపేక్షించును. కాన అచట ఏకదేశవివర్తి రూపకమే యగును. ఉదా.—

'ఎవనికి రణాంతఃపురమున మండలాగ్రలతను చేపట్టువానికి రసనమ్ముఖి యయ్యు రిపుసేన తటాలున పరాఙ్ముఖి యగునో.'

---

1 అసమాప్తజిగీషస్య స్త్రీచిన్తా కా మనస్వినః
అనాక్రమ్య జగత్కృత్స్నం నో సన్ధ్యాం భజతే రవిః.

2 వికసితముఖీం రాగాసఙ్గా ద్గళ త్తిమిరావృతిం
దినకర కర స్పృష్టామైన్ద్రీం నిరీక్ష్య దిశం పురః
జర లవలీ పాణ్డుచ్ఛాయో భృశం కలుషాన్తరః
శ్రయతి హరితం హాన్త ప్రాచేతసీం తుహినద్యుతిః.

3 జస్స రణంతే ఉరఏ కరే కుణంతస్స మండలగ్గలఅం
రస సంముహీవి సహసా పరమ్ముహీ హోఇ రిఉసేణా
యస్య రణాన్తఃపురే కరే కుర్వాణస్య మణ్డలాగ్రలతామ్
రససమ్ముఖ్యపి సహసా పరాఙ్ముఖీ భవతి రిపుసేనా.

ఇట రణాంతఃపురములకు సాదృశ్యము అస్ఫుటమే. కొన్ని యెడల ఎచ్చట స్ఫుట సాదృశ్యముకలవానికే పెక్కింటికి రూపణము శాబ్దముగాను ఏకదేశమునకు ఆర్థము గాను ఉండునో అచ్చట రూపకప్రతీతి వ్యాపకమగుటచేత సమాసోక్తిప్రతీతి మఱుఁగుపఱుచుట ఏకదేశవివర్తిరూపకమే. ఓయి రణాంతఃపురములకు సయితము సుఖ సంచారతచేత స్ఫుటమయిన సాదృశ్యము కలదు అందువేని, నీవు చెప్పినది సత్యమే, కలిగియే యున్నది, కాని అది వాక్యార్థ పర్యాలోచన సాపేక్షముగా నున్నది, నిర పేక్షమో కాదు. ముఖచంద్రాదులకు మనోహరత్వాదివలె రణాంతఃపురములకు స్వాభావికమైన సుఖసంచారత్వము లేదు.

సాధారణ్యముచేత ఉదా.—

1 'వాసరాధీశుఁడు ఉదయింపఁగా సరోజిని సహజసౌగంధముకై సంభ్రాంతములగు భృంగ ములచే నొప్పుచున్నదై స్మేరయైనది.'

ఇచట సహజేత్యాది విశేషణ సామ్యమువలన సరోజినియందు నాయికావ్యవహార ప్రతీతి కలుగుటకు స్త్రీమాత్రగామి యగు స్మేరత్వధర్మముయొక్క సమారోపము కారణము; అది లేక విశేషణసామ్యమాత్రముచేత నాయికావ్యవహారప్రతీతి సంభ వింపదు గావున. ఔపమ్య గర్భత్వమో ఉపమా రూపక సంకర గర్భత్వములను మూఁడు విధముల సంభవించును. అందు ఉపమాగర్భత్వమున ఉదా.—

'దన్త ప్రభా పుష్ప చితా పాణి పల్లవ శోభినీ
కేశపాశాలిబృన్దేన సువేషా హరిణేక్షణా.'

['దంతప్రభాపుష్పచితయు పాణిపల్లవశోభినియు కేశపాశాళిబృందముచే సువేష హరి ణేక్షణ.']

ఇచట సువేషత్వవశంబున ముందుగా 'దంతప్రభలు పుష్పములవలె' అని ఉపమా గర్భముగా సమాసము. తర్వాత మఱి దంతప్రభాసదృశమునైన పుష్పములచేత చిత(నిండినది) ఇత్యాది సమాసాంతరాశ్రయణముచేత సమాసవిశేషణ మాహాత్మ్య మువలన హరిణేక్షణయందు లతాత్వవ్యవహారప్రతీతి. రూపకగర్భత్వమున ఉదా.— 'లావణ్యమధు దేనియలతో నిండిన' (౬.౭౮) ఇత్యాది. సంకరగర్భత్వమున ఉదా.— 'సువేష హరిణేక్షణ దంతప్రభాపుష్పచిత' ఇత్యాది. 'సువేష' అను దానికి బదులు గా 'పరీత' అని పఠించినచో ఉపమారూపక సాధకము లేనందున సంకరసమాశ్రయణ

1 నిసర్గ సౌరభోద్భ్రాన్త భృఙ్గ సఙ్గీతశాలినీ
ఉదితే వాసరాధీశే స్మేరాజని సరోజినీ,

మగును. అప్పుడు సమాసాంతరము మునుపటివలెనే. సమాసాంతర మహిమచేత లతాప్రతీతి. వీనియందును ఎవరిమతమున ఉపమాసంకరములయందు ఏకదేశవివర్తిత లేదో వారిమతమున తొలిదానను మూఁడవదానను సమాసోక్తి యగును. రెండవ ప్రకారమో ఏకదేశవివర్తిరూపకవిషయమే అగును. పర్యాలోచింపఁగానో ఆద్య ప్రకారమున ఏకదేశవివర్తినిని ఉపమను అంగీకరించుట తగును; కానిచో—

'ఐన్ద్రం ధనుః పాణ్డు పయోధరేణ
శర ద్దధా నార్ద్రనఖక్షతాభమ్
ప్రమోదయ న్తీ సకలఙ్క మిన్దుం
తాపం రవే రభ్యధికం చకార.'

[శరత్తు పాండు పయోధరమున ఆర్ద్ర నఖక్షతాభము నింద్రధనుస్సును ధరించి, సకలం కుని ఇందుని ప్రమోద పెట్టుచు రవికి అధికతాపమును గలిగించెను.]

అను నియ్యెడ ఎట్లు శరత్తునందు నాయికావ్యవహారప్రతీతి? నాయికా పయోధరమందసు ఆర్ద్ర నఖక్షతాభ శక్రచాప ధారణము సంభవింపదు గదా; ఓయి 'ఆర్ద్రనఖక్ష తాభ' మనునెడ నున్నదయ్యు నుపమాసత్త్వము వస్తుపర్యాలోచనచేత ఇంద్ర ధనుస్సు నందు అర్పింపవలసినది. ఎట్లనఁ— 'పెరుఁగుతో వేల్పుచున్నాఁడు' ఇత్యాదుల యందు వేలిమి వేఁకుప్రకారమున సిద్ధించుటవలసు విధి పెరుఁగునందు పోర్పఁబడును. అయితే ఇటను 'ఇంద్రచాపాభమైన యార్ద్రనఖక్షతమును ధరించుచున్నది' అని ప్ర తీతికలుగును అందువేని, అది సరిపడదు; ఈవిధముగా నిర్వహించునెడ కష్టకల్పన కంటె ఏకవివక్షోపమను అంగీకరించుటయె మేలుగావున. పోనీ ఇట ఎట్లో ఒక యట్లు సమాసోక్తి యగుఁగాక, 'కలుపలచే కన్నులచేతనుం బోలె' (౬-౬౩) ఇత్యా దులయందు అన్యగతి లేదు. మఱియు ఉపమయందు వ్యవహారప్రతీతి లేనందున వ్యవ హారము ననుభవించునదైన సమాసోక్తికి ఎట్లు ప్రవేశము ఎట్లు? ఇట్లు చెప్పుదురు:—

'వ్యవహారము గాని తత్త్వము గాని ఎందువలన ఔపమ్యమందు తోఁపదో అందువలన ఔపమ్యము సమాసోక్తి గాదు, ఏకదేశోపమ స్ఫుటము.'

ఇట్లు ఉపమారూపకములలో ఏకదేశవివర్తిత్వము నంగీకరించుటచే తన్మూలకమయిన సంకరమందును సమాసోక్తికి అప్రవేశము న్యాయసిద్ధమే. అందువలన దీనికి ఔపమ్య గర్భ విశేషణోత్థాపితత్వము విషయము గాదు అని. విశేషణసామ్యమున శ్లిష్టవిశేష ణోత్థాపితయు సాధారణవిశేషణోత్థాపితయు నని యిది యిరుదెఱఁగులు; కార్య లింగములు తుల్యము లయినచో సమాసోక్తి చతుఃప్రకార యగును. ఇట నెల్ల వ్యవహారసమారోపము కారణము. అదియు కొన్నిచోట్ల లౌకికమగు వస్తువున లౌకిక

వస్తు వ్యవహార సమారోపము, శాస్త్రీయమగు వస్తువున శాస్త్రీయగు వస్తు వ్యవహార సమారోప మేని, శాస్త్రీయమందు లౌకికవస్తు వ్యవహార సమారోప మేని, అని నాలుగు విధము లగును. అందు లౌకికవస్తువు కూడ రసాది భేదముచేత అనేకవిధము, శాస్త్రీయము కూడ తర్కాయుర్వేదజ్యోతిశ్శాస్త్రప్రసిద్ధిచేత, అని సమాసోక్తి బహుప్రకార యగును. దిఙ్మాత్రము ఉదా.—'బంగరు గిన్నె విలాసము'—(ఇంక) ఇత్యాదులయందు లౌకికవస్తువునందు లౌకికమయిన హాటకాముక వ్యవహారాట యొక్క సమారోపము:—

'యై రేకరూప మఖిలా స్వపి వృత్తిషు త్వాం
పశ్యద్భి రవ్యయ మసంఖ్యతయా ప్రవృత్తమ్
లోపః కృతః కిల పరత్వజుషో విభక్తే
స్తై ర్లక్షణం తవ కృతం ధ్రువ మేవ మన్యే.'

[ఎవరు నిన్ను అన్ని వస్తువులందును ఏకరూపనిగాను, అవ్యయునిగాను, సంఖ్యాతీతత్వము నొంది ప్రవర్తిల్లుచున్నవానినిగాను చూచుచున్నవారై పరత్వభాజిఐన నీయందు ద్వైతభావమును వదలినారో వారు నిశ్చయముగా నిన్నెఱింగినవారని నమ్ముచున్నాను. వృత్తిషు = పదార్థాన్వయములందు, అవ్యయమ్ = అవ్యయ మనెడు పదవిశేషమును, అసంఖ్యతయా = సంఖ్యలేనిదిగా, పరత్వజుషః = పరవర్తినియగు, విభక్తేః=సుబ్జస్ ఇత్యాదివిభక్తికి, లోపః= అదర్శనము- ధ్రువమ్=నిశ్చితమయిన, లక్షణమ్=సూత్రము. అని వ్యాకరణ సంబంధముగల యర్థాంతరములు.]

ఇచట ఆగమ శాస్త్ర ప్రసిద్ధమయిన వస్తువునందు వ్యాకరణ ప్రసిద్ధ వస్తు వ్యవహార సమారోపము. ఇట్లె ఇతరత్ర. రూపకమున అప్రస్తుతము తన స్వరూపమును పైనుంచుటచేత ప్రకృతముయొక్క స్వరూపమును కప్పివైచును, ఇటనో తన వ్యవస్థను సమారోపించుటచేత అవచ్ఛాదిత స్వరూపమునే దానిని పూర్వావస్థకంటె విశేషించును; అందువలననే ఇందు వ్యవహారసమారోపము గాని స్వరూపసమారోపముగాదు అని చెప్పుదురు. ఉపమాధ్వని యందును శ్లేషయందును విశేష్యమునకుఁ గూడ సామ్యము, ఇట విశేషణమాత్రమునకే. అప్రస్తుతప్రశంసయందు ప్రస్తుతమునకు గమ్యత్వము, ఇట అప్రస్తుతమునకు అని భేదము.

౨౦౪. సాభిప్రాయములగు నుక్త విశేషణములచేత పరికరము చెప్పఁబడినది.

ఉదా.—'అంగరాజా, సేనాపతీ, ద్రోణోపహాసీ, కర్ణా భీమునినుండి యీతని దుశ్శాసనుని రక్షింపుము.'

౨౦౫. స్వభావముచేత ఏకార్థములైన శబ్దములచే అనేకార్థములను వచించుట శ్లేష.

'స్వభావముచేత ఏకార్థములైన' అనుటచేత శబ్దశ్లేషనుండి వ్యవచ్ఛేదము. 'వచించుట' అనుటచేత ధ్వనినుండి.

ఉదా:—

1. 'సాధువులగు క్రియలను ప్రవర్తిల్లఁజేయుచు దిక్కుల మాలిన్యమును హరించుచు, గొప్ప తేజముతో దీప్తుఁడై విభాకరుఁడు విరాజిల్లుచున్నాఁడు.'

ఇచట ప్రకరణాది నియమము లేసందున రాజ సూర్యు లిరువురును వాచ్యులు.,

౨౦౬. ఒక్కెడ సామాన్యమువలన విశేషము, విశేషమువలన సామాన్యము, కార్యమువలన హేతువు, హేతువువలన కార్యము, సమమువలన సమము, అప్రస్తుతమువలన ప్రస్తుతము, గమ్యమగు నేని అప్రస్తుతప్రశంస ఐదు ప్రకారముల నగును.

వరుసగా ఉదా:—

2. 'ఏది పాదాహతమై ఎగసి శిరమున కెక్కునో, ఆ ధూళి అవమానము కలిగినను స్వస్థము గానే ఉండు దేహికన్న శ్రేష్ఠము.

ఇచట మనకన్న రజస్సు కూడ మేలు అని విశేషము ప్రస్తుత మయి యుండఁగా సామాన్యము చెప్పఁబడినది.

3. 'ఈ పూదండ ప్రాణమును హరించునట్టిది యేని హృదయమందు ఉంచుకొనఁగా నన్ను చంపలేదేమి? ఈశ్వరేచ్ఛచేత విషము కూడ ఒకప్పుడు అమృత మగును, అమృతము విషము నగును.'

ఇచట ఈశ్వరేచ్ఛచేత ఒకప్పుడు అహితకారి నయితము హితకారి యగును, హితకారి నయితము అహితకారి యగును అని సామాన్యము ప్రస్తుతమై యుండఁగా విశేషము

---

1. పరివర్తయన్ క్రియాః సాధ్వీ ర్మాలిన్యం హరితాం హరన్
మహసా భూయసా దీప్తో విరాజతి విభాకరః.
2. పాదాహతం యదుత్థాయ మూర్ధానమధిరోహతి
స్వస్థాదేవాపమానేఽపి దేహినస్తద్వరం రజః
3. స్రగియం యది జీవితాపహా హృదయే కిం నిహితా న హన్తి మామ్
విషమప్యమృతం క్వచిద్భవేదమృతం వా విషమీశ్వరేచ్ఛయా.

[తియ్యనగు మిడి మంచి పరిమళముగలది (సర్వదా సంతోషముగలవాఁడు), వసంతశోభతోఁ గూడుకొన్నది (వసంతునిశోభతోఁ గూడుకొన్నవాఁడు), పెక్కులయిన మొగ్గలతో నిండినది (పలు కోర్కులతో అలరువాఁడు) ప్రకాశమానమైన కాంతికలదై (...... యభిరుచికలవాఁడై) యున్నది.]

ఇచట విశేషణమాత్ర శ్లేషవశంబున అప్రస్తుతమైన సహకారమువలన ఒకానొక ప్రస్తుత నాయకుని ప్రతీతి.

'పుంస్త్వా దపి ప్రవిచలే ద్యది యద్యధోఽపి
యాయా ద్యది ప్రణయనేన మహా నపి స్యాత్
అభ్యుద్ధరే త్త దపి విశ్వమి తీదృ శీయం
కేనాపి దిక్ప్రకటితా పురుషోత్తమేన.'

[విష్ణుపక్షమున — స్త్రీ యయినను పాతాళమునకు పోయినను యాచనవృత్తిము పొట్టవాఁడైనను విశ్వమును రక్షించును, అను నీమార్గమును అనిర్వచనీయుఁడైన విష్ణుఁడు చూపినాఁడు.—

రాజపక్షమున— పౌరుషము నుండి చలించినను, నీచత్వము పొందినను, మహిమ కోల్పోయినను, తన దేశమును ఉద్ధరించును—అను నీమార్గమును పురుషోత్తముఁడను పేరి రాజు చూపుచున్నాఁడు.]

ఇచట విశేషమగు పురుషోత్తమ పదము గూడ శ్లిష్టమగుట ప్రచురప్రసిద్ధిచేత ముందుగా విష్ణువును బోధించుచున్నది, అందువలన వర్ణనీయుఁడు ఒకానొక పురుషుఁడు తోఁచుచున్నాఁడు.

సాదృశ్యమాత్రమూలకు ఉదా:—

1. 'ఒక కపోతశిశువు డేగలు నూర్లు అంకటిచే తఱుముచున్నవి. ఆకాశమునకు ఆవరణము లేదు. హరహర! విధియొక్క కరుణయే శరణము.'

ఇచట అప్రస్తుతమగు కపోతమువలన ఒకానొక ప్రస్తుతుఁడు తోఁచుచున్నాఁడు ఇది వైధర్మ్యముచేతను గూడఁ గలుగును.

2. 'కల్హార స్పర్శ శీతలములగు నే వాతములు వనములో ఇందీవరశ్యాముని రాముని అనివారితములై స్పృశించునో అవి ధన్యములు.'

ఇచట వాతములు ధన్యములు నేనధన్యుండను అని వైధర్మ్యముచేత ప్రస్తుతము

1. ఏకః కపోతపోతః శతశః శ్యేనాః క్షుధాభిధావన్తి।
అమ్బర మావృతిశూన్యం హరహర శరణం విధేః కరుణా॥

2. ధన్యాః ఖలు వనే వాతాః కహ్లారస్పర్శశీతలాః।
రామ మిన్దీవరశ్యామం యే స్పృశ న్త్యనివారితాః॥

తోఁచుచున్నది. వాచ్యముయొక్క సంభ వాసంభ వోభయరూపములచేత ఇది మూఁడు విధములు. అందు సంభవమున ఉక్తోదాహరణములే.

అసంభవమున ఉదా:—

1 'నేను కోకిలను, నీవు కాకివి, నలుపు మన ఇరువురకును సమానము కాని, కాకలీకోవిదులు మన యంతరమును చెప్పుదురు.'

ఇచట కాకకోకిలల వాక్యోవాక్యము ప్రస్తుతాధ్యారోపము లేక సంభవింపదు.

ఉభయ రూపత్వమున ఉదా:—

'అన్తశ్ఛిద్రాణి భూయాంసి కణ్టకా బహవో బహిః
కథం కమలనాళస్య మా భూవ న్భఙ్గురా గుణాః.'

[లోపల ఛిద్ర భూయస్త్వము బయట కంటక బాహుళ్యము, కమల నాళమునకు గుణములు భంగురములు గా కెట్లుండును? ఛిద్రములు = రంధ్రములు, దోషములును, కంటకములు = ముండ్లు, క్షుద్ర శత్రువులు; గుణములు = తంతువులు, కీర్తులు.]

ఇచట ఏదేనొక ప్రస్తుతపురుషుని యధ్యారోపము లేక కమలనాళాంతశ్ఛిద్రములకు గుణభంగురీకరణమందు హేతుత్వము సంభవింపదు. ఇతరములకు (ముండ్లకు) సంభవించును కావున ఉభయరూపత్వము. దీనికిని సమాసోక్తికిం బోలె వ్యవహారసమారోపము ప్రాణమగుటం బట్టి శబ్దశక్తిమూలమగు వస్తుధ్వనినుండి భేదము. ఉపమాధ్వనియందు అప్రస్తుతమునకు వ్యంగ్యత్వము, సమాసోక్తియందును శ్లేషయందును రెంటికిని వాచ్యత్వము.

[రెంటికిని=ప్రస్తుతాప్రస్తుతములకు.]

౭౦౭. వాచ్యములగు నిందా స్తుతులచేత స్తుతి నిందలు గమ్యము లయినచో వ్యాజస్తుతి చెప్పఁబడును.

నిందచేత స్తుతి గమ్యమయినచో వ్యాజముచేత స్తుతి యనెడు వ్యుత్పత్తిచేత వ్యాజస్తుతి, స్తుతిచేత నింద గమ్యమయినచో వ్యాజరూపయగు స్తుతి. వరుసగా ఉదా—

2 'ఓరాజా, నీవు కుపితుఁడ వయినను నీ రిపుభార్యలు మునుపటివలె నే విశ్వస్తులును స్తనయుగ ముక్తాభరణలును, కంటక కలితాంగ యష్టులును.'

---

1 కోకిలోఽహం భవా న్కాకః సమానః కాలిమావయోః
అన్తరం కథయిష్యన్తి కాకలీకోవిదాః పునః.

2 స్తనయుగముక్తాభరణాః కణ్టకకలితాఙ్గయష్టయో దేవ
త్వయి కుపితేఽపి ప్రాగివ విశ్వస్తా ద్విట్స్త్రియో జాతాః.

[విశ్వస్తలు=విశ్వాసముగలిగినవారు— విధవలు; ముక్తా=ముత్తెములు— ముక్త = విడువఁబడిన; కంటక=పులకలు- ముండ్లు.]

ఇది మదీయము.—

1. 'పయోదుఁడా నీకు ఈ వ్యాజస్తుతిని బలికితిని:— ఏమన, నీ జీవనములు జగమునకు సంజీవనములు. నీకు ఇదే గొప్ప స్తోత్రము ఘనుఁడా, ఏమన పథికులం బరిమార్చుటచేత నీవు ధర్మరాజునకు తోడ్పడుచున్నావు.'

౨౦౮. గమ్యమునే భంగ్యంతరముచేతఁ జెప్పుట పర్యాయోక్తి.

ఉదా.—

2. 'నందనమునందు శచియొక్క వేనలియందు సంభోగముచే లాలితములయిన యాపారిజాతంపు మంజరులు వాని సైనికులచేత తిరస్కారముతో స్పృశింపఁబడినవి.'

ఇట 'హయగ్రీవుఁడు స్వర్గమునుజయించెను' అని ప్రస్తుతమే గమ్యము కారణము నైచిత్ర్య విశేషప్రతిపత్తికొఱకు సైన్యము పారిజాతమంజరులను సావజ్ఞముగా స్పృశించుటను కార్యము ద్వారముగా చెప్పఁబడినది. ఇది కార్యమువలన కారణము తోఁచుట యను నప్రస్తుతప్రశంస గాదు, అందు కార్యము అప్రస్తుతమగుటవలన, ఇటనో వర్ణనీయునియొక్క ప్రభావాతిశయమును బోధించుచున్నది గావున కార్యము కూడ కారణమువలె ప్రస్తుతమే.

ఇ.శ్లో:—

3. 'ఇతఁడు శత్రు విలాసినుల పాలిండ్లయందు ముక్తాఫల స్థూలతమములైన యశ్రుబిందువులను ఉరలించుటం జేసి పట్టుకొను దారములేకయే హారములను అర్పించినాఁడు.'

ఇచట వర్ణనీయుఁడయిన రాజుయొక్క గమ్యభూతమయిన శత్రు మారణ రూప కారణము వలెనే కార్యభూతమయిన ఆ విధంపు శత్రుస్త్రీక్రందనజలము కూడ ప్రభావాతిశయ బోధక మగుటంబట్టి వర్ణనార్హమే అని పర్యాయోక్తమే.

---

1. వ్యాజస్తుతి స్తవ పయోద మయోది తేయం
సఞ్జీవనాయ జగత స్తవ జీవనాని
స్తోత్రం తు తే మహ దిదం ఘన ధర్మరాజ
సాహాయ్య మర్జయసి య త్పథికా న్నిహత్య.

2. స్పృష్టా స్తా నన్దనే శచ్యాః కేశసమ్భోగలాలితాః
సావజ్ఞం పారిజాతస్య మఞ్జర్యో యస్య సైనికైః.

3. అనేన పర్యాసయ తాశ్రుబిన్దూ న్ముక్తాఫల స్థూలతమా న్స్తనేషు
ప్రత్యర్పితాః శత్రువిలాసినీనా మాక్షేపసూత్రేణ వినైవ హారాః.

1. "రాజా, రాజకుమారి నాకుఁ బాఠము చెప్పకున్నది; దేవేరులును ఊరకయే యున్నారు. ఓసి మఱుగుజ్జా నాకు బోనము పెట్టు; కుమారుఁడా మంత్రులతో కలసి భుజింపలేదా?' ఇట్లని నీ వైరిభవనములందు పంజరమునుండి తెరువరులు విడిచిన రాచిలుక శూన్యవలభుల యందు చిత్రగతములయిన ప్రతిమలను ఒక్కొకదానినిం జూచి పలుకుచున్నది."

ఇచట నీవు విజయప్రస్థానమునకు ఉద్యమించుటను విని శత్రువులగు నీవైరులు పలాయితులైరి, అని కారణము అప్రస్తుతము. కార్యము సయితము వర్ణనార్హ మగుటవలన ప్రస్తుతమే అని కొందఱు. ఇతరులో రాచిలుకవృత్తాంతముచేత ప్రస్తుతప్రభావుఁడగు ఒకానొకఁడు బోధింపఁబడుచున్నాఁడు గావున అప్రస్తుత ప్రశంసయే యందురు.

౨౦౯. సామాన్యమును విశేషముచేత నేని, విశేషమును సామాన్యముచేత నేని, కారణమును కార్యముచేత నేని, కార్యమును కారణముచేత నేని, సాధర్మ్యముచేతఁగాని వైధర్మ్యముచేతఁగాని సమర్థనము ఎనిమిదివిధములుగా అర్థాంతరన్యాస మగును.

వరుసగా ఉదా.—

2. 'అల్పుఁడయినను గొప్పవారితోడ్పాటు కలవాఁడేని కార్యాంతమును చూచును. సెలయేఱును మహానదితోఁగూడి సముద్రము జేరును.'

ఇట ద్వితీయార్ధమందలి విశేషరూపార్థముచేత ప్రథమార్ధములోని సామాన్యార్థమునకు ఉపపత్తికలదిగాఁ జేయఁబడుచున్నది.

3. 'మాధవుఁడు అర్థ్యములగు పదములుగల యెంత వాక్యమును చెప్పవలయునో యంత వాక్యమునం జెప్పి విరమించెను; గొప్పవారు స్వభావముచేత మితభాషులు గదా.'

---

1. రాజన్ రాజసుతా న పాఠయతి మాం దేవ్యోఽపి తూష్ణీం స్థితాః
కుబ్జే భోజయ మాం కుమారసచివైర్నాద్యాపి కిం భుజ్యతే
ఇత్థం నాథ శుకస్తవారిభవనే ముక్తోఽధ్వగైః పఞ్జరా
చ్చిత్రస్థానవలోక్య శూన్యవలభావేకైక మాభాషతే.

2. బృహత్సహాయః కార్యాన్తం క్షోదీయానపి గచ్ఛతి
సమ్భూయ యామ్భోధిమభ్యేతి మహానద్యా నగాపగా.

3. యావదర్థపదాం వాచ మేవ మాదాయ మాధవః
విరరామ మహీయాంసః ప్రకృత్యా మితభాషిణః.

1 'ఓపృథ్వీ స్థిరవగుము, ఓభుజంగమా దీనిని మోపుము, ఓయి తాఁబేటిమేటీ నీవు అయీ రెంటిని మోపుము; ఓదిగ్గజములారా అమూఁడిటిని మోయ నుద్యమము సేయుఁడు, అన్న శివకార్ముకమును అధిజ్యము సేయుచున్నాఁడు.'

ఇచట కారణభూతమయినది హరకార్ముకాధిజ్యీకరణము పృథ్వీస్థైర్యాదియగు కార్యమునకు సమర్థకము.

'సహసా విదధీత న క్రియా మవివేకః పర మాపదాం పదమ్
వృణతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయ మేవ సంపదః.'
('విమర్శింపకొనక పనిని చేయఁజనదు' ఇత్యాది. ౫౨౩)

ఇందు సంపత్కరణ మనెడి కార్యము విమర్శింపకచేయమి యనెడి విమృశ్యకారిత్వ రూపకారణమునకు సమర్థకము. ఇవి సాధర్మ్యమున నుదాహరణములు.

వైధర్మ్యమున ఉదా.—

2 'ఇట్లు సేవింపఁబడుచునే (వాఁడు) జగత్త్రయమును బాధించుచున్నాఁడు; దుర్జనుఁడు ప్రత్యపకారముచేత శమించును గాని ఉపకారముచేత శమింపఁడు.'

ఇచట సామాన్యము విశేషమునకు సమర్థకము: 'విమర్శించుకొనక' అనునెడ విమర్శింపకచేయమికి ఆపత్ప్రదత్వ మను విరుద్ధకార్యము సమర్థకము. ఇట్లు ఇతరస్థలము లుందును.

౨౧౦. హేతువు వాక్యపదార్థమయినచో కావ్యలింగము చెప్పఁబడును.

3 'ప్రియసీ నీ నేత్రములకు సమానమగు కాంతిగలదైన నల్లగలువ గలదే అది నీట మునిఁగి పోయినది, నీ ముఖచ్ఛాయ ననుకరించువాఁడైన చంద్రుఁడు మేఘములచే మఱుఁగుపడి పోయినాఁడు, నీగమనము ననుసరించు గమనముకలవయిన యీ రాజహంసలును తొలఁగినవి, నీ సాటివస్తువులయందుఁ గలుగు వినోదమును గూడ దైవము నాకు ఒప్పకున్నది.'

---

1 పృథ్వి స్థిరా భవ భుజఙ్గమ ధారయైనాం
త్వం కూర్మరాజ తదిదం ద్వితయం దధీథాః
దిక్కుఞ్జరాః కురుత తత్త్రితయే దిధీర్షా
మార్యః కరోతి హరకార్ముక మాతతజ్యమ్.

2 ఇత్థ మారాధ్యమానోఽపి క్లిశ్నాతి భువనత్రయమ్
శామ్యేత్ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః.

3 యత్త్వన్నేత్రసమానకాన్తి సలిలే మగ్నం తదిన్దీవరం
మేఘైరన్తరితః ప్రియే తవ ముఖచ్ఛాయానుకారీ శశీ
యేఽపి త్వద్గమనానుసారిగతయ స్తే రాజహంసా గతా
స్త్వత్సాదృశ్యవినోదమాత్ర మపి మే దైవేన న క్షమ్యతే.

1 'తన్వీ, నీకు కోపమువచ్చినప్పుడు ఇతనిని నఖక్షతములు గావించి, నీ బాహుపాశములతో కట్టివైచుము.'

ఈ విచ్ఛిత్తివిశేషము సర్వాలంకారవిలక్షణముగా స్ఫురించుచుండుటవలన దీనికి పృథక్త్వాలంకారత్వమే న్యాయ్యము.

౭౧౮. చెప్పఁగోరిన వస్తువునందు విశేషము తెలియుటకైన నిషేధాభాసము ఆక్షేప మనఁబడును, అది వక్ష్యమాణగయు ఉక్తగయు నని యిరుదెఱఁగులు. అందు వక్ష్యమాణవిషయమున ఒక్కొక్కచో సామాన్యముగా సూచితమయినదాని కంతకును నిషేధము, ఒక్కొక్కచో అంశము ఉక్తమగుచుండఁగా అంశాంతరమునకు నిషేధమును అని రెండు భేదములు; ఉక్తవిషయంబునను ఒకచోట వస్తుస్వరూపమునకు నిషేధము, ఒకచోట వస్తుకథనమునకు నిషేధము అని రెండు భేదములు; ఇట్లు ఆక్షేపమునకు నాలుగు భేదములు

వరుసగా ఉదా.—

2 'వలరాని కోలల వంపలచే నసిచెడిన సఖికొఱకు ఏమో చెప్పెదను సఖుఁడా క్షణము మిక్కడ విశ్రమింపుము; అథవా నిర్దయహృదయునికి ఏమి చెప్పుదును?'

ఇచట సామాన్యముగా సూచితమయిన సఖీవిరహమునకు వక్ష్యమాణవిశేషమున నిషేధము.

3 'హరిణాక్షి నీ వియోగమున నిపుడు వికసించిన సన్నజాజిని గాంచి అయ్యో మిక్కిలి— అథవా, ఇసీ పాడుమాటలవలన నేమి ప్రయోజనము.'

ఇచట 'మృతినొందును' అను నంశము ఉక్తముగాదు.

4 'అబ్బాయీ, నేను దూతిని గాను, దానికి ప్రియుఁడ వని పూనుకొన్నదానను గాను; అది మృతిబొందును, నీకు అపకీర్తి గల్గును, ఇట్లని ధర్మాక్షరము చెప్పుచున్నాను.'

---

1 కుపి తాసి యదా తన్వి నిధాయ కరజక్షతమ్
బధాన భుజపాశాభ్యాం కణ్ఠే మస్య దృఢం తదా.
2 స్మర శరశత విధురాయా భణామి సఖ్యాః కృతే కిమపి
క్షణ మిహ విశ్రామ్య సఖే నిర్దయహృదయస్య కిం వదా మ్యథవా.
3 తవ విరహే హరిణాక్షీ నిరీక్ష్య నవమాలికాం దళితామ్
హన్త నితాన్త మిదానీం మాః కిం హత జల్పితై రథవా.
4 బాలఅ ణాహం దూతీ తుఅ ప్పిఓసి త్తి ణ మహ వావారో
సా మరఇ తుజ్ఝ అఅసో ఏఅం ధమ్మక్ఖరం భణిమో.
బాలక నాహం దూతీ త్వం ప్రియోఽసీతి న మమ వ్యాపారః
సా మ్రియతే తవాయశ ఏత ద్ధర్మాక్షరం భణామః

శః' అనుపాఠమున ('వయస్సులో' అను పదమును త్యజించిన) అనుక్తము.

౭౧౭. హేతు వుండఁగా ఫలము లేమి విశేషోక్తి, అశ్లిష్టీ యురుపగలు.

అశ్లిష్టి అనఁగా ఉక్తానుక్తనిమిత్తత్వమువలన. అందు ఉక్తనిమిత్తకు ఉదా.—

1 'మహామహిమశాలులు వారు ధనికులయ్యును మదము లేనివారు, యౌవనవంతులయ్యును చపలులు గారు, ప్రభువులయ్యును అప్రమత్తులు.'

ఇట మహామహిమశాలిత్వ మను నిమిత్తము ఉక్తము. ఇటనే 'మహా......... వారు' అనుటకు బదులుగా 'ఎంద ఉన్నారు భూతలమందు' అని పఠించిన అనుక్తము. అచింత్యనిమిత్తత్వము అనుక్తనిమిత్తమునకే భేద మని ప్రత్యేకముగా చెప్పఁబడ లేదు.

ఉదా.—

2 'ఎక్కటి (వీరుఁడు) కుసుమధన్వుఁడు- మూఁడు జగములను జయించుచున్నాఁడు; వాని శరీరమును హరించియు శంభుఁడు బలమును హరింపఁడాయెను.'

ఇచట తనువును హరించియు బలమును హరింపమికి నిమిత్తము అచింత్యము. ఇచటను కార్యాభావము కార్య విరుద్ధ సద్భావముఖముచేత నైనను నిబంధింపఁబడు చున్నది. విభావనయందును కారణాభావము కారణవిరుద్ధ సద్భావముఖముచేత. ఇట్లు 'నా కన్నెఱికమును హరించినాతఁడు' (౨) ఇత్యాదికమును ఉత్కంఠాకారణవిరుద్ధమును నిబంధించినందువలన విభావన. 'ఎవఁడు నా కన్నెఱికమును—' ఇత్యాదికారణము యొక్క కార్యవిరుద్ధమైన ఉత్కంఠను నిబంధించినందున విశేషోక్తి. ఇట్లిచట విభావనా విశేషోక్తుల సంకరము. శుద్ధోదాహరణమును వెదకవలయును.

౭౧౮. జాతి జాత్యాది చతుష్టయము చేతను, గుణము గుణాదిత్రితయము చేతను, క్రియ క్రియాద్రవ్యముల చేతను, ద్రవ్యము ద్రవ్యము చేతను పరస్పరము విరుద్ధమే భాసించునెడల విరోధము దశవిధముల నగును.

వరుసగా ఉదా.—

3 'నీతోడి విరహమున ఈమెకు మలయమారుతము దావాగ్ని, చంద్రుని వెలుఁగులు నయి

1 ధనినోఽపి నిరున్మాదా యువానోఽపి న చఞ్చలాః
ప్రభవోఽప్యప్రమాదాస్తే మహామహిమశాలినః.

2 స ఏకస్త్రీణి జయతి జగన్తి కుసుమాయుధః
హరతాపి తనుం యస్య శమ్భునా న బలం హృతమ్.

2 తవ విరహే మలయమరుద్దవానలః శశిరుచోఽపి సోష్మాణః
హృదయమలిరుతమపి భిన్తే నలినీదళమపి నిదాఘరవిరస్యాః.

తము పేఁడులు, తేఁటిరుతము సయితము హృదయమును భేదించును, తామరాకు కూడ వేసవిసూర్యుఁడు,'

1 'ఓ రాజా! సంతతము రోఁకటిపోఁటుకూటవలనను, మిక్కుటమయిన యింటిపనిలో వ్యాపారవంతములగుటవలనను కఠినములుగానున్న ద్విజపత్నుల కరములు నీ వుండుట వలన సరోజసుకుమారము లయినవి.'

2 'పుట్టనివాఁడవు పుట్టువుం గ్రహింతువు, చేష్టలేనివాఁడవు శత్రువులను సంహరించితివి, నిద్రించుచునే మేలుకొనఁగలవాఁడవు, అట్టి నీ తత్త్వము నెవ్వఁ డెఱుంగును.'

3 'హరిణాక్షికి వల్లభుని యొడియొక్క సంగము లేనందున రాకాచంద్రుఁడు విషజ్వాలాకులుఁడాయెను. కనుఁగవకు ఎంతమాత్రమును తనివి తీఱనిదియు, మానసమార్గమున నయినను అందరానిదియు నగు నీ మదిరాక్షియొక్క యీ రూపము నా హృదయమును హర్షమొందించును, వెత గుందించును.'

'నీ వాజిరాజిచేత—' ఇత్యాది (౭౧౦), 'హరిణాక్షికి వల్లభుని' ఇత్యాదిశ్లోకమున, 'విషజ్వాలాకులుఁడాయెను' అనుటకు బదులు 'మధ్యందినదినాధిపుఁడు' అని పఠించినచో ద్రవ్యములకు విరోధము. ఇచట 'సీతోఁడి విరహమున' ఇత్యాదియందు బహువ్యక్తివాచకములగుటంబట్టి జాతిశబ్దములగు పవనాదులకు దవాన లోష్మ హృదయభేదన సూర్యు లనెడు జాతిగుణక్రియాద్రవ్యములతో పరస్పరవిరోధము ముఖమందే ఆభాసించును. విరహహేతుకత్వముచేత సమాధానము. ఇట 'పుట్టని వాఁడవు'—ఇత్యాదియందు అజత్వాదిగుణమునకు జన్మగ్రహణాదిక్రియతో విరోధము; భగవంతుని ప్రభావము అతిశయి గావున సమాధానము. 'నీవాజిరాజిచేత' ఇత్యాదియందు 'హరుఁడును గంగను శిరమునఁ దాల్పకున్నాఁడు' అని విరోధము. 'నీవాజిరాజిచేతను' ఇత్యాది కవిప్రౌఢోక్తిచేత సమాధానము. కడమ స్పష్టము; విభావనయందు కారణములేకయే ఉపనిబధ్యమానమగుటవలన కార్యము మాత్రమే బాధ్యముగా తోఁచును; విశేషోక్తియందు కార్యభావముచేత కారణమే. ఇటనో అన్యోన్యము రెంటికిని బాధ్యత్వము అని భేదము.

---

1 సన్తత ముసలాసఙ్గా ద్బహుతర గృహకర్మ ఘటనయా నృపతే
ద్విజపత్నీనాం కఠినాః సతి భవతి కరాః సరోజసుకుమారాః.

2 అజస్య గృహ్ణతో జన్మ నిరీహస్య హతద్విషః
స్వపతో జాగరూకస్య యాథార్థ్యం వేద క స్తవ.

3 వల్లభోత్సఙ్గసఙ్గేన వినా హరిణచక్షుషః
రాకావిభావరీజాని ర్విషజ్వాలాకులోఽభవత్,

౭౮౯. కార్యకారణములకు భిన్న దేశత్వము అసంగతి.

ఉదా.—

1 'ఆ చెలువ బాల, మేము అప్రగల్భమనస్కులము, ఆ రమణి స్త్రీ, మేము కాతరులము, ఆ సకి పీనోన్నతమయిన పయోధరయుగమును వహించుచున్నది, మేము ఖేద పడుచున్నాము, ఆ కలికిని పృథులమయి నితంబము ఆక్రమించియున్నది, మేము గమన మున అశక్తుల మైయున్నాము. ఇతరజనాశ్రియములగు దోషములచేత మేము అపటువుల మైతి మని యద్భుతముగా నున్నది.'

దీనికి అపవాదముగా ఏక దేశస్థమునకు విరోధమున విరోధాలంకారము.

౭౯౦. హేతుకార్యములయొక్క గుణములు గాని అట్టి క్రియలు గాని ఒక టికొకటి విరుద్ధములాయెనా, ఒండె ఆరబ్ధమునకు వైఫల్యము, అనర్థము కూడ సంభవించుట, విరూపములకు సంఘటనము, విషమాలంకారము లగును.

వరుసగా ఉదా.—

2 'ఎప్పటికప్పుడు (తని చేత తాడనము బొందినదై చిత్రము! తమాలనీలయితని కృపాణ రేఖ కలనికలనియందును త్రిలోకాభరణమును శరదిందుపాండువును యశమును కను చున్నది.'

ఇచట కారణభూతయయిన (నల్లని) యసిలతనుండి తెల్లని యశస్సు జనించుట 'కారణగుణములు గదా కార్యగుణమును ఆరంభించును' అను స్థితికి విరుద్ధముగా నున్నది.

3 'ఓ కువలయ పత్రాక్షీ నీవు ఆనందమయిన యీ యానందమును ఒసంగుచున్నావు; మఱి నీచేత నేజనించిన వియోగము నా శరీరమును బిట్టుగా తాపము గొల్పును.'

ఇచట ఆనందజనకమయిన స్త్రీ రూపకారణమువలన తాపజనకమయిన విరహోత్పత్తి.

---

1 సా బాలా వయ మప్రగల్భ మనసః సా స్త్రీ వయం కాతరాః
సా పీనోన్నతిమ త్పయోధరయుగం ధత్తే సఖేదా వయమ్
సాక్రాన్తా జఘనస్థలేన గురుణా గన్తుం నశక్తా వయమ్
దోషై రన్యజనాశ్రయై రపటవో జాతాః స్మ ఇ త్యద్భుతమ్,

2 సద్యః కరస్పర్శ మవాప్య చిత్రం రణేరణే యస్య కృపాణలేఖా
తమాలనీలా శరదిన్దు పాణ్డు యశ త్రిలోక్యాభరణం ప్రసూతే.

3 ఆనన్ద మమన్ద మిమం కువలయ దలలోచనే దదాసి త్వమ్
విరహ స్త్వయైవ జనిత స్తాపయతితరాం శరీరం మే.

1 'ఈ సముద్రుని రత్నాకరుఁడని ధనాశచేత సేవించితిని: ధనము మాట దూరాన నుండ నిమ్ము, ఉప్పునీళ్ళతో మొగము నిండిపోయినది.

ఇచట కోరిన ధనలాభము లేకపోవుట మాత్రమే గాక, పైగా ఉప్పునీళ్ళతో మొగము నిండుట.

2 'తరువల్క-భూషణమయిన వన మెక్కడ, మహేంద్రవందితమైన రాజలక్ష్మి యెక్కడ! ప్రతికూలవర్తియగు ధాతయొక్క చేత, అయ్యో! తప్పక బోత్రిగా పైఁపరానిది'

ఇట విరూపలగు వనరాజశ్రీలకు సంఘటన. ఇది మదీయము. ఇదియు ఉదా.—

3 'విపులమయిన యే సముద్రశాయియొక్క కడుపు యుగాంతకాలమున లోకములను త్రాగినదో, మఱి అతనిని ఒకపౌరాంగన మదముతోడి యొయ్యారముచే సన్నగిల్లిన యొక కంటితో త్రాగివైచెను.'

౭_౧౧. యోగ్యమయిన వస్తువులకు అనురూప్యమువల్లఁ శ్లాఘ సమాలంకారము.

ఉదా.—

4 'ఇది కౌముది మేఘము వెంపలి చంద్రునిఁగూడినది, జహ్నుపుత్రి దిగివచ్చి అనురూపుని జలనిధిని కలసినది; ఇట్లని సమగుణయోగ ప్రీతులైన పౌరజనులు రాజులకు కర్ణకటోరమగునట్లుగా ఏకవాక్యము పఠించిరి.'

౭_౧౨. ఇష్టఫలము నిమిత్తమై అంపులకు విరుద్ధమయిన పని సేయుట విచిత్రాలంకారము.

ఉదా.—

---

1 అయం రత్నాకరోఽమ్బుధిరిత్యసేవి ధనాశయా
ధనం దూరేఽస్తు వదనమపూరి క్షారవారిభిః

2 క్వ వనం తరువల్క-భూషణం నృపలక్ష్మీః క్వ మహేన్ద్రవన్దితా
నియతం ప్రతికూలవర్తినో బత ధాతుశ్చరితం సుదుఃసహమ్.

3 విపులేన సాగరశయస్య కుక్షిణా భువనాని యస్య పపిరే యుగక్షయే
మదవిభ్రమాసకలయా పపే పునః స పురస్త్రియైకతమయైకయా దృశా.

4 శశిన ముపగతేయం కౌముదీ మేఘముక్తం
జలనిధి మనురూపం జహ్నుకన్యావతీర్ణా
ఇతి సమగుణయోగప్రీతయ స్తత్ర పౌరాః
శ్రవణకటు నృపాణా మేకవాక్యం వివవ్రుః.

1 'ఉన్నతికై ప్రణమిల్లును, జీవితముకై ప్రాణములను వదలును, సుఖముకై దుఃఖమును గోరును; సేవకునికన్న మూఢుం డెవ్వఁడు?'

౨_౯౩. ఆధారాధేయములలో నొకదాని యాధిక్యము అధికాలంకార మనఁబడును.

[ఆధారము = ఆశ్రయము, ఆధేయము = ఆశ్రయి, ఆశ్రితము.] *

ఆశ్రితాధిక్యమునకు ఉదా.—

2 'యుగాంతకాలమందు సంకోచము గావించుకొన్న కైటభారియొక్క యే దేహమందు లోకములు (ఇఱుకటములేకుండ) దారాళముగ నెలకొనియుండెనో, ఆ దేహమందు అప్పుడు తపోధనుని రాకచేత గలిగిన సంతోషములు ఇముడవాయెను.'

౨_౯౪. ఇరువురు ఒండొరులకు ఏకక్రియను గావించుట అన్యోన్యాలంకారమగును.

3 'నీచేత ఆతన్వి శోభించును, నీవు ఆతన్విచేత శోభింతువు. రాత్రిచేత చంద్రుఁడు శోభించును. చంద్రునిచే రాత్రియు'

౨_౯౫. ఆధారము లేకయే ఆధేయ ముండుట, ఆధేయము అనేకాధారము లం దుండుట, ఒక చిన్నపని యారంభించుటచేత అశక్యమయిన మఱియొక పని దైవవశమున నెఱవేఱుటయు, మూఁడు విధములయిన విశేషము.

ప్రథమంగా ఉదా.—

---

1 ప్రణమ త్యున్నతిహేతో ర్జీవితహేతో ర్విముఞ్చతి ప్రాణాన్ ।
దుఃఖీయతి సుఖహేతోః కో మూఢః సేవకా దన్యః ॥

* ఇట ప్రకాశకుల గ్రంథపాత పూరణము:— 'ఆశ్రయాధిక్యమునకు ఉదా.—

'ఆహా సముద్రముయొక్క మహిమాతిశయమును ఏమని వర్ణింపను? ఎవనిలో హరి కడుపులో లోకములను ఉంచుకొన్న వాఁడై [illegible] సుఖముగ [illegible]!'

[కి మధిక మస్య బ్రూమో మహిమానం వారిధే ర్హరి ర్యత్ర ।
అజ్ఞాత ఏవ శేతే కుక్షౌ నిక్షిప్య భువనాని ॥]

2 యుగాన్తకాలప్రతిసంహృతాత్మనో జగన్తి యస్యాం సవికాస మాసత ।
తనౌ మము స్తత్ర న కైటభద్విష స్తపోధనాభ్యాగమసంభవా ముదః ॥

3 త్వయా సా శోభతే తన్వీ తయా త్వమపి శోభసే ।
రజన్యా శోభతే చన్ద్ర శ్చన్ద్రేణాపి నిశీథినీ ॥

1 'స్వర్గతులయినను అనల్పగుణులయిన యెవరివాక్కులు కల్పాంతమువఱకు జగములను ఆనందింపఁజేయుచుండునో వారు కవులు వంద్యులు ఎట్లు గాకపోవుదురు!'

2 'ఒక్కని నిన్ను యమసన్నిభుని రిపువులు అడవిలో ఏటియొడ్డున, కొండలగుహలలో, మ్రోలం గాంతురు.'

3 'ఇల్లాలవు, కార్యసహాయవు, రహస్యమున సఖివి, లలితమయిన కళావిధియందు ప్రియశిష్యవు: కరుణావిముఖుఁడై మృత్యువు నిన్ను హరించుటయందు మదీయమును దేనిని హరింపలేదు!'

౭౨౮. ఎవఁడేని ఏ యుపాయమున ఏవస్తువును ఎట్టిదానినిగా సాధించునో, దానిని ఆ యుపాయముచేతనే అన్యుఁడు అన్యథా సాధించునేని వ్యాఘాతాలంకారము.

ఉదా.—'దృశా దగ్ధం మనసిజమ్—' ఇత్యాది (౬౩౬)

౭౨౯. కార్యమునకు విరుద్ధమగుదానిని సౌకర్యముచేత సాధించుటయు వ్యాఘాతమే.

4 'కాంతా (మణీ) నీవు ఇటనే ఉండుము, నేను త్వరగానే కొలఁది దివములలో వచ్చెదను; నీవు మృదులవు ఆయాసమును ఓపనేరవు,— సొబగుఁడా, నీతోఁగూడ వచ్చుటకు నాకు మృదుత్వము ఎక్కువ కారణము; ఎట్లన- విరహకృతమయిన యసమాన ప్రయాసమును మృదువు సహింపనేరదు గదా.'

ఇట నాయకుఁడు నాయికయొక్క మృదుత్వమును తనతోఁగూడ రాఁగూడమికి హేతువుగాఁ జెప్పినాఁడు; నాయికయో దానినే కూడఁబోవుటకే సౌకర్యముచేత హేతువుగా ఉపన్యసించినది.

---

1 దివ మప్యుపయాతానా మాకల్ప మనల్పగుణగణా యేషామ్
రమయన్తి జగన్తి గిరః కథమివ కవయో న తే వన్ద్యాః.

2 కాననే సరిదుద్దేశే గిరీణా మపి కన్దరే
పశ్యన్త్యన్తకసఙ్కాశం త్వా మేకం రిపవః పురః.

3 గృహిణీ సచివః సఖీ మిథః ప్రియశిష్యా లలితే కలావిధౌ
కరుణావిముఖేన మృత్యునా హరతా త్వాం బత కిం న మే హృతమ్.

4 ఇహైవ త్వం తిష్ఠ ద్రుత మహ మహోభిః కతిపయైః
సమాగన్తా కాన్తే మృదు రసి న చాయాససహనా
మృదుత్వం మే హేతుః సుభగ భవతా గన్తు మధికం
న మృద్వీ సోఢా య ద్విరహకృత మాయాస మసమమ్.

౭౩౮. పైపైదానికి పూర్వపూర్వము హేతువగునేని కారణమాల యగును.

ఉదా.—

1 'కృతాత్ముల సాంగత్యమువలన వినికి కలుగును; వినికివలన వినయము, వినయమువలన లోకానురాగము, లోకానురాగమువలన ఏమి కలుగదు!'

౭౩౯. ధర్ములకు యథోత్తరముగా ఏధర్మముతో సంబంధము మాలాదీపకము.

2 'నీవు కలనికి రాఁగా, విల్లు కోలలను పొందినది, కోలలు పగవాతలలను (పొందినవి), ఆతల నేలను (పొందినవి), నేల నిన్ను (పొందినది), నీవు కీర్తిని (పొందితివి).'

౭౪౦. పూర్వపూర్వమునకు ఉత్తరోత్తరము విశేషణముగా నుంచఁబడినను, తొలంగింపఁబడినను, ఇరుదెఱంగుల నేకావళి యగును.

వరుసగా ఉదా :—

3 'ఎచట సరస్సు వికసితాంభోజమో, అంభోజము భృంగసంగతమో, భృంగములు ససంగీతములో, సంగీతము సస్మరోదయమో.'

4 'ఏది సుచారుపంకజము కాదో అది జలము గాదు, ఏది లీనషట్పదము కాదో అది పంకజము కాదు, ఏది మధురముగా గుంజితము సేయదో అది షట్పదము గాదు, ఏది మనస్సును హరింపదో అది గుంజితము గాదు.'

కొన్నిచోట్ల విశేష్యము కూడ యథోత్తరము విశేషణముగా నుంచఁబడును తొలంగింపనుంబడును :— ఉదా.—

5 'బావులు విమలము లగును, బావులందు కమలములు వికసించును, కమలములయందు

---

1 శ్రుతం కృతధియాం సఙ్గాజ్జాయతే వినయః శ్రుతాత్
లోకానురాగో వినయాన్న కిం లోకానురాగతః.

2 త్వయి సఙ్గరసమ్ప్రాప్తే ధనుషాసాదితాః శరాః
శరైరరిశిరస్తేన భూస్తయా త్వం త్వయా యశః.

3 సరో వికసితామ్భోజ మమ్భోజం భృఙ్గసఙ్గతమ్
భృఙ్గా యత్ర ససఙ్గీతాః సఙ్గీతం సస్మరోదయమ్.

4 న తజ్జలం యన్న సుచారుపఙ్కజం
న పఙ్కజం తద్యదలీనషట్పదమ్
న షట్పదోఽసౌ న జుగుఞ్జ యః కలం
న గుఞ్జితం తన్న జహార యన్మనః.

5 వాప్యో భవన్తి విమలాః స్ఫుటన్తి కమలాని వాపీషు
కమలేషు పతన్త్యలయః కరోతి సఙ్గీత మలిషు పదమ్.

(నిపుడు) తోడేళ్లపిండులు సక్కఁగను పరుపులువాఱుచున్నవి.’

1 ‘ఆమెచేత లత్తుకపూఁత మాసిన మోవినుండియు, పాలిండ్ల యంగరాగముచేత నెఱ్ఱనయిన కందుకమునుండియు ఎడలింపఁబడినదై హస్తము దర్భమోసులను కోయుటచేత గాయపడినట్టిది రుద్రాక్షతావళమునకు చెలిగాఁ జేయఁబడినది.’

2 ‘నీ యరివధువులు (మున్ను) ఎచట తోరములైన ముత్తెంపుఁ బేరులను దాల్చినారో యచట (నిపుడు) స్తనములయందు బొద్దలయిన కన్నీటిబిందువులను ధరించుచున్నారు.’

వీనిలో ఒక్కొక్కెడ ఆధారము సంహతరూపమేని అసంహతరూపమేనియు; ఒక్కొక్కెడ ఆధేయంబును నట్లె;— ఉదా.— ‘బద్ధాసనమైన—’ అనుచోట ఉదబిందువులు అసంహతరూపమయిన యాధారమగు రెప్పలులోనగువానియందు క్రమముగా నిలిచినవి. ‘ఏ నీ యరిపురమునందు—’ అనుచోట ఆధేయభూతములైన వృకాదులు సంహతరూపమయిన యరిపురమందు క్రమముగా నుండినవి. ఇట్లునే ఇతరంబులు. ఇందు మఱి ఒకటి పెక్కింట క్రమముగా నుండుటవలన విశేషాలంకారమునుండి భేదము; వినిమయము లేనందున పరివృత్తినుండి (భేదము).

౭౨౮. సమన్యూనాధికములచేత వినిమయము పరివృత్తి యనఁబడును.

వరుసగా ఉదా.—

3 ‘ఏణాక్షి కటాక్షమిచ్చి నా హృదయమును పుచ్చుకొన్నది; నేనో హృదయము నిచ్చి మదనజ్వరమును గ్రహించితిని.’

ఇచ్చట పూర్వభాగమున సమముచేత (వినిమయము), ఉత్తరభాగమున న్యూనముచేత.

4 ‘ఎవఁడు శిథిలమయిన కళేబరమును వెలగా నొసంగి చంద్రకిరణోజ్జ్వలమయిన యశస్సును విలిచికొన్నాఁడో చిరకాలము జీవించిన యా జటాయువు స్వర్గగుఁడైనవానికొఱకు నిపుడు శోక మేల?’

ఇట ఆధిక్యము చేత.

---

1 విస్పష్టరాగా దధరా న్నివర్తితః స్తనాఙ్గరాగా దరుణాచ్చ కన్దుకాత్
కుశాఙ్కురాదాన పరిక్షతాఙ్గులిః కృతోఽక్షసూత్రప్రణయీ తయా కరః.

2 యయో రారోపిత స్తారో హార స్తేఽరివధూజనైః
నిధీయన్తే తయోః స్థూలాః స్తనయో రశ్రుబిన్దవః.

3 దత్త్వా కటాక్ష మేణాక్షీ జగ్రాహ హృదయం మమ
మయా తు హృదయం దత్త్వా గృహీతో మదనజ్వరః.

4 తస్య చ ప్రవయసో జటాయుషః స్వర్గిణః కి మివ శోచ్యతేఽధునా
యేన జర్జరకళేబరవ్యయా త్క్రీత మిన్దుకిరణోజ్జ్వలం యశః.

౭౮౧. ప్రశ్న కలిగియేని లేకయేని, చెప్పిన యొకదానివలన అట్టి మఱియొక దాని నిషేధము శాబ్దముగాని ఆర్థముగాని అగునెడల పరిసంఖ్య.

వరుసగా ఉదా.—

1 'కమనీయమయిన భూషణ మేది? యశము, రత్నము గాదు; ఏ యార్యచరితము ఆచరింపవలసినది? సుకృతము, దోషము గాదు; అప్రతిహతమయిన చక్షుస్సేది? ప్రజ్ఞ, కన్ను గాదు; నీకన్న ఇతరుఁ డెవఁడు సదసద్వివేక మెఱిఁగినవాఁడు.?'

ఇచట వ్యవచ్ఛేద్యము రత్నాది శాబ్దము.

2 'సర్వదా ఆరాధ్య మేది? పుణ్యము. సదా సేవనీయ మేమి? సత్సంగతి. ఏ భగవంతుని ధ్యానింపవలసినది? విష్ణుని. ఏది కోరవలసినది? పరమపదము.'

ఇచట వ్యవచ్ఛేద్యమయిన పాపాద్యము ఆర్థము. ఈ రెంటను ప్రశ్నపూర్వకత్వము కలదు. అది లేనందులకు ఉదా.—

3 'గొప్పవారికి ప్రాయికముగా, భక్తి భగవంతునియందు కనఁబడును, విభవమునందుఁ గాదు, అనుశీలనము శాస్త్రమునందు, యువతీరూప కామాస్త్రమునందుఁ గాదు, చింతనము యశమందు దేహమందుఁ గాదు.'

4 'బలము పీడితుల భయమును పోఁగొట్టుటకు, పెంపయిన శ్రుతము విద్వాంసులను నమస్కరించుటకు, ఆ ప్రభువునకు ధనము మాత్రమే గాక గుణము కూడ పరప్రయోజనమునకే.'

దీనికి శ్లేష మూలమయిన వైచిత్ర్యవిశేషము కలుగును. ఉదా.—

---

1 కిం భూషణం సుదృఢ మత్ర యశో న రత్నం
కిం కార్య మార్య చరితం సుకృతం న దోషః
కిం చక్షు రప్రతిహతం ధిషణా న నేత్రం
జానాతి క స్త్వదపరః సదసద్వివేకమ్.

2 కి మారాధ్యం సదా పుణ్యం కశ్చ సేవ్యః సదాగమః
కో ధ్యేయో భగవా న్విష్ణుః కిం కామ్యం పరమం పదమ్.

3 భక్తి ర్భవే న విభవే వ్యసనం శాస్త్రే న యువతికామాస్త్రే
చిన్తా యశసి న వపుషి ప్రాయః పరిదృశ్యతే మహతామ్.

4 బల మార్త భయోపశాన్తయే విదుషాం సమ్మతయే బహుశ్రుతమ్
వసు తస్య న కేవలం విభో ర్గుణవత్తాపి పరప్రయోజనమ్.

'హారోఽయం హరిణాక్షీణాం లుఠతి స్తనమణ్డలే
ముక్తానా మప్యవస్థేయం కే వయం స్మరకిఙ్కరాః.'

[హరిణాక్షుల స్తనమండలమందు హారము పొరలు చున్నది, ముత్తెముల (ముక్తుల) యవస్థయే యిట్లున్నదే, స్మరకింకరులము మా మాట చెప్పవలయునా?]

1 'అతఁడు స్వాభావికము నయినను ధీరతను కోలుపోయి బాష్పగద్గదముగా నేడ్చెను; మిక్కిలి కాల్చినయెడల ఇనుము నయితము మెత్తనగును, శరీరుల మాట చెప్పవలయునా?'

ఇచటను సమానన్యాయము శ్లేషమూలమయినచో వైచిత్ర్యవిశేషము. ఉదా—'హారోఽయ'మిత్యాది యుక్తము. ఇదియు ననుమానము గాదు, ఏలన సమానన్యాయమునకు వ్యాప్తిరూపత్వము లేనందున.

౭౩౮. చాతురీయుక్తము తుల్యబలవిరోధము వికల్పము.

ఉదా.—

'శిరముల నేని ధనువుల నేని వంపుదురు గాక, ఆజ్ఞ నేని అల్లెత్రాటి నేని కర్ణపూరముగాఁ జేసికొందురుగాక.'

ఇచట శిరములయు ధనుస్సులయు వంచుటలు సంధి విగ్రహోపలక్షణములు గావునను, సంధి విగ్రహములు ఏకకాలమున నొనర్ప శక్యములు గావు. గావునను, విరోధము; అది ఏకపక్షాశ్రయణమందు పర్యవసించును; ఇచట తుల్యబలత్వము ధనుశ్శిరోనమనములకు రెంటికిని స్పర్ధచేత సంభావ్యమానత్వముచేత. ఇచట ఔపమ్యగర్భత్వముచేత చాతుర్యము. ఇట్లు 'కర్ణపూరముగాఁ జేసికొందురుగాక' అనుచోటనుం గూడ. ఇట్లు

'యుష్మాకం కురుతాం భవార్తిశమనం
నేత్రే తను ర్వా హరేః.'

[కురుతామ్=నేత్రపరముగా ద్వివచనము, తనుపరముగా నేకవచనము.— మీకు హరి యొక్క నేత్రములుగాని దేహముగాని భవార్తి శమనముం గావించుఁగాక']

అను నిచ్చట శ్లేషానష్టంభముచేత చారుత్వము.

'గడించిన ధనమును దేవునికేని బ్రాహ్మణునికేని ఇమ్ము', అను నియ్యెడ చాతుర్యము లేనందున ఈయలంకారము గాదు.

౭౩౯. కార్యమునకు సాధకము ఒకటి యుండఁగా కళ్ళపు గువ్వల న్యాయమున

1 విలలాప స బాష్పగద్గదం సహజా మప్యపహాయ ధీరతామ్
అభితప్త మయోఽపి మార్దవం భజతే కైవ కథా శరీరిణామ్.

ఆ కార్యమును సాధించునదే మఱియొకటియు కలుగునేని సముచ్చయా లంకార మగును. ఇందు గుణములు రెండు గాని క్రియలు రెండు గాని గుణమును క్రియయుం గాని యౌగపద్యంబున కలుగును

ఉదా.—మదీయము—

1 '[1]ఓహోయి ధీరుఁడా సమీరుఁడా, బళి, నీవు చందనపర్వతమందు జనించితివి; నీ దాక్షిణ్యము (ఔదార్యము, దక్షిణదిగ్భవత్వము) లోకోత్తరము, నీవు గోదావరీజలముల పరిచయము గలవాఁడవు; అట్టి నీవే నా ప్రత్యవయవమును ఉద్దామదావాగ్నివలె కాల్చుచున్నాఁడ వేని, మత్తము మలినాత్మకము వనచరము నయిన యీ కోకిలమాట చెప్పవలయునా?'

ఇచట, ఒక దాహక్రియకు చందన పర్వతజన్మరూపమంగు న కారణము ఉన్నను, దాక్షిణ్యాదులు హేత్వంతరములు ఉపాత్తములు. ఇట హేతువు లన్నియును శోభనము లయినందున సద్యోగము. ఇటనే 'మత్తమి'త్యాది వాక్యమున మత్తాదులు అశోభనములు గావున అసద్యోగము. సదసద్యోగమునకు ఉదా.—

2 '[2]పగలు ధూసరుఁడైన చంద్రుఁడును, యౌవన మెడలిన కామినియు, తామరలం బాసిన కొలంకును, అక్షరము లేని సురూపుని ముఖమును, ధనపరాయణుఁడగు ఱేఁడును, సతతదరిద్రుఁడగు సజ్జనుఁడును, ఱేని యింటి ముంగిటనుండు ఖలుఁడును, నా మనంబున ఏడు శల్యములు.'

ఇట—'చంద్రప్రభృతులకు శోభనత్వమును ఖలునికి అశోభనత్వమును సదసద్యోగము' అని కొందఱు చెప్పుదురు. మఱికొందఱు—'చంద్రప్రభృతులకు స్వాయము శోభనత్వమును ధూసరత్వాదులకు అశోభనత్వమును, అగుటంబట్టి సదసద్యోగము.' అట్లే ఇటను చంద్రప్రభృతులయందు ధూసరత్వాదులకు అత్యంత మనుచితత్వ మనెడి విచ్ఛిత్తివిశేషమునకే చమత్కారవిధాయిత్వము, 'నా మనంబున ఏడు శల్యములు' అని ఏడింటికి శల్యములుగా నుపసంహారంబును; 'ఱేని యింటి ముంగిట

---

1 హంహో ధీర సమీర హన్త జననం తే చన్దనక్ష్మాభృతో
దాక్షిణ్యం జగదుత్తరం పరిచయో గోదావరీవారిభిః
ప్రత్యఙ్గం దహసీహ మే త్వమపి చే దుద్దామదావాగ్నివ
న్మత్తోఽయం మలినాత్మకో వనచరః కిం వక్ష్యతే కోకిలః!

2 శశీ దివసధూసరో గలితయౌవనా కామినీ
సరో విగతవారిజం ముఖ మనక్షరం స్వాకృతేః
ప్రభు ర్ధనపరాయణః సతతదుర్గతః సజ్జనో
నృపాఙ్గణగతః ఖలో మనసి సప్త శల్యాని మే,

నుంఞు ఖలుఁడు' అనునదియో క్రమభేదముచేత దుష్టత్వముం గలిగించుచున్నది. కడమ యెల్లెడల విశేష్యముయొక్క శోభనత్వముతోనే ప్రక్రమించుటవలన నని, ఇట్లను ఖలేకపోతన్యాయంబున కారణము లన్నియు కలిసి పనివడినవి. సమాధ్యలంకారంబుననో ఒకకార్యమును గూర్చి సాధకము సమగ్రమే అయినను వేఱొకటి కాకతాళీయన్యాయంబున సంభవించును అని భేదము.

1 'తరుణీ నీ కన్నులు అరుణములు, ప్రియుని ముఖము మలినము. సఖీ నా వదనము వంగి నది. ఇతని హృదయమున మన్మథానలము జ్వలితమైనది.'

ఇచట పూర్వార్ధమున గుణములకు యోగపద్యము, ఉత్తరార్ధమున క్రియలకు ఉభయ యోగపద్యమునకు ఉదా.—

2 'ఓ రాజేంద్ర(డా శ్వేతసరోజ సోదరశ్రీ) యగు నీ నయనము నీ శత్రులపై కలుషము కాను అయినని, వారిదేహములయందు అపసల కటాక్షములు పడనుం బడినవి.'

'కత్తినిం గదలించును, కీర్తినిం బర్వించును' ఇత్యాదులయందు ఇది ఏకాధికరణమందు నయితము కానిపించుచున్నది. మఱి యిచట దీపకము గాదు, ఏల యన గుణక్రియాయోగపద్యమందు ఈ సముచ్చయప్రకారములకు నియతముగా కార్య కారణ కాల నియమ విపర్యయ రూపమగు అతిశయోక్తి మూలము, దీపకమునకు అతిశయోక్తి మూలము గాదు.

౨౮౦. దైవవశమున వస్త్వంతరము వచ్చుటవలన కార్యము సుకర మగుట సమాధి యగును.

ఉదా.—

3 'ప్రియునికి కోపమును పోఁగొట్టుటకు నేను పాదములలో వ్రాల నుంకించుచుండ, అహో! ఉపకారార్థము ఈ మేఘగర్జనము మ్రోగినది.'

౨౮౧. శత్రువునకు ప్రతీకారము సేయ నశక్తుఁడైనవాఁడు తదీయుని తిరస్కరించుట ఆ రిపునికే ఉత్కర్షను సాధించునట్టిది ప్రత్యనీక మనఁబడును.

---

1 అరుణే చ తరుణి నయనే తవ మలినం చ ప్రియస్య ముఖమ్
ముఖ మానతం చ సఖి తే జ్వలితశ్చాస్యాన్తరే స్మరజ్వలనః.

2 కలుషం చ తవాహితేష్వకస్మాత్సిత పఙ్కేరుహ సోదర శ్రి చక్షుః.
పతితం చ మహీపతీన్ద్ర తేషాం వపుషి ప్రస్ఫుట మాపదాం కటాక్షైః.

3 మాన మస్యా నిరాకర్తుం పాదయో ర్మే పతిష్యతః
ఉపకారాయ దిష్ట్యేద ముదీర్ణం ఘనగర్జితమ్.

తదీయుని అనఁగా శతృసంబంధిని ఉదా :— మదీయము.—

1 'ఈ తనుమధ్య తన మధ్యము చేత నా మధ్యమును జయించినది అని సింహము ఏతత్కుచకుంభనిభములను ఇభకుంభములను భేదించును.'

౭౮౨. ప్రసిద్ధమయిన యుపమానమునకు ఉపమేయత్వము నేని నిష్ఫలత్వము నేని కల్పించుట ప్రతీప మనఁబడును.

క్రమముగా ఉదా.—

'ప్రియసీ నీ నేత్రములకు సమానమగు కాంతిగలదైన- ఇత్యాది (౭_౨౦)

2 'ఆ వక్త్రమేని చంద్రకథ ముద్రితమే; ఆ కాంతియేని అయ్యో బంగారము: ఆ కన్నేని కలువలు మోసపోయినవి; ఆ నవ్వేని అమృత మేమి? కనుబొమ్మ లేని కందర్పుని చాపము ఇసీ; నీకు ఎంతయని చెప్పుదుము, అదేమో గాని బ్రహ్మయొక్క సృష్టిక్రమము వస్తువునకు క్తికి విముఖమైయున్నది.'

ఇచట వక్త్రాదులే చంద్రాదుల శోభను అతిశయించుటవలన చంద్రాదుల నిష్ఫలత్వము.

౭౮౩. అత్యుత్కృష్ట వస్తువునకు అత్యంతోత్కర్షను చెప్పి దానికి ఉపమానత్వము కల్పించుట ప్రతీప మని కొందఱు వచింతురు.

3 'ఓ హాలాహలమా, అతిదారుణముల కెల్ల నేనే గురవ నని బాబూ గర్వపడకు. కలవు సుమా నీవంటివి ఈలోకములో పెక్కులు, (ఏవనఁగా) దుర్జనుల వచనములు.'

ఇచట ఆదిలో ఉత్కర్షాతిశయము చెప్పఁబడినది. దానిని చెప్పనియెడల ఈ యలంకారము గాదు. ఉదా.— 'బ్రహ్మవలె బ్రాహ్మణుఁడు వచించుచున్నాఁడు.' ఇత్యాది.

---

1 మధ్యేన తనుమధ్యా మే మధ్యం జితవతీ త్యయం
ఇభకుమ్భా భినత్త్యస్యాః కుచకుమ్భనిభౌ హరిః.

2 తద్వక్త్రం యది ముద్రితా శశికథా హా హేమ సా చే ద్ద్యుతి
స్త చ్చక్షు ర్యది హారితం కువలయై స్త చ్చేత్స్మితం కా సుధా
ధి క్కన్దర్పధను ర్భ్రువౌ యది చ తే కిం వా బహు బ్రూమహే
య త్సత్యం పునరుక్తవస్తువిముఖః సర్గక్రమో వేధసః.

3 అహ మేవ గురుః సుదారుణానా మితి హాలాహల మాస్మ తాత దృప్యః
నను సన్తి భవాదృశాని భూయో భువనేఽస్మి న్వచనాని దుర్జనానామ్.

౭౪౪. తుల్యలక్షణమైన యేదేనొక వస్తువుచేత వస్తువునకు గోపనము మీలితమనఁబడును.

ఇచట సమానలక్షణమయిన వస్తువు సహజ మొండె ఆగంతుక మొండె నగును. క్రమముగా ఉదా.—

1 'హరివక్షఃస్థలమందు (అంటుకొన్న) లక్ష్మీవక్షోజ కస్తూరి లక్ష్మను (అతని) సహజ నీలోత్పలకాంతిచేత గ్రస్తమయినదానిని భారతి పరికింపదాయెను.'

ఇట భగవంతుని శ్యామకాంతి సహజమైనది.

2 'ఆ పురమున సర్వదా కెంపుటాకమ్మల కిరణములచేత ఎఱ్ఱఁబాఱినవై కామినుల ముఖములు కోపోపరక్తము లయినను యౌవనవంతులకు శంకను కలిగింపవాయెను.'

ఇట మాణిక్యకుండలముయొక్క యెఱుపు ముఖమున ఆగంతుకము.

౭౪౫. ప్రస్తుతమునకు సదృశగుణములచేత అన్యతాదాత్మ్యము సామాన్యము. ఉదా.—

3 'కొప్పులందు మల్లికలం జెరివి అందముగా చందనము పూసికొని ఒరులకంటికి కనఁబడకుండ అభిసారికలు వెన్నెలలో సుఖముగా పోవుదురు.'

మీలితమందు ఉత్కృష్టగుణముచేత నికృష్టగుణమునకు తిరోధానము; ఇటనో రెంటికిని తుల్యగుణతచేత భేదము తెలియమి.

౭౪౬. తనగుణమును మాని అత్యుత్కృష్టగుణమును గ్రహించుట తద్గుణము. ఉదా.—

4 'వదనమనెడి మిషగల పద్మముకడకు వచ్చుచున్న తేంట్లను ఉదగ్రములగు దంత కిరణములచేత ధావళ్యముం బొరయించుచు వచించెను.'

---

1 లక్ష్మీ వక్షోజ కస్తూరీ లక్ష్మ వక్షఃస్థలే హరేః
గ్రస్తం నాలక్షి భారత్యా భాసా నీలోత్పలాభయా.

2 స దైవ శోణోపలకుణ్డలానాం యస్యాం మయూఖై రరుణీకృతాని
కోపోపరక్తా న్యపి మానినీనాం ముఖాని శఙ్కాం విదధు ర్న యూనామ్.

3 మల్లికా చిత ధమ్మిల్లా శ్చారు చన్దన చర్చితాః
అవిభావ్యాః సుఖం యాన్తి చన్ద్రికా స్వభిసారికాః.

4 జగాద వదన చ్ఛద్మ పద్మ పర్యన్త పాతినః
నయ న్మధులిహః శ్వైత్య ముదగ్రదశనాంశుభిః.

మీలితమందు ప్రకృతవస్తువునకు వస్త్వంతరముచేత ఆచ్ఛాదనము. సామాన్యమున వస్త్వంతర గుణముచేత ఆక్రాంతత తోఁచును- అనిభేదము.

౨౮౭. హేతు వున్నను దాని రూపమును పొందమి అతద్గుణము.

ఉదా.—

1 'అయ్యో! ఏమి యిది! దట్టంపు రాగముతో నిండిన నాహృదయమున నుంచఁబడియు గుణముచే గౌరుఁడా, రాగము నొందవు!'

మఱియొక యుదా.—

2 'గంగాజలము తెలుపు, యమునాజలము నలుపు, ఓ రాజహంసమా, ఈ రెంటను క్రుంకుచున్న నీకు నీ శుభ్రత హెచ్చను హెచ్చదు, తగ్గనుందగ్గదు.'

పూర్వోదాహరణమున అతిరక్త హృదయ సంపర్కముచేత ప్రాప్తించఁదగినదైనను గుణగౌర శబ్దవాచ్యునికి నాయకునికి రక్తత్వము నిష్పన్నము కాలేదు. ఉత్తరోదాహరణమున అప్రస్తుతప్రశంసయు నున్నందున (వాస్తవముగా ప్రకృతము గాకున్నను) గంగాయమునల యపేక్షచేత ప్రకృతమయిన హంసకు గంగాయమునల సంపర్కమున నయితము వానిరూపము రాలేదు. ఇటనో గుణమును గ్రహింపమి యనెడి విచ్ఛిత్తివిశేషము కలిగినందున విశేషోక్తికన్న ఇది భిన్నము. వర్ణాంతరోత్పత్తి లేనందున విషమముకన్నను భిన్నము.

౨౮౮. ఆకారముచేతఁ గాని ఇంగితముచేతఁ గాని కనిపట్టఁబడిన యొకానొక సూక్ష్మార్థము ఏదో యొకప్రకారముచేత ఎందు సూచింపఁబడునో అది సూక్ష్మాలంకారము.

సూక్ష్మమనఁగా స్థూలమతులకు కనఁబడనిది. అందు ఆకారముచేత ఉదా. —

3 'వదనమందుండి జాఱుచున్న చెమట బొట్ల పరంపరలచేత భిన్నమైన కుంకుమను కలశమందుఁ గాంచి వయస్య యొకతె తన్వియొక్క పురుషాయితమును వ్యక్తీకరించుచున్నట్లు కేలను లేనగవు నగ్గి కత్తి లేఖను వ్రాసెను.'

---

1 హస్త సాన్ద్రేణ రాగేణ భృతేఽపి హృదయే మమ
గుణగౌర నిషణ్ణోఽపి కథం నామ న రజ్యసి.

2 గాఙ్గ మమ్బు సిత మమ్బు యామునం కజ్జలాభ ముభయత్ర మజ్జతః
రాజహంస తవ సైవ శుభ్రతా చీయతే న చ న చాపచీయతే.

3 వక్త్ర స్యన్ది స్వేదబిన్దు ప్రబన్ధై ర్దృష్ట్వా భిన్నం కుఙ్కుమం కాపి కణ్ఠే
పుంస్త్వం తన్వ్యా వ్యఞ్జయన్తీ వయస్యా స్మిత్వా పాణౌ ఖడ్గలేఖాం లిలేఖ.

ఇచట ఒక తె కుంకుమభేదముచేత ఎఱుంగనయిన యొక తె పూరుషాయితమును కరమునందు పురుష చిహ్నమయిన కత్తిలేఖను వ్రాయుటచేత సూచించినది.

ఇంగితముచేత ఉదా.—

1 'విటుఁడు సంకేతకాలము నెఱుంగఁగోరుచున్నాఁడని యెఱింగి జాణెత నవ్వుచు నేత్రములచే మనస్సులోని యభిప్రాయమును తెలుపుచు (చేతిలోని) లీలాపద్మమును ముకుళింపఁజేసినది.'

ఇట విటుని భ్రూవిక్షేపదులచే సంకేతకాలజిజ్ఞాస లక్షితము, రజనీకాలమున జరుగునదైన పద్మనిమీలనముచేత ప్రకాశితము.

౭౪౯. వస్తువును బయలువడినదానినె యైనను వ్యాజముచే గోపనముచేయుట వ్యాజోక్తి.

ఉదా.—

2 హిమవంతునిచే నీఁబడుచున్న పార్వతీహస్తమును కవ్వుటచేత పొడమిన పులకలవలన కడుం బటిమయెడలిన యఖిల విధివ్యాసంగమందలి భంగముచేత ఆకులుఁడై 'అబ్బ! ఏమి చలిమిరి యీ మంచుకొండచేతులకు' అని పలుకుచున్నవాఁడై చిఱునవ్వుతోడ శైలాంతఃపుర మాతృమండలముచేత చూడఁబడిన శివుఁడు మిమ్ము రక్షించునుగాక.'

ఇది ప్రథమాపహ్నుతి గాదు, అపహ్నవకారి యగు విషయమును చెప్పనందున; ద్వితీయాపహ్నుతికిని దీనికిని భేదము అచ్చటనే చెప్పియున్నాము.

౭౫౦. దురూహార్థ స్వ క్రియా రూప వర్ణనము స్వభావోక్తి.

[దురూహ=దురూహములనఁగా కవిమాత్రవేద్యములు; అయిన— అర్థ=అర్థముయొక్క అనఁగా డింభాదులయొక్క, స్వ=స్వకీయములయిన అనఁగా తదేకాశ్రయములయిన—చేష్టారూపములయొక్క వర్ణనము.]

ఉదా- మదీయము—

1 సఙ్కేతకాలమనసం విటం జ్ఞాత్వా విదగ్ధయా
హసన్నేత్రార్పితాకూతం లీలాపద్మం నిమీలితమ్.

2 శైలేన్ద్ర ప్రతిపాద్యమాన గిరిజా హస్తోపగూఢోల్లస
ద్రోమాఞ్చాదివిసంష్ఠులాఖిల విధి వ్యాసఙ్గ భఙ్గాకులః.
అః శైత్యం తుహినాచలస్య కరయో రిత్యూచివా న్సస్మితం
శైలాన్తఃపుర మాతృమణ్డలగణై ర్దృష్టోఽవతా ద్వః శివః.

1 'సివంగి కోపావిష్టమై తోఁకతో నేలను మాటిమాటికి తాటించుచు ముందటి పాదములతోఁ జీల్చుచు, తనలోఁ దాను కుంగుచు, తటాలున మింటి కెగసి పరాక్రమముతోఁ హుంకారఘోషముం గావించుచు జంతువులను దిక్కు-దిక్కు-నకు తఱుముచు ఎఱ్ఱని యుబ్బిన గ్రుడ్లతోఁ బ్రతివనమందును బ్రవేశించుచున్నది.'

౭౫౧. అద్భుతమయిన పదార్థము భూతమేని భావియేని ప్రత్యక్షమువోలె నాచరించుట భావిక మనఁబడును.

ఉదా.—

2 'ఎవఁడు ఒక్క పుడిసిటిలోఁ దివ్యములను ఆ మత్స్యకచ్ఛపములను చూచినాఁడో, ఆ కుంభసంభవుఁడు యోగీంద్రుఁడు ముని మహాత్ముఁడు సర్వోత్కృష్టుఁడు.

ఇదియొండె నుదా—

3 'నీ లోచనములను అటనుండిన కాటుకతోఁ జూచుచున్నాను. నిండు తొడవులతోడి నీ భావికాలపు స్వరూపమును ప్రత్యక్షముగా చూచుచున్నాను.'

ఇది ప్రసాద మను పేరి గుణము గాదు, భూతభావుల ప్రత్యక్షాయమాణత్వము దానికి హేతువు గామిచేత. అద్భుతరసమునుం గాదు, విస్మయమునుగూర్చి యిది హేతువు గామిచేత. మఱి అతిశయోక్త్యలంకారమునుం గాదు, అధ్యవసాయము లేనందున. భ్రాంతిమంతమునుం గాదు, భూతభావులు భూతభావులుగానే ప్రకాశించుటవలన. స్వభావోక్తియుం గాదు,- దానికి లౌకికవస్తుగతమయిన సూక్ష్మధర్మస్వభావము యొక్క వర్ణనమే స్వరూపము, దీని కనిన వస్తువుయొక్క ప్రత్యక్షాయమాణత్వ రూపమయిన విచ్ఛిత్తివిశేషము కలుగుటం బట్టి. ఒకవేళ వస్తువుయొక్క స్వభావోక్తియందును ఈ విచ్ఛిత్తి సంభవించునేని అప్పుడు రెంటికిని సంకరము.

---

1 లాఙ్గూలే నాభిహత్య క్షితితల మసకృ ద్దారయ న్నగ్రపద్భ్యా
మాత్మ న్యేవావలీయ ద్రుత మథ గగనం ప్రోత్పత న్విక్రమేణ।
స్ఫూర్జ ద్ధూఙ్కారఘోషః ప్రతిదిశ మఖిలా న్ద్రావయ న్నేష జన్తూ
న్కోపావిష్టః ప్రవిష్టః ప్రతివన మరుణోచ్ఛూనచక్షు స్తరక్షుః.

2 ముని ర్జయతి యోగీన్ద్రో మహాత్మా కుమ్భసమ్భవః
యే నైకచులకే దృష్టౌ దివ్యౌ తౌ మత్స్యకచ్ఛపౌ.

3 ఆసీ దఞ్జన మత్రేతి పశ్యామి తవ లోచనే
భావి భూషణ సమ్భారాం సాక్షాత్కుర్వే తవాకృతిమ్.

1 'కొంత మూఁతపడి యలసవివర్తితములై యున్న తారకలతోడి నేత్రములదానిని, నా కంఠమందలి కట్టు ఇంచుక సడలిన బాహులతలు గలదానిని, చెమట నీటి బొట్టులచే నిండిన గండపాళి గలదానిని ప్రేయసిని అనిశము సంస్మరించి నా డెందము శాంతి నొందక యున్నది.'

ఇచట సంభోగశృంగారము స్మరణ మను భావమునకు అంగము, అది విప్రలంభమునకు. ఊర్జ స్సనఁగా బలము, అనౌచిత్యప్రవృత్తి గుంటు అది (ఊర్జస్సు) యుట నున్నదని ఊర్జస్వి యనఁబడును.

ఉదా.—

2 'వనమందు అఖిలకళాసక్తులై తమ చెలువలను త్యజించి పుళిందులు నీ వైరి వనితాబృందమందు రతిని వహించుచున్నారు.'

ఇచట శృంగారాభాసము రాజ విషయక రతిభావమునకు అంగము. ఇట్లు భావాభాసంబును. సమాహిత మనఁగా పరిహారము. ఉదా.—

3 'ఎడతెంపు లేని కత్తి జళిపింపులచేతను, మాటిమాటికిని బొమముడి జంకెనలచేతను బొబ్బరింతలచేతను, నీ వైరులగర్వము ఏది యగపడుచుండెనో అది నీవు చూడఁగా నే క్షణములో ఎక్కడికి పోయినదో.'

ఇట మదాఖ్యభావమునకు ప్రశమము రాజ విషయక రతిభావమునకు అంగము.

౭౫౮. భావముయొక్క యుదయసంధిమిశ్రత్వములయుఁను ఆ పేర్లు గల యలంకారములగును.

ఆ పేర్లుగల యలంకారము లనఁగా భావోదయ, భావసంధి, భావశబలములను పేరుగల యలంకారములు. క్రమముగా ఉదా.—

4 'నీ వైరులు మిత్రులతోఁ గూడ సురఁ ద్రాగం గడంగినవారు, ఎటనుండియో నీ పేరు విని విషమదశలోఁ బడిరి.'

---

1 అమీలితాలస వివర్తిత తారకాక్షీం మత్కణ్ఠబన్ధన దరశ్లథ బాహువల్లీమ్
ప్రస్వేద వారికణికా చిత గణ్డబిమ్బాం సంస్మృత్య తా మనిశ మేతి న శాన్తి మన్తః.

2 వనేఽఖిల కలాసక్తాః పరిహృత్య నిజస్త్రియః
త్వద్వైరివనితా బృన్దే పుళిన్దాః కుర్వతే రతిమ్.

3 అవిరళకరవాళీకమ్పనై ర్భ్రుకుటీతర్జనగర్జనై ర్ముహుః
దదృశే తవ వైరిణాం మదః స గతః క్వాపి తవేక్షణే క్షణాత్.

4 మధుపానప్రవృత్తా స్తే సుహృద్భిః సహ వైరిణః
శ్రుత్వా కుతోఽపి త్వన్నామ లేభిరే విషమాం దశామ్.

మఱియు రసాద్యుపకారమాత్రముచేత నే అలంకారత్వము కలుగును [illegible] కావున
అది ప్రసక్తించును. ఇందువలన 'రసాదులు [illegible] రసవదాద్యలంకారము,
అంగములైనచో ద్వితీయోదాత్తాలంకారము' అను [illegible] స్పష్టము.

277. ఈ యలంకారములే యొకదానితో నొకటి [illegible] సంసృష్టియు సంకరము నని రెండే అలంకారము లగును.

ఏవిధముగా లౌకికాలంకారములకుం గూడ పరస్పరమిశ్రణ [illegible] కలుగుటంబట్టి పృథగలంకారత్వము కలుగునో ఆవిధముగానే [illegible] కావ్యాలంకారములకుం గూడ పరస్పరమిశ్రణముచేత సంసృష్టిసంకర [illegible] వే అలంకారములు కలుగును. అందు.—

278. వీనికి పరస్పరము అపేక్ష లేనియునికి సంసృష్టి యనంబడును.

వీనికి అనఁగా శబ్దార్థాలంకారములకు. ఉదా.—

'దేవః పాయా దపాయా న్నః స్మే రేన్దీవర లోచనః
సంసార ధ్వాంత విధ్వంస హంసః కంసనిషూదనః'

[సంసార మను చీకటిని ధ్వంసించు సూర్యుఁడు, కంసుని సంహారకుఁడు వికసదిందీవర నేత్రుఁడు నయిన దేవుఁడు మమ్ము అపాయమునుండి కాచును గాక.]

ఇచట 'పాయా దపాయాత్' అని యమకము. 'సంసార—' ఇత్యాదియందు అను ప్రాసము, అని శబ్దాలంకారములకు సంసృష్టి. ద్వితీయపాదమున ఉపమ, [illegible] ర్థమున రూపకము అను నర్థాలంకారములకు సంసృష్టి. ఇట్లు రెండును నుండుటంబట్టి శబ్దార్థాలంకారముల సంసృష్టి.

279. అలంకారములకు అంగాంగిత్వముగాని ఏకాశ్రయస్థితిగాని సందిగ్ధత్వము గాని కలిగిన మూఁడువిధముల సంకరము కలుగును.

అంగాంగిభావసంకరమునకు ఉదా.—

1 'ఆకర్షణవేగముచేత జాఱుచున్న నాగేంద్రుని యొడలి కుబుసము సముద్రమును చుట్టుకొనియుండుట ఎట్లుండె ననఁగా, మథనవ్యథను శమింపఁజేయుటకై వడిగా సింధురాజని సముద్రుని పాదమూలమున (పక్షమందు— చరణ సమీపమందు) గాలనీవు [illegible] కొనియున్నదో యనునట్లుండెను.'

ఇచ్చట నిర్మోకపట్టత్వమును డాఁచుటచేత మందాకినీత్వాగోపము [illegible]

1 ఆకృష్ట వేగ విగళ ద్భుజగేన్ద్ర భోగ నిర్మోక పట్ట పరివేష్టన యామ్బురాశేః
మన్థవ్యథా వ్యుపశమార్థ మివాశు యస్య మన్దాకినీ చిర మవేష్టత పాదమూలే.

మయినది. అది మంజీరముయొక్క వస్తువృత్తముచేత పాదమూలవేష్టన మేహో అదే చరణమూలవేష్టన మను నతిశయోక్తికి అంగముగా నున్నది. ఉత్ప్రేక్షయు మందాకిన్యంబురాసుల నాయికానాయక వ్యవహారమును తోపింపఁజేయుచున్నది గావున సమాసోక్తికి అంగము.

మఱియు ఉదా.——

1 'సంధ్య అనురాగవంతురాలు, దివసము తత్పురస్సరము; అయినను సమాగమము లేదు, అహో దైవగతి చిత్రము!'

ఇట సమాసోక్తి విశేషోక్తికి అంగము. సందేహసంకరమునకు ఉదా.——

2 'ఇది యాకాశమున అమంద నయనానందకరమును వ్యాపించిన చీకటిని ధ్వంసించుచు ఇందుమండలము ప్రకాశించుచున్నది.'

ఇచట ముఖమును చంద్రునిగా అధ్యవసించుటచేత అతిశయోక్తియు, కాక ఇది అని ముఖమును నిర్దేశించి చంద్రత్వము నారోపించుటవలన రూపకమును, అథవా ఇది అని ముఖమునకును చంద్రమండలమునకును రెంటికిని ప్రకృతములకు ఏకధర్మాభిసంబంధమువలన తుల్యయోగితయు, అట్లుగాక చంద్రుఁ డప్రకృతుఁ డగుటవలన దీపకమును, లేక విశేషణసామర్థ్యము వలన అప్రస్తుతమయిన ముఖము గమ్య మగుటవలన సమాసోక్తియు, ఒండె అప్రస్తుత చంద్రవర్ణనచేత ప్రస్తుతముఖమునకు అవగతి యని యప్రస్తుతప్రశంసయు, అట్లుం గాక మన్మథోద్దీపనమగు కాలము స్వకార్యభూత చంద్రవర్ణనా ముఖమున వర్ణితమని పర్యాయోక్తియు- అని బహ్వలంకారముల సందేహమువలన సందేహసంకరము. ఒండు ఉదా—— 'ముఖచంద్రుని చూచుచున్నాను' అనునో 'ముఖమును చంద్రునివలె' అని ఉపమయగునా కాక 'ముఖము చంద్రుఁడే' అని రూపకమా అని సందేహము. సాధకబాధకములు రెంటిలో ఒకటి యున్నయెడల సందేహము కాదు. ఉదా—— 'ముఖచంద్రుని ముద్దుగొనుచున్నాఁడు' అనునెడ 'చుంబనము ముఖమునకు అనుకూలమగుటచే ఉపమకు సాధకము; చంద్రునికి ప్రతికూలమగుటవలన రూపకమునకు బాధకము. 'ముఖ

---

1 అనురాగవతీ సన్ధ్యా దివస స్తత్పురఃసరః
అహో దైవగతి శ్చిత్రా తథాపి న సమాగమః.

2 ఇద మాభాతి రుచిరం భిన్దానం సతతం తమః
అమన్ద నయ నానన్ద కరం మణ్డల మైన్దవమ్.





చంద్రుఁడు ప్రకాశించుచున్నాఁడు' అనుచోట ప్రకాశము నను ధర్మము రూపకమునకు సాధకము ముఖమందు ఉపచరితముగా సంభవించును గావున ఉపమా బాధకముగాదు.

'రాజనారాయణుని నిన్ను లక్ష్మి నిర్భరముగా కౌఁగిలించుచున్నది.'

ఇచట స్త్రీకి ఆలింగనము నాయకుని తుల్యునియందు ఉచితముగాదు గావున రాజునందు సంభవింపనిదై ఉపమకు బాధకముగా నున్నది నారాయణునందు సంభవించును గావున రూపకమగును. ఇట్లే—

'ఏణాక్షీ వదనాంబుజము చంచలలోచనము ప్రకాశించుచున్నది.'

ఇచట వదనమున లోచన ముండును గావున ఉపమకు సాధకము, అంబుజమున సంభవింపదు కావున రూపకమునకు బాధకము. ఇట్లే 'సుందరము వదనాంబుజము' ఇత్యాదులందు సాధారణధర్మమును ప్రయోగించినయెడల 'ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే' అను సూత్రముంబట్టి ఉపమా సమాసము సంభవింపదుగావున ఉపమకు బాధకము, ఇట్లే ఇచట మయూరవ్యంసకాదిత్వమువలన రూపకసమాసమే అగును. ఏకాశ్రయాను ప్రవేశమునకు ఉదా.— మదీయము—

'కటాక్షే ణాపీష త్క్షణ మపి నిరీక్షేత యది సా
త దానన్దః సాన్ద్రః స్ఫురతి పిహితాశేషవిషయః,
స రోమాఞ్చోదఞ్చ త్కుచకలశ నిర్భిన్న వసనః
పరీరమ్భారమ్భః క ఇవ భవితాఽమ్బురుహదృశః.'

['ఆ కాంత కడకంట నేనియు ఇంచుకేని క్షణమేని కను నేని ఇప్పుడు సకల విషయము లను మఱపించునట్టి సాంద్రానందము కలుగును; అట్లుగాక ఆ యంభోరుహాక్షి వలువ పిగులునట్లు ఉబుకుచున్న పులకలతోడి కుచకలశములతో పరిరంభ మారంభించు నేని అది యెట్లుండునో!]

ఇచట 'కటాక్షే ణా పీష త్క్షణమపి' అను నియ్యెడ ఛేకానుప్రాసమునకును 'నిరీక్షేత' అను నియ్యెడ క్షకారముం గైకొని వృత్త్యనుప్రాసమునకును ఏకాశ్రయమందు అనుప్రవేశము. ఇట్లు ఇచటనే అనుప్రాస స్వార్థాపత్త్యలంకారములకు (ను ఏకాశ్రయమందు అను ప్రవేశము.) ఇది యొండె నుదా.— 'కురవకా రవకారణతాం యయుః' [కురవకములు రవకారణతం బొందినవి] అను నియ్యెడ రవకారవకా అని యొకటి 'వకారవకార' అనియొకటియుం గా రెండు యమకములకు,

ఇదియొండె నుదా.—

'అహీణఅ పఓఅ రసిఏసు
పహిఅ సామాఇఏసు దిఅహేసు.

రహస పసారిఅ గిఅణ
ణచ్చిఅం మోర విన్దాణమ్'
య. అభినవ పయోద రసితేషు
పథిక శ్యామాయితేషు (పథిక సామాజికేషు) దివసేషు
రభస ప్రసారిత గ్రీవాణాం
నృత్యం మయూర బృన్దానామ్.

[నూతనాంబుద ధ్వానములు గలవై పథికుల చేత నలు పెక్కిన (పథిక సామాజికములైన) దివసములందు హర్షముచే మెడసాచిన నెమలిపిండుల నృత్యము] [పథికులచే నలు పెక్కుట- దుఃఖముచే వారు నలుపొందినారను గావున, వారిచే దివసములకు నలుపు.]

ఇచట 'పహిఅ సామాజిఏసు' అను పాఠాంతరమున 'పథిక శ్యామాయితే' అని యుపమయు, 'పథికసామాజికేషు' అని రూపకమును ప్రవేశించినవి.

శ్రీ చంద్రశేఖరుడను మహాకవిచంద్రుని పుత్రుడగు శ్రీవిశ్వనాథకవిరాజు రచియించిన యీ ప్రబంధమును సాహిత్యదర్పణమును, ఓ బుద్ధిమంతులారా, పరికించి సాహిత్యతత్త్వము నెల్ల సుఖముగా నెఱుంగుడు.

ఎంతకాలము ప్రసన్నేందునిభ సద్గుణ లక్ష్మీ నారాయణుని దేహము నలంకరించునో, అంతకాలము కవుల హృదయములకు సంమోదము గూర్చుచు ఈప్రబంధము లోకమునం బ్రఖ్యాతముగుం గాక.

